# ఎనిమిదవ ప్రకరణము.

## సాంఘికాదర్శము.



బ్రాహ్మమతమునుగూర్చి యోచించునపుడు బ్రాహ్మసమాజముయొక్క సాంఘికాదర్శమునుగూడ వివరించుట ముఖ్యావశ్యకము. అన్యులసంబంధము లేకుండ నొక్కొక్కనిచేఁ బ్రత్యేకముగా నేకాంతమున ననుష్ఠేయమగుమతమే బ్రాహ్మమతమని భావింపఁబడదు. మనుష్యునియొక్క సకలవ్యాపారములను సన్మార్గమునఁ బెట్టి యాతనిగృహకార్యములను, సమస్తసంబంధబాంధవములను సంస్కరించి యున్నతస్థితికిఁ దెచ్చునది బ్రాహ్మమతము. తత్కారణముచే బ్రాహ్మసమాజమునందు సంఘనిర్మాణవిషయమున నొకయుత్తమమైనయాదర్శ మేర్పడినది. "న స్త్రీ స్వాతంత్ర్య మర్హతి" యనెడు వాక్యము పరమప్రమాణముగాఁ గైకొనఁబడి దుర్లంఘ్యము లగు ననేక జాతిభేదములచే శాఖోపశాఖలుగఁ జీలియున్న మన దేశమునం దీయాదర్శము జనబాహుళ్యమునకు గంటకప్రాయమై బహుకలహములకుఁ గారణభూతమయ్యెను. అందువలన నాయాదర్శము గురించి యొకింత యిచట ముచ్చటించుట యప్రస్తుతము గాదు. దేవునిగురించియు, దేవునకును మానవులకును గలసంబంధమును గూర్చియు బ్రాహ్మసమాజికులకుఁ గల యభిప్రాయములను బట్టియే యీయాదర్శముగూడ నిర్ణయింపఁబడినది. జగత్పిత యగు నేకేశ్వరునియందలివిశ్వాసము ననుసరించి కులజాతివర్ణభేదములు లేక మానవులందఱొక్క కుటుంబమునకుఁ జెందినవారనువిశ్వాసముగూడ సహజముగా నుత్పన్నమైనది.

దేవుఁడు మనకుఁ దండ్రి యగుటచే, మనుష్యులందఱు నాతనిసంతానము గదా! ఆహేతువువలన స్త్రీలును బురుషులును బరస్పరసోదరీసోదరభావమును గలిగి వర్తిల్లవలసినవారగుచున్నారు. కులదేశవర్ణభేదములనుబట్టి పుట్టుకతోడనే యొకఁ డెక్కువ యనియు, నొకఁడు తక్కువ యనియు నిరూపించుటకు వీలుపడదు. బుద్ధివికాసమునందును, పాండిత్యవిశేషమునందును, భాగ్యగరిమయందును, అధికారప్రాబల్యమునందును మనుష్యుల కొండొరులలో నేరీతి వ్యత్యాసము లున్నను, నొక్కయీశ్వరకుటుంబమునఁ జేరిన వారగుటచే నెల్లరును సమానులై పఱగుచున్నారు. జన్మసిద్ధమైన యాధిక్యము గాని

న్యూనత గాని యుండవలె నని యభిలషించుట మన కందఱకుఁ బరమజనకుఁ డగుభగవంతునియెడల నపరాధమును గావించుట గాని వేఱు గాదు. అత్యంతనిందాపాత్రమైన యిట్టిభేదములను బాటించుటకు బ్రాహ్మసమాజము సమ్మతింపదు. ఏమానవునకుఁ గాని యేసంఘమునకుఁ గాని స్వతస్సిద్ధమైనయాధిక్యము గల దని బ్రాహ్మసమాజ మెంచఁ జాలదు. ఒకమనుష్యునకును మఱియొకమనుష్యునకును, నొకశాఖకును మఱియొక శాఖకును నకారణముగాఁ బెరుగుచున్న భేదభావములను బోనడచి సర్వసౌభ్రాత్రమును స్థాపించుటయే బ్రాహ్మసమాజముయొక్క సాంఘికాదర్శము. మనుజులకు గురువులుగా నుపకరించునిమిత్తమై యుద్దేశింపఁబడినయేప్రత్యేకజాతియు భూతలమున భగవంతునిచే సృష్టింపఁబడినట్లు బ్రాహ్మసమాజము విశ్వసింపదు. ఎల్లమానవులకును మతప్రకృతి నిసర్గ మగుటచే నీతిజ్ఞానములందువలెనే యీయాధ్యాత్మికవిషయమునందును మనుజు లందఱును నిరంతరాభివృద్ధిఁ బొందఁగలరు. ప్రకృతమునఁ గానవయ్యెడుస్థితిభేదములకు నాయాసంఘస్థులజన్మవిశేషము కారణము గాక, శతాబ్దములనుండి కారణాంతరములచే వా రనుభవించుచు వచ్చిన యధికమైనప్రాబల్య మనుటకు సందేహము లేదు. అక్రమములైననిబంధనములును, శాసనములును నిట్టివిపరీతతారతమ్యములకు మూలహేతువులై యుండెను. ఆయక్రమములను గాని, యాభేదములను గాని యంతరింపఁజేయక యింకను సాగనిచ్చుట గాని, జోక్యము కలిగించుకొనక తటస్థముగా నుండుట గాని మహాపాతకముగా బ్రాహ్మసమాజము భావించును. పంచముఁడైనను, బ్రాహ్మణుఁడైనను, హిందు వయినను, మహమ్మదీయుఁడైనను, నల్లనిచర్మము గలయాఫ్రికాదేశస్థుఁడైనను, తెల్లనిచర్మము గలయిరోపాదేశస్థుఁడైనను బ్రాహ్మసమాజికునకు భ్రాతయే. సకల మానవులను సహోదరులనుగా భావింపలేకపోయినచో భగవంతుని "తండ్రీ" యని పిలుచుటకు మనకు యోగ్యత లే దని చెప్పవచ్చును.

హిందూదేశములోఁ గులద్వేషములు మిక్కుటముగా నుంటచే మనుజు లందఱు సోదరు లనియు సమాను లనియు నొక్కి వక్కాణించుట మిక్కిలి యావశ్యక మయ్యెను. జాత్యుపజాతులుగాను, శాఖోపశాఖలుగాను, మనదేశమునందు సంఘమంతయు నానా విధములుగా విడివడియున్నది. తేనియతుట్టెయలోనిగదులవలె వేఱువేఱుగా నున్న హిందూమహాసంఘములోనిచిన్నిచిన్ని తెగలలోఁ బరస్పరభోజనబాంధవ్యములు నిషేధింపఁబడినవి. భోజనాదులమాట యటుండ నూరక సమీపించి పలుకరించి, యాదరించు

టయుఁ బ్రతిషేధింపఁబడిన పలుతెగలును మనదేశమునఁ గలవు. కటకటా! యస్వాభావికములై యమానుషములై యనర్థదాయకములైన యీమానవకల్పితభేదజాలముచే మనుష్యమాత్రులలోనెల్ల బెల్లుగ నల్లుకొనవలసినయనురాగవల్లరి మెల్లమెల్లగా శోషిల్లుచున్నది. అకృత్రిమమైన నీశ్వరధర్మ మగునీమానవభ్రాతృత్వమును సర్వవిధముల నీసాధారణమతసమాజమునందుఁ బోషింపఁ బ్రయత్నించుట పరమకర్తవ్యము.

పశ్చిమదేశస్థులలోను నుద్యోగభాగ్యాదితారతమ్యముల ననుసరించి గొప్పవా రనియుఁ గొలఁదివా రనియు భేదములు గల వనియు, నొకనికిని మఱియొకనికిని భేదము లేకుండఁ జేయుట దుస్సాధ్య మనియుఁ గొందఱుబుద్ధిమంతు లొకయుక్తినిఁ జెప్పుదురు. మనుజులలోఁ బరస్పరాంతరము లుండ వని యెవ్వారును నొడువఁజాలరు. కాని యట్టి తారతమ్యములు తరతరాంతములవఱకు నంతు లేక నడచుచుండవలె నని గాని, యవి మానవు లొండొరులలో నుండవలసిన స్నేహపాశమును ద్రెంచి ద్వేషాసూయలను బుట్టించి పెంచెడుకులభేదములుగా మాఱవలె నని గాని బుద్ధిమంతుఁ డెవ్వండును గోర నేరఁడు. పాశ్చాత్యులలో వర్గభేదములును, నిమ్నోన్నతభావములును బ్రబలియున్నచో నపుడు వారిస్థితియు శోచనీయమే యగును గాని శ్లాఘనీయము గాదు. అయినను వారిలో నున్నభేదములు మనదేశమునందలికులభేదములవలె దురతిక్రమములును శాశ్వతములు నయినభేదములు గా వని మనము గ్రహింపవలయును. అచ్చటివిభాగములు యోగ్యతనుబట్టియు విద్యాసంపదనుబట్టియు నేర్పడినవి గాని పుట్టుకతోడనే నిర్ణయింపఁబడినవి గావు. భూపతనమైనతోడనే యొకఁడు సమ్మానార్హుఁడో గాఁడో యాతని కులగౌరవమునుబట్టి నిశ్చయింపఁబడుచున్నది. ఇతరదేశములందును మనదేశములందును వర్తించుచున్నభేదములలోఁ గలవిశేష మిచ్చటనే యున్నది. స్వప్రయత్నమూలకముగా నున్నతిని బూజ్యతను గాంచుటకు మనదేశపుస్థితిగతు లవకాశ మియ్యవు. కడమజాతీయుఁ డెంతటిగుణవంతుఁడైనను, నెంతటివిద్యావంతుఁడైనను గౌరవపాత్రుఁడుగా నెంచఁబడఁడు. ఉత్తమజాతీయుఁ డెంతటియధముఁడైనను, మూఢుఁడైనను, గౌరవార్హుఁడుగా నెన్నఁబడును. గుణాధికుఁడైనవాఁడు, జ్ఞానాధికుఁడైనవాఁడు సంఘములో నెట్టిగౌరవపదవి యైనను బొందుటకు పాశ్చాత్యులలో సంపూర్ణస్వాతంత్ర్యము గలదు. పాదరక్షలను గుట్టికొని జీవనముచేసిన పేదవానితనయుఁడు తనగుణజ్ఞానాతిశయప్రభావముచే రాజ్యచక్రమును ద్రిప్పెడునమాత్యుఁడో మతబోధఁ జేసెడు

నానాన్యదేశములందు సకలజనస్వాతంత్ర్యమునకు జేరఁగూడుట కేవలము లైనయభ్యంతరములు నా దేశములందు లేవు. అధమవర్గములోఁ బుట్టి యుత్తమగౌరవమును సాధించినపురుషవరేణ్యులు, విదుషీమణు లాప్రతీచ్యులలో వేనవేలు గలరు. ఇఁక మనదేశమునందలి కులభేదములో, యెన్నఁడో యేకారణముననో యుద్భవించినవై కాలక్రమమున స్థిరపడి సంఘమునం దిప్పటికిని దిటవుగా నాటుకొనియున్నవి. అనేకశతాబ్దములక్రిందట నేర్పడినయానిబంధనములకు దాసులై కోట్లకొలఁదిప్రజలు సకలమానవసామాన్యము లగు స్వాతంత్ర్యములకుఁ గూడ నెడలైనవారై యనంతము లైనయిడుములఁ గుడుచుచున్నారు. ఆనిర్బంధముల నొకింత నతిచరించినను ఘోరపాపముగాఁ బరిగణింపఁ బడుచున్నది. ఇట్టి యన్యాయములు పవిత్రమైన మతముపేరిట జరుగుచుండుట మతింతసంతాపకరము గదా! సకలాభివృద్ధికి భంగము నాపాదించుచుఁ జిరకాలమునుండి మనభరతఖండము నావేశించి యున్నయీవర్ణవైషమ్యపిశాచము హతమగునంతవఱకు విడువక యుద్ధము సలుపుటకై బ్రాహ్మసమాజము సంసిద్ధమై యున్నది. ఎట్టియాటంకములు తటస్థించినను వెనుకంజ వేయక, యెట్టియోటమితోను సమాధానము చేసికొన వేగిరపడక స్వభావవిరుద్ధములును, న్యాయవిరుద్ధములును, నీశ్వరోద్దేశప్రతికూలములు నైనయీభేదభావము లంతరించుదనుక నీసమరము సాగించుటకు బ్రాహ్మసమాజికులు కృతప్రతిజ్ఞులై యున్నారు.

సంఘమునందలియెల్లరును సమాను లనియెడునీయాదర్శమువలననే బ్రాహ్మసమాజముపై ననేకులకు ననూయత పొడముటకు హేతువు గలిగినది. జాతిభేదములను నిరసించినందునఁ బూర్వాచారపరాయణు లగుహిందువులు బ్రాహ్మసమాజముమీఁద ద్వేషము వహించిరి. ఈకులభేదములను నిందింపకపోయినచో హిందూసంఘ మొకవేళ బ్రాహ్మసమాజముయొక్క యేకేశ్వరవాదమును, నేకేశ్వరోపాసనమును సహించియుండును. కాని సర్వానర్థదాయక మైన యీకులభేదమహీరుహమును గూఁకటివేరుతో నూడఁబెఱుకుట బ్రాహ్మసమాజము తనముఖ్యధర్మములలో నొక్కటిగాఁ జేసికొనియున్నది. ఒకవైపునఁ బూర్వాచారపరులను గోపోద్రిక్తులనుఁ జేసియు, మఱియొకప్రక్కను వంశపరంపరగా దీర్ఘకాలమునుండి కొందఱనుభవించుచున్నయధికారగౌరవములకు భంగము నాపాదించియు, ఇట్లు పలువురకు ననిష్టము గలిగింపవలసివచ్చినను నోర్చి తన యుద్దిష్టధర్మమైనమానవభ్రాతృత్వమును మాత్రము బ్రాహ్మమతము విడువక నిలువఁబెట్టుచున్నది. నిమ్నజాతులుగా నెంచఁబడెడుపంచమాదులయొక్క సముద్ధరణము బ్రాహ్మ

సమాజముయొక్క మహత్కార్యములలో నొకటి. బ్రహ్మసమాజమునాదిగా నిప్పటి వఱకును క్రూరము లగు సాంఘికశాసనములఁబట్టి నిర్దయతోఁ జూడఁబడుచున్న యీ యంత్యజాతులవారికి బ్రాహ్మసమాజ మభయహస్తమిచ్చి కాచుచున్నది. ఈహీనజాతులకు సాహాయ్యము చేయఁగల్గుట తనమహాభాగ్యముగా బ్రాహ్మసమాజము భావించును.

సకలమానవులును సమాను లనియెడునీయుత్తమధర్మమును స్త్రీలపక్షమునను వర్తింపఁజేసి బ్రాహ్మసమాజము జనప్రీతికి మఱింత దూరమయ్యెను. హిందువులు నాగరికాగ్రగణ్యులై జ్ఞానాధికులై యుండినప్రాచీనకాలమునందు హిందూస్త్రీలును నున్నతదశయం దుండి సమస్తకళల నభ్యసించుచు సంఘమునకు వన్నెయు వాసియుఁ దెచ్చి రనుట కనేకనిదర్శనములు గలవు. కాని కడచినకొన్నివందలసంవత్సరములనుండి హిందూభామినులయవస్థ యతిహీనమై శోచనీయముగా నున్న దనుటకు సంశయము లేదు. స్త్రీవిద్య యొకగొప్పదోషముగా నెన్నఁబడెడుదుర్గతి తటస్థించినది. భర్తలకు విధేయురాండ్రై గృహమును దిద్దుటకుఁ దప్ప తక్కినయేపనులకును గొఱగానివారుగా వనిత లెన్నఁబడుచున్నారు. పరులఁ జూడనీక తెరలమఱుగునఁ బదిలముగా నుంచఁబడుచున్నారు. ఈశ్వరునిచే దయాపూర్వకముగ నొసంగఁబడినచక్కనివెలుతురునందుఁ దిరుగాడుటకు వారికి నవకాశము లేదు. నిర్మలవాయువును పీల్చుటకు వారికి వీలు లేదు. బుద్ధిని వికసింపఁజేసికొనుటకుఁ గాని, శరీరారోగ్యమును గాపాడుకొనుటకుఁ గాని యవకాశమే లేకయుండ నీక వారియాధ్యాత్మికస్థితిని గూర్చి యోజించువా రెవ్వరు? ఇవ్విధమున జ్ఞానవిషయమునను శారీరవిషయమునను ఆత్మవిషయమునను మనదేశపు నుదతులయొక్కయవస్థ యత్యంతవిచారకరమై భారతీయుల కెల్లరకు మిగుల లజ్జాకరముగా నున్న దనుటకు సందియము లేదు. పురుషులయొక్కప్రయోజనమునిమిత్తమును సౌఖ్యమునిమిత్తమును స్త్రీలు సృజింపఁబడినట్లు తలంపఁబడుచున్నారు. పవిత్రగ్రంథములుగాఁ బరిగణింపఁబడు భారతాదిగ్రంథములయందలి వనితలనుగూర్చి వర్ణనము లక్కడక్కడ నతిహేయములుగా నుండును. అనేకభాగములయందు వారు కామైకప్రధానలుగాను, విశ్వాసానర్హలుగాను నభివర్ణింపఁబడిరి. తండ్రియో, భర్తయో, కుమారుఁడో శ్రద్ధఁదీసికొననిచోఁ జెడిపోయెడుచంచలమతులుగా స్త్రీలు వర్ణింపఁబడిరి.

మానవస్వభావమునుగూర్చి తనకుఁ గలయున్నతభావమున కనుగుణముగా బ్రాహ్మసమాజము ప్రప్రథమముననే స్త్రీపురుషులకు స్వాతంత్ర్యము సమానముగా నుండవలె

వని నియమించియుండెను. ఆ మొట్టమొదటియేర్పాటు ననుసరించి సంఘమునందలిసర్వ విషయములను సవరించుచున్నది. స్త్రీలకు మిక్కిలివేదనాకరములుగా నుండెడు నెల్ల దురాచారములను మెల్ల మెల్లగా నిర్మూలము చేయుటకు బ్రాహ్మసమాజము దృఢప్రయత్నములను జేయుచున్నది. అతిఘోరమైన ఘోషాపద్ధతినిఁ దొలఁగించి పరమేశ్వరునిచేఁ బ్రసాదింపఁబడిన స్వచ్ఛమైనవాయువును సూర్యరశ్మిని స్వేచ్ఛగా ననుభవించుచు విద్యాలాభమును బొందుట కవకాశ మిచ్చుటయే గాక, విద్యలలో నెల్ల నగ్రగణ్యమై, యీశ్వరసద్భావమును బ్రకటించెడుబ్రహ్మవిద్యను గూడఁ బడయుటకు సదుపాయము చేయుచున్నది. సంఘమునం దిట్టిస్వాతంత్ర్యమును పతులకు నొసంగఁ బూనుకొనుటచే బ్రాహ్మసమాజము ప్రజలయొక్కయాదరమును బోఁగొట్టుకొనెను. స్త్రీల నుద్ధరించెడువారని బ్రాహ్మసమాజికులను గొంద ఱొకకాలమునందుఁ బరిహసించియుండిరి. ఆహాస్యము చేసినవా రిప్పుడు బ్రాహ్మసమాజ మొనరించినమహోపకారమును గుర్తించి ప్రస్తుతించుచున్నారు. యుగయుగములనుండి యంధకారమునఁ దడవులాడుచున్న వారికి బ్రాహ్మసమాజము సూర్యకాంతియొక్కసౌఖ్యమును జవిచూపిన దని చెప్పవచ్చును.

ఇదేతీరున గృహసంబంధము లైనవిషయములందును సంఘసంబంధము లైనకార్యములందును సాధ్యమయినంతవఱకు ధర్మన్యాయానుసారముగా బ్రవర్తించుటకు బ్రాహ్మసమాజము గడంగుచున్నది. యీశ్వరసమ్మతము లైనయిట్టిసకలసంస్కారములను గావించి గృహమును భూతలస్వర్గము గా మార్చుట బ్రాహ్మసమాజముయొక్కయాశయము. ఎవ్వరో కొందఱుజ్ఞానులకు మాత్రమే సాధ్య మగుమతము బ్రాహ్మమతము గాదు. ప్రశాంతములగుపర్ణశాలలలో మాత్రమే యనుష్ఠేయ మగుమతము బ్రాహ్మమతము గాదు. సంఘమునం దుండుసమస్తజనులు నవలంబించి యానందింపఁదగుమతము బ్రాహ్మమతము. సకలాభీష్టప్రదాయకుఁ డగుసర్వేశ్వరునియనుగ్రహమువలన భారతమహాసంఘమును ధర్మానుగుణముగను, న్యాయానుసారముగను, ప్రేమానుకూలముగను బునర్నిర్మాణము చేయుట బ్రాహ్మసమాజముయొక్క ముఖ్యాభిలాష.

———

# తొమ్మిదవ ప్రకరణము.

## ఉపసంహారము.

కడచినప్రకరణములయందు బ్రాహ్మసమాజముయొక్క ప్రధానసిద్ధాంతములను విశదపఱచియున్నారము. ఆసిద్ధాంతము లొకవేళఁ గేవలము నూతనములుగాఁ దోఁపక పోవచ్చును. బ్రాహ్మసమాజమువలె నుత్తమాదర్శములు గలిగియుండినభక్తశ్రేష్ఠులచే నట్టిసద్ధర్మములు పూర్వకాలమునందు నయితము ప్రకటింపఁబడియుండనోపును. అయినను నానావిధకష్టజాలములు చుట్టుముట్టినను వెనుదీయక యుదారము లైనయాధర్మసముదాయమును సంఘజీవనమునందుఁ బ్రవేశపెట్టుటకు బ్రాహ్మసమాజము చేసినప్రబలప్రయత్నములు హిందూదేశచారిత్రమునందే గాక ప్రాపంచికమతచరిత్రమునందును బ్రశంసాపాత్రములై ప్రకాశింపఁగల వనుటకు సంశయము లేదు. ఈశ్వరానుగ్రహమున బ్రాహ్మసమాజముయొక్క మనోరథము సిద్ధించునేని లోకము నంశయముఁ గలవరపఱచుచున్నయొకమహాసమస్య పరిష్కరింపఁబడఁగలదు. అమోఘమగుప్రత్యేకప్రమాణగ్రంథము లేక, అమోఘుఁడనఁ దగు భవిష్యద్వక్త లేక, యొక సర్వసాధారణమతసమాజమును స్థాపించుట యసాధ్య మని దాదాపుగా సకలజనులయొక్క యభిప్రాయమై యుండెను. అయినను సర్వోత్కృష్ట మైనయామతస్వభావమును నెఱింగినవారు లేక పోలేదు. మేటికవీశ్వరులు తమయనర్గళకవితాలహరియం దట్టియున్నతమతభావములను బ్రవహింపఁజేసియున్నారు. భావిదర్శులయొక్క హృదయాకాశమునం దీయాదర్శము విద్యుల్లతవలె మెఱసియున్నది. తత్త్వవిచారు లీయుత్కృష్టాదర్శమును దమభావప్రపంచమునందు దర్శించియున్నారు. అయినను నయ్యది సమస్తజనులకును హృదయసంతుష్టినిఁ గలిగించునట్టియు సమస్తమానవులచే ననుష్ఠేయ మగునట్టియు మతముగా మాత్ర ముపకరింపఁజాల దని బుద్ధిమంతులయొక్కయు భక్తులయొక్కయు నభిప్రాయమై యుండెను. పూర్వమతచారిత్రములనుబట్టి చూచితిమేని యిట్టియనుమానమునకుఁ గావలసినంతయవకాశము గలదు. లోకమునందలిమతములయొక్క చరిత్రములను బరీ

క్షీణించితిమేని ప్రతిమతమును బ్రాగ్గ్రంథమునఁ బ్రాతాంతరాశమునుండి వెలువడెడు జలప్రవాహమునకె మిక్కిలి నిర్మలమై కాలక్రమమున బహువిధజాతిమాత్సర్యములతోడను మూఢాచారములతోడను గలసి కలుషిత మయినట్లు మనము గ్రహింపఁగలము. పరిశుద్ధమై సాధారణమై యాధ్యాత్మిక మైనమతము మనదేశములో మిగుల నధోగతిని జెందియున్నది. సన్మతోద్ధారణము మనదేశములో సాధ్య మగునా యను సందేహమును గూడఁ బొడమింపునంతటిదుస్థితి ప్రాప్తించినది. ప్రతిమారాధనము ప్రబలమైనది. ఆచార్యు లసంఖ్యాకులు గలరు. ప్రమాణగ్రంథములు పెక్కు లున్నవి. కులజాతిమాత్సర్యములకు మితి లేదు. బౌద్ధయుగానంతరమున నీయనర్థము లన్నియు మనమతమునందు మూలాంగములుగాఁ బ్రవేశించియున్నవి. ఎందఱో మతాచార్యులు భక్తవర్యులు మనదేశమునందు జన్మించినను వారీప్రతిబంధకములను నతిక్రమింపఁ జాలరైరి. కోట్లకొలఁది దేవతలను గలిగి యనేకజాత్యుపజాతులుగాను, శాఖోపశాఖలుగాను భిన్నభిన్నమై యున్న యీభరతఖండమునందు సకలమానవులకును సమానజనకుండగు నేకేశ్వరునియొక్క యాధ్యాత్మికోపాసనమును స్థాపింపఁ బూనుకొనుట బ్రాహ్మసమాజముపట్టిన నతిసాహసకార్యముగా నెంచవచ్చును. ఎన్నియిక్కట్టులు తటస్థించినను సొక్కక ప్రతిఘటించి నిలిచి "దేవుఁ డొక్కఁడు; మానవకోటి యొక్కటి" యనుధర్మమును బ్రాహ్మసమాజము లోకమునకుఁ బ్రకటించుచున్నది. ఎవఱు సదుద్దేశముతో విగ్రహారాధన మావశ్యక మని వాదించినను, నింకెందఱు కపటవాదులు హేత్వాభాసములచేఁ బ్రతిమారాధనమును సమర్థింపఁ బూనినను, బ్రాహ్మసమాజము గనంతమైనను జలింపక యావాదముల నెల్ల ఖండించుచు నట్టి యారాధన మనావశ్యక మనియు నాత్మానందభంగకర మనియుఁ జాటుటయే గాక ప్రతిమారాధనముతో నెట్టిసంబంధము నైనను గల్గియుండుట గాని ప్రతిమారాధనముగా భావింపఁబడినయెట్టిచిహ్న మైనను దాల్చుట గాని తగ దని ఘంటాపథముగా వెల్లడించుచున్నది. స్వకీయజీవనమునందే గాక గృహసంబంధములైనట్టియు సంఘసంబంధములైనట్టియు సర్వకార్యములయందును బ్రాహ్మసమాజికుఁడు విగ్రహారాధనమును విసర్జింపవలెను. పుట్టినదాది మరణపర్యంత మతఁ డనంతుఁడును నద్వితీయుఁడు నగు పరబ్రహ్మము నే యాత్మపూర్వకముగా యథార్థముగా నుపాసింపవలయును. అతని నొక్కని నే సేవింపవలయును. బ్రాహ్మసమాజముయొక్క యుపదేశములవలన

# బ్రాహ్మధర్మసారము.

-:(O):——

శ్లో॥ సువిశాల మిదంవిశ్వం పవిత్రం బ్రహ్మమందిరమ్
చేతస్సు నిర్మలంతీర్థం సత్యం శాస్త్ర మనశ్వరమ్
విశ్వాసో ధర్మమూలంహి ప్రీతిః పరమసాధనమ్
స్వార్థనాశస్తు వైరాగ్యం బ్రాహ్మైరేవం ప్రకీర్త్యతే.

[సువిశాల మైనయీవిశ్వము పవిత్రమైనబ్రహ్మమందిరము. నిర్మలమైనచిత్తమె పుణ్యక్షేత్రము. సత్యమె నాశము జెందనిశాస్త్రము. విశ్వాసమె మతమునకు మూలము. ప్రేమయె శ్రేష్ఠమైనసాధనము. స్వార్థనాశమె వైరాగ్యము. బ్రాహ్మలచే నిట్లు చెప్పఁబడుచున్నది.]

# అంకితము

సీ. పరివిమలవేదాంత పరిష్కృతిశాస్త్రంబులఁ
బఠియించి పట్టంబుఁ బడసె నెవఁడు
పరిజలలోఁ బరిశుద్ధ పరిబలంబుగాఁగఁ బరి
సంగంబు లూరూర సలిపె నెవఁడు
సంఘసంస్కారంబు సాధింపుఁ డంచును
సకలజనాళికిఁ జాటె నెవఁడు
స్వాదరణంబుచే బ్రాహ్మసమాజాభ్యు
దయకారణుం డయి తనరె నెవఁడు
దేశరాజాన్వయదీపకుండై పెద
బాపయ్య యనుపేరఁ బరగె నెవఁడు.
అస్మదీయహితుఁడు గాక యఖిలలోక
హితుఁడు నయి గుణోపేతుఁడై యొసగె నెవఁడు
అట్టివినుతచారిత్రున కలఘుమతికి
సంకీత మొనర్తు మత్కృతి నధికభక్తి.

# వి జ్ఞ ప్తి

మతప్రపంచమునం దిపు డొకనూతనభావ ముదయించినది. సత్యశివసుందర స్వరూపుఁ డైనయీశ్వరుఁ డొక్కఁడే గలఁ డనియు, నట్టియేకేశ్వరునియుపాసనయే మోక్షప్రాప్తికి రాజమార్గ మనియు సకలజనులును గ్రహించుచున్నారు. మతమహా సముద్రములో నుద్భవించినయీనవీనభావతరంగమువలన సర్వమతస్థులలోను, సర్వదేశములలోను నూతనోద్యమములు ప్రారంభ మైనవి. క్రైస్తవమతస్థులలో యూనిటేరియనుమతమును, ఆస్తికమతమును నంకురించినవి. మహమ్మదీయమతావలంబులలో బాహైమతము బయలు దేఱినది. హిందువులలో బ్రాహ్మమతము ప్రభవించినది. యూనిటేరియనుమతము ఐరోపా, అమెరికా మున్నగుక్రైస్తవదేశములలో నెల్ల మెల్లమెల్లగా వల్లుకొనుచున్నది. బాహైమతము పారసీకదేశములోఁ బ్రారంభమై మహమ్మదీయులు గలసకలప్రదేశములలోఁ గ్రమక్రమముగాఁ బ్రాకుచున్నది. బ్రాహ్మమతము భరతఖండమునం దంతట వ్యాపించుచున్నది.

మనయాంధ్రదేశములో బ్రాహ్మమతము ప్రవేశించి ముప్పదిసంవత్సరములు గడచినవి. బ్రాహ్మమతధర్మములే తమధర్మములుగాఁ గలయనేకప్రార్థనసమాజములు మన తెలుఁగుదేశమునందుఁ బుట్టినవి. కీర్తిశేషులయిన శ్రీమన్నవ బుచ్చయ్యపంతులు గారిచేఁ బూర్వము సంపాదింపఁబడుచుండిన హిందూజనసంస్కారిణీపత్రికయు, శ్రీరాయబహద్దరు కందుకూరి వీరేశలింగముపంతులుగారిచే నడపఁబడుచుండిన వివేకవర్ధని, సత్యవాదిని మొదలైనపత్రికలును బ్రాహ్మమతాభిప్రాయములను తెలుఁగుదేశస్థులలో వ్యాపింపఁజేయుటకు విశేషముగాఁ దోడ్పడియుండెను. బ్రాహ్మధర్మాంతర్గతము లగుప్రత్యేకవిషయములనుగూర్చి కొంతకొంతజ్ఞానమును బడయుటకు జనుల కప్పుడప్పుడుపన్యాసాదులవలన నవకాశములు గల్గుచువచ్చినను, సమస్తధర్మములను సమగ్రముగాఁ దెలిసికొనుటకు నేవిధమైనయాధారమును లేదయ్యెను. గతించినతొమ్మిదిపదిసంవత్సరములనుండి బ్రాహ్మమతమునుగుఱించి సంపూర్ణముగాఁ దెలిసికొనవలె నని యాంధ్రమహాజనులలో నొకప్రబలమైనయాకాంక్ష యుద్భవించినది. అప్పుడప్పుడు బ్రాహ్మసమాజ

మునుపూర్వ యేదైనయుపన్యాసమును వినఁ దటస్థించినవారు తద్ధర్మములను బూర్తిగాఁ దెలుపుపుస్తక మేదేనిఁ దమకు దయచేయు మని సామాజికులఁ గోరఁ దొడంగిరి. బుద్ధియందును, భాషాపరిచయమునందును, లోకానుభవమునందును నాకంటె నధికులైనవారెవ్వరయినఁ దగ్గ్రంథము లేనిలోపమును దీర్చెదరేమో యని నేను జాలకాల మెదురుచూచియుంటిని. కాని యెంతవఱకు వేచియున్నను గార్యము లేదయ్యెను. ఇటులుండ మిత్రులు గొందఱీగ్రంథరచనమునకు నన్ను బూనుకొను మని హెచ్చరింపసాగిరి. నాయసమర్థత నెఱిఁగించి నన్ను మన్నింపుఁ డని నాహితులకు విన్నవించితిని. ఐనను నూరకుండక పలుమాఱు నన్నీకార్యభారమును వహింపు మని వారు ప్రేరేపించియుండుటచేతను, పుస్తక మేదియు లేకపోవుటకంటె నేదియో యొకటి యుండుట కొంతవఱకుఁ బ్రయోజనకరముగా నుండు ననుతలంపుతోడను నే నీపుస్తకమును వ్రాయ నారంభించి ముగించినాఁడను. ధర్మములను వ్యక్తీకరించుటలో నేమి, భాషారూపమున వానిని బ్రదర్శించుటలో నేమి, నే ననేకలోపముల నిందుఁ గావించియుండవచ్చును. నాశక్తిలేమిచేఁ గల్గినయాదోషములను మాన్యమైనబ్రాహ్మమతమున కారోపింపక యనుభవజ్ఞుల నడిగియో, తద్విషయముల విపులముగాఁ జర్చించునద్గ్రంథములఁ జదివియో తమ యనుమానముల నివారించుకొనఁ జదువరులు ప్రార్థితులు.

ఈగ్రంథమును జాలవఱకు శ్రీహేమచంద్రసర్కారుగారిచే వ్రాయఁబడిన "బ్రాహ్మసమాజమత" మను పుస్తకమునుబట్టియే రచించితిని. అందుచే వారికి మున్ముందు నాహృదయపూర్వకవందనముల నర్పించుచున్నాను. పండితశివనాథశాస్త్రిగారును, శ్రీసీతానాథతత్త్వభూషణుఁడుగారును, జానురైటుదొరగారును వ్రాసినగ్రంథములుగూడ నాకుఁ గొన్నియంశములలో సాహాయ్యము చేసియుండుటచే వారికిని నేను నాకృతజ్ఞతను వెల్లడింపవలసియున్నది. మానవసేవాపత్రికాధిపతులై నా ప్రేమాస్పదులగు మిత్రులై నాయీగ్రంథరచనమునకు ముఖ్యకారకులుగా నుండిన శ్రీనాళము కృష్ణరావుగారికిని, తదితరసుహృదుల కెల్లరకును నాయభివందనముల నొసంగుచున్నాఁడను.

---

# బ్రాహ్మసమాజసంగ్రహచరిత్రము.



అతిప్రాచీనకాలమునుండి యిప్పటివఱకును హిందూమతమును సంస్కరించుటకై యనేకప్రయత్నములు జరిగినట్లు తన్మతచారిత్రపరిశీలనవలన సుబోధకముకాఁగలదు. దాదాపుగాఁ బ్రతియుగమునందును నానాకాలములయందు జనులచే నవలంబింపఁబడు మతమునందలిలోపములను రూపుమాపుటకయి సంస్కర్తలు కృషిసలిపియున్నారు. ఇట్లు సంఘమునందు బయలుదేఱినప్రతిసంస్కారోద్యమమును బ్రజలహృదయసీమలయందు సత్యస్వరూపుఁ డగుపరబ్రహ్మముయొక్క యాధ్యాత్మికోపాసనను నెలకొల్పుటనే ప్రధానోద్దేశముగాఁ గలిగియుండెను. ఉపనిషత్కాలపుఋషీశ్వరులనాఁటినుండి నేటివఱకును తరతరమునందును మనభరతఖండమునందలి యేదోయొకభాగమునందు నెవ్వఁడో యొకమహాపురుషుఁ డుద్భవించి భక్తిప్రచారముచేతను, కర్మశీలత్వముచేతను విగ్రహారాధనముచేతను జెడిపోవుచుండు హిందూమతమును సంరక్షించియున్నాఁడు. హిందూమతమునుగూర్చి క్రమమైనచరిత్ర లేమిచే నామహామతసంస్కర్తలనామము లన్నియు మనకుఁ దెలియవయ్యెను. అయినను నాసంస్కారసంతతిలోఁ జేరినమహానుభావు లగు గౌతమబుద్ధుఁడు, నానకు, కబీరు, తుకారాము, చైతన్యులయొక్క పవిత్రనామముల నిటఁ బేర్కొనినఁ జాలును. ధన్యచారిత్రులగు నాపురుషపుంగవులచే నత్యంతసామర్థ్యముతో సాగింపఁబడినయమ్మహాప్రయత్నమునే వర్తమానభరతవర్షమునందు బ్రాహ్మసమాజము నడుపుచున్నది. తత్సంస్థాపకుఁడగు రాజారామమోహనరాయలు వారును హిందూస్థానమునకు నిరుపమానప్రఖ్యాతిఁ దెచ్చిన యాఋషిసత్తములయొక్కయు భక్తాగ్రేసరులయొక్కయు సరియైన సంతతివాఁడనుటకు సంశయము లేదు.

భరతఖండమునం దిప్పు డొకనూతనయుగ మారంభమయినది. హిందూదేశచరిత్రమునం దీయుగమున కద్వితీయమైనప్రాముఖ్యము గలదు. ప్రకృతమునందువలె మునుపెన్నఁడును మనజాతీయజీవనమునందలిసకలశాఖలయందును నిట్టిశీఘ్రములైనమార్పులు జరిగియుండలేదు. భారతజాతియొక్క రాజకీయసాంఘికపారిశ్రామికాదిసర్వవిషయములందును నిప్పు డొకమహత్తరమైనపరివర్తనము కలుగుచున్నది. ఇంత యేల? సకలప్రపంచము

నను మనోహరముగా నుండు నద్భుతనాటకరాజ మొకటి హిందూదేశరంగప్రదేశము నందుఁ బ్రదర్శింపఁబడుచున్నది. దూరదూరముగాఁ జాలకాలమునుండి ప్రవహించు చుండినమహావాహినులం బోలుప్రాగ్దేశపాశ్చాత్యనాగరికతలు రెండును మనహిందూదేశ మునందుఁ గలిసికొనినవి. ఈయుభయనాగరికతలసమ్మేళనమువలన భావిమానవకోటిచే ననుసరణీయం బగు నొకశ్రేష్ఠమై, సంపూర్ణమైనయుత్తమనాగరికత యుదయింపనున్నది. నిత్యుఁడై, నిరాకారుఁడై, నిఖిలప్రజాపితరుఁడైన యేకేశ్వరునియుపాసనయే ప్రధానముగాఁ గలిగినట్టియు,జాతివర్ణాదిభేదము లేక సమస్తదేశస్థులను సమస్తవర్ణస్థులను సమ్మేళనముచేయ సమర్థమైనట్టియు నొకసాధారణమతాదర్శమును బ్రాహ్మసమాజప్రతిష్ఠాపకుఁ డగు రామమోహనరాయలవారికి దయామయుఁ డగుభగవంతుఁ డుపదేశించియుండెను.

లోకమునందలియెల్లముఖ్యమతస్థులచే నాత్మాభివృద్ధినిమిత్తమై యనుసరింపఁబడు నానావిధసాధనవిధానములను నెఱిఁగినవాఁ డగుటచే నుదారమై విశ్వజనీనమైన యీమహామతమును బ్రకటించుటకై రామమోహనుఁడు భగవంతునిచే నుద్దేశింపఁబడెనేమో యనుతలం పెల్లవారికినిఁ గలుగకమానదు. ఒకయుత్తమహిందూకుటుంబమునందుఁ బుట్టిపెరిగినవాఁ డగుటచే, రామమోహనుఁడు హిందూమతసంబంధములైన నిఖిలగ్రంథములను సకలాధ్యాత్మికసాధనకలాపములను జక్కఁగా నెఱిఁగియుండెను. విశేషవయస్సు రాకమునుపే యాతఁడు మహమ్మదీయమతము గుఱించినగ్రంథసముదాయమును జదివెను. భాషాంతరములమూలమునఁ గాక మూలమునందే బైబిలు వేదగ్రంథమును జదువ నెంచి హీబ్రూగ్రీకుభాషలను బఠించి, తద్గ్రంథమును శ్రద్ధతోఁ బరిశీలించి, క్రైస్తవమతమునుగూర్చి యథార్థజ్ఞానమును సంపాదించెను. ఉదారములైన తనమతాభిప్రాయకారణముచే గృహమునుండి తండ్రిచే వెడలనడపఁబడినవాఁడై యుత్తరహిందూస్థానమునందుఁ గొంతకాలము సంచరించి, హిమాలయపర్వతమున కావల నున్నతిబెతుదేశమున కరిగి, బౌద్ధమతజ్ఞానమును బడసెను. నానాప్రదేశములయందుఁ జరించి, షోడశభాషల నేర్చి, హిందూమహమ్మదీయాదిపంచమహామతములయొక్క ప్రమాణగ్రంథముల శోధించి సర్వమతసారముగాఁ దా గ్రహించినమతరాజమును భరతఖండమునందే గాక యావత్ప్రపంచమునందును వ్యాపింపఁజేయ నెంచి యాతఁడు తననలువదవయేట 1814 వ సంవత్సరమునఁ గలకత్తానగరమునఁ బ్రవేశించి స్థిరనివాస మేర్పఱచుకొనెను. ఈమహాత్కార్య

సాఫల్యార్థమై యామహనీయుఁడు తనయావద్భాగ్యమును, యావత్కాలమును, యావచ్ఛక్తిని వినియోగించెను.

మృదుమధురసంభాషణములద్వారమునఁ దనస్నేహితకోటికిని, లిఖితోపన్యాసములమూలమున మానవకోటికిని దనసందేశము నెఱింగించుచు నామహాపురుషుఁడు పదునాల్గుసంవత్సరములు తనయుద్యమమును ఫలింపఁజేయుటకై పాటుపడెను. హిందువులేమి క్రైస్తవులేమి సామాన్యజను లెవ్వరును నాధీమంతునియంతరంగమును గ్రహింపలేక తీవ్రముగా నతనిని నిందింపసాగిరి. ఆయామతావలంబులప్రమాణగ్రంథములందలి వాక్యములనే చూపి హిందువులను క్రైస్తవులను వాదములలో నిరుత్తరులను జేయుటకై యతఁడు ప్రయత్నించెను.

నిరాకారుఁడై, నిత్యుఁడైన యేకేశ్వరునియుపాసననే హిందూప్రాచీనప్రమాణగ్రంథములు విధించుచున్నవని తనహిందూప్రతిపక్షుల కాతఁడు ప్రమాణవాక్యములఁ గనఁబఱిచెను. ఈశ్వరపితృత్వము, మానవభ్రాతృత్వము ముఖ్యముగాఁ గలపరిశుద్ధాస్తిక మతమునే జీసను బోధించెనని క్రైస్తవుల కతఁడు స్పష్టముగాఁ దెలియఁజేసెను. "దేవుఁ డొక్కఁడు, మానవకోటి యొక్కటి" యనెడు నుత్తమధర్మము నుపదేశించెడు సాధారణాస్తికమతమును స్థాపించునిమిత్తమై యతఁ డిట్లు పూర్వాచారపరాయణులగు హిందూక్రైస్తవమతస్థులతో ననన్యసహాయుఁడై పోరాడవలసినవాఁడయ్యెను. తుట్టతుదను రామమోహనుఁడు జాతిమతవిచక్షణ లేకుండ నెల్లవారును నేకముగా నుపాసించు నుద్దేశముతో నొకసమాజము నేర్పఱిచి తన్నిమిత్తమై కలకత్తానగరమున కుత్తరభాగమున నొకగృహము నద్దెకుఁ దీసికొనెను. పిదప రెండుసంవత్సరముల కతఁడు కొందఱుమిత్రుల సాహాయ్యముతో బ్రాహ్మసమాజమునకై కలకత్తాపురముయొక్కమధ్యభాగమునం దొకసామాన్యమందిరమును నిర్మించెను. అదె యిప్పటికిని ఆదిబ్రాహ్మసమాజ మను పేరం బరగుచున్నది.

జాతిమతాదిభేదము లేక కొంద ఱీసదనమునందు వారవారమును నేకేశ్వరోపాసననిమిత్తమై చేరుచుండిరి. ఉపనిషత్తులనుండి కొన్నిశ్లోకములను జదువుటయుఁ, గొన్ని కీర్తనలను బాడుటయు, రామమోహనవిరచితములగు మతోపన్యాసములను బఠించుటయును నప్పటియీశ్వరోపాసనయై యుండెను. బహిరంగముగా నిట్టియుపాసనలను జరుపుటకుఁ బూర్వము కొంతకాలము సామాజికులందఱు మందిరమునకు వెనుకభాగమున నున్న

గము కగదిం గూర్చి వేదాధ్యయనము చేయుచుండిరి. వేదపఠనమునకు బ్రాహ్మణులకు మాత్రమే యధికారముండుటచే నాయుపాసనకు బ్రాహ్మణేతరులు పోవుటకు వీలు లేకుండెను.

శైశవావస్థలో నుండిన యీమతసమాజమును రామచంద్రవిద్యావాగీశున కొప్పగించి 1830 వ సంవత్సరము ఆగష్టు నెలలో రామమోహనుఁ డింగ్లాండు దేశమునకుం బయనమయ్యెను. దేశాభిమానధురంధరుఁడును బరోపకారపారీణుఁడునై ప్రసిద్ధిఁజెందిన యీమహనీయుఁ డాదేశమునందు 1833 వ సంవత్సరము సెప్టెంబరు 27 వ తేదిని పరమపదము నొందెను. తన్ను స్థాపించి, పోషించుచుండిన రామమోహనుఁడు కలకత్తానగరమును వదలినదాదిగా బ్రాహ్మసమాజము క్రమక్రమముగా వాశిల్లఁదొడంగెను. రామమోహనునియందలి గౌరవాతిశయముచే నందుఁ బ్రవేశించిన యనేకసామాజికులాతఁ డింగ్లాండు దేశమునకుఁ జనినప్పటినుండియు సమాజమునుగురించి చింతింప మానిరి. కాని పరమవిశ్వాసి యగు నా రామచంద్రవిద్యావాగీశుఁ డొక్కరుఁడు మాత్రము సమాజమును త్యజియింపఁ డయ్యెను. గట్టిపట్టుదల గలవాఁడయి యేడేండ్లకు నతఁడు కాలము మించుచుండ దినదినము నామందిరమున కరిగి, రామమోహనుఁ డుపదేశించినవిధమున నుపాసనను నడపుచుండెను. భూశయనము చేయఁబడిన యనసానపశయ్యంగు సయితము తనభర్తకు మరల ప్రాణములు చేకూరు నేమో యని పేరాసతో నతనిముఖమునే చూచుచు వేచియుండెడు భార్యవగిది, నా విద్యావాగీశుఁడు చేయువిధమున సమాజమును గని పెట్టుకొనియుండెను. ఒక్కొకప్పు డుపాసన వాతఁ డొంటిమై జరపవలసినవాఁ డగుచుండెను. ఇటు లుండ నతఁడు తా నెన్నఁడు నెదురుచూచి యెఱుఁగనిదిక్కునుండి యాకస్మికముగా సాయమును బొందెను. రామమోహనుని స్నేహితుఁడును సహాయుఁడు నైన ద్వారకానాథఠాకురు యొక్క ప్రథమపుత్రుఁడు 1838వ సంవత్సరమున బ్రాహ్మసమాజమును గూర్చి శ్రద్ధఁ దీసికొన నారంభించెను. తనబాల్యమునందు దేవేంద్రనాథుఁడు రామమోహనునిఁ జూచియుండెను. రామమోహనుఁడును నతనియం దెక్కువమక్కువ గనఁబఱిచెను. తాఁ బూనినకార్యభారమును తనమరణానంతరము వహించుటకు దేవేంద్రనాథుఁడ సమర్థుఁడు గాఁగలఁ డని రామమోహనుఁ డప్పుడే తలంచినట్లు గొందఱు నుడువుదురు కాని చాలకాలమువఱకు దేవేంద్రనాథునియం దేవిధమైనమతానురాగమును వంక తెలుపలేము.

ధనవంతులగు పలువురిబిడ్డలవలె దేవేంద్రనాథుఁడును మొట్టమొదట సహజవైభవముతో నిచ్చ్రమై వర్తించెను. కాని యకస్మాత్తుగా నొకదినమున నాతనిడెందములో నొకమహత్తరమైనమార్పు పొడమెను. మరణ మాసన్నమై యున్నతనపితామహిని గంగాతీరమున నుంచి యాశ్మశానవాటికయందుఁ గాచియున్నసమయమునం దతని కొకయసదృశమైన నూతనభావోదయము కలిగెను. అప్పు డాతఁడు దీర్ఘసందర్శనమును బొంది యనిర్వాచ్యమైనపరమానందము ననుభవించెను. అంతట నతని కైహికైశ్వర్యము లెల్ల మిక్కిలిస్వల్పములుగాఁ దోఁచెను. నాఁటినుండియు నాతనిజీవితప్రవాహము మఱియొకనూతనమార్గమునఁ బోసాగెను. అనేకవాసరము లతఁడు తదేకధ్యానమునందుఁ గడపెను. దేవుఁ డద్వితీయుఁ డనియు, నింద్రియాగోచరుఁ డనియు ప్రతిమారాధన మెన్నటికిని భగవదారాధనము గానేర దనియు, నతఁడు గ్రహించెను. ఆసమయమున రామమోహనుఁ డతనిస్మరణమునకు వచ్చెను. బ్రాహ్మసమాజమును గుఱించి విచారింపఁజొచ్చెను. రామచంద్రవిద్యావాగీశులవారికి వర్తమానమంపెను. వెంటనే దేవేంద్రనాథుఁ డీపండితవరేణ్యునిొద్ద నుపనిషత్తుల నేర్వ నారంభించి, యాస్తికమతబోధకము లగుగ్రంథములపఠనమును వ్యాపింపఁజేయుఁ దలంపుతోఁ దత్త్వబోధినీసభ యనుపేర నొకసమాజమును స్థాపించెను.

ప్రప్రథమమున నీసమాజమునందు దేవేంద్రనాథుఁడు నాతనిసోదరాదిబంధువులె సభ్యులుగా నుండిరి గాని త్వరలో నది యన్యులను గూడ నాకర్షింపఁదొడంగెను. ఆసంఘమునకు విద్యావాగీశులవా రాచార్యులుగా నేమింపఁబడిరి. 1840 సంవత్సరమున నాసమాజముయొక్క ప్రథమసాంవత్సరికోత్సవము విశేషవైభవముతో జరుపఁబడెను. బ్రాహ్మసమాజము మిక్కిలిదీనదశయం దుండినయత్తఱిని దత్త్వబోధినీస్థాపన మెంతయు దానికిఁ బ్రోత్సాహదాయకమయ్యెను. తత్త్వబోధినీసభాసదు లీబ్రాహ్మసమాజమును వర్ధిల్లఁజేయ నెంచి తాము ప్రత్యేకముగా జరుపుకొనుచున్నయుపాసనను మానుకొని బ్రాహ్మసమాజోపాసనయందుఁ జేర నిశ్చయించుకొనిరి.

ఇట్లు యౌవనులయుత్సాహప్రోత్సాహములచే బ్రాహ్మసమాజము పునర్జీవము నొందెను. తదాదిగా బ్రాహ్మసమాజమునందు వగల నూతనకార్యోత్సాహ మంకురించెను. వృద్ధాచార్యుఁ డగు నావిద్యావాగీశునియొక్క పట్టుదల నేఁటికి ఫలించినది. విద్యావాగీశుఁడే శ్రద్ధతీసికొనియుండకపోయినచో రామమోహనునిచే నాటఁబడిన బ్రాహ్మసమాజబీజము మొలకెత్తక యంతరించియుండును.

ధీమంతుఁ డగు దేవేంద్రనాథుఁడు బ్రాహ్మసమాజాంకురమును దగినవిధమున దోహదము చేయఁ దొడంగెను. తనసామర్థ్యాతిశయముచే నతఁ డనేకయౌవనులను సమాజమునందుఁ జేర్చెను. నిరంతరపరిశ్రమపరాయణుఁ డగుటచే నతఁడు సమాజాభివృద్ధికై యనేకోపాయముల నరయ నారంభించెను.

దేవేంద్రనాథుఁడు సమాజమునందుఁ జేరకపూర్వము శ్రద్ధతో నుపాసనకొఱకు సమాజమునకు వచ్చువారిసంఖ్య మిక్కిలితక్కువగా నుండెను. కేవలవినోదమునిమిత్తము కొందఱును, వేదమంత్రపఠనము వినుకుతూహలమునఁ గొందఱును, భగవత్కీర్తనముల నాలకింపఁ గొందఱును, నిట్లు నానావిధము లైనయుద్దేశములతో జనులు బ్రాహ్మసమాజోపాసనలకుఁ జనుచుండిరి. నిర్ణీత మైనయొకయుద్దేశము గాని నిశ్చిత మైనయొకయభిప్రాయము గాని యందెవ్వరికిని లేదయ్యెను. వేదపఠనము నాకర్ణించుట కనర్హు లైనట్లెంచి బ్రాహ్మణేతరులను దమసమాజమునందుఁ జేర్చికొనక జాతిమతాదిభేదములు లేక యెల్లవారును సమాజోపాసనలయందుఁ జేరవచ్చు నని తత్సమాజప్రదానపత్రమునందుఁ జేయఁబడిననిబంధన ముల్లంఘింపఁబడెను. ప్రతిమారాధనమును, అవతారములను గూర్చిన సిద్ధాంతములు నిరాతంకముగా సామాజికవేదినుండి తఱచు బోధింపఁబడుచుండెను. సమాజమునందుఁ దాఁ బ్రవేశించినతోడనే దేవేంద్రనాథుఁ డీలోపములఁ దీర్పసమకట్టెను.

దేవేంద్రనాథునియొక్క ప్రాబల్యమువలనను, ప్రోత్సాహమువలనను, నాసమాజము సంపూర్ణముగాఁ బరిశుద్ధాస్తికమతసమాజ మయ్యెను. ఉపాసనకై యొందఱో తన్మందిరమునందు సమావేశమగుచుండినను, వారందఱ నైక్యముచేసెడుసమానధర్మము లెవ్వియు లేకుండెను. సకలేతరహిందువులవలెనె గృహమునందు నీసామాజికులును విగ్రహారాధకులుగనే యుండిరి. ఏకేశ్వరునియందు నమ్మకముంచి, యతని నొక్కనినే యాత్మపూర్వకముగను, యథార్థముగను, నుపాసించెడునొకసంఘమునుగా బ్రాహ్మసమాజమును జేయ నెంచి దేవేంద్రనాథుఁ డొకప్రతిజ్ఞాపత్రమును దయారుచేసెను.

విగ్రహారాధనావిసర్జనమును, వేదాంతానుసారముగా బ్రహ్మోపాసనయు, పుణ్యానుష్ఠానమును బ్రతిసామాజికుఁడును బ్రతిపాలింపవలసిననియమములుగా నందుఁ జేర్పఁబడెను. 1843వ వత్సరము డిశెంబరుమాసమునందుఁ దానే మొట్టమొదట నాపత్రికను సంతకముచేసి తీసికొని విద్యావాగీశులవారిచే బ్రాహ్మసమాజమునందుఁ జేర్చికొనఁబడినవాఁడై దేవేంద్రనాథుఁడు తత్ప్రతిజ్ఞాపత్రికాస్వీకారమునందు నితరసామాజికులకు

మార్గమును జూపెను. అతఁడవలంబించినయీనూతనపద్ధతి బ్రాహ్మసమాజచరిత్రములో నత్యంతప్రధానమయినది. అతఁడు త్రొక్కినత్రోవ ననుసరించి యిరువదిమందిసామాజికులు సంతకములుచేసి ప్రతిజ్ఞలను గైకొనిరి. బ్రాహ్మసంఘములయొక్క బీజ మిట్లు హిందూస్థానక్షేత్రమునందు మొట్టమొదట నాటఁబడినది. 1847 సంవత్సరము వచ్చుసరికి బ్రాహ్మమతస్థులసంఖ్య యేడువందలయిరువదియేఁ డయ్యెను.

స్పష్టముగా నెవ్వరును జెప్పకపోయినను, బ్రాహ్మమత ముపనిషత్తుల నాధారము చేసికొనియుండిన ట్లింతవఱకు భావింపఁబడుచుండెను. తనక్రైస్తవప్రతికక్షులవాదములను బైబిలునందలిప్రమాణములమూలముననే ఖండింపఁగడంగినట్లు రామమోహనుఁడు తనహిందూప్రతిపక్షులతో వాదింపవలసివచ్చినపుడు హిందువులప్రమాణగ్రంథము లగు నుపనిషత్తులలో నుండి ప్రమాణవాక్యములను గనఁబఱచుచుండెను. హిందూమతస్థుల ప్రమాణగ్రంథము లెవ్వియు విగ్రహారాధనము నంగీకరింప వని స్వదేశస్థులకుఁ దెలుపు నిమిత్తమై యుపనిషత్తులఁ గొన్నిటి నాతఁడు సంస్కృతమునందుఁ బ్రచురించుటయే గాక ఆంగ్లవంగభాషలలోఁగూడ వానిని రచించి ప్రచురించి స్వదేశవాసులకే గాక పరదేశీయులకుఁ గూడ నందలిరహస్యము లెల్లఁ దేటతెల్ల మగునట్లు చేసెను. ఇట్లుఁ జేయుటచే బ్రాహ్మమతమున కుపనిషత్తు లాధారము లని రామమోహనునియనుగాములు తలంచిరి. తొలుత వేదాంతమే బ్రాహ్మమతముగా భావింపఁబడెను. మౌనీభావ మర్ధాంగీకారముగాఁ బరిగణింపఁబడుటచే వేదములయొక్క ప్రామాణ్యత గూడ సమ్మతింపఁబడినట్లుగనే యెన్నఁబడెను. అందువలన బ్రాహ్మమతము నొకవేఱుమతముగా నెంచుటకు జనులకంతగాఁ గారణము కనఁబడదయ్యెను. ఇత్తఱుణమునందు నుత్తమహిందూకుటుంబమునకుఁ జెందిన యొకబాలుఁడు క్రైస్తవమతమునందుఁ జేరఁ దటస్థించెను. అపుడు హిందూజనసంఘమునందుఁ గ్రైస్తవులయెడఁ గలిగినమహాద్వేషము బ్రాహ్మసమాజమునకుఁ గొంతప్రోత్సాహము నొసంగెను. తనబ్రాహ్మమతానురాగమునకు నుపనిషత్తులు మొట్టమొదట నంతగాఁ దోడ్పడినవి గాకపోయినను దేవేంద్రనాథుఁ డుపనిషత్తుల యెడ నధికవిశ్వాసము గల్గియుండెను. అంతియే గాక సంహితలాదిగాఁ గలయితర ప్రమాణగ్రంథములనెల్ల నిరాకరించినను, నుపనిషత్తులనుమాత్రము బ్రాహ్మమతమునకు నాధారములుగా నంగీకరింపవలె నని యతఁ డుద్దేశము కనఁబఱచెడువాఁడు. కాని యిక్కాలమునందు నాయుపనిషత్తులనుగూడ నమోఘప్రమాణములుగా సమ్మతింపని

యువజనులు కొందఱు సమాజమునుండి బయలుదేరిరి. బ్రాహ్మసమాజమునందు దీనివిషయమై వాదప్రతివాదము లనేకసంవత్సరములు నడచెను. మహర్షి దేవేంద్రనాథుఁడు దీనిని గుఱించి జాగరూకతతో నాలోచించి చతుర్వేదములను బఠించుటకై నల్వురుపండితులను వారణాసికిఁ బంపెను. ప్రసిద్ధులగు వేదవిద్వాంసులతో నీమహద్విషయమును గూర్చి చర్చించుటకై యతఁడుగూడ స్వయముగాఁ గాశీపురమున కరిగెను. తుట్టతుద కీయాలోచన మంతయు నాతనిమనస్సున కనుకూలముగాఁ బరిణమింపలేదు. నిష్పాక్షికవిచారణమీఁద వేదములు గాని యుపనిషత్తులు గాని యమోఘప్రమాణములుగా నంగీకరింపఁదగనివిగాఁ దేలుటచేఁ దన కెంతయునిష్టముగాను, విచారకరముగాను నున్నను నతఁడు 1848 సంవత్సరమున గ్రంథప్రమాణమును ద్యజింపవలసినవాఁ డయ్యెను. ఇట్లు వేదాంతసంబంధమైనయేకేశ్వరసిద్ధాంతము మెల్లమెల్లగా స్వాభావికమైనసాధారణాస్తికమతముగా మాఱెను. తోడనే యతఁ డుపనిషత్తులలోని యాస్తికమతబోధకములగు శ్లోకరాజముల నెల్ల నొకగ్రంథరూపముగఁ జేర్చి కూర్చెను. దేవేంద్రనాథుఁ డీగ్రంథమును తన జ్ఞాపకమునుబట్టి యక్షయకుమారదత్తునకుఁ జెప్పి వ్రాయించెను.

పూర్వోక్తములయినమార్పు లన్నియు 1850 సంవత్సరమున జరిగినవార్షికమహోత్సవమునందు యథావిధిగాఁ బ్రకటింపఁబడెను. ఇప్పు డీయుత్సవము జనవరి 24వ తేదీకి సరియైన మాఘశుద్ధయేకాదశి నాఁడు వంగదేశమునందు మిగులవైభవముతో సలుపఁబడుచున్నది. ఇప్పటికి 88 సంవత్సరములక్రిందట రామమోహనరాయలవారు యను గలకత్తానగరమునందలి చిత్పూరుగోడ్డుభాగమునందు నిర్మించినట్టిప్రార్థనమందిరముయొక్క ప్రవేశోత్సవము నీదినమునందే జరగించెను. ఇట్లు పునర్నిర్మాణము గావింపఁబడినయాసమాజము మతప్రచారమునిమిత్తమై యధికముగాఁ గృషి సేయ నారంభించెను. నానాప్రదేశముల కరిగి దేవేంద్రనాథుఁ డనేకనూతనసమాజముల నచ్చటచ్చట నెలకొల్పెను. ధర్మోపదేశకుల గొందఱను సిద్ధముచేసి వారిమూలమున వంగదేశమునందంతట బ్రాహ్మసమాజసందేశము చక్కఁగా వెల్లడియగునట్లు చేసెను. పలువత్సరములవఱ కీవిధమున నధికోత్సాహముతోఁ బనిసాగెను. గ్రంథపఠనమునందును, భగవద్ధ్యానమునందును, భక్తియోగమునందును గాలము గడపనెంచి మహర్షి హిమాలయపర్వతప్రాంతముల కరిగెను. నానావిధాందోళనములతో నిండియుండెడు జనమధ్యమునకుఁ బోవ నతఁడు మనస్కరింపఁ డయ్యెను. కాని పదునెనిమిదిమాసము లీతీరున నేకాంతమున గడపునప్పటికి జనసము

దాయమునందు మరలఁ బ్రవేశించి, తదభివృద్ధినిమిత్తమై పాటుపడవలసిన ట్రేశ్వరాదేశము నతఁడు గ్రహించెను. అందువలనఁ దనమనమున కెంతయునిష్టముగా నున్నను దేవేంద్ర సాధుఁడు తిరిగి కలకత్తానగరమునకు రావలసివచ్చెను. ఆతనియాగమనఫలితముగా నిరుప మానమైనకార్యోత్సాహము మరల బ్రాహ్మసమాజమునందుఁ బ్రభవించెను. ఈతరుణ మునం బాతఁ డొసంగినప్రసంగములు యువజనులహృదయప్రదేశములయం దభినవోత్సా హాగ్నిని బ్రజ్వలింపఁజేసెను. అప్పటికే దేవేంద్రసాధుఁడు లేనికాలమునందు కేశవ చంద్రసేనుఁడు బ్రాహ్మసమాజమునందుఁ బ్రవేశించెను. కేశవచంద్రదేవేంద్రసాధులకు వెంటనే మైత్రి కలిగెను. కేశవచంద్రసేనులు మహర్షియం దపరిమితములైనప్రేమ గౌరవములఁ బ్రకటించెను. సద్వంశసంజాతుఁడై, మేధాసంపన్నుఁడై సమాజమునందుఁ బ్రవేశించిన యీకేశవచంద్రుని మహర్షి యనురాగపురస్సరముగా నభినందించి పుత్రి వాత్సల్యమును జూపెను. ఏకమనస్కులై వీరిరువురును గొంతకాలమువఱకు సమాజాభి వృద్ధికై శ్రమజేసిరి. ఈయుభయులపరిశ్రమమువలనఁ గాలీఘట్టమునందే గాక వంగదేశ మునం దెల్ల నొకనవీనచైతన్య మావిర్భవించెను. పందలకొలఁదియువజనులు బ్రాహ్మసమా జమునందు బ్రవేశింపఁదొడంగిరి. నూతనముగాఁ జేరినయీయువజనులు మతప్రచారము నందు విశేషశ్రద్ధ వహించి నగరనగరములకు నరిగి క్రొత్తసమాజముల స్థాపింప మొదలు పెట్టిరి. 1864 సంవత్సరమునందుఁ గేశవచంద్రసేనులు చెన్నపురికిని బొంబాయిపురము నకును బోయి, యాయానగరములందలి జనులహృదయములలో బ్రాహ్మమతాభిరతి నుద యింపఁజేసెను. కేశవచంద్రసేనుని యుపన్యాసములమూలముననే 1867 సంవత్సరమున బొంబాయినగరమునందలి ప్రార్థనసమాజమును, చెన్నపట్టణమునందలి వేదసమాజమును బ్రతిష్ఠింపఁబడెను. ఈవేదసమాజము బహువిధములయినమార్పులను బొంది యిప్పుడు దక్షిణహిందూదేశబ్రాహ్మసమాజ మనుపేరునఁ బరగుచున్నది.

బ్రాహ్మసమాజముయొక్క సిద్ధాంతవిషయమునందును ననుష్ఠానవిషయమునందును నీకాలమునం దధికమైనయభివృద్ధి కలిగెను. ప్రతిమపూజను విసర్జించినను, బ్రాహ్మ సమాజికులలోఁ బల్వురు కులభేదములను బరిత్యజింపరైరి. వివాహశ్రాద్ధాదికర్మలయందు విగ్రహారాధనము ననేకులు సలుపుచునే యుండిరి. ప్రతిమారాధనముతో నెట్టిసంబం ధమును గల్గియుండుటయు నయోగ్యమును నక్రమమును నని కేశవచంద్రసేనులు మొద లయినయువజనులయొక్క దృఢాభిప్రాయము. విగ్రహారాధనమును, వర్ణభేదమును

బూర్తిగా విసర్జించుటకు నెల్లరు నొక్కటిగాఁ గృతసంకల్పులయిరి. పూర్వాచారానుసారముగా హిందూకర్మలపరిహారము తనతండ్రియొక్క శ్రాద్ధమును బెట్టక నిరాకరించి నిజబంధువర్గమునందును, గలకత్తాసంఘమునందును నొకసంక్షోభమును 1846 సంవత్సరమునందే కలిగించి, మహర్షియే యీకర్మవిషయికసంస్కారమునందు మార్గదర్శకుఁ డయ్యెను. కాని తరువాతఁ జాలకాలమువఱకు నతనిత్రోవ ననుసరించువా రెవ్వరును బయలుదేఱరైరి. కేశవచంద్రసేనులును, నతనిమిత్రబృందమును దేవేంద్రనాథుఁడు నడచినమార్గమున నడచి యాతని కెంతయు నాహ్లాదమును బ్రోత్సాహమును గూర్చిరి. యువజనుల నూతనాకాంక్షలతో మహర్షియు నేకీభవించెను. యజ్ఞోపవీతమును గూడ నతఁడే త్యజించెను. బ్రాహ్మవివాహవిధానము ననుసరించి దేవేంద్రనాథుఁడు తనకుమారితలలో నొక్కరితయొక్క వివాహమును జరపి యీనవీనవివాహకర్మావలంబనమునందును మార్గము జూపినవాఁ డయ్యెను.

మఱికొంతకాలము బ్రాహ్మసమాజము నిరంతరాయముగా నభివృద్ధినొందెను. అంతర్వ్యాపారములయందే గాక జనులలో వ్యాపనవిషయమునందు గూడ బ్రాహ్మసమాజము ముందడుగు వేయుచుండెను. కాని కొలఁదికాలములో దేవేంద్రనాథకేశవచంద్రులకు నభిప్రాయభేదములు వొడమెను. యజ్ఞోపవీతధారు లయినసామాజికు లాచార్యపీఠమును వహించుటగుఱించి మొట్టమొదట వారిద్దఱకును భేదభావ మంకురించెను. విగ్రహారాధనముయొక్కయు వర్ణభేదముయొక్కయుఁ జిన్నెలుగా నెన్నఁదగినజన్నిదములను దాల్చినవా రాచార్యులుగా నుండఁదగ రని కేశచంద్రునియొక్కయుద్దేశము. చాల కాలముక్రిందటనే సమాజమునందుఁ జేరినవారై యుపన్యాసాదికముల సలుపుచు, తదభివృద్ధికై పలుభంగుల పనిసేయుచున్నవృద్ధాచార్యులయెడ గాఠిన్యమును బూన మహర్షికి నెంతమాత్రము నిష్టములేదయ్యెను. అపుడు సమాజమునందు రెండుపక్షము లేర్పడెను. సహజముగా వృద్ధులందఱు మహర్షిపక్షమును, యువను లెల్లరు కేశవచంద్రసేనునిపక్షము నవలంబించిరి. ఈయిరుతెగలవారిలో నొకరు సాంప్రదాయమును సంరక్షించువారుగను, మఱియొక రభివృద్ధిని గోరువారుగను నేర్పడిరి. మొట్టమొదట దేవేంద్రనాథుఁడు యువజనులయుద్దేశముల నభిమానించి యజ్ఞోపవీతధారులగువృద్ధుల నాచార్యపదవినుండి తొలఁగించి, యజ్ఞోపవీతమును విసర్జించినయువజనులను దత్పదవియందు నియోగించెను.

ఇట్టిసమయమునందు కేశవచంద్రసేనునిపక్షమునం దొకవివాహము తటస్థించెను. ఈపరిణయమాడిన వధూవరులు భిన్నవర్ణములకుఁ జెందినవారు. కులభేదమును పాటింపక చేయఁబడినయీయుద్వాహము దేవేంద్రనాథుని భయకంపితునిజేసెను. వెంటనే యతఁడెదుటిపక్షమువారికి నెఱిఁగింపకయే పూర్వపుటాచార్యులను యథాస్థానములయందు నియమించెను. కేశవచంద్రప్రభృతు లాతనిచర్య యక్రమం బని వాదించిరి గాని కార్యము లేదయ్యె. సమాజధర్మకర్తలలో మిగిలినవాఁడు తా నొక్కఁడే యగుటచే యువజనులకుఁ దా నొసంగినయధికారములనెల్ల నూడఁదీసి, తత్త్వబోధనీపత్రికను వారియాజమాన్యము నుండి తొలఁగించెను. కేశవచంద్రసేనునిపక్షమువారు ప్రతినిధిసభయొకటి యేర్పాటు చేసి, సామాజికకార్యములయందుఁ దాముగూడ నధికార మ్ముంచుకొని యైకమత్యము నెట్టులయిన నిలువఁబెట్టఁ గొంతకాలము ప్రయత్నించిరి. ఈయత్నము సాగమిచే భరతవర్ష బ్రాహ్మసమాజ మనునామమున 1866 సంవత్సరము నవంబరుమాసమునందు వా రొకప్రత్యేకసమాజమును స్థాపించిరి. యౌవనులలో ననేకు లీనూతనసమాజమునందుఁ బ్రవేశించి యభినవబలోత్సాహములతో తత్ప్రవృద్ధికై కృషి చేసిరి. పూర్వసాంప్రదాయముల నిలుపఁ బ్రయత్నించెడునావృద్ధులయొక్క బెడఁద తీఱుటచే భరతవర్షీయబ్రాహ్మసమాజికులు తమసంఘమునం దావశ్యకములగు నెల్లసంస్కారములను గావించి సమాజము నున్నతదశకుఁ దేఁగఁ దొడంగిరి. భారతవర్షీయబ్రాహ్మసమాజపుమతప్రచారకులు దేశము నందలినానాభాగములను దర్శింపఁదొడంగిరి. బ్రాహ్మమతబోధకములగుపత్రికలను గ్రంథములను బ్రచురింప నారంభించిరి. కతిపయమిత్రసమేతుఁడై కేశవచంద్రసేనుఁడు నీసమయమునందే యింగ్లాండుదేశమునకు నరిగి తత్ప్రజలయాదరగౌరవములఁ బడసి, మహోపన్యాసములఁ జేసి బ్రాహ్మసమాజమునందు వా దేశాంతరమునఁగూడ నభిరుచి జనియింపఁజేసెను.

ఈభారతవర్షీయబ్రాహ్మసమాజస్థాపనముతోడ సామాజికధర్మములలోఁగూడఁ గొన్నిముఖ్యపరివర్తనములు చేయఁబడెను. మతాభిప్రాయము లెంతయుదారములుగా నున్నను, దేవేంద్రనాథునికాలమునందు బ్రాహ్మసమాజము హిందూసాంప్రదాయముల నతిక్రమింపలేదు. బ్రాహ్మమతమునకుఁ గొంతవఱకు సాధారణస్వభావము నొసంగినవాఁడు కేశవచంద్రుఁడే యని చెప్పవచ్చును. భారతవర్షీయబ్రాహ్మసమాజమునందుఁ గావింపఁబడినమార్పులలో నెల్ల నియ్యది మిగులఁ బ్రధానమైనది. సర్వమతగ్రంథము

నుండియు, సకలమతములనుండియుఁ దా నిరాక్షేపముగా గ్రహింపఁదగినవిషయముల నెల్ల నతఁ డామోదించి స్వీకరింపసాగెను. ఉపనిషత్సారమంతయు బ్రాహ్మధర్మ మనుగ్రంథరూపమున నింతకుఁబూర్వమె రచింపఁబడినది. తమసర్వసమత్వము తేటపడు నట్లు సకలప్రమాణగ్రంథములనుండియు సద్వాక్యములఁ గైకొని యొకపుస్తకరూపమున భారతవర్షీయబ్రాహ్మసమాజికులు ప్రచురించిరి. ఇంతియే గాక సామాజికోపాసనయందు సంస్కృతమునకుఁ బ్రత్యామ్నాయముగా వంగభాష వాడఁదొడంగిరి. భాషాడంబరమును దగ్గించి స్వేచ్ఛానుసారముగా నుపాసించుటకై యెక్కువయవకాశ మియ్యఁబడెను. సామాజికులప్రత్యేకజీవనమునందే గాక, సాంఘికోపాసనలయందును నధికమైనయుత్సాహమును భక్త్యావేశమును గనఁబడఁజొచ్చెను. ప్రార్థనపశ్చాత్తాపములను గూర్చి సమాజమునందు గభీరాలోచనము లంకురించెను. ఇట్లు నవీనముగా సమాజసముద్రమునందు నుప్పొంగఁదొడంగినభావతరంగముల కెల్ల కేశవచంద్రుఁడె మూలకారణుఁడు. వర్ణభేదములను బాటింపక బ్రాహ్మసమాజమునందు జరగసాగినవివాహములు రాజశాసనసమ్మతములు గానయ్యెను. అందుచే భారతవర్షీయబ్రాహ్మసమాజికులు కేశవచంద్రసేనునినాయకత్వమున నీవిషయమును ప్రభుత్వమువారికి నెఱిగించి తద్వివాహములు రాజశాసనాంగీకారము లగునట్లు 1872 సంవత్సరమున నొకశాసనమును బుట్టింపఁజేసిరి. 1872 సంవత్సరపు ప్రత్యేకవివాహశాసన మని పిలువంబడు నీచట్టముప్రకారము పురుషులు 18 యేండ్లకుఁబూర్వము గాని, స్త్రీలు 14 యేండ్లకుఁబూర్వము గాని పెండ్లాడుటకు వలనుపడదు.

మఱికొంతకాలము సమాజ మెట్టియుఁ దొందరలు లేక సరళముగా సాగెను. కాని దినదినప్రవర్ధమాన మగు తనయనుగామిమండలియొక్కవిశ్వాసమును కేశవచంద్రుఁడును చిరకాలము నిలుపకొనఁజాలఁడయ్యెను. కేశవచంద్రుఁ డవలంబింప నారంభించిన నిరంకుశపద్ధతులను నొప్పుకొననినవీనపక్ష మొకటి భారతవర్షీయబ్రాహ్మసమాజమునందు నుదయించెను. సామాజికకార్యపరిపాలనమును బ్రతినిధిసంఘముల మూలమున జరుపవలయు ననియు, సాంఘికవిషయములందు ముఖ్యముగా స్త్రీలవిషయమునందు నెక్కువసంస్కారము లావశ్యకము లనియు నీనూతనపక్షమువారియాశయము. పరులకుఁ బైకంతయు నిశ్చలముగనే కాన్పించుచుండినను, కేశవచంద్రసేనునియొక్కయు, తదనుచరులయొక్కయుఁ బద్ధతులనుగుఱించి యొకవిధమైనయసంతుష్ట్యగ్ని సమాజాభ్యంతరమున రవులుచుండెను.

సందిగ్ధమైనయీసమయమునందె బ్రాహ్మసమాజచరిత్రమునందు మఱియొకగొప్ప మార్పును గలిగింపనున్న యొకకార్యము జరిగెను. కేశవచంద్రసేనుఁడు తనప్రథమ పుత్త్రికను కూచిబిహారురాజుగారియొక్క పుత్త్రున కిచ్చి వివాహము సేయఁదలంచినట్లు 1878 సంవత్సరమునందుఁ దెలియవచ్చెను. ఈవార్త బ్రాహ్మసంఘము నాశ్చర్యము పాలుచేసెను. వివాహకాలమునకు వరునకు 18 సంవత్సరములును, వధువునకు 14 సంవత్సరములును, నుండవలయు నని కేశవచంద్రసేనునిచే నిర్ణయింపఁబడి సామాజికు లందఱచే నామోదింపఁబడెను. తా నేర్పఱచిననియమమును కేశవచంద్రసేనుఁడే యుల్లంఘింప సిద్ధపడెను. ఇతనిపుత్త్రికకుఁ బదునాలుగేండ్లు గాని కుచిబీహారురాజకుమారునకుఁ బదునెనిమిదేండ్లు గాని లేవయ్యెను. వరుఁడు బ్రాహ్మసమాజికుఁడు కాఁడు. మీఁదుమిక్కిలి కుచిబిహారురాజకుటుంబముయొక్క హిందూవివాహవిధానప్రకారము విగ్రహారాధనసమేతముగా నావివాహము గావింపఁబడు నని యొకవదంతి పుట్టెను. అంతట నీవివాహమునుగూర్చి యనేకప్రదేశములందలిబ్రాహ్మసమాజములును, ప్రత్యేకసామాజికులును, దమతమయాక్షేపణములను కేశవచంద్రసేనునికి నెఱిఁగించిరి. నాయకుఁడును నాచార్యుఁడు నయినకేశవచంద్రుఁడే యిట్లు బ్రాహ్మసమాజవిధుల నతిక్రమించినపుడు నుద్యమమున కంతకు నపఖ్యాతియు నాశమును గల్గుట నిశ్చయం బని యెల్లసామాజికులును భయపడిరి. ఆక్షేపణములను లక్ష్యముసేయక వివాహమును జరగించుటకు కేశవచంద్రుఁడే స్వయముగాఁ గుచిబిహారునగరమునకు నరిగెను. బ్రాహ్మవివాహమునకావశ్యము లగు ననేకాంశములు తద్వివాహవిధానమునందు లోపించె ననియు, నింకను విశేషాక్షేపణీయము లగు బహులక్షణము లందుఁ గల వనియు ననంతర మెల్లవారికిఁ దెలిసెను.

కేశవచంద్రసేనుఁడు కూచిబిహారునుండి తిరిగివచ్చినతరువాత, నాకూచిబీహారు వివాహము నామోదింపనివారందఱు భారతవర్షీయబ్రాహ్మసమాజసభ యొకటి గావించి యందుఁ దమయనిష్టమును బ్రకటింపఁ బ్రయత్నించిరి. కాని సమాజకార్యదర్శి యగు కేశవచంద్రసేనుఁ డనేకప్రతిబంధకములఁ గల్పించి యాసభ జరుగకుండఁజేసెను. అయినను నాతనిని నాచార్యపీఠమునుండి తొలగించుచు నొకతీర్మానమును మాత్రము వారు చేయఁగలిగిరి. కాని సమాజనిబంధనముల నణుమాత్రము పాటింపక కేశవచంద్రసేనుఁడారక్షకభటులసాయమువలనఁ దనయాచార్యస్థానమును బలవంతముగా నిలుపుకొనెను.

ఆయాక్షేపకు లందఱును కేశవచంద్రసేనునివిపరీతవర్తనమునకు విసుగుఁ జెంది కలసిమెలసి యెప్పటిచొప్పునఁ గార్యము సాగించునుపాయము గానక సాధారణ బ్రాహ్మసమాజముగా నేర్పడి, తత్సమాజకార్యము లన్నిటిని నిర్ణీతనిబంధనానుసారముగా నడపఁ గృతసంకల్పులైరి.

కలకత్తాపురమందిరమునందు 1878 సంవత్సరము మేనెలలో బహిరంగముగా జరిగిన యొకమహాసభలో నీసాధారణబ్రాహ్మసమాజము విధ్యుక్తముగా స్థాపింపఁబడెను. ఇతరస్థలములందలియనేకసమాజము లీనూతనసమాజముతోఁ జేరెను. సమాజమునందుఁ బ్రబలుఁడుగా నుండఁ దటస్థించు నేపురుషుఁడు గాని సర్వాధికారమును దానే వహించి మిగిలినసామాజికులమనోరథమునకు వ్యతిరేకముగా వర్తించి యింతకుఁ బూర్వమువలెనె యిఁకముందును సమాజమునందు విభాగములను గల్పించుటకు వీలు లేకుండునట్లు కట్టుదిట్టములు సేయుట తమముఖ్యకార్యముగా నెంచి తద్విషయికనిబంధనముల నేర్పఱచుట కీనూతనసామాజికులు ప్రప్రథమముననే పూనుకొనిరి. ఈనూతనసమాజనిర్మాణమునందుఁ బ్రతినిధ్యనియమము సంపూర్ణముగాఁ బాటింపఁబడెను. సమాజమునందలిప్రతిసభ్యునినుండియు ననుమతిపత్రికను బుచ్చుకొని యేటేటఁ గార్యనిర్వాహకసంఘము నేర్పాటుచేయునట్లు నిశ్చయింపఁబడెను. కలకత్తాసమాజమునకే గాక యితరప్రదేశములందలి సమాజములకుఁగూడఁ దత్సభకుఁ బ్రతినిధులను బంపునధికార మియ్యఁబడెను. ఆస్తికమతజ్ఞానము భారతవర్షమునం దంతటను వ్యాపించుట కీనూతనసమాజమే ముఖ్యమార్గ మయ్యెను. 1880 సంవత్సరమున నీసమాజమునకొఱకయి విశాలమై సుందరమైనయొకమందిరము కలకత్తానగగముయొక్కమధ్యభాగమునందు నిర్మింపఁబడెను. కేశవచంద్రసేనులును నాతనిపక్షావలంబకు లగుసామాజికులును ద్విగుణిత మైన పట్టుదలతోఁ గృషిసేయ మొదలుపెట్టిరి. పూర్వపుసంయుక్తసమాజముయొక్క ద్రవ్యాదిరూపమైనసాధనసంపత్తి యంతయు వారియధీనమునం దుండుటచే నూతనసామాజికులకంటెఁ బనిసేయుటకు వారి కెక్కువయవకాశ ముండెను. కేశవచంద్రసేనునియందు నధికబద్ధానురాగు లైన వృద్ధులగుధర్మోపదేశకు లంద ఱాతనిపక్షముననే నిలిచిరి. అత్యంతవిశ్వాసమును దనయెడలఁ బూనియుండిన యాబోధకమండలియొక్కతోడ్పాటుమూలముననతఁడు బ్రాహ్మధర్మమును నానాభాగములందు వ్యాపింపఁజేయఁగలిగెను. సామాన్యజనులకు నగోచరములుగా నుండున నేకనూతనమతాభ్యాసములను దనసమాజమునం దతఁడు

ప్రవేశపెట్టెను. 1880 వత్సరమున కేశవచంద్రుఁడు తనసమాజమునకు నవవిధానసమాజ మని నూతననామకరణము చేసి నిజబోధకమండలియందలిపన్నిద్దఱకు నవవిధానప్రవక్త లని పేరుపెట్టెను. అసదృశచారిత్రుఁ డగునీమహానుభావుఁ డాకస్మికముగా నకాల మృత్యువువాతఁబడియెను. అనేకవత్సరంబులు విశ్రాంతి యెఱుఁగక పరిశ్రమచేయుట వలనను బహుసమాజములును సమాజికులును దననుండి విడిపడుటచేతను తన్నంటియుండిన ధర్మోపదేశకులలో నంతఃకలహములు గల్గుటవలనను, నాతఁడు పొందినమనోవ్యథయె మొదల నారోగ్యభంగమునకుఁ గారణభూత మయ్యెను. తుదకు నతఁడు 1884వ సంవత్సరమునఁ బరమపదమునొందెను. అతనిమరణానంతరమున నవవిధానసమాజము మఱింత తాఱుమాఱయ్యెను. ఏకభావము లేక ప్రవక్తలును, బోధకులును దమలోఁ దాము కలహింపసాగిరి. ధర్మోపదేశకులందఱు నొక్కటిగాఁ గూడి పనిచేయకపోయినను విడివిడిగా నుండియు వారధికమైనశ్రద్ధతోడను స్వార్థత్యాగబుద్ధితోడను సమాజాభివృద్ధికై పాటుపడిరి.

సాధారణబ్రాహ్మసమాజము ప్రతిష్ఠింపఁబడినపిమ్మట మతప్రచారవిషయమున బ్రాహ్మసమాజమునందు మరల నవ్యకార్యోత్సాహ మంకురించెను. దేశమునందు మరల ననేకనూతనసమాజములు స్థాపింపఁబడెను. అక్కడక్కడ నుండినపూర్వసమాజములతో దృఢమయినసంబంధ మేర్పఱుచుటకుఁ బ్రయత్నములు సేయఁబడెను. సాధారణ బ్రాహ్మసమాజ మిట్లు దినదినాభివృద్ధినొందెను. ఇప్పటికిని గలకత్తాలో శ్రద్ధతో సంఘ మతసంస్కారములకై కృషిసేయుచున్నయనేకనవీనసంఘములు తత్సమాజికులచే నెలకొల్పబడినవే. సాధారణబ్రాహ్మసమాజ మిపుడు స్థిరముగా నేర్పడిన దని చెప్పవచ్చును. బ్రాహ్మసమాజ మారంభమయినతరువాత మొట్టమొదటి 30 సంవత్సరములలో రెండు పర్యాయము లంతఃకలహములచే విభాగములు తటస్థించెను. కాని సాధారణబ్రాహ్మ సమాజము స్థాపింపఁబడి యిప్పటికి 30 సంవత్సరములు గడచినను నట్టితొందర లేమియు లేక నానాఁట నభివృద్ధిఁ జెందుచున్నది. నిరంతరాభివృద్ధియే ముఖ్యోద్దేశముగాఁ గలిగి తద్వృద్ధి కత్యంతావశ్యకమగుస్వాతంత్ర్యము నెల్లరకు సంపూర్ణముగా నొసంగునట్టి బ్రాహ్మసమాజమునందు నభిప్రాయభేదము లుండుట స్వాభావికమే గాని యాశ్చర్యకరము గాదు. అట్టియభిప్రాయభేదములును సాధారణబ్రాహ్మసమామునం దనేకములు గలవు. అయినను సభ్యులస్వల్పభావభేదములచే సమాజాభ్యుదయమునకు భంగము

గలుగకుండఁ దత్పరిపాలనావిషయమునందు దగినకట్టుదిట్టములు చేయఁబడినవి. ముఖ్యవిషయములలో నైకమత్యమును, నముఖ్యవిషయములలో భిన్నత్వమును నెల్లవిషయములందును నౌదార్యమును నుండవలె నను నుత్తమధర్మసూత్రము ననుసరించి, విశాలమై యుదాత్తమైనసమదృష్టితోఁ బ్రతినిధులమూలముగా సామాజికకార్యముల నిర్వహించెడు నుత్కృష్టపద్ధతి యవలంబింపఁబడినది. ఇవ్విధమున సద్ధర్మములప్రకారము సమాజము పరిపాలింపఁబడుటచేతనే తమలోఁ దాము కొన్నిధర్మములనుగుఱించి యెట్టిభిన్నాభిప్రాయములఁ గల్గియున్నను సమాజమునందలి స్త్రీపురుషులెల్లరు నొక్కటిగాఁ బనిసేయుచు నీశ్వరమహిమాతిశయమును ప్రపంచమునకుఁ బ్రకటించుచు మానవసేవను గలుపఁగలుగుచున్నారు.

# బ్రాహ్మమతము.

## మొదటిప్రకరణము.

### దేవుఁడు.

ఏమతమునం దయినను దేవునిగుఱించినయభిప్రాయము ప్రధాన మైనది. వివిధ మతములు భగవంతునిగూర్చి వివిధముగా బోధించుచున్నవి. ఒక్కహిందూమతమునే తీసికొని యాలోచించితి మేని, యీశ్వరునివిషయ మై యనేకాభిప్రాయములు తేలఁ గలవు. ఇట్లే క్రైస్తవమహమ్మదీయాదిమతములలోను భిన్నాభిప్రాయములు వెలయుచున్నవి. మతమున కంతకు మూలాధార మైనయీమహద్విషయమున బ్రాహ్మమతము యొక్కయుద్దేశ మేమో తెలిసికొనుటకు సన్మతాన్వేషులు కుతూహలు లై యుందురు.

పుడమిమీఁద నుదయించినప్పటినుండి మనుష్యుఁడు భగవంతుఁ డెట్టివాఁడో గ్రహించుటకై ప్రయత్నించుచున్నాఁడు. కాలము గడచినకొలఁది యీవిషయము కష్టసాధ్య మైనది, కాని సులభము కా లేదు. నానాదేశములందలితత్త్వవేత్తలు తమ బుద్ధి ప్రసరించిన ట్లెల్ల నీశ్వరుని వర్ణించి సామాన్యజనులమనస్సులను గలవరపెట్టి యున్నారు. ఆలోచింపఁ గడంగితి మేని పరమేశ్వరునిస్వభావమునుగుఱించి యనేకాభిప్రాయములు హృదయమునకు స్ఫురింపఁ గలవు. మానవులమానససరోవరములఁ గలుగుచున్నయెల్లభావములను నొక్కొక్కటిగాఁ దీసికొని చర్చించి యిది సిద్ధ మని యొకదానిని స్థాపించుటకు వీలు గాదు. అందువలన భగవంతునిస్వరూపనిర్ణయము చేయుటకు ముఖ్యప్రతిబంధకములుగా నుండుకొన్నియభిప్రాయములను మాత్రము విమర్శించి, బ్రాహ్మమతముయొక్కయుద్దేశమును దెలుపఁ దలచినారము.

"దేవుఁ డున్నాఁడో లేఁడో మనము చెప్పఁజాలము. దేవుఁ డొకఁ డుండినను నతనిని మనము తెలిసికొన నేరము. అతఁ డనంతుఁ డగుటచే మానవబుద్ధికి గోచరుఁడు గాఁడు" అని బుద్ధిమంతులు కొందఱు వాదించుచున్నారు. ఇట్లనుటచే నిరుత్సాహు లయి పలువు రీశ్వరునిగుఱించి చింతించుటయే మాని యథేచ్ఛగాఁ బ్రవర్తింపసాగిరి.

పాశ్చాత్యులలో స్పెన్సరు హక్స్లీ మొదలైనధీమంతులు మనోహరము లైనతమవ్రాతలచే నిట్టిభావములను విశేషముగా జనసంఘములో వ్యాపింపఁ జేసిరి. ఆంగ్లవిద్య వ్యాపించిన దేశములలో నెల్ల నీయభిప్రాయము ల్లుకొని యొకప్పుడు యువజనులమనములఁ గొంత కలవరపెట్టెను. ఈవాదమునందుఁ గొంతవఱకు సత్యము లేక పోలేదు. అపారజ్ఞానసంపన్ను లగుమనపూర్వపుఋషీశ్వరులును దీనిని గ్రహించి యుండిరి. "యతో వాచో నివర్తన్తే యప్రాప్య మనసాసహ" యని వారు నుడివిరి. మనసుతోఁ గూడ నేబ్రహ్మస్వరూపమును బొందనేరక వాక్కును మఱలిపోవుచున్నదో, యని యీశ్లోకముయొక్క-యర్థము. బ్రాహ్మసమాజము గూడ నావాదమునందలియాదార్థ్యమును గుర్తించి యుండెను. భగవంతుఁ డనంతుఁ డనియు, నిరాకారుఁ డనియు, నవాఙ్మానసగోచరుఁ డనియు బ్రాహ్మసమాజముయొక్క-యభిప్రాయము. పరమేశ్వరునియొక్క-యీలక్షణముల నాధారము చేసికొనియే, బ్రాహ్మమతస్థు, లతనికి మనయిచ్చవచ్చిన ట్లాకారములను గల్పించి నైవేద్యముల నొసంగుచు, కల్యాణాదులను జేయుచుండుట తగ దని యింతవఱకుఁ బోరాడు చున్నారు. ఇట్టిపోరాటము సలుపుటచేతనే బ్రాహ్మమతమును గూడ నొకరీతి నాస్తికమతముగా జనులు భావింపఁ జొచ్చిరి. భగవంతుఁ డనంతుఁ డనియు, మనమనసున కందనివాఁ డనియు బోధించెడు స్థితినాస్తివాదము (Agnosticism) జనులయాస్తికబుద్ధిని మూలమట్టుగఁ జలింపఁ జేయు నని పలువురు భయపడిరి. కాని యీజంకునకు మా కావంతయు నవకాశము గనఁబడదు. పరిశుద్ధాస్తికమతమున కది యెట్టి భంగము నాపాదింపఁ గలదో మే మూహింపఁ జాలము. ఆస్తికమతజ్ఞానమును వ్యాపింపఁ జేసినప్రాచీనతత్త్వజ్ఞు లీవాదమునను నొకవాక్యములో నుత్తర మొసంగిరి.'

శ్లో॥ నాహం మన్యే సువేదేతి నో న వేదేతి వేదచ
యో న స్తద్వేద తద్వేద నో న వేదేతి వేదచ॥ [కేనము]

[అర్థము:—బ్రహ్మమును జక్కఁగాఁ దెలిసికొంటి నని నేను తలఁచ లేదు. అయ్యది తెలియనిదియుఁ గాదు. తెలిసినదియుఁ గాదు] "తెలిసినదియుఁ దెలియనిదియుఁ గాదు" అనువాక్యముయొక్క-తత్త్వమును మనలో నెవ్వరు తెలిసికొనియెదరో వారు బ్రహ్మమును దెలికొనుమన్నారు. స్థితినాస్తివాదమున కింతకంటె యుక్తియుక్తమైనసమాధానము మఱియొకటి లేదు. భగవంతుఁడు నిజముగా ననంతుఁడే. అతఁడు మనయోచనాశక్తి కందకపోవుటయు, నతనిని వర్ణించుటకు మనభాష చాల కుండుటయు వాస్తవమే. ఐనను పరమేశ్వరుఁ డనంతుఁ డనునపుడు మనబుద్ధి కేదోయొకభావము తోఁచక పోవుట లేదు. అనంతుఁ డనినపుడు లేఁ డనుభావము మనస్సున కేమాత్రమును స్ఫురింపదు.

పరిమితస్వరూపము గలయొక్కమహత్తర మైనవస్తువు నయినను భగవంతునిగా గ్రహించుటకు • హృదయము సమ్మతింపదు. మితజ్ఞుల మైనమన మాతనిని నింతకంటె వేఱుగా నెట్లు వర్ణింపఁ గలము? ఈవిషయమునందు భగవంతుఁ డాకాశమును బోలి యున్నాఁడని చెప్పవచ్చును. మన నేత్రములతో నాకసముయొక్క యాద్యంతములను జూడఁజాలము. ముందెన్నఁడును జూడఁ బోము. దాని కింతటి వైశాల్యము గల దని యూహించుటకు సయితము మనకు సాధ్యము గాదు. అటు లయ్యు గగనము నెఱుఁగ మని మనలో నెవ్వరును జెప్పఁజాలరు గదా! ఆవిధముననే పరమేశ్వరుఁ డిట్టివాఁ డని స్పష్టముగా నిర్ధారణ చేయ లేకపోయినను, మన మాతని నెఱుఁగుదు మని నుడువుట కేవిధమైనయభ్యంతర ముండ నేరదు. మనో నేత్రమూలమున నతనియనంతస్వరూపమును జూచుటయే గాక యతనితో సమీపసంబంధమును గలిగి యున్నా మని చెప్పుటకును సందేహింపఁ బని లేదు. మనతొల్లింటిఋషీశ్వరులతోఁ బాటు బ్రహ్మసమాజము గూడ నిట్లు నుడువుచున్నది.

శ్లో॥ “నాహం మన్యే సువేదేతి నో న వేదేతి వేద చ
యో న స్తద్వేద తద్వేద నో న వేదేతి వేద చ [కేనము]

పరమేశ్వరునిస్వభావము నిర్ణయించుటకుఁ బ్రతిబంధకముగా నుండెడుమఱియొక వివాదాంశము గలదు. ఇది మనదేశములోనే ప్రత్యేకముగా బయలుదేరినది కాదు. పాశ్చాత్యులలోఁ గూడ నిట్టిమతవివాదము ప్రబలి యున్నది. భగవంతుఁడు సగుణుఁడా నిర్గుణుఁడా యనువిషయమునుగూర్చి మనదేశమునందలితత్వజ్ఞులు తమవాదనానైపుణ్యము నంతయు వినియోగించి హెచ్చుగాఁ జర్చించి యున్నారు. అయినను నీయంశమును గుఱించి యింతవివాద మనావశ్యక మని మాయభిప్రాయము. ఉభయపక్షములవాదము నందును గొంతసత్య మున్నది. భగవంతుఁ డొకవిధముగా నిర్గుణుఁ డనియు మఱియొక విధముగా సగుణుఁ డనియుఁ జెప్పవచ్చును. విశ్వాధారుఁ డైనపరమపురుషుఁడు గుణసంపదయందు మానవులతో సమానుఁడుగా నుండు నని మన మెంచుట సరి కాదు గదా! మితజ్ఞుఁడును మితశక్తియుతుఁడు నైనమనుష్యుఁ డెక్కడ? సర్వజ్ఞుఁడును, సర్వశక్తిసంపన్నుఁడు నగుభగవంతుఁ డెక్కడ? దురవగాహ మైనయాతనిమహత్స్వభావములో మిక్కిలియల్పతమాంశము నే మనము గ్రహింపఁ గలుగుచున్నాము. మనయనుభవమును బట్టి యారోపించెడుగుణము లాతనిస్వభావము నెన్నటికి సంపూర్ణముగాఁ జేయఁజాల వనుట వాస్తవము. నాలుగేండ్లబిడ్డఁడు తనతల్లినిగూర్చి యేపాటిగా గ్రహింపఁగలుగునో, యాపాటిజ్ఞానము నే మనమును భగవంతునివిషయమునందుఁ బొందఁ గలిగియున్నాము.

ఇట్లు మానవుల కనుభవసిద్ధము లగుగుణములకు నతీతుఁ డగుటచేతనే, యతఁడు నిర్గుణుఁ డనఁ దగి యున్నాఁడు. ఇట్లనుటచే భగవంతునియందు గుణము లెవ్వియు లే వని యెంచఁ దగదు. మనప్రాచీనతత్త్వజ్ఞులు పరమేశ్వరుని సకలకల్యాణగుణసమన్వితుఁ డని వర్ణించి యున్నారు. క్షమ దయ శాంతము మొదలైనసద్గుణములు మానవస్వభావమునకంటె శ్రేష్ఠతర మైనస్వభావమునకుఁ జెందిన వగుటచేతనే, యవి యెల్లజనులకు నమూల్యము లై పవిత్రము లై పరగు చున్నవి. క్షమ, దయ, శాంతము అనుపదములు భగవంతునివిషయమునందు సంపూర్ణభావముతో వర్తించును. మానవుని యందే మిక్కిలి యమూల్యముగాఁ బరిగణింపఁబడెడునీసుగుణములు భగవంతునియం దుండ వని మన మెంచుటకు వీలు లేదు. అట్టిచో నీకల్యాణగుణము లన్నియు భగవంతునిస్వభావమునం దిమిడి యుండక తీరవు గదా. ఇట్లు యోచించునపుడు పరమేశ్వరుని సగుణుఁ డనుటకుఁ గాని, మానవులతో సంబంధము గలిగి యున్నాఁ డనుటకుఁ గాని యేమాత్రము సంశయ ముండదు. అయినను మానవునకుఁ గలభ్రమప్రమాదాదిలోపము లేమియు లేనివాఁ డగుటచేతను, భగవంతుని కంతకంటె నెక్కువగుణములు లే వని చెప్పుటకు నెంతటిబుద్ధిమంతుల కయినను వలవి గాక పోవుటచేతను నతఁడు మానవాతీతుఁ డనియు, నిర్గుణుఁ డనియు, నుడువుట కేమియు నాక్షేపణ ముండ నేరదు. అపారప్రేమాస్వరూపుఁ డనియే గాక మన పూర్వులు భగవంతుఁడు సచ్చిదానందమయు మని చెప్పియున్నారు. బ్రాహ్మమతముగూడ భగవత్స్వభావమునం దీగుణము లన్నియుఁ గల వని సమ్మతించుచున్నది. కాని యింతటితోనే యీశ్వరునిస్వభావము నంతయు గ్రహించితి మని మనము భ్రమపడఁగూడదు. పరమేశ్వరునిగుఱించి మనము తెలిసికొనవలసిన విషయము లటుండ, మన బుద్ధీంద్రియములవలనను, అంతరాత్మమూలమునను, గ్రహించిన గుణాదు లయినను, నతనియం దెట్టిపూర్ణత్వమును, నెట్టివికాసమును గాంచినవో మన మెఱుంగుటకు సాధ్యము గాదు.

భగవంతునిస్వరూపమును నిరూపించుటయందు నాటంకముగా నుండుపరస్పరవిరుద్ధము లైనమఱిరెండుపదములనుగూర్చి కూడ యోచింపవలసియున్నది. నిర్గుణుఁడా సగుణుఁడా యనువిషయము మనదేశస్థులను బాధించినట్లే యీశ్వరుఁడు ప్రకృతికతీతుఁడా, లేక ప్రకృతియం దంతర్భూతుఁడా యనువిషయము పాశ్చాత్యులను మిక్కిలి కలవర పెట్టినది. చూచుట కీరెండుపదములును వ్యతిరేకార్థమును సూచించునట్లు కనఁబడినను సూక్ష్మబుద్ధితో నాలోచించితి మేని రెండుభావములును సత్యములే యని తోఁపకమానవు. భగవంతుఁడు సృష్టియం దంతర్భూతుఁ డై యున్నాఁ డనుట వాస్తవమే,

గడియారమును జేసినయంత్రికారునివలె నాతఁడీసృష్టియంత్రమునకు విడిగా నుండుట లేదు. భగవంతుఁడీవిశ్వము నంతయుఁ గ్రమముగా నడపుచు దానియందే యుండి నిరంతరము పని సేయుచున్నాఁడు. హిందూమహర్షులతోఁ బాటు బ్రహ్మవేత్తలు నిట్లు వక్కాణించుచున్నాఁడు:—

శ్లో॥ యో దేవోగ్నౌ యోప్సు యోవిశ్వం భువన మావివేశ

యఓషధీషు యోవనస్పతిషు తస్మైదేవాయ నమో నమః [శ్వేతాశ్వతరము]

[అర్థము—ఏదేవుఁడు అగ్నియందును, జలమునందును, ఓషధులయందును, వృక్షములయందును భువనములం దెల్లెడలను వ్యాపించి యున్నాఁడో, యాదేవునికి నమస్కారము, నమస్కారము,]

శ్లో॥ శ్రోత్రస్య శ్రోత్రం మనసో మనో యద్వాచో హ వాచం

స ఉ ప్రాణస్య ప్రాణ శ్చక్షుష శ్చక్షుః॥ [కేనము]

[అర్థము—ఎవఁడు శ్రోత్రమునకు శ్రోత్రమో, మనసునకు మనసో, వాక్కునకు వాక్కో, అతఁడే ప్రాణమునకుఁ బ్రాణము; నేత్రమునకు నేత్రము.]

భూమ్యాకాశములు,సకలచేతనాచేతనపదార్థములు, సమస్తకాలములు, భగవంతుని యం దిమిడియున్నవి. ఎల్లవస్తువులును వతనినుండి వెలువడి యతనియందే జీవించు చున్నవి. అతఁ డాత్మలకు నాత్మ. ఈవిధముగా పరమాత్మ విశ్వమునం దంతర్వర్తి యై యున్నాఁడు. కాని యతఁ డనంతుఁ డగుటచే నాతనిమాహాత్మ్యము నీప్రపంచము పూర్ణముగాఁ బ్రకటింపఁ జాలదు. అప్రతిమానప్రభాసమేతుఁ డగుసూర్యునినుండి బయలువెడలినయొకకిరణమువలెను, అనంతభంగసమన్వితమగుమహాసముద్రమునందలి యొకతరంగమువలెను, విశాల మైనయీమహావిశ్వము గూడ నపార మైనయీశ్వర శక్తిలో మిక్కిలిస్వల్పాంశమే యై యున్నది. మహాతేజోమయుఁ డగు భగవంతుని ప్రకాశముముందట సూర్యచంద్రాదులవెలుతు రేపాటిది?

శ్లో॥ న తత్ర సూర్యోభాతి న చంద్రతారకం

నేమా విద్యుతోభాన్తి కుతో య మగ్నిః

[అర్థము—అచ్చట (బ్రహ్మమునందు) సూర్యుఁడు ప్రకాశింప నేరఁడు, చంద్రతారలును, మెఱుపులును బ్రకాశింపవు. ఈయగ్ని యెక్కడ?]

అతఁ డనంతుఁడు, శాశ్వతుఁడు. విశ్వముతో సంబంధించినంతవఱకు విశ్వాంత ర్వ్యాప్తుఁడైనను, అనంత మైనమహిమ గలవాఁ డగుటచే విశ్వాతీతుఁడు నై యున్నాఁడు

పైన చర్చించినవిషయములనుబట్టి భగవంతునిగూర్చి కొన్నియంశములు బోధపడఁగలవు. అతఁడు సగుణుఁడయ్యు నిర్గుణుఁడనియు, సకలవిశ్వాంతర్వ్యాప్తి యయ్యు విశ్వాతీతుఁడనియు, అనంతుఁడయ్యు నగోచరుఁడు కాఁడనియు ఘనము తెలిసికొని యున్నాము. మనము పరమేశ్వరునిగుఱించి యెఱిఁగిన దంతయు నింతటితోఁ బూర్తి కాలేదు. అయినను దేవుఁడిట్టివాఁడని స్పష్టముగా నిర్వచించుట కెవ్వరికిని శక్యము గాదు. ఒక్క భగవంతునిగూర్చియే యన నేల? పదార్థము, వెలుతురు, వాయువు, శక్తి మొదలయినయేస్వల్పవస్తువులను గుఱించియు నేశాస్త్రజ్ఞుఁడును గట్టిగా నిర్వచనము చేయఁ జాలఁడు. వాయువునుగూర్చి మన మేమి చెప్పుదుమో యాలోచింతము. చెట్ల యాకులను గదలింపఁ జేయునది, మనదేహమునకు సోకునది, మనప్రాణమునకు నాధారమైనది వాయు వని గదా మనము చెప్పుదుము. ఇట్లు ఫలితములనుబట్టి యావస్తువును తెలియఁ జేయు చున్నాము. ఇదేవిధమున భగవంతుని గూడ మనపూర్వపుఋషీశ్వరు లుపనిషత్తులలో వర్ణించి యున్నారు.

శ్లో॥ యతో వా ఇమాని భూతాని జాయన్తే యేన జాతాని జీవన్తి
యత్ప్రియ న్త్యభిసంవిశన్తి తద్విజిజ్ఞాసస్వ తత్బ్రహ్మ. [తైత్తిరీయము]

అర్థము—దేనివలన నీభూతములు పుట్టుచున్నవో, దేనివలన పుట్టినవి జీవించు చున్నవో, దేనినిగూర్చి తిరిగి యివి పోయి పొందు చున్నవో, దానిని చక్కగాఁ దెలిసికొనుటకు కోరుఁడీ. అదియే బ్రహ్మము.

ఈశ్వరుఁ డొక్కఁడే సృష్టికిఁ బూర్వమందుండెను. చరాచరాత్మకమైన విశ్వమంతయు నతనినుండియే పుట్టి యతనియందే వెలుగు చున్నది. అపారమహిమోపేతుఁ డగుటచే నతనిని మనస్సు పూర్తిగా గ్రహింప లేక మఱలిపోవు చున్నది. సంపూర్ణముగా నతనిని మన మెఱుఁగ లేకపోయినను దెలిసినకొలఁదిపాటిజ్ఞానమే మన యక్కఱలను దీర్పఁ గలిగియున్నది. కొందఱు దేవుఁడనినను, కొందఱు శక్తి యనినను, కొందఱు మనస్సనినను, మఱికొందఱు సత్పదార్థ మనినను, ప్రకృతి కంతకు మూలకారణ మొకటి గల దని చెప్పుటలో నెల్లవారును నేకీభవించు చున్నారు. పరమేశ్వరుఁడిన్ని విధములుగా విశ్వములోఁ దనమహిమను బ్రకటించు చున్నాఁడు.

ఆదికారణుఁ డని తెలిసికొనినతోడనే మనము భగవంతునిగూర్చి యెఱుఁగఁ గలిగినదంతయు ముగియ లేదు. ఇంతకంటె నెక్కుడుజ్ఞానమును మనము పొంది యుంటిమి. అటనినిగుఱించి మనకుఁ దెలియక మఱుఁగయి యున్నవిషయములతోఁ బోల్చి చూచి నప్పుడు తెలిసినది మిక్కిలికొంచెముగాఁ గాన్పించినను నిదియే మనజ్ఞాననేత్రమును మిఱుమిట్లు గొల్పునంతయధికముగా నున్న దనుటకు సందియము లేదు. విశ్వమున కంతకు నాధారభూత మైనయామూలప్రకృతి జ్ఞానసమేత మయిన దనియు సులభముగా నెఱుఁగవచ్చును. నిర్జీవ మై యంధప్రాయ మైనశక్తిచే నీవిశ్వ మంతయు నడపఁబడు చున్న దనుటకంటె విశ్వాసానర్హ మైనయుక్తి యింకొకటి యుండఁ బోదు. అచేతన మయినప్రకృతిపదార్థమునందును, సచేతన మయినయుత్తమమానవస్వభావమునందును, క్షణభంగుర మైనపిపీలికయందును, మహత్తర మైనమానవచరిత్రమునందును, భూమిమీఁది యిసుకరేణువు మొదలుకొని యాకాశమునందలినక్షత్రములవఱకుఁ గలసమస్తవిశ్వము నందును నమోఘ మైనబుద్ధిచాతుర్యము ప్రకాశించుచున్నది. జ్ఞానాత్మక మైనయీమూల ప్రకృతి నీతిసమేత మయిన దనుటకుఁ గూడ ననేకనిదర్శనములు గలవు. విశ్వనిర్మాణ మంతయు ధర్మాభివృద్ధికే ననుకూలముగా నున్నట్లు బుద్ధిమంతు లందఱు సమ్మతింపక తప్పదు. సృష్టియందుఁ గలయీధర్మచింత మనుష్యునియందును, మానవసంఘమునందును నంతరాత్మరూపమునఁ బరిణమించినది. న్యాయాన్యాయములను, సత్యాసత్యములను నిరూపించెడునీయంతరాత్మను బ్రతిమనుజుఁడును గలిగి యుండుటచేతనే భగవంతుఁడు నీతిమంతుఁ డని చెప్పవచ్చును. మఱింతజాగరూకతతోఁ బరీక్షించితి మేని విశ్వనిర్మాణ మునందు ప్రేమాత్మక మైనయొకయద్భుతశక్తి పని చేయుచున్నట్లు మనకు గోచరము గాక మానదు. తల్లిబిడ్డలయందును, భార్యాభర్తలయందును, సోదరీసోదరులయందును, మనుష్యులొండొరులయందును, జంతుసంతానమునందును చిత్రవిచిత్రముగాఁ బ్రేమా విధానము కానవచ్చుచున్నది. దీనిని గుర్తించియే మనఋషీశ్వరులు "ఆనందాద్ధ్యేవఖ ల్విమాని భూతాని జాయన్తే" యని యానందమునుండియే సమస్తభూతములును బుట్టి నట్లు చెప్పి యున్నారు. మానవులు తమబుద్ధీంద్రియమూలమునను, అంతరాత్మమూలమునను హృదయమూలమునను గ్రహించి యనుభవించినవిషయము లెల్ల నీక్రిందిశ్లోకరాజ ములో నిమిడి యున్న వని నుడువవచ్చును.

శ్లో॥ "నిత్యో నిత్యానాం చేతన శ్చేతనానా మేకో బహూనాంయో విదధాతి కామాన్ తమాత్మస్థం"

[అనిత్యవస్తువులలో నిత్యుఁడై, చేతనపదార్థములకుఁ జైతన్యమును బ్రసాదించువాఁడై, యనేకరూపములఁ దాల్చియున్నవస్తువులలో నేకరూపుఁడై, సకలజీవులకుఁ గోర్కెల నెల్లను నొసంగుచు, భగవంతుఁడు విశ్వమునందంతటను వర్తించుచున్నాఁడు.] ప్రకృతియందును మానవసంఘమునందును జిరకాలానుగతముగా నడచుచున్నధర్మముతోఁ గాక సకలభక్తులును పరమేశ్వరునికల్యాణగుణములనుగూర్చి సాక్ష్య మిచ్చుచున్నారు. తమహృదయములయందు నిశ్చలమైనభక్తివిశ్వాసములతో ధ్యానించుచు, ప్రార్థించుచుండెడువారెల్లజనులకును పరమేశ్వరుఁ డొకప్పుడు తండ్రివలెను; మఱియొకప్పుడు తల్లివలెను, నొకవేళ హితునివలెను, మఱియొకవేళ ప్రియునివలెను; నానారూపములఁ బ్రత్యక్షమయి బుద్ధులను జెప్పుచు, ప్రేమను జిల్కుచు, హితములఁ గఱపుచు, సరసస్సల్లాపముల సలుపుచు విచిత్రగతుల వినోదించుచుండును. ఆహా! యీయద్భుతము లన్నియు భక్తులకుఁ దక్క నన్యులకు గోచర మగునవి గాకపోయినను; ప్రకృతిధర్మము లెట్లు మాఱక శాశ్వతముగా వర్తించుచుండునో, యదేతీరున నవియు జరుగుచుండును. సృష్టిలోనియొకయణువు మఱియొకయణువు నాకర్షించుచున్నట్లు సర్వేశ్వరుఁడును తన పుత్రుల నందఱను దనవైపున కాకర్షించుకొనుటకు పరిపరివిధములఁ బ్రయత్నించుచున్నాఁడు. భగవంతునిస్వభావమునుగూర్చి స్వానుభవమువలన మానవులు వెల్లడించిన విషయముల నెల్ల ఋషిసత్తములసరసవచనములలో బ్రాహ్మమత మిట్లు వర్ణించుచున్నది.

శ్లో॥ సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ ఆనందరూప మమృతం యద్విభాతి
శాన్తం శివ మద్వైతమ్ శుద్ధ మపాపవిద్ధమ్.

[అర్థము:—ఈశ్వరుఁడు సత్స్వరూపుఁడును, జ్ఞానస్వరూపుఁడును, అనంతుఁడును, ఆనందమయుఁడును, అమృతస్వరూపుఁడును, స్వప్రకాశుఁడును, శాంతుఁడును, శివస్వరూపుఁడును, అద్వితీయుఁడును, పరిశుద్ధుఁడును, పాపరహితుఁడు, నై యున్నాఁడు.]

అయినను నీయభిప్రాయము మాఱక యెప్పు డొకేతీరున నుండు నని గాని, యున్నం దింతకంటె నున్నతభావములు భగవంతునిగూర్చి మనుష్యునికిఁ గలుగ జాల వని గాని బ్రాహ్మమత మెన్నటికినిఁ జెప్ప సాహసింపదు.

# రెండవప్రకరణము.

## మానవుఁడు.

---

దేవుఁ డెట్టివాఁడో నుడివినమీఁదట మానవుఁ డెవఁడో వివరించుట యత్యంత ముఖ్యము. భగవత్స్వభావమును గూర్చి భిన్నాభిప్రాయములు గలిగి యుండినట్లే "మానవుఁ డెవరు" అనువిషయమును గుఱించియు తత్త్వజ్ఞులు నానావిధములుగా భావించియున్నారు. ఈయభిప్రాయభేదము లనేకవివాదములకుఁ గారణము లయ్యెను. లోకాభివృద్ధిఁ గోరెడుసన్మతము మానవుని గుఱించి యుక్తమైనయభిప్రాయమును వెల్లడింపవలెను. అట్లు కానిచో గొప్పప్రమాదము వాటిల్లక మానదు. దీర్ఘవిచారాభిలాషు లగుతత్త్వవేత్త లీవిషయమును జర్చించి చర్చించి యయోమయము చేసి యుండిరి. ఆత్మ యనుపదము నాధారము చేసికొని యెన్నియో వివాదములు చెలరేఁగెను. జీవాత్మను గూర్చి వాదించువా రందఱు ముఖ్యముగా నిరుతెఱంగులుగా నుండినా రని చెప్పవచ్చును. దేహమునకు భిన్నమైనజీవాత్మ లే దని గొందఱిమతము. ఆత్మయొక్క కర్తృత్వమున కారోపించెడుకార్యము లన్నియు, శరీరమునందలికొన్ని సూక్ష్మావయవముల వలనఁ గలుగుచున్న వని వీ రందురు. మానవునియొక్క బుద్ధి, యంతరాత్మలమూలమున జరుగుచున్న వని చెప్పెడుకార్యజాలమున కంతకు మెదడును, నాడులునే కారణము లని వీరు నుడువుచున్నారు. శరీరధర్మములనుండి యవి యెంత వేఱుగాఁ గాన్పించినను వానికిని, నొకయంత్రములోని నానాభాగములు చేసెడుచలనములకును నేవిధమైనభేదము లే దని వీరియభిప్రాయము. జీవాత్మ శరీరమునకు భిన్నమైనది గా దని దేహాత్మవాదు లిట్లు వక్కాణించుచుండ, జీవాత్మయే పరమాత్మ యని మఱికొందఱు వాదించుచున్నారు. ఉత్తరదక్షిణధ్రువములవలె నుభయమతస్థులయభిప్రాయములకు నేవిధమైనసంబంధమును గాన్పింపదు. జీవుఁడే పరబ్రహ్మ మనుభావమును మనతత్త్వజ్ఞులు చిరకాలమునుండి కలిగి యున్నారు. ఈసిద్ధాంతము మనభరతఖండములోనే యుద్భవించిన దని చెప్పవచ్చును. జీవాత్మ యని ప్రత్యేకముగా లే దనియు, మానవుఁడు తాను వే అని యెంచుకొనుట నట్టిమాయ యనియు వీరిమతము.

ఈసిద్ధాంతములనిజానిజముల నిపుడు పూర్తిగాఁ జర్చింప వలసినపని లేదు, బ్రాహ్మమతప్రకారము జీవాత్మ (మనుష్యుఁడు) యనఁగా నేమియో తెలుపుటయే యావశ్యకము. శరీరముకంటె భిన్నమైనయాత్మ లేదను మొదటిపక్షమువారిలోఁ గాని, యాత్మకంటె వేఱయినభగవంతుఁడే లేఁడనురెండవపక్షమువారిలోఁ గాని చేరక బ్రాహ్మసమాజము మానవతత్త్వమును నాధారము చేసికొని, యాత్మ యొకటి కల దనియు, నది శరీరమునకును నీశ్వరునకును భిన్నమైన దనియు నుడువుచున్నది. ఎండకు నెండుచు వానకుఁ దడియుచు నేదో కొంతకాలము పని చేసి తనయందలియంతర్భాగములం చెడిపోఁగానే యంత మొందెడుయంత్రమువంటివాఁడు మనుష్యుఁ డెన్నటికినిఁ గా నేరఁడు. మనవ్యాపారముల నిర్వర్తించుకొనుటకు శరీరమును, ఇంద్రియములును, నాడులును, నావశ్యకము లనుటకు సందియము లేదు. నేత్రము చూచుటకును, మెదడు యోజన చేయుటకును గావలసినవే. ఐనను, వాస్తవము యోజించితిమేని, చూచునది చక్షువు గాదు; యాలోచించునది మెదడు గాదు. ఈయవయవములద్వారమున నాయా వ్యాపారముల జరగించెడు "నేను" అనునది యొకటి గల దనుట నిర్వివాదాంశము. ఈభౌతికశరీరయంత్రమునకు భిన్నమైనయాజీవాత్మ యాధ్యాత్మిక మైనది. అవయవలోపముచే నష్టపడునది గాదు; దేహయంత్ర మాగిపోయినను, నది నాశము నొందక నిలిచి యుండును.

సృష్టికర్త యగుభగవంతుఁడు గలఁ డనువిశ్వాసమును గలిగి యున్నటులె, బ్రాహ్మమతావలంబకుఁడు మనుష్యుఁ డాత్మస్వరూపి యని నమ్ముచున్నాఁడు. మనుజుఁ డాత్మస్వరూపి యని యొప్పుకొనినచో నతఁడు మరణరహితుఁ డని గూడ సమ్మతింపక తప్పదు. తాను వికల్పము లేక కలకాలము జీవించి యుండు నని ప్రతిమానవుఁడును సహజముగా నమ్ముచున్నాఁడు. సర్వస్వాభావికమైనయావిశ్వాసమును మానవుని నైతికమానసికాదియనుభవములు బలపఱచుచున్నవి. యుగయుగములనుండి యిప్పటివఱకు మనుష్యులు తమబుద్ధివ్యాపారములలో నెట్టిమహత్తరమైనమార్పులను బొందినను, తమహృదయములను మాత్రము నిశ్చలముగా నావిశ్వాసమునందు నిలిపి యుంచిరి. మిక్కిలి వినాశకరమైనదుర్జ్ఞేయవాదము (Agnosticism) ప్రబలినయీకాలమునందుఁ గూడ ప్రజలు దానిని విడువ లేదు. ఈనూతనాభిప్రాయములవలనఁ దమకు గలిగినసంశయములను నివారణ చేసికొని తమహృదయముల కత్యంతప్రీతిప్రదమైనయావిశ్వాసమును నిలువఁబెట్టుకొనుటకు జనులు ప్రయత్నములు చేయుచున్నారు.

# మానవుఁడు.

పరలోకమును గుఱించి మనుజులకు విశ్వాస మేర్పడక పోవుటకు నొకగొప్ప యాటంకము గలదు. పుట్టినది యెల్ల గిట్టు ననునభిప్రాయము హిందువు లందఱిలో బాగుగ వ్యాపించి యున్నది. పయికి నిది యెంత సహేతుకముగాఁ గాన్పించినను, జాగరూకతతోఁ బరీక్షించితిమేని యెల్లవిషయములందును నది యదార్థము కానట్లు తోఁపక పోదు. మీఁదుమిక్కిలి దానికి విరుద్ధ మైనయభిప్రాయమే వాస్తవమయి నట్లు సకలశాస్త్రములు నుద్ఘోషించుచున్నవి. పదార్థవిజ్ఞాన మంతగా వ్యాపింపని పూర్వకాలమునందు ప్రపంచములోనివస్తువు లన్నియు గతించు నని సకలజనులును సాధారణముగా భావించుచుండిరి. గతించినపదార్థము లెల్ల నాశముఁ జెందుట లే దనియు, నదృశ్య మయ్యెడువస్తువు లన్నియు మాఱురూపమును దాల్చుచున్న వనియు ప్రకృతిశాస్త్ర మిపుడు నిరూపించినది. కనుక " జాతస్య మరణం ధ్రువం " అనునార్యోక్తి పదార్థప్రపంచమునందు సార్థక మగుట లే దని మనము గ్రహింపవచ్చును. అంకురించినవి యెల్ల నంతు లేక సాగుచుండుటే మనము చూచుచున్నాము గాని యంతరించుచున్నట్లు గాంచము. మహాశాస్త్రజ్ఞుఁ డగు న్యూటను నొడివినమొదటివిధాన మేమి బోధించుచున్నది? " చలనమునందుఁ బెట్టినప్రత్యణువును నాటంకము లేవియుఁ దటస్థింపనిచో నొకేవేగముతో నెప్పటికిని సమముగాఁ బోవుచుండు " నని గదా! " విశ్వముయొక్క ప్రయోజనార్థమై యాకర్షణశక్తి యొసంగఁబడిన దని మన మెంచుచో, నది యెన్నఁడో యాగిపోక మాన దని భావింపవలసినయావశ్యకము లేదు." అని తత్త్వజ్ఞానవిశారదుఁ డగు మార్టినో నుడువుచున్నాఁడు. స్థూలప్రపంచమునందే వాస్తవము కానట్టి "జాతస్య మరణం ధ్రువం" అనులోకోక్తి సూక్ష్మప్రపంచమునం దంతకంటె నిజము కానేరదు. స్థూలపదార్థములవిషయమున భారపరమాణములను గూర్చి చెప్పవచ్చును గాని సూక్ష్మపదార్థములను గుఱించి యట్టి వనుటకు వీలు పడదు. స్థూలము లైనవస్తువు లుపయోగించినకొలఁది తఱుగును కాని యధ్యాత్మికవిషయములు వినియోగముచే వృద్ధి నొందును. ఇచ్చినకొలఁది పెరుగుటయు, కూర్చినకొలఁది తఱుగుటయు నీసూక్ష్మప్రపంచమునందు వాస్తవమై జరుగుచున్నది. కనుక ఆది యున్నహేతువుచే నంతము గూడ నుండక తీఱ దని మన మాత్మవిషయమున నొప్పుకొన నావశ్యకము లేదు.

వస్తుప్రపంచమును వదలి యింక మానవతత్త్వమును బరీక్షింతము. సకలమనుజులకును సాధారణముగాఁ గలవిశ్వాసమును నాకాంక్షను నిరాకరించుటకు వీలు లేదు గదా!

మానవప్రకృతియొక్క నిర్మాణమే జీవాత్మయొక్క నిత్యత్వమునకుఁ బ్రబలనిదర్శనముగా నున్నది. మనుష్యుఁడు క్షణభంగుర మగుజీవి కాఁడు. శాశ్వతముగా జీవించుటకై యుద్దేశింపఁబడిన ట్లాతనిస్వభావమువలనఁ దెలియవచ్చుచున్నది. భూలోకములోనియీ స్వల్పకాలము మాత్రమే గడపుటకై యేర్పాటు చేయఁబడినచో, నద్భుత మైనయాతని బుద్ధియు, నగాధ మైనయాతనియంతఃకరణమును, గంభీర మైనయాతనియిచ్ఛాశక్తియు పరిహాసాస్పదము లగును. ఇంతయల్పకాలములో శ్మశానవాటికకు నప్పగించుటకై మహత్తరము లైనయిట్టిశక్తులను భగవంతుఁడు మన కనుగ్రహించి యుండఁడు. అట్లయినచో నొక్కతృణము నైనను నిరర్థకముగా విశ్వమునందు సృజింపనియాపరమేశ్వరుఁ డట్టి యమోఘము లైనశక్తులను వ్యర్థము చేసె నని చెప్పక తప్పదు. మరణమే మానవజీవితము యొక్కగమ్యస్థాన మయ్యేనేని, యీవిశ్వమును నడుపుచున్నభగవంతుఁడు క్రూరాత్ముఁడో చపలచిత్తుఁడో యై యుండవలె నని యూహింపవలసి యుండును.

గీ. తెల్పదే నాకుజీవిత మల్ప మయ్యు,
జీవితం బెన్నటికిని నశింపఁ దంచు?
నట్లు గా కున్న, నప్పు డీయవని యెల్ల
నంధకారము, ధూళియౌ నరసి చూడ.

గీ. గగనమునఁ దోచునట్టిప్రకాశ మెల్ల,
మహినిఁ గాన్పించుసౌందర్యమహిమ యెల్ల
బుద్ధియు వివేకమును లేక పొలుపు సెడిన
కవిమనోవిభ్రమముఁ బోలి కానఁబడదె?

గీ. ఇటుల కానిచో నా కేల యీయాసఁ దేల?
అస్థిరము లైనవానికై యాశ యేల?
అయ్యవి లభించు నని యెంచి యాగ నేల?
వసుధపై నుండునింత కీబాధ యేల?

మరణముతోడనే మనము నాశము నొందమనువిశ్వాసమును మనకు స్మృతిసిద్ధము లగునెల్లవిషయములును దెలుపుచున్నవి. న్యాయము గెలువక పోవుటయు, నన్యాయము జయించుటయు మనము తఱుచుగా లోకములోఁ జూచుచుందుము. దృగ్గోచర మగు నీవిశ్వమునందే యధర్మమును జక్కఁబెట్టుటకును, ధర్మమును నిలుపఁబెట్టుటకును, నెన్నియో సదుపాయములు చేయఁబడిన వని నుడువుటకు సందేహము లేదు.

పుణ్యాత్ముఁడు నిర్మల మైనయానందమును బొందుటయు, పాపాత్ముఁడు దుర్భర మైన సంతాపము ననుభవించుటయు మనము సాధారణముగాఁ గాంచుచున్నాము. ఈసంగతులను గూడ మనము లెక్కలోనికిఁ దీసికొనినను, దోషమునకు ననుగుణ మైనశిక్ష గాని సత్కార్యమునకుఁ దగినగౌరవము గాని యీప్రపంచములో జరుగుట లేదని మనము సమ్మతింపక వీలు లేదు. అందుచేఁ బుణ్యశీలుఁడు తనమంచికార్యములకు నుచిత మైన బహుమానమును, దుశ్శీలుఁడు తనదుష్కార్యములకుఁ దగినదండనమును ననుభవించెడు పరలోక మొకటి యుండవలె నని బుద్ధిమంతుఁడు తలంపక మానఁడు. ధర్మసంరక్షణనిమిత్తమును, ధర్మవిజయమునిమిత్తమును నిట్టియేర్పాటును భగవంతుఁడు చేసి యుండ నోపు నని మనన్యాయదృష్టికి గోచరము గాఁ గలదు. మనుష్యునికిఁ గలయీన్యాయాన్యాయవిచక్షణాజ్ఞానముయొక్క తత్వమును జక్కగా యోచన చేసి మహాశయుఁ డగు మార్టినో యీదిగువసారాంశముఁ దెలియఁబఱచుచున్నాఁడు. "ఈలోకములో మనము పొందెడుననుభవముతోడనే మననైతికస్వభావము తనపని నెంతయు నెఱవేర్చిన దని యొప్పుకొనుటకు సాధ్యముగాదు. అది యొకధర్మపరిపాలనమును బ్రకటించుచు, దానినే తఱుమగా మనస్సునకు స్ఫురింపఁ జేయుచు, నట్టిపరిపాలన మిప్పుడు తటస్థింపక పోయినను దానిని మాత్రము విస్మరించుటకు వీలు లేకుండఁ జేయుచున్నది. అది యొక పరమావధిని జూపెడు భావిసూచన. ఈసూచనప్రకారము నెఱవేఱుటను మన మిప్పుడే చూడ లేకపోయినను, నది విశ్వాసార్హ మైన దనుటకు నిదర్శనములు ముందుగానే కాన్పించుచున్నవి. పాపాత్మునకును పుణ్యాత్మునకును మరణమే కడపటివిమోచనము నొసంగు నేని, వారి కాగోక్షింపఁ దగనియనేకము లైనయసత్యముల నంతరాత్మ వారికి బోధించె నని మనము చెప్పుట కాధార మేర్పడుచున్నది." ఈవిధముగా నుండు నని స్పష్టముగా నిరూపించుటకు వీలు లేకపోయినను, నేదో యొకరూపమున మరణానంతరమునఁ గూడ మనయాత్మ లుండు నని నమ్మక తప్పదు. ఎట్లయినను జీవాత్మ తన మానసికాదిసకలవ్యాపారములమూలమున సంపాదించినజ్ఞానధనమును పరలోకమునందును నిలువ చేసికొని యుంచుకొను నని భావింపవలసి యుండును. నిత్యుఁడును అనంతుఁడు నగుభగవంతునియందలివిశ్వాసమువలెనే యాత్మ నిత్య మని నమ్ముటయు మానవులకు సహజ మైనమతానుభవమే యని బ్రాహ్మసమాజ మెంచుచున్నది.

ఆత్మ నాశరహిత మైన దని నమ్మినచో, నింతకుఁ బూర్వము గూడ ఆత్మ యుండె నని యొప్పుకొనవలె నని కొందఱుబుద్ధిమంతులయభిప్రాయము. మరణ మేరీతిగా జీవాత్మయొక్క యంతము కా నేరదో, యాతీరుననే యీలోకమునందలిజన్మమే యాత్మ యొక్క ప్రారంభము గా దని వారు వాదించుచున్నారు. ఆత్మకుఁ బూర్వజన్మ ముండుటకు వీలు లే దని ఖండితముగా బ్రాహ్మసమాజము నుడువుట లేదు. అయినను మరణానంతరమున జీవాత్మ యుండు నని చెప్పుటకుఁ గలయట్టిబలవత్తరము లైన యాధారము లీపూర్వజన్మవిషయమునఁ గాన రావు. పరలోకము గల దని ఋజువు చేయఁ గలిగినంతసులభముగాఁ బూర్వజన్మము గల దని మనము నిరూపింపఁ జాలము. ఆత్మకుఁ బరలోకము లే దని చెప్పెడుపక్షమున ఆస్తికమతము గాని మఱి యేమతము గాని నిల్చుటకు వీలు లేదు. మృత్యువే మన కంత మయ్యెడుచో, మనయధ్యాత్మిక జ్ఞానములును నైతికాభిప్రాయములును నేవిధ మైనవృద్ధినిఁ జెందక యంతరింపవలసినదే గాని వానికి వేఱుగతి యేమియుఁ గాన రాదు. పొందఁ దగినయానన్త్యమును బొందకయే యీజన్మముతోడనే జీవాత్మ జీర్ణ మగు నని యెంచుటకంటె నిదియె యాత్మకుఁ బ్రారంభదశ యని నుడువుటయే యెక్కువ యుక్తియుక్తముగాను, యథార్థముగాను దోఁపక పోదు. తమయధ్యాత్మిక, నైతిక, రసజ్ఞానశక్తులమూలమున మానవులు పొందినయనుభవములను మనము జాగరూకతతోఁ బరీక్షించితి మేని, జీవాత్మయొక్క నిత్యత్వమును నిరాకరింపఁ జాలము.

కాని, యిట్టిబలవత్తరము లైనహేతువులు పూర్వజన్మవిషయమున మనకు గనఁబడుట లేదు. జనులలోఁ గలస్థితిభేదములే పూర్వజన్మమునందు మనము విశ్వాసమును గలిగి యుండుటకుఁ బ్రబలకారణము లనియు, నట్లు కానిచో నాభేదములకుఁ దగినసమాధాన మిచ్చుటకు వీలు లే దనియుఁ గొందఱు దురభిప్రాయపడుచున్నారు. మానవులలో ననేక స్థితిభేదము లుండుట వాస్తవమే. ఒకఁడు కూటికి లేనిపేదవాఁడుగను మఱియొకఁ డాగర్భ శ్రీమంతుఁడుగను పుట్టుచున్నాఁడు. ఒకఁడు సకలరోగములకు నాశ్రయుఁ డై బలహీనుఁ డై యున్నాఁడు. వేఱొకఁడు నిరామయుఁ డై బలాఢ్యుఁ డై యున్నవాఁడు. మిక్కిలి తారతమ్యము లగునీభేదములను ధర్మస్వరూపుఁ డగుభగవంతునికి నారోపించుటకు వీలు లే దనియు, నివి పూర్వజన్మసంచితము లనుట యెంతయు సహేతుక మనియుఁ గొందఱు భావించుచున్నారు. మనుష్యులలోఁ గల యీస్థితిభేదములే హిందువులకుఁ బునర్జన్మము

నందు దృఢ మైనవిశ్వాస ముండుటకుఁ గారణ మై యుండ నోపును. ఎవనికర్మఫలితము వాఁ డనుభవింపక తీఱ దని ప్రజలలోఁ గలనమ్మకము గూడ నీజన్మపరంపరతో సంబంధముఁ గలిగి యున్నది. కార్యకారణసంబంధముతో సమాన మైనయీకర్మవిధానము సకలజనులు సామోదింప వలసినయంశ మే. తాఁ జేసినకర్మముయొక్క ఫలితమును ప్రతిమనుష్యుఁడును స్వయముగా నే యనుభవింపక తప్ప దని బోధించెడుకర్మసిద్ధాంతమునకు విరుద్ధముగా బ్రాహ్మసమాజ మేమియుఁ జెప్పుట లేదు. సత్కార్యమునకుఁ దగినబహుమానమును, దుష్కార్యమునకుఁ దగినశిక్షయుఁ బ్రతిమనుష్యుఁడు ననుభవింపక తీఱదు. నీతిలోకములో నభివృద్ధిఁ గాంచుటకు నీతిసిద్ధాంత మావశ్యక మని బ్రాహ్మమత మొప్పుకొనుచున్నది. కాని, యీకర్మసిద్ధాంతమునకును పూర్వజన్మ, పునర్జన్మసిద్ధాంతములకును నేవిధ మైనసంబంధమును లేదు. కర్మసిద్ధాంతమునకును జన్మాంతరసిద్ధాంతమునకును సంబంధము లే దని చెప్పెడిచో, నీశ్వరకారుణ్యమును మనము శంకింపవలసి వచ్చు నని యెంచుట వట్టిభ్రమ. కర్మసిద్ధాంతప్రకారము పునర్జన్మమును నమ్ముటచే పరమేశ్వరుని నిష్పాక్షికత్వము స్థిరపడు నని తలంచుట యెంతటిగొప్పపొరబా టయినది కొంచె మోపికతో నీవిషయము నాలోచించినచో మనము తెలిసికొనవచ్చును. ఈజన్మమునందలి యవస్థాభేదములకు వెనుకటిజన్మమునందలికర్మము కారణ మైనచో, నాజన్మమునందలి స్థితిభేదములకుఁ గారణ మేమి? దానికి వెనుకటిజన్మమునందలికర్మ మని చెప్పవలసివచ్చును. తిరిగి యావెనుకటిజన్మమునందలి స్థితిభేదములకుఁ గారణ మేమి యన్నచో, దానికి వెనుకటిజన్మమునందలికర్మ మే యని యుత్తరము వచ్చును. ఇట్లు యోచించినచో, జన్మము లొకటికి పూర్వ మొకటి యున్న వని చెప్పుకొనవలసి వచ్చునే గాని స్థితిభేదములకుఁ దృప్తికర మైనసమాధానము చిక్కుట లేదు. భగవంతునికిఁ బక్షపాతము నారోపింపఁ దగినట్టిస్థితిభేదములే లోకములో నున్నచో, నవి నూరు గాని వేయి గాని సంవత్సరములకిందట నున్న వని యొప్పుకొనుటచే మనకుఁ జేకూరినలాభ మేమి? పరమేశ్వరుఁ డెల్లవారిని సమానముగా సృజించినచో మొట్టమొదట నట్టిస్థితిభేదము లేర్పడుటకుఁ గారణ మేమి? ఈజన్మమునందలిపరిస్థితికి వెనుకటిజన్మమునందలికర్మ మే కారణ మైనచో కర్మపరంపరకును, నానాజన్మములందలిస్థితిభేదములకును హేతుభూత మైనయీప్రథమకర్మ మెట్లు కలిగినది? ఈకాలమును దప్పించి పూర్వకాలమునకు నెట్టుటచే మన మెట్లు భగవంతుఁడు పక్షపాతరహితుఁ డని నిరూపింపఁ గలిగితిమి?

అక్రమములుగా మనము భ్రమించెడునీ స్థితిభేదముల నేర్పఱచినపరమేశ్వరుని న్యాయబుద్ధినిం గూర్చి మనకుం గలిగినసంశయములను దీర్ప లేకపోవుటయే గాక, యీ జన్మాంతరసిద్ధాంతము లోకములో ననుసరింపఁబడున్యాయపద్ధతికిని మననీతిజ్ఞానమునకును గొంతవఱకు విరుద్ధమై యున్నది. ఒకనిమీఁద శిక్ష విధించునపుడు, ఆశిక్షితుఁడు తన నేరము నెఱుంగుట ముఖ్యావశ్యకముగా నెంచఁబడుచున్నది. చేసిననేరమునకుం గేవలము ప్రతీకారముగా విధింపఁబడుశిక్ష యైనను నేరస్థునినిగ్రహమును దిద్దుటకై యుద్దేశింపఁబడినశిక్ష యైనను నాదండనను ననుభవించువాఁడు తనదోషము నెఱుఁగనిపక్షమున నే మాత్రము ప్రయోజన ముండదు. ప్రతీకారముగా విధింపబడినశిక్ష యైనచో శిక్షితుఁడు తననేరమును దెలిసికొనవలె నని మనన్యాయదృష్టికి గోచర మగుచున్నది. మానవులచే నేర్పరుపఁబడినశాసనమే తప్పును జెప్పకుండ శిక్షను విధించుట లేదు. నడతను సవరించుటకై యుద్దేశింపఁబడినశిక్షావిషయమున నేరస్థుఁడు తనదోషము నెఱుఁగనిచో నేమియు లాభ ముండదు. దోషి తననేరమును గ్రహింపనిచోఁ దనప్రవర్తనము నెటుల బాగు చేసికొనఁ గలఁడు?

మనహృదయములఁ గలవరపెట్టుచున్న మానవసంఘములోని యీన్యాయలోపములకు సహేతుకమైనసమాధానముల నొసంగక పోవుటయే గాక యీజన్మాంతరసిద్ధాంతము నూతనమైనసంశయశృంఖలలో మనలను దగిలించుచున్నది. జన్మాంతరమునందు విశ్వాస మున్నను లేకపోయినను బ్రాహ్మమత మంతగాఁ బాటిగాఁ దీసికొనదు. ఈ సిద్ధాంతమును గుఱించి, యవు నని కాని కా దని కాని నిర్ధారణ చేయుటకు బ్రాహ్మసమాజము పూనుకొనదు. తనజీవనచారిత్రము పూర్వ మెప్పుడో యారంభ మైన దని యెంచినప్పటికి, నీజన్మముతోనే ప్రారంభించిన దని యెంచినప్పటికి బ్రాహ్మసమాజికుని యొక్క విశ్వాసము చలింపవలసినపని లేదు. ఈశ్వరునిగ్రహశాసనమున కనుగుణముగా నున్నంతవఱకు నొకజీవి నిరంతర మైనయీమహాకాలప్రవాహములో నేక్షణమునందుఁ బుట్టినను నిబ్బంది లేదు. అందుచే బ్రాహ్మమతమునకు లాభము గాని నష్టము గాని కలుగదు.

పూర్వజన్మవిచారము నొక్కొక్కనిబుద్ధిపరిపాకమునకుఁ దగినచందమున యోజించుకొనుటకు విదలి ప్రతిమనుష్యునకును గల "నేను" అనుజ్ఞానమునే బ్రాహ్మమతము ముఖ్యముగాఁ దీసికొనుచున్నది. ఒకఁడు పూర్వజన్మ మున్న దనినను, మఱియొకఁడు లే దనినను, హేతుజ్ఞానాదిశక్తులతోఁ గూడిన "నేను" అనుజ్ఞానము మాత్రము తనకుఁ గల దని ప్రతిమానవుఁడును నమ్ముచున్నాఁడు. బ్రాహ్మమతమున కింతయే చాలును.

మానవుఁ డనువాఁ డొకఁడు గలఁ డనియు, నతనియునికి మాయ గా దనియు స్థిరపడుటయే యాస్తికమతమునకు ముఖ్యముగాఁ గావలసినది. ఒకవైపున దేహాత్మవాది శరీరవిలక్షణ మైనజీవాత్మ లే దనియు, ఆత్మ చేయునట్లు మనము భావించెడుకార్యము లన్నియు మెదడు, నాడులమూలముననే జరుగుచున్న వనియు, శరీరము నశించినవెంటనే యాత్మకు నారోపించెడు వ్యాపారములు గూడ నాగిపోవు ననియు వాదించుచున్నాఁడు. మఱియొకప్రక్కన అద్వైతవాది పరమాత్మకు భిన్న మైనయాత్మయే లే దనియు, నాత్మ పరమాత్మ లొక్కటియే యనియు నొడువుచున్నాఁడు. జీవేశ్వరు లొకటియే యనుటలో జీవునికి ఈశ్వరుడే యాధారుఁ డని గాని, పరబ్రహ్మముయొక్క లక్షణములు జీవుని యందుఁ గల వని గాని యభిప్రాయపడినచో నద్వైతవాదులతో బ్రాహ్మసమాజము గూడ నేకీభవించుచున్నది. అట్లు గాక భగవంతునికిని మానవునకును భేదమే లే దనియు నిద్దఱొకటియే యనియుఁ జెప్పఁ బూనుకొనినపక్షమున నట్టిభావముతో బ్రాహ్మసమాజ మేకీభవింపఁ జాలదు.

ప్రతిమనుష్యుఁడును బ్రత్యేకవ్యక్తి యనుభావమే మతమునకు మూలాధారము. దీనిని హేతువులమూలమున నిరూపింపవలసినయావశ్యకము లేదు. ఇది ప్రత్యక్షసత్యము. మానవుఁడు భగవంతునికి వేఱయినవాఁ డనియు, నతఁడు తనకార్యాకార్యములకు నుత్తరవాది యనియు, నొప్పుకొనినచో మతమును, నీతియు నర్థశూన్యము లై యంతరింపవలసి యుండును. మనుజుఁ డెన్నటికిని భగవంతుఁడు గా నేరఁడు. ఏపాటిజ్ఞానము గలమానవుఁ డైనను తాను పరమేశ్వరునినుండి వే అనుస్మృతినిఁ గలిగియే యున్నాఁడు. జీవాత్మయుఁ బరమాత్మయు నొక్కటే యని వాదించుట యతిసాహసమనియు, యుక్తిబాహ్య మనియు బుద్ధిమంతుఁ డగువాఁడు సమ్మతింపక మానఁడు. మనుష్యుఁడు భగవంతునినుండియే జన్మించుటయు, నతనియందే జీవించుటయు, నతనికి సంబంధించినవాఁ డగుటయు వాస్తవ మనుటకు లేశ మైనను సంశయము లేదు. కాని యతఁడే భగవంతుఁడు గాఁడు. తత్త్వవేత్త యగునొకమహాశయుఁ డిట్లు నుడువుచున్నాఁడు. “మానవుని భగవంతునిలో

లీనము చేయునట్టియీయద్వైతసిద్ధాంత మసత్యమును, నష్టహేతువు నని నామనస్సునకుఁ దోఁచుచున్నది. జీవేశ్వరులు వే ఱనుదానినే వివేకుల మగుమనము నేర్చుకొనవలసిన ముఖ్య మైనసత్యము. దేవుఁడు న న్నెట్లు సృజించెనో నాకుఁ దెలియదు. భగవంతుని యందు లీనము గాక విడిగా నుండునేనొకజీవి నని యెఱుఁగుదును. మనుజుఁ డిట్లు పర మేశ్వరునినుండి వేఱుగా నుండుటయే సకలప్రార్థనమునకును, సమస్తనయప్రవ ర్తనము నకును హేతుభూత మనియు, నిచ్ఛాకర్షకవిషయములకును పశ్చాత్తాపమునకును, కృతజ్ఞ తాభావమునకును, నున్నతాభిలాషలకును, ఈశ్వరసాంగత్యమునకును, ప్రార్థనమునకును, నాధార మనియు నాకుఁ దోఁచుచున్నది. భగవంతునిచే సృష్టింపఁబడి యనుక్షణమును నతనిచే సంరక్షింపఁబడుచు, నతనిసద్భావంబులోఁ బాల్గొనినవార మై, యావద్బలమును యానచ్ఛక్తియు నతనినుండియే పొందుచున్నవార మైనప్పటికి మనము మాత్ర మతనికి వే ఱయినయునికినిఁ గలిగి యుండి మనము చేసెడుకార్యాకార్యములయొక్క ఫలములను మనమే యనుభవించుచున్నారము. అనంతకాలమువఱకు నీయేర్పాటు జరుగునదే గాని నడుమ నంత మొందునది గాదు. బ్రాహ్మమతప్రకారము, ఆత్మాభివృద్ధి యాత్మవినాశము గాదు; ఈశ్వరునిలో లీనమగుటయుఁ గాదు; జీవుఁడు తనయిచ్ఛ నీశ్వరేచ్ఛతో నైక్య ము చేసి నిరంతరాయముగా దయాసత్యశౌచములందు నభివృద్ధిఁ బొందుటయే యాత్మా భివృద్ధి యగును. ఏవేదములను బ్రమాణములనుగాఁ గొని జీవేశ్వరులయైక్యమును హిందు వులు స్థాపించిరో, యావేదములే జీవాత్మపరమాత్మలు వే ఱని యిట్లు స్పష్టముగా బోధించుచున్నవి.

శ్లో॥ ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం
వృక్షం పరిషస్వజాతే. [ముండకము]

[అర్థము] సుందర మైనపక్షములు గలరెండుపక్షులు (జీవాత్మపరమాత్మలు) జంట గాను స్నేహముగాను (శరీర మను) నొకవృక్షమును నాశ్రయించి యున్నవి.

# మూఁడవప్రకరణము

## ప్రకృతి

గతప్రకరణములయందు దేవునిఁగూర్చియు మానవునిఁగూర్చియు విపులముగా వ్రాసి యుండుటచేఁ బ్రకృతినిగురించి యిందు విశేషముగా వివరింపవలసినయావశ్యకత యుండదు. బ్రాహ్మమతప్రకార మీలోకమునందలిసకలమునకును దేవుఁడే యాదికారణుఁడు; అతఁడే మూలాధారుఁడు. అందుచేఁ బ్రకృతియు, భూవ్యోమాకాశములును నతనిసృష్టియై యున్నవి. మనోహరమైనయీజగత్తు నంతయుఁ గలుగఁజేసి, కాలగతికి విడిచిపెట్టి భగవంతుఁడు నిర్వ్యాపారుఁడై యొకచోఁ గూరుచుండలేదని యింతకు ముందే తెలిసికొనియున్నారము. శక్తిస్వరూపుఁడై యతఁడీవిశ్వమునందంతటను వ్యాపించి యున్నవాఁడు. ప్రతిపదార్థాణువును, ప్రతిజీవాణువును నామహామహునిమహిమనే యుద్ఘోషించుచున్నవి. అతఁడు లేనిచో నెద్దియు నీలోకములో నొకనిమేషమైన నుండఁజాలదు.

శ్లో॥ కో హ్యేవాన్యాత్ కః ప్రాణ్యాత్ యదేష ఆకాశ ఆనన్దో న స్యాత్
[తైత్తిరీయము]

[అర్థము:—ఆనందరూపుఁడయినపరమాత్మ బయలున లేకున్న నెవఁడు చలించును? ఎవఁడు జీవించును?]

శ్లో॥ భయాదస్యాగ్నిస్తపతి భయాత్తపతి సూర్యః
భయాదిన్ద్రశ్చ మృత్యుర్ధావతి పఞ్చమః [కఠము]

[అర్థము:—ఆపరమేశ్వరునియొక్క భయమువలన అగ్ని వేడిమి నిచ్చుచున్నది. ఆతనిభయమువలన సూర్యుఁడు ఉష్ణము నిచ్చుచున్నాఁడు. మేఘము, వాయువు, అయిదవది యైనమరణము నాతనిభీతివలన నడచుచున్నవి.]

భగవంతుఁ డీరీతిగా సర్వవ్యాపకుఁడై యుండ, నిందునకు వ్యతిరిక్తములైన, రెండువిధము లగునభిప్రాయములు జనములలో నల్లుకొని యున్నవి. ఇం దొకటి దేవుఁడు, విశ్వమునుండి వేఱుగా నున్నాఁ డనునది; మఱియొకటి విశ్వమే దేవుఁ డనునది.

ఈవిధము నైనమతములలో దేనితోడను బ్రాహ్మమత మేకీభవింపఁ జాలదు. మనోజ్ఞమైనప్రకృతియం దనారతము బ్రహ్మమును వీక్షించుటచే మనపూర్వులు ప్రకృతీశ్వరులకు గలభేదమును బాటింప లేకపోయిరి. మనభరతఖండములో నీయభిప్రాయమునకు నెక్కువ వ్యాపకము గలదు. విశ్వమునందలి ప్రతితృణమునందును, ప్రతిజీవాణువునందును భగవన్మహిమ కానవచ్చుచున్నను, భగవంతునియందే సమస్తవిశ్వమును విశ్వమునందు భగవంతుని మనము దర్శింపఁ గలిగినను, నీవిశ్వము లెన్ని గలిపినను భగవంతుఁ డెన్నటికిని గానేరఁడు. ఎల్లపదార్థములయం దంతర్భూతుఁ డై ప్రతిక్షణమునందును చిత్రవిచిత్రము లైనమార్పుల నెన్నియో యతఁడు కలిగించుచున్నను, నతఁ డీలోకమున కతీతుఁ డై మన మూహింప నలవి గానియనంతకోటిబ్రహ్మాండముల సృష్టించి పరిపాలింప సమర్థుఁ డై యున్నాఁడు.

ఈరీతిన యోజించితి మేని మృతపదార్థ మని మనము ప్రకృతిని నిరాకరించుటకు వీలు లేదు. అందుఁ బని సేయుచున్నశక్తు లన్నియు నంధము లని తృణీకరించుటకును వలనుపడదు. సృష్టియందలిప్రతిశక్తియు ప్రపంచాభివృద్ధికై యుద్దేశింపఁబడిన దై నిరంతరాయముగా నడచుచున్నది. రమణీయ మైనయీప్రకృతి యీశ్వరునియనల్పకల్పనాచాతుర్యమును జాటెడుమహాదేవాలయము. అతఁడే దీనిని గాపాడుచు ననునిమిషమును తదభివృద్ధికై కృషి సేయుచున్నాఁడు. సృష్టి యంతయు నియామకము లైనకొన్నిశాశ్వతధర్మముల ననుసరించి వర్తిల్లుచున్నది. మార్పు లేక కలకాల మొకేతీరున నడచుచుండెడునీధర్మములకు ప్రకృతిశాస్త్రజ్ఞులు ప్రకృతిధర్మము లని పేరు పెట్టిరి.

ఈధర్మములు సర్వకాలములయందును సర్వదేశములయందును నొకేచందమునఁ బ్రవర్తించుచున్నవి. అందువలననే జ్యోతిశ్శాస్త్రజ్ఞుఁడు ఖగోళమండలమునందలిగ్రహనక్షత్రములయొక్క గమనమును దెలిసికొని గ్రహణము లెప్పుడు గలుగునో నిర్ణయింపఁ గలుగుచున్నాఁడు; రసవాదశాస్త్రజ్ఞుఁడు వస్తుతత్త్వమును గ్రహించి యేయేపదార్థములను మిశ్రము చేసిన నేయేనూతనపదార్థము లేర్పడునో స్పష్టము గాఁ జెప్పఁగలుగుచున్నాఁడు.

జ్ఞుఁడై యొకయంత్రకారుఁడును నీధర్మముల నాధారము చేసికొని నానావిధ యంత్రములను నిర్మింపఁ గలుగుచున్నాఁడు. ఈప్రకృతిధర్మములు పక్షపాతము లేక ధనవంతులవిషయమునను, దరిద్రులవిషయమునను, పండితులయెడలను, పామరులయెడలను నొక్కవిధముగానె వర్తించుచున్నవి. విషమును పాపాత్ముఁడు మ్రింగినను, పుణ్యాత్ముఁడు మ్రింగినను ప్రాణమును గోల్పోవుచున్నాఁడు. తుపాను వచ్చినప్పుడు దొంగ లెక్కిన నావ యైనను దొర లెక్కిననావ యైనను మునిఁగిపోవుచున్నది.

చాలకాలమునుండి యిట్లు మార్పు లేక జరగుచుండుటచే నీవిశ్వము తనంతటనే నడచుచున్న దనియు, దీనిని నడపునట్టివాఁ డెవ్వఁడును లేఁ డనియుఁ గొందఱు భావించుచున్నారు. ఇట్టియభిప్రాయమునకుఁ గారణము లేకపోలేదు. స్వాతంత్ర్యబుద్ధిసంపద గలమానవు లొకతీరున నడచుకొనక పరిపరివిధములఁ బ్రవర్తించుచుండుటచే సర్వస్వతంత్రుఁ డగుపరమేశ్వరుఁడు గూడ నిట్లె యుండు నని వా రూహించుచున్నారు. కొంచె మాలోచించినచో నీయభిప్రాయము సరి గా దని మనకుఁ దోఁప గలదు. మనుష్యు లొకపద్ధతిప్రకారము నడచుకొనకపోవుటకుఁ గారణము, వారియజ్ఞానమును దూరాలోచనరాహిత్యము గాని వారిబుద్ధిస్వాతంత్ర్యము గాదు. అసంపూర్ణజ్ఞానము గలవా రగుటచే మనుజులు తమకార్యగతులను సాంతముగా గ్రహింప లేక నడుమనడుమ మార్పులను జేసికొనవలసినవా రగుచున్నారు. నిలుకడ లేక తనకార్యములలో మాటిమాటికి మార్పులు చేయువానిని మన మస్థిరచిత్తుఁ డని సామాన్యముగాఁ జులకన చేయుచుందుము. మాఱుపు లేక చాలకాలము చక్కఁగా వ్యాపారము చేయువానిని మనము బుద్ధిమంతుఁ డనియు, యోచనాపరుఁ డనియుఁ గొండాడుచుందుము. ఆగతానాగతవేది యగుసర్వేశ్వరుఁ డీవిశ్వముయొక్కప్రవర్తనమును గూర్చి ముందుగా నాలోచించి యిప్పటివఱకును నేమార్పును లేక యొక్కచందముననే నడపుచున్నచో, దీని నాతఁడు వదలి యూరకుండె నని యూహించుటకు నావశ్యకము లేదు. భగవంతుఁ డీజగత్పరిపాలనమునం దనుసరించుపద్ధతులే గదా ప్రకృతిధర్మములు! అనంతకాలస్థాయి యగునీవిశ్వముయొక్కసంరక్షణాభివృద్ధులనిమిత్తమై యనుసరింపవలసినపద్ధతులను నొక్క

పర్యాయము నిర్ణయించి యుండుటయుఁ దత్ప్రకార మింతవఱకు నిరంతరాయముగా జరగించుచుండుటయు నాసృష్టికర్తయొక్క బుద్ధికౌశలమునకుఁ బ్రబలనిదర్శనముగా నున్నవి. ఎవ్వనిమూలమున నీప్రకృతి మొదల నిర్మింపఁబడెనో, యతనిమూలముననే యది యింతవఱుక నిపుణముగా నడపఁబడుచున్నది.

భగవంతుఁడే దయాపరుఁ డైనచోఁ దనయేర్పాటుల నప్పుడప్పుడు మనుజుల లాభమునిమిత్తమై మార్చికొనవలసియుండు నని కొందఱు భావించుచున్నారు. కాని కొంచె మాలోచించినచో నీయభిప్రాయముయొక్క లోపము తేటతెల్లము గాఁగలదు. వస్తువులయొక్క స్వభావ మొక్క తీరున నుండక మాటిమాటికి మాఱుచుండె నేని మన మే కార్యమును జేయుటకు వీ లుండఁ జాలదు. సూర్యుఁ డొకనాఁడు తూర్పుదిక్కునను మఱియొకనాఁడు పడమటిదిక్కునను నుదయించి, చంద్రుఁ డొకప్పుడు వెన్నెలను మఱియొకప్పుడు వేఁడిమిని నిచ్చినచో, ప్రపంచమున కెంత యుపద్రవము గలుగునో యూహించుకొనుఁడు. ఒకేపదార్థ మొకసమయమున ప్రాణపోషణమునకును, మఱియొక సమయమున ప్రాణనాశనమునకును గారణ మైనచో నెట్లు లుండునో తలపోయుఁడు. కార్యకారణసంబంధము లేక పనులు జరగుచుండె నేని జగత్తంతయు తాఱుమాఱగు ననుట సంశయము లేదు. తనయిచ్చ వచ్చినట్లు నిరంకుశముగాఁ బ్రకృతిని నడపుచుండెడు భగవంతుని బుద్ధిమంతు లగుమానవు లెవ్వరును బూజింపఁ జాలరు. అంతియే గాక యట్టిప్రపంచములో నివసించుటయుఁ బ్రయాసకరముగానే యుండును. జ్ఞానమయుఁడును, కరుణాళుఁడు నగుపరమేశ్వరుఁ డాతీరుగా వర్తించు నని యెంచుటకు నావంతైన నవకాశము లేదు. ప్రకృతియందలిధర్మముల నిట్లు భగవంతునిపరిపాలనామార్గములుగా భావించి గౌరవించుచుండుటచే మతమునకును బ్రకృతిశాస్త్రమునకును గలవైరమును బ్రాహ్మమతము తీర్చినది. ప్రకృతిశాస్త్రవేత్తలపరిశోధనలవలన స్థాపింపఁబడుప్రతిధర్మమును బరమేశ్వరునిమహిమమును వృద్ధిపఱచుచు, మనకు నూతనజ్ఞానమును బ్రసాదించుచున్నది. తరచి చూడఁగాఁ బ్రకృతిశాస్త్రము మతమునకు సహకారియే గాని వైరి గాదు. సృష్టియందుఁ గలిగెడుమార్పులయొక్క తత్వమును బరిశోధించుభారమును

ప్రకృతిశాస్త్రజ్ఞులను వదలి తత్పరిశోధనాఫలితములుగా నేర్పడువిషయముల నీశ్వరమహిమను వెల్లడించెడు సత్యములనుగా బ్రాహ్మమతము స్వీకరించుచున్నది.

విశ్వ మంతయు నొకకాలమందు తాఱుమాఱుగాను వికారముగాను నుండి యంతకంతకా స్థితి మాఱిపోయిన దనియు, కీటకాదిక్షుద్రజంతువు లొకప్పు డీభూతలము మీఁద వాసముచేయుచుండి యవి రాను రాను నున్నతము లైనప్రాణిసముదాయమునకుఁ జోటియ్య సాగె ననియు ప్రకృతిశాస్త్రజ్ఞులు నిరూపించియున్నారు. సహేతుక మైనయీసిద్ధాంతానుసారముగాఁ బ్రకృతి యేర్పడె నని యొప్పుకొనినచో నొక మతము ప్రపంచ మాఱుదినములలో సృష్టింపఁబడిన దని బోధించినను, మఱియొకటి యాఱువేలసంవత్సరములలో సృజింపఁబడిన దని నుడివినను బ్రాహ్మసమాజమునకు సమానమె.

ఒక్కయినుకరేణువును గాంచినను, ఒక్కజీవాణువును వీక్షించినను, ఒక్క చరిత్రాంశమును బరిశీలించినను, అపార మైనజ్ఞానమును, అనంత మైనకారుణ్యమును, అకలంక మైన సద్భావమును బొడగట్టుచున్నవి. అపరిమితమేధాసంపన్నుఁడును, దయాసముద్రుఁడు నగుభగవంతునిసంబంధముచేతఁ గాక యట్టిప్రశస్తగుణము లానస్తగణమునం దెట్లు కానఁబడఁ గలవు? ఆబుద్ధియు, ఆశక్తియు, ఆప్రేమయు మున్నెద్దియో యొకయుగమునందు, నేదో యొకప్రదేశమునందు మాత్రమే యుండె నని జనులు భావించిరి గాని యిప్పు డాయద్భుతగుణవిశేషములు ప్రతిస్థలమునందును, ప్రతిక్షణమునందును వ్యక్తము లగుచున్నట్లు గ్రహింపఁబడుచున్నవి. సర్వాంతర్యామి యైయాసకలకల్యాణగుణాకరుఁ డెల్లెడలఁ బ్రకాశించుచున్నాఁడు. అందుచే నీవిశాలవిశ్వ మంతయుఁ బవిత్ర మైనబ్రహ్మమందిరము. లౌకికము పారమార్థిక మనుభేదము నశించి సర్వకార్యములును నీశ్వరప్రీతికరము లైనవి. సర్వప్రదేశములును బవిత్రము లైనవి. సర్వకాలములును పావనము లైనవి. ఇఁక వ్రేలెత్తి "యిచట దేవుఁడు లేఁ" డని యెక్కడఁ జూపఁ గలము?

ఆనందస్వరూపుఁ డగునీశ్వరుఁడు సర్వత్ర వ్యాపించియున్నాఁ డని భావించుటచే నీప్రపంచము దుఃఖబహుళ మనియు నివాసయోగ్యముగా దనియు మన మెంచుటకు

నవకాశము లేదు. మానవజీవితమును సకలప్రతిష్ఠాపనలును బవిత్రములు. ప్రపంచ మెన్నటికిని మిథ్య కానేరదు. మనజీవితము గూడ వట్టిమాయ గాదు. జీవితము ననుగ్రహించినందునకు మనము విచారపడుటకుఁ గాని యిట్టిమానవసంఘమును సృష్టించిన యీశ్వరునిబుద్ధికుశలతను శంకించుటకుఁ గాని యావశ్యకము లేదు. అనిర్వాచ్య మైన యానందము నొడఁగూర్చెడుకుటుంబమును సంఘమును మన కెన్నటికినిఁ ద్యాజ్యములు గావు. సమస్తానురాగములను బంధములఁగా నెంచుట కేవల మస్వభావికమును, నీశ్వరాజ్ఞోల్లంఘనము నై యున్నది. మన మొకమాయాజాలములోఁ దగుల్కొని యున్నా మనియు, దీనినుండి తప్పించుకొనుటయే ముక్తి యనియుఁ దలంచుట న్యాయ్యము గాదు. అట్లయినచోఁ గోట్లకొలఁది మానవుల నిట్టికష్టసంఘాతములచేఁ బీడించుచున్నవానిని మనము భగవంతుఁ డని పూజించుటకంటె పెనుభూత మని పిలువవలసియుండును. ఈశ్వరశక్తికి భిన్న మైనమతియేశక్తియు నీప్రపంచమునందు లే దని బ్రాహ్మ సమాజముయొక్క నిశ్చితాభిప్రాయము. భగవంతునియుద్దేశమునకు వ్యతిరిక్తముగా వర్తింపఁ గలభూతపిశాచము లెవ్వియు లేమిచే నేయుపద్రవములకును మనము భయపడ వలసినపని లేదు. కరుణాకరుఁ డగుపరమేశ్వరుఁ డధిష్ఠానదేవత యగుటచే నీవిశ్వమును కారాగృహముగా నెంచఁ దగదు.

ప్రపంచము నొకచెఱసాలగాను, విందలిసౌఖ్యములను దుచ్ఛములుగాను, నిందలి యనురాగములను సంకెళ్లగాను బోధించినవేదాంతమువలన సంఘమున కగణిత మైన యపకారము సంభవించెను. ఈవేదాంతసిద్ధాంతము భక్తిపరు లగుమహానుభావులను సంఘమునుండి దూరము చేసి సంఘమునకుఁ బనికిరానివారినిగా నొనరించెను. అట్లు ప్రేమలతలను ద్రెంపుకొని విడిచిపోలేక మానవులలో మెలఁగుచుండినమహాభాగుల యొక్క జీవితములను మిగుల దుఃఖభాజనము చేసెను. ఇహలోకసౌఖ్యములయందు విముఖత్వమును గలిగించి సంఘాభివృద్ధికై పాటుపడెడుపరోపకారపరాయణుల నడుగంటఁ జేసెను. ఇన్నివిధముల నష్టకారి యైనయాసిద్ధాంతమునందు జనులకు విశ్వాసము సన్నగిల్లిన గాని హైందవసంఘ మభివృద్ధిఁ బొందఁ జాలదు. మనము నివసించెడి యీభూమం

డలము మిక్కిలి యానందావహ మైనది. నిర్మల మైనయాత్మయే భగవంతుఁ డధివసించు స్వర్గము. మనగృహములే యీశ్వరాలయమునందలిగర్భగృహములు. మనయభివృద్ధికొఱకే యీలోకమునందుఁ బ్రేమపూర్వకముగా సృజింపఁబడినారము. మనము నీతివంతుల మగుటనిమిత్తమే సర్వోపేత మైనయీవిశ్వమునందు మన మాపరమపావనమూర్తిచే నుంపఁబడితిమి. బ్రహ్మజ్ఞానమును బడయఁగోరెడువారిఁ డీప్రపంచమును వదలుటకంటె నిం దుండుటయే యావశ్యకము. విపత్తులకును, విధులకును, ప్రలోభనములకును, పోరాటములకును, గృహసౌఖ్యములకును, గృహచ్ఛిద్రములకును దావల మైనయీలోకమే మన మనుభవమూలకముగా నాధ్యాత్మికాభివృద్ధిఁ జెందుటకుఁ దగినపవిత్రస్థలము. బిడ్డలను తలిదండ్రులకును, భార్యకును భర్తకును, ఒకమనుష్యునకును మఱియొకమనుష్యు నకును గలసహజానురాగమే మనల నానందపరవశులను జేయు నెడతెగనిమహోత్సాహ మై యెచటఁ బరగుచుండునో, దుఃఖములును, బాధలును, రోగములును, మరణములును మనహృదయాంతరాళములయందు దయానుకంపముల నెచటఁ బ్రేరేపించుచుండునో, యోగులయొక్కయు, మహాభాగులయొక్కయు, ధీరులయొక్కయు, సదాచారుల యొక్కయు సహవాసభాగ్యమున మనజీవితము లెచటఁ బావనము లగుచుండునో, యట్టి మానవసమాజమునందుఁ గాక యంధకారబంధుర మగు నేపర్వతగుహాంతరమునందు, నేకాననమధ్యమందు మన మాపరబ్రహ్మముయొక్క దివ్యదర్శనము చేయఁ గలము? ఈలో కమునందు నెఱపవలసినవిధులనుండియు, ననుభవింపవలసినకష్టములనుండియుఁ, జించు కొని పాఱిపోవుటవలనఁ గాక యిం దుండి వాని నెల్ల ధైర్యముతోడను, భక్తితోడను, నిర్వహించి సహించుటమూలముననే, శక్త్యనుసారముగా మానవసేవ నాచరించుటమూ లముననే మనము పరమేశ్వరునిఁ దెలిసికొనవలసియున్నది. ఘనకార్యములఁ జేసి కీర్తి గాంచకపోయినను, పలికినప్రతివచనమునందును, యోజించినప్రత్యాలోచనయందును, నొనరించినప్రతికార్యమునందును నిష్కపట మై, నిర్మల మైనసద్భావమును గనఁబఱతు రేని యట్టిమనుజులు జీవితముయొక్క పరమార్థము నెఱిఁగినవా రనియును, వారిజీవితములు సఫలము లైనవనియు నుమువృపాంపు లేశ మైనను సందేహము లేదు.

బ్రాహ్మసమాజముయొక్క ముఖ్యాభిప్రాయము నీక్రిందిశ్లోకము తెలియఁ జేయఁ గలదు.

శ్లో॥ లోకేశ చైతన్యమయాధిదేవ మాఙ్గల్య విష్ణో భవదాజ్ఞ యైవ
హితాయ లోకస్య తవప్రియార్థం సంసారయాత్రా మనువర్తయిష్యే॥

[అర్థము:—లోకములకు నియామకుఁడ వగునోపరమేశ్వరుఁడా! జ్ఞానస్వరూపుఁడ వగునోసర్వేశ్వరుఁడా! సర్వమును బొంది ప్రకాశించువాఁడ వగునోజగదీశ్వరుఁడా! మంగళభానము గలయోస్వామీ! వ్యాపకుఁడ వగునోపరమేశా! నీయాజ్ఞచేతనే ప్రపంచహితముకొఱకును, నీప్రియముకొఱకును నీసంసారయాత్ర ననుసరించుచున్నాను.]

---

# నాల్గవ ప్రకరణము

## ఉపాసన

బ్రాహ్మమత ముపాసనయే ప్రధానముగాఁ గలమతము. నిత్యుఁడై, యద్వితీయుఁడైనపరబ్రహ్మము నధ్యాత్మికముగా నుపాసించుటయే బ్రాహ్మసమాజమతము నందు ముఖ్యాంశము. సహేతుకములైనసిద్ధాంతములసముదాయమే మత మని బ్రాహ్మసమాజికునియభిప్రాయము గాదు. మతగురువులయిష్టానుసారముగాఁ గొన్నికట్టుదిట్టములప్రకారము ప్రవర్తించుటయే మత మనిపించుకొనదు. సత్యమై, ప్రేమపూర్వకమైన జీవేశ్వరులయన్యోన్యసంబంధమే వాస్తవమైనమతము. దేవునకును, మానవునకును గలయిట్టిపరస్పరానురాగమునకు మూలాధార మగుటచేతనే బ్రాహ్మసమాజ ముపాసనయొక్కయావశ్యకమునుగూర్చి నొక్కి వక్కాణించుచున్నది. ఆచారానుసరణము గాని కర్మాచరణము గాని మంత్రజపోచ్చారణము గాని మఱి యేయితరబాహ్యాడంబరము గాని బ్రహ్మోపాసన యని బ్రాహ్మసమాజికుఁడు భావింపఁజాలఁడు. ఆత్మపరమాత్మలసంయోగమే యతనికి సమ్మతమైనయుపాసన. ఈయోగసమాధియందు జీవాత్మ తనలోపాపగాధముల నొప్పుకొని, తనయభిలాషలను జెప్పుకొని భగవంతునికిఁ దన్నుదా సమర్పించుకొనుచున్నది. తనసాహాయ్యము నపేక్షించుచున్నమనుష్యునకుఁ బరమేశ్వరుఁడు తన తేజమును, బలమును, తనయాశీర్వాదమును, నాదేశమును బ్రసాదించును. ఉపాసన యనునది క్రోధావేశుఁడైనయీశ్వరునియొక్కయక్కసును దీర్చుటకై యొసగఁబడు బలిదానము గాదు; తనయిచ్చవచ్చినట్లు మనకు నుపకారము గాని యపకారము గాని చేయఁ గలసర్వసమర్థుఁ డగునిరంకుశప్రభువుయొక్కయనుగ్రహమును బడయుటకై యర్పింపఁబడునుపదానమును గాదు. భగవంతునకును, మనుష్యునకును గలసహజమైన సంబంధమును వెల్లడించుటయే యుపాసన. పుత్రుఁడు తండ్రిని "బాబూ" యంచు జేరఁ జనినయట్లు, శిశువు తల్లియొద్దకుఁ బోయి కౌఁగలించుకొనునట్లు, మనుజునకు నీశ్వరు నుపాసించుటయు స్వాభావికము. భగభగ మండెడునగ్నియొక్కజ్వాలలు పైకెగసిన

చందమున మానవునియొక్క యాశలును, నభిలాషలును, విలాసములును దీనాలాపములును సర్వేశ్వరునివైపునకు నిరంతరము మఱలుచుండును.

సహజముగా మనహృదయాంతరాళమునందు జనించెడునీయుపాసనాభిరతినిఁ దీర్చుట మనవిధాయకకృత్యములలో నగ్రగణ్యమైనది. జ్ఞానసంపాదనకుఁ గావలసిన బుద్ధ్యాదిశక్తులను, సుఖజీవనమున కావశ్యకము లగుసమస్తపదార్థములను దయచేసినసృష్టికర్తకు మనకృతజ్ఞతను దెలుపక మన మెట్లుండఁ గలము? భగవంతుఁడు మనస్తోత్రవందనముల కెదురుచూచుచుండుట లేదనియు, మనవిధులను జక్కగా నెఱవేర్చినఁ జాలుననియు నుడివెడువారలవాద మింతయు విశ్వాసార్హ మైనది గాదు. పైకార్యములను బట్టియే మన మొకమనుష్యునిసుగుణసంపత్తిని నిర్ణయింపఁ జాలము. అతనిచిత్తవృత్తులను గూడ మనము స్పష్టముగఁ దెలిసికొనవలసియుండును. ఒకయుదాహరణమును జూడుఁడు. ఒకతల్లికి నిద్దఱుకుమారు లుండిరి. వీరిలో నొకఁడు గొప్పజీతమును గడించెడువాఁడు; ధనాఢ్యుఁడు. రెండవవాఁడు స్వల్ప మైనవేతనమునే సంపాదించెడివాఁడు; పేదవాఁడు. పసలు తనను నిందింతు రనుభయముచే మొదటివాఁడు తనజననికి నెలకు ముప్పదిరూప్యములఁ బంపుచుండెను; రెండవవాఁడు లోకభీతిచేఁ గాక వాస్తవ మైనమాతృభక్తితోఁ దనమాతకు మాసమునకు మూఁడురూపాయలనే యంపఁ గలుగుచుండెను. ఈసోదరులలో నెవ్వని మనము గుణవంతుఁ డని సన్నుతింపవచ్చును? ఎక్కువసొమ్మును బంపినవాఁడు మొదటివాఁడే యైనను, యథార్థ మైనమాతృప్రేమ గలవాఁడు రెండవవాఁ డగుటచే నితనినే మన ముత్తముఁ డని యుగ్గడింపవలసియుండును గదా! అందుచే విధాయకకృత్యములను జేయుటయే మనము ప్రధానముగా నెంచక యీనెఱవేర్చుటలో నెట్టియుద్దేశ ముండునో మనము గ్రహింపవలయును. అందువలనఁ బ్రతిమానవుఁడును దన విధులను గ్రమముగా నిర్వహించుటయే గాక, యీశ్వరప్రీతికరముగాఁ గూడ వాని నెల్ల నిర్వహింపవలయును.

భయకంపిత మైనపక్షిశాబకము తల్లిరెక్కలక్రింద డాగి నిర్భయము నొందినట్లు, రోదనము చేసెడుబిడ్డడు జననియక్కును జేరి యేడ్పుడిగినట్లు లోకమునందు నానావిధబాధలకు లోనయ్యెడుసకలజనులును సర్వేశ్వరుని శరణమును బొంది హృదయశాంతినిఁ బొందుచున్నారు. ఈశ్వరోపాసనమహిమచే క్రోధోద్దీపితులు శాంతాత్ము లగుచున్నారు; దుఃఖబాధితులు దుఃఖోపశమనమును బొందుచున్నారు; నిరుత్సాహు లుత్సాహపూరితు

లగుచున్నారు. జీవితమునందలి మోదఖేదములచేఁ జలింపక ప్రశాంతముగా నుండఁ గల యొక యుత్తమస్థితి బ్రహ్మోపాసనమూలకమున నెల్లజనులకు లభించుచున్నది. మహోత్తమము లైనయిట్టిలాభము లీశ్వరోపాసనవలనఁ గలుగఁగల వనుటకు నానాదేశములందలి భక్తులును, యోగులును, మహాత్ములును సాక్ష్య మిచ్చుచున్నారు. గీతోపనిషత్తు లవి యథార్థము లని యుద్ఘోషించుచున్నవి. యూదులలోనిపరిశుద్ధులును క్రైస్తవభక్తశిఖామణులును నిందుకుఁ దార్కాణులుగా నున్నారు. ఇవన్నియు నున్మత్తప్రలాపము లని నిరాకరించుటకు వలనుపడదు గదా!

సద్యఃకాలమున హృదయమునకుఁ గలిగెడుశాంతిసౌఖ్యములే గాక యుపాసనాప్రభావమువలన మానవుఁడు సంపూర్ణపూతచేతస్కుఁ డగుచున్నాఁడు. భగవంతునితోడి దినదినసహవాసభాగ్యవశమునఁ బ్రతిమనుష్యుఁడును సకలసద్గుణములను బడయఁగలుగును. చిత్తమును వికసింపఁజేసెడుతలంపులును, హృదయము నాహ్లాదపఱచెడుభావములును, ఇచ్ఛాశక్తికిఁ బ్రోత్సాహ మిచ్చెడునుత్కృష్టసంకల్పములును నుపాసనయందు నుద్భవించి పెంపొందుచున్నవి. తాఁ జేయవలసినవిధాయకకృత్యములయందుఁ బ్రతిమానవుఁడును గౌరవబుద్ధినిఁ బొందుచున్నాఁడు. ఈశ్వరునిఁగూర్చి యించుకేనియుఁ జింతింపక యొకఁడు తనవిధులను లోపరహితముగాఁ జేసినను బిడ్డయొక్క సంరక్షణమునిమిత్తమై యెంతటిశ్రద్ధను గైకొనినను మాతృప్రేమకు సరి రాఁ జాలనిదానియొక్క ప్రేమము వలె నవి యెల్ల సహజానురాగశూన్యము లగుచున్నవి. ఈశ్వరోపాసనమువలన స్వార్థపరత్వము సన్నగిల్లి పరార్థపరాయణత్వము పట్టువడును. వేయేల? మనుష్యుఁ డీయోగసాధనవలన నూతనజీవమును గ్రహించి నవీనోత్సాహముతోడను, నవీనాభిలాషల తోడను దనజీవయాత్రను గడపఁ గలిగియుండును.

గణనాతీతము లైనయిట్టిప్రయోజనముల నెవరో కొందఱు మాత్రమే యనుభవింపవలె నని దేవుఁ డుద్దేశించియుండఁ జాలఁడు. ధనికులును, దరిద్రులును, పండితులును, పామరులును, పురుషులును, నారీమణులును, మానవజన్మ మెత్తినయెల్లవారును భగవంతుని నుపాసించుటకు సదుపాయ ముండవలయును. ఈశ్వరుని సేవించుటకై స్థలనియమము గాని, కాలనియమము గాని యుండవలసినపని లేదు. ఈయాలయమునందే భగవంతు నుపాసింపవలె నని కాని యీవేళయే యీశ్వరోపాసనకుఁ దగిన సమయ మని కాని నిష్కర్ష లేదు. ఎచ్చట భక్తిపూర్వకముగా భగవంతు నారాధిం

తుమో యదియే తగినప్రదేశము. ఎప్పుడు దేవుఁడు మనమనోవీధిని దోఁచునో యదియే యతనియారాధనమునకుఁ దగినయదను. సమస్తవస్తువులను మనకుఁ బ్రసాదించిన యామహామహునకు మనము సమర్పింపఁ గలపూజాద్రవ్యము లెవ్వియు లేవు. నిష్కపటమై, నిశ్చలం బైనహృదయమే యుపాసనయందు ముఖ్యావశ్యకము. పశ్చాత్తాపతప్తమైనమానస మీశ్వరదర్శనమునకై యెదురుచూచునపు డెద్దియు నడుమ నిలచి యాటంకము పెట్టఁ జాలదు.

మానవునియొక్క ప్రార్థనములను దేవునకు నందఁ జేసెడి యేమధ్యవర్తులయందును నేపురోహితబృందమునందును బ్రాహ్మసమాజమునకు నమ్మకము లేదు. ఈశ్వరుఁడు మనకుఁ జనకుఁడు. మన మందఱ మాతనిసంతానము. అతనివలె మనల నింకెవ్వఁడును ప్రేమింపఁ జాలఁడు. పాపాత్ముల మగుమనపక్షమున నతనితో వాదించుటకుఁ గాని మనకును నతనికిని సమాధానము సమకూర్చుటకుఁ గాని యెవ్వరేని యొకమహానుభావుఁ డుండవలె నని నుడువుటకంటె యుక్తిబాహ్యమైనవాద మింకొకటి లేదు. నిర్హేతుకమైనయాతనిప్రేమకంటె మన కాతఁడు మోక్షము ప్రసాదించు నని తలంచుటకు నింకేమినిదర్శనములు గావలెను? మనుష్యులకును, నీశ్వరునకును నడుమఁ గల్పింపఁబడిన యెల్లయడ్డంకులను బ్రాహ్మమతము తొలగించినది. విశ్వ మంతయు బ్రహ్మమందిరముగను, బ్రహ్మజ్ఞానార్థి యగుప్రతిమనుష్యునిఁ దనకుఁ దా నాచార్యునిగను, బ్రాహ్మసమాజము భావించుచున్నది. జ్ఞానవిషయములలోఁ బ్రతివిద్యార్థియు దనకుఁ దానే గురు వై యనేకము లైనసంగతుల నేర్చికొనఁ గలిగినట్లు, అధ్యాత్మికవిషయములందును శ్రద్ధావంతుఁ డగుమానవుఁ డెన్నియో మతరహస్యములఁ దెలిసికొనఁ గలిగి యుండును. ఉపదేశకుల కెల్ల నుపదేశకుం డగుపరమేశ్వరుఁడే యుత్తమాచార్యుఁడు. ఏకాశియందో, యేజెరుసలేమునందో, యేప్రవక్తద్వారమునో, యేయాచార్యుని మూలముననో మన మీశ్వరుని దర్శింపవలెఁ గాని యన్యథా యది సాధ్యము గా దని యెంచుట యసత్య మనియు, మధ్యవర్తు లెవ్వరు లే రని యాగి యుండక భగవంతుఁడు తనభక్తుఁ డెం దున్నను బ్రసన్నుఁ డగు ననియు, బ్రాహ్మసమాజముయొక్క నూతనసందేశ మై యున్నది.

అధ్యాత్మిక మైనయీశ్వరోపాసనము బాహ్యకర్మము గాదు. ఉపాసకుఁడు వాగ్రూపము లైనస్తోత్రవందనములనే యర్పింపవలసినపని లేదు. పరబ్రహ్మమునందు

గాఢ మైనయనురాగముఁ గలిగియుండుటయు, నాత్మసమర్పణము చేసికొనుటయు నుపాసనయొక్క పరమార్థము. దేవునిఁ బ్రేమించుటయు, నతనికిఁ బ్రీతికరము లైన కార్యములను జేయుటయు, బ్రహ్మోపాసన యని బ్రాహ్మమతోపదేశకులు నిర్వచించియున్నారు.

"తస్మిన్ప్రీతి స్తస్యప్రియకార్యసాధనఞ్చ తదుపాసనమేవ" ప్రీతియు ప్రియ కార్యసాధనమును బ్రహ్మోపాసనమునందలిముఖ్యభాగములు. ప్రేమపూర్వకము గాఁ జేయఁబడినప్రతిసత్కార్యమును నుపాసనయే. అన్నాతురులకు నన్న మిడుటయు, గుడ్డ లేనివారికి గుడ్డ లొసంగుటయు, నిండ్లు లేనివారికి నిం డ్లిచ్చుటయు, బలహీనులకు సాయము చేయుటయు, అగతికులకు గతిఁ గల్పించుటయు చెడినవారిని బాగుపఱచుటయు కూ్రరుల నడంచుటయు నీశ్వరసేవయే. అయినను ప్రేమపూర్వకముగాఁ జేయని యేకార్యమును భగవత్సేవ యనిపించుకొనదు. వాస్తవ మైనప్రీతి లేక యొకఁడు తన సమస్తమును బీదలయన్నదానమునకై యొసంగినను, తనదేహము నగ్నికి నర్పించినను, నిసుమంతయు నాతని నున్నతచిత్తునిఁ జేయఁ జాలవు. ఈశ్వరప్రీతికొఱకును ఈశ్వర మహిమకొఱకును జేసినప్రతికార్యమును నాత్మాభివృద్ధికిఁ దోడ్పడును. అట్టియుద్దేశ ముతోఁ జేయనిపరోపకార మంతయు స్వార్థపరత్వమును డాంబికత్వమును మనలో నంకురింపఁ జేయును. హృదయములో నణగియుండక మాటలతోఁ బూర్తి గాక కార్యరూపముగాఁ బరిణమించెడు ప్రేమయు, స్వార్థబుద్ధితోఁ గాక నిర్మల మైన పరోపకారచింతతోఁ జేయఁబడుమానవసేవయు నుపాసనయొక్క సారాంశము. స్వల్ప మయ్యు నత్యంతసంతుష్టికర మైనయీభావమునే బ్రాహ్మసమాజము ప్రకటించుచున్నది.

ఉపాసనయు సేవయు ని ట్లన్యోన్యసంబంధమును గలిగి యొకటి మఱియొకదానికి దోడ్పడుచున్నను రెండును సమానములు గావు. అందుచే భక్తిభావమును బెంపొందించు నీయుపాసన నలుపుటకై కొన్నిసమయము లుండవలెను. అనుదినమును మన మనేక విధుల నెఱవేర్పవలసినవార మగుటచే నీశ్వరునిగూర్చి చింతించుటకు మనకు సమయము దొరకుటయే దుర్లభముగా నుండును. కావున కాలనియామ ముంచుకొని దైవభక్తి నలవఱచుకొనుచు హృదయమును భగవంతునిప్రేమరసముచేఁ బోషించుచు మనయిచ్ఛల నీశ్వరేచ్ఛతో నైక్యము సేయఁ బ్రయత్నింపవలెను. నూతనదినారంభ మగునుదయ కాలమును, దినాంత మగుసాయంకాలమును నట్టిబ్రహ్మోపాసనకుఁ దగినసమయము

లనుటకు సందేహము లేదు. సకలమతస్థులును నీకాలములను భగవంతునిగుఱించి గానము చేయుటకై వినియోగించుచున్నారు. ఈయుపాసనాసమయములందు నారాధనమూలమునను, ధ్యానప్రార్థనలమూలమునను మనసకలమానసికశక్తులును పరమేశ్వరునియందు లగ్నమై యానందించునట్లు చేయవలయును. రాత్రులయందు శయనమును జేరుటకుఁ బూర్వమును ప్రాతఃకాలమున నిదురనుండి మేల్కాంచినపుడును భోజనకాలములందును బరమేశ్వరుని స్మరించుకొనుట యావశ్యకము. శుభాశుభకార్యముల నీశ్వరోపాసనతో నారంభించుటయు మనలో దైవభక్తిని వృద్ధిపఱచుటకుఁ దోడ్పడును. ఈయభ్యాసములు మనహృదయములయెదుటఁ దఱచుగా బరమేశ్వరునికళ్యాణగుణములఁ బ్రదర్శించుచు, నున్నతాభిలాషలను గలిగించుచు నీతిని వృద్ధిఁ జెందించుచు, మనకును నతనికిని గలసంబంధము నంతకంతకు దృఢపఱచుచుండును. అత్యంతానందజనక మైన యీబ్రహ్మోపాసనను బ్రతిమానవునియొక్క జీవనమునందే గాక కుటుంబజీవనమునందును సాంఘికజీవనమునందును, స్థాపింపఁ జేయుటయే బ్రాహ్మసమాజముయొక్క ముఖ్యోద్దేశము.

ఈయుద్దేశానుగుణముగా బ్రాహ్మసమాజమునందలియుపాసన ద్వివిధ మైనది. బ్రాహ్మమతము నవలంబించినప్రతిపురుషుఁడును బ్రతివనితయు తనతనయనుకూల్యము ననుసరించియు, తనచిత్తౌన్నత్యమును బట్టియు యథోచితముగాఁ బరమేశ్వరు నుపాసించుటయే గాక యెల్లవారును నొకచోఁ జేరి యేకముగా నుపాసన జరపుటయు నావశ్యక మైనది. ప్రతికార్యమునందును సామాన్యముగా సభ్యతకొఱకయి యెదురు చూచుచుండెడు మానవునియొక్క యభీష్టమును జెల్లించుటయే గాక యీసామాజికోపాసన సంఘమునం దన్యోన్యానురాగమును బలపఱచి యందఱొక్క యీశ్వర కుటుంబమునకుఁ జెందినవా రనుసద్భావమును గలిగించుచున్నది. మఱియు బ్రాహ్మ సమాజికునియభిప్రాయప్రకార ముపాసనతో నారంభ మై యుపాసనయందే పరిపక్వ మగుచున్నది.

---

# అయిదవ ప్రకరణము

## పాపము—మోక్షము.

---

పాప మనఁగా నేమియో, పాపవిషయమున మన కెట్టిభావ ముండవలెనో, యీప్రకరణమునందుఁ దెలిసికొందము. మతమునకును తత్త్వశాస్త్రమునకును గలముఖ్యభేదములలో నిది యొకటి. మానవుఁడు పాపమునందుఁ బుట్టు నని గాని, ఆదిజననీజనకులు చేసినప్రథమదోషకారణముచే సకలజనులును జన్మముతోడనే పాపస్వభావు లగుచున్నా రని గాని, యీజన్మమునందలిపాపములకుఁ బూర్వజన్మమే కారణ మని గాని, బ్రాహ్మమత మామోదింపకపోయినను మనుష్యులకు మిక్కిలి వేదనాకర మైనపాప మను నది ప్రపంచములో నున్నవిషయమును మాత్రము విస్మరించుట లేదు. అంతియె గాక మానవులకు నిత్యానుభవ మై యధికబాధకరమగు నొకప్రబలవిషయముగాఁ బాపమును బ్రాహ్మసమాజము భావించుచున్నది. ఈశ్వరునిశాసనమును బుద్ధిపూర్వకముగా నుల్లంఘించుటయే పాపము. అత్యంతకరుణాసమేతుఁ డగుభగవంతుఁడు మనుష్యులను సద్వర్తనాపరులను గాఁ జేయుతలంపుతో స్వేచ్ఛను బ్రసాదించెను. దేవుఁ డిచ్చిన యమూల్య మైనయీవరమె పాపమునకుఁ గారణభూత మైనది. మానవులు గుణవంతులగుటకును, నీస్వేచ్ఛను సన్మార్గమున నుపయోగించుకొనుట తప్ప మార్గాంతరము లేదు. పరమేశ్వరుఁ డిట్టిస్వాతంత్ర్యము నే యొసంగక మనమందఱ మెల్లప్పుడును సాధుశీలుర మై యుండునట్లు చేసియుంచినచో, మనస్థితికినిఁ బశువులస్థితికిని తారతమ్యమే యుండి యుండదు. మృగములస్థితినిఁ గోరెడుమనుష్యు లెవ్వరు నుండరు గదా!

ఎఱ్ఱనివస్తువునుండి తెల్లనివస్తువును, సుందర మైనపదార్థమునుండి సుందరము గాని పదార్థమును వేఱు సేయుటకు మనకు శక్తి యిచ్చినట్లె, తప్పునుండి యొప్పును విడదీయు గలయొకయమోఘసాధనమును గూడ సర్వేశ్వరుఁడు మన కనుగ్రహించినాఁడు. ఒకటి నీచమును, మఱియొకటి యుత్తమము నగుమార్గములు రెం డున్నప్పుడు నీచపథమును విడిచి యుత్తమపథమును బట్టి వర్తించుటకు మానవుల మగుమనకు మాత్రమే స్వాతంత్ర్యము గలదు. తనశరీరమునకుఁ గలుగఁ బోయెడుబాధలను పాటింపక నీచమార్గమును

బరిత్యజించి, యుత్తమమార్గమును స్వీకరించునాతఁడు సన్మార్గుఁడై యీశ్వరశాసనాను కారియై, పరమేశ్వరునియనుగ్రహమునకుఁ బాత్రుఁడగుచున్నాఁడు. అటు గాక స్వలాభాపేక్షచేఁ గాని, యింద్రియలోలత్వముచేఁ గాని సత్పథమును వదలి దుష్పథమునఁ జరుగునాతఁడు దుర్మార్గుఁడై, యీశ్వరశాసనతిరస్కారియై యీశ్వరుని యనుగ్రహమునకు దూర మగుచున్నాఁడు. ఆచరింపవలసినవి యాచరింపకయు, నాచరింపఁగూడనిది యాచరించియు నిట్లు దైవాజ్ఞ నుల్లంఘించుటయే పాపము.

ఈపాపపరిజ్ఞానము సకలజనులలో సామాన్యముగా నున్నది. తాఁ జేసినయకార్యములు తలంపునకు వచ్చినపుడు చింతింపనివాఁడు గాని, సిగ్గుజెందనివాఁడు గాని లోకములో నెవ్వఁడును లేఁడని చెప్పవచ్చును. తనయిష్టానుసారముగాఁ బ్రవర్తించుటకు మనుష్యునకు స్వాతంత్ర్యము గలదనుటకును, నధర్మముకంటె ధర్మమే శ్రేష్ఠమైనదని సాధించుటకును, నీయొక్కయంశమే ప్రబలసాక్ష్యముగా నున్నది. అంతియే గాక స్వేచ్ఛయొక్కసద్వినియోగమువలనఁ గాని, దుర్వినియోగమువలనఁ గాని సంభవించెడు లాభనష్టములకుఁ బ్రతిమానవుఁడును దనకుఁ దానే యుత్తరవాది యనియు నిందువలన మనకుఁ దెలియఁగలదు.

భగవంతుఁడు పాపాత్ములను శిక్షించు నని యెల్లజనులును నమ్ముచున్నారు. తన యాజ్ఞల నతిక్రమించినవారిమీఁద దేవునికిఁ గోపము వచ్చు ననియు, నట్టివారి నాతఁడు దండించు ననియు లోకులు తలంతురు. కాని యాశిక్ష యీలోకమునఁ దటస్థింప దనియు, ముం దెక్కడో జరుగు ననియు, నీనడుమ నేదియో యొకవిధమునఁ దమపాపములఁ బరిహారము గావించుకొనినయెడల నాదండనమును దప్పించుకొనవచ్చు ననియు, వా రభిప్రాయపడుచున్నారు. ఈసందర్భమున మనము గమనింపవలసినయొకయంశము గలదు. ప్రపంచములో నేకార్యమును క్రమవ్యతిరేకముగా జరుగదు. ఒక్కొక్క మనుష్యునియానుకూల్యమునిమిత్తమై తనపద్ధతుల మార్చుకొనుట భగవంతునిస్వభావము గాదు. విషమును దిగమ్రింగి "దేవుఁడా! నాప్రాణమును గాపాడుము" అని ప్రార్థించిన నెంత నిరర్థకమో, పాప మాచరించి క్షమియింపు మని వేఁడికొనినను నంతయే. సకలమానవజాతియొక్క ప్రయోజనార్థమై యోజించి యేర్పరచినవిధుల నాతఁ డెన్నటికిని మీఱఁ డని మనము తెలిసికొనవలెను. ప్రకృతిధర్మముల దాటినయెడల నేమి తటస్థించునో చెప్పఁగలిగినట్లే ధర్మమును మీఱి పాపము చేసిన నేమి సంభవించునో మనము నుడువవచ్చును.

ఏశక్తియైనను నిరుపయోగముగా నుంచినపుడు గాని అయుక్తముగా నుపయోగించినప్పుడు గాని బలమును గోల్పోవును. ఉపయోగింపనిశరీరకండరములు కరఁగి పోవుటయు, నుపయోగించినవి వృద్ధి యగుటయు మన మెఱుఁగుదుము. పరిశ్రమ చేయనిబుద్ధి మొద్దువాఱుటయు, పరిశ్రమ చేసినకొలఁది బుద్ధి వికసించుటయు మనము గాంచుచున్నాము. అట్లె జ్ఞాపకశక్తి గూడఁ దగినంతపని లేకపోయినచోఁ గాలక్రమమున దుర్బల మగును, వినియోగముచేఁ బ్రతిశక్తియు వృద్ధిఁబొందును. బోధించిన హితముల నొకప్పుడు పెడచెవినిఁ బెట్టియు, మఱియొకప్పుడు తృణీకరించియు, వేఱొకప్పుడు నిరాకరించియు, నిట్లెల్లప్పుడును మన్నింపమిచే నంతరాత్మ తనయుపదేశముల నంతకంతకు మెల్లమెల్లన బోధింపసాగి, తుదకుఁ గొండఱిలోఁ బూర్తిగా నూరకుండినను, నూరకుండవచ్చును. పాపచింత తప్ప నన్యచింత చింతింపలేక, పాపకార్యము తప్ప నన్యకార్యముఁ జేయలేక యనవరతము పాపసముద్రమునందు దోఁగాడెడునిర్భాగ్యు లిట్టివారే! అంతరాత్మ, యిచ్ఛ యనునవి మానవునియందు లేవని సాధించుటకుఁ గొంద ఱిట్టికలుషాత్ములను దార్కాణముగాఁ జెప్పుదురు. అట్లయినచో మందబుద్ధు లగువారినిఁ జేర్కొని మనము మనుష్యులకు జ్ఞానము గూడ లేదని వాదింపవచ్చును. ఆచారసిద్ధము లగుటచేఁ గడుంగడు హేయము లైనకార్యములను సయితము కొందఱు చేయుచుండుట మనము గాంచుట లేదా? నిర్లక్ష్యముచే నంతరాత్మ స్పష్టముగను, స్ఫుటముగను బల్కు మానియు, నిరుపయోగముచే నిచ్ఛాశక్తి పటుత్వమును గోల్పోయియు, నొకఁడు తనవిధాయకకృత్యముల నెఱవేర్పవలె నను బుద్ధిని గాని ధర్మ మాచరింపవలె నను నుద్దేశము గాని పోఁగొట్టుకొనవచ్చును. ఇట్లుభయశక్తులును నొకేకాలమందు నంతరించు నని మన మూహింపవలసినపని లేదు. అంతర్వాణియొక్క బోధనానుకూలముగాఁ గాకపోయినను, తద్వ్యతిరేకముగాఁ బ్రవర్తించుటలోఁ గొంద ఱెక్కువపట్టుదలను గలిగియుండవచ్చును. కొందఱికి నంతరాత్మయొక్క సదుపదేశానుసారముగా నడచుటకు మనోదార్ఢ్యత లేకపోవచ్చును. ఒకఁడు తనచిత్తముయొక్క స్థైర్యము నొకసారి చలింపఁజేసికొనెనేని, కాలము గడచినకొలఁది నది కొంచెముకొంచెముగా క్షీణింప, లజ్జాభయములను సయితము వదలుకొనునంతటిదుస్థితికిఁ గూడ దిగవచ్చును.

అంతరాత్మ యిట్లు నాశము జెందుటయే పాపమువలన మానవునకు సంభవించెడు ప్రథమదండనము. అంతరాత్మయొక్క క్షీణతతో మనుష్యునిసద్భావమును క్షీణించును.

సృష్టి కంతకు శిరోభూషణ మనెడునాతనియాధిక్యత యడుగంటును. ఆతని దేహము నందుఁ బ్రకాశించుచున్న సుజ్ఞానదీపము వెలవెలబారును. అయినను నీవిధమున నెల్లరుఁ దుఃఖించుట లే దనియు, దురితాత్ము లనేకులు హాయిగా సుఖము ననుభవించు చున్నా రనియు బుద్ధిమంతులు గొందఱు చెప్పవచ్చును. విషక్రిమిన్యాయమున ధర్మాధర్మవిభాగజ్ఞానము పోయినకిల్బిషాత్ములు తమదుర్గతిని గుర్తింపఁ జాలక, యదియె సుగతి యని భ్రమపడవచ్చును. అంతమాత్రమున మన మాతని కేమియు నష్టము సంభవింప లే దని యనవచ్చునా? పూర్వము బానిసవ్యాపారమును రూపుమాపుటకై మహానుభావులు గొందఱు ప్రయత్నము చేసినపుడు, తమకు స్వాతంత్ర్య మక్కఱ లే దనియు, దాస్యమే తమకుఁ గావలె ననియు మొఱ్ఱపెట్టుకొనినబానిస లనేకు లుండిరి. సర్వోత్కృష్ట మైనస్వాతంత్ర్యమును గోరక పరమనికృష్ట మైనసేవకావృత్తి వరించినయాబానిసలస్థితి యుత్తమస్థితియో, హీనస్థితియో చింతింపుఁడు. అదే తీరున పాపపంకమునందుఁ బడి కొట్టుకొనుచుఁ దమ స్థితియే శ్రేష్ఠ మైన దని తలంచుకొని మురియువారును నుండవచ్చును. అట్టివారినిఁ జూచి యెల్లవారును గనికరింపవలసియుండును. విద్యవలన లాభము లే దనియుఁ, దమకుఁ జదు వక్కఱ లే దనియు మూర్ఖు లెవ రైనఁ జెప్పినచో మొట్టమొదటినుండి వారిని విద్యాభ్యాసము చేయకపోవుట యెంతటియనర్థమునకుఁ గారణమయ్యెనో గదా యని విచారింపవలసినదే గాని విద్య నష్టకారి యని యెంచఁ దగునా? ధర్మమునందు గౌరవమును ధర్మాచరణమునందు నుత్సాహమును లేకపోవుటయు, వీనిని మించి ధర్మాధర్మవివేకమే చెడుటయు మానవునికి పాపమువలన వాటిల్లెడునష్టములలో నత్యంతఘోరము లయినవి. పుణ్యాపాపవివేచన మంతరించినచో మనుష్యుఁడు తనమానుషత్వమును గోల్పోవుటయే గాక, పశువులకంటెను హీనుఁ డగుచున్నాఁడు. సమస్త జంతువులలో మనుజులకు మాత్రమే యుత్తమానందమును బొందఁగలగొప్పయోగ్యత యున్నది. దీనిని దనయవజ్ఞతచేఁ బాపాత్ముఁడు పోఁగొట్టుకొనుచున్నాఁడు.

అంతరాత్మ పూర్తిగాఁ జెడినవారు లోకములో మిక్కిలి యరుదు. ఎంతటిదుష్టవర్తనాపరుఁ డైనను, మనస్సాక్షియొక్కపోటులను బొందుచు నిరుత్సాహముగాఁ గాలము గడపును. తాఁ జేసినదుష్కార్యములు బయలుపడకపోయినప్పటికిని, పైకి మాత్రము సంతోషముగా నున్నట్లు కాన్పించుచున్నప్పటికి, దోషకర్ముఁడు లోలోనఁ గ్రుంగి కృశించుచుండును. పరనిందకంటెను, రోగశిక్షారూపక మైనయితరైహికబాధలకంటెను, నీయాత్మనిందయే మిక్కిలి వేదనాకర మై పాపినిఁ బీడించును. బాధమాట

యెటు లున్నను, మనుజునకు నిర్మలానందదాయక మైనయంతరాత్మ మాత్రము బలహీన మగుట గాని, పూర్తిగా నణఁగిపోవుట గాని గొప్పప్రమాదముగాఁ దలఁపఁ దగియున్నది.

అంతరాత్మయొక్క శక్తి తగ్గినకొలఁదిని భగవంతునితోడిసంబంధము తొలఁగిపోవును. నీతియే భక్తియోగమునకు ముఖ్యావశ్యక మగుటచే నీతిశూన్యుఁ డైనమానవుఁడు పరమేశ్వరుని సమీపింపఁ జాలఁడు. చిత్రవస్తుసమన్విత మైనయీసృష్టికంటె సృష్టికర్త గలఁ డనుటకు నీతిరతిని మనుజునియందుఁ గలిగించెడునద్భుతశక్తులె గొప్పనిదర్శనములు. ధర్మాధర్మవిభాగజ్ఞానరహితుఁ డగువానికి నీశ్వరునియునికియందు విశ్వాసము చేయుట యొకయాశ్చర్యము గాదు. సరిగా యోజించుసామర్థ్యము లేక యొకఁడు భగవంతునియందు విశ్వాస ముంచఁడేని నట్టివానిని బాగుచేయవచ్చును. నూతనప్రకృతిశాస్త్రశోధనలచే నొకనికి దేవుఁ డున్నాఁడో లేఁడో యని సందేహము తోఁచెనేని వానియనుమానములు తీర్చి మరలింపవచ్చును. ఈశ్వరునియందు గాఢవిశ్వాసము లేనివానికి దృఢ మైనదైవభక్తి కుదురునట్లు చేయవచ్చును. కాని తనలోనియీశ్వరాంశను బాపకార్యాచరణముచే బొత్తిగా వినాశము నొందించుకొని దేవునిదివ్యముఖసందర్శనము సేయఁ జాలనివాని నెన్నిహేతువులు చెప్పి యైనను ద్రిప్పుట కష్టసాధ్యము.

అశుభములవలని యీనష్టములు ముం దెన్నఁడో ఘటిల్లునవి గాక వెంటనే తటస్థించునవి యై యున్నవి. అల్పపాప మైనను, అధికపాప మైనను, నంతర్వాణియొక్క వాక్కులను ధిక్కరించువారందఱీబాధల ననుభవింపవలసినదే! భావికాలమునం దెక్కడో పాపములకు దండన విధింపఁబడు నని యెంచినచో మనుజుల కట్టిశిక్షయందు నిర్లక్ష్యభావ ముండుటయే గాక, దాని నేదోయొకచందమునఁ దప్పించుకొనవచ్చు నని యాశను గూడ బురికొల్పును. ఈయభిప్రాయము మానవాభివృద్ధికి భంగకర మని వేఱుగాఁ జెప్పవలసినపని లేదు.

అపరిమితజ్ఞానసంపన్నుఁ డగుసర్వేశ్వరునిచే నిర్మింపఁబడిన పాపశిక్షయొక్క పరమార్థమును బ్రాహ్మసమాజము గ్రహించి గౌరవించుచున్నది. బ్రాహ్మమతాభిప్రాయములు వ్యాపించినప్రదేశములలో జనులను బాపమృగములబారినుండి తప్పించుటకుఁ జేయఁబడుప్రయత్నములే యిందుకు సాక్ష్యములు. అయినను పాపాత్ములు శాశ్వతనరకము ననుభవింతు రని బోధించెడుక్రైస్తవసిద్ధాంతమును బ్రాహ్మమత మణుమాత్రమును నంగీకరింపఁ జాలదు. పాపకార్యములస్వభావమును తత్ఫలితములును

నతిభయోత్పాదకములును గఠినశిక్షాపాత్రము లైనను, మానవుఁడు గావించెడుదుష్కృ ములవలనఁ గలిగెడునష్టమునకంటె భగవంతుని ప్రేమాతిశయముచే నతనికిఁ జేకూరఁగల లాభ మధిక మైన దని బ్రాహ్మసమాజికుఁడు నమ్ముచున్నాఁడు. అనంతప్రేమామయుఁ డగునీశ్వరుఁడు పాపినిఁ ద్యజింపఁడు. దినదినమును దోషముల నాచరించెడువాని నైనను దనను నెదిరించెడువాని నైనను దేవుఁడు క్రోధైకపరిణామః డై నిరంతరనరకాగ్నియందు దహింపఁ జేయు నని యెంచుట ఘోరాపచారము. మనుష్యులలో నొక్కనినిఁ గూడ నాతఁడు నాశము గానియ్యఁడు. ఇది యాతనియఖండ మైనశక్తికిని జ్ఞానమునకును న్యూనత యని చెప్పక తప్పదు. పాపము యథార్థ మైనచో నీశ్వరప్రేమయు నంత కంటె యథార్థ మైనది. తననైపునకు మఱలక త్రోవ తప్పి వర్తించెడువారల నందఱను సర్వేశ్వరుఁడు విసువుఁ జెందక నెపకి సన్మార్గమునఁ బెట్టుట కెల్లప్పుడు ప్రయత్నించు చుండును. పాపాత్ముని బాగుచేయుటకు భగవంతుఁడు సదా సిద్ధ మై యుండును స్వపుత్రుల సంరక్షించును గాని యాలోకమాత సమయించునా?

సర్వేశ్వరునియాగ్రహమును శాంతింపఁ జేయుటకై యేబలులను మన మర్పింప వలసినపని లేదు. మనదేవుఁడు శాంతాత్ముఁడు గాని కోపస్వభావుఁడు గాడు. పాపాత్మునిఁ జూచి యాతఁడు గనికరించును గాని కనలి తఱిమివేయఁడు. పాపబాధలను బరమేశ్వరుఁడు గూడఁ దొలగింపఁ జాలఁడు. క్రోధావేశపరవశుఁ డై యొకఁడు మఱియొకనిని సంహరించె నేని చంపినవానిమీఁది ప్రేమచే భగవంతుఁడు మృతిజెందిన వానికిఁ బ్రాణము పోయఁడు. ఒకపురుషుఁడు కామోద్రేకముచే నేవనిత కయిన మానభంగము గావించె నేని యేరక్షకునిద్వారమున నాతఁడు తనను బ్రార్థించినను భగవంతుఁడు క్షమింపఁడు. అట్టిదుర్నీతిపరుఁడు తాఁ జేసినఘోరనేరముయొక్క శిక్ష ననుభవించి తీరవలెను. కావించినదోషముయొక్క దుష్క్రియాశక్తినుండి యెవ్వనికిని క్షమార్పణమును లేదు. ఆశిక్షను దప్పించుకొనుటకును వీలు లేదు. ఇదె యటుండ, నేపాటిమానుషము గలవాఁడు గాని నిజమైనపశ్చాత్తాపము గలవాఁడు గాని తనయపరా ధమునకుఁ దగినదండనమును దప్పించుకొన నిచ్చగింపఁడు. ప్రకృతిధర్మముల మీఱుటచేఁ గలుగునష్టములను దొలగింపఁ గలక్షమార్పణ మేదియు లేదు. కాని పాపకార్యాచరణ కారణమువలన భగవంతునికిని మానవునకును గలిగినయెడబాటును బోఁగొట్టుకొనవచ్చును. తాఁ బొందవలసినన్యాయమైనశిక్షనుండి పశ్చాత్తాపతప్తుఁ డైనదోషాత్ముఁ డెన్నటికిని దప్పించుకొనవలె నని కోరఁడు. మీఁదుమిక్కిలి తనపాపమునకు నుచితరీతిని శిక్ష

జరగవలె నని యే యభిలషించును. ఈశ్వరుని ముఖదర్శనమునుండి దూరము గాక యెప్పుడాతనిని దనహృదయమునందు వీక్షించుచుండవలె నని యతఁడు నిత్యము ప్రార్థించుచుండును. పరమేశ్వరునితో సమాధానము చేసికొన నెంచెడువాఁడు నిష్కపట మైన పరితాపమును బొందవలెను. తనదోషములకై మనసార పశ్చాత్తాపమునొందఁడేని, యాపాపాత్మునికొఱకై యెంతటిసాధుశీలుఁడు తనరక్తమును భగవంతుని కర్పించినను సార్థకము లేదు. అతనిచే నేముక్తిస్నానము చేయించినను లాభము లేదు; ఆతఁ డేపుణ్యక్షేత్రముల సందర్శించినను బ్రయోజనము లేదు. ఏబదిదానములు చేసినను నుపయోగము లేదు. అతఁ డేనదీస్నాన మాచరించినను ఫలితము లేదు. ఇవియెన్నటికిని నాదురితాత్మునిఁ బూతాత్మునిఁ జేయఁజాలవు. దేవుని కీబాహ్యకర్మములవలన ననుగ్రహము గలుగదు. యథార్థ మైనపరితాపము నొకఁడు పొందునేని భగవంతునిఁ జేరకుండ నాతని నేమియు నాటంక పెట్టఁ జాలదు. కరుణాంతరంగుఁడును, ప్రేమాసంపన్నుఁడు నగుపరమేశ్వరుఁడు పాపశీలుఁ డెప్పు డెప్పుడు పరితాపపడి తనకొఱకయి నిరీక్షించునా యని ప్రతీక్షించుచుండును. "నేను నాతండ్రియొద్దకుఁ బోవలె" నని యతఁ డేక్షణమున నెంచునో తత్క్షణముననే దేవుడు ప్రసన్నుఁడై కలుషాత్ముని సమీపించి కౌఁగిలించుకొనును. పశ్చాత్తాపాగ్నిచేఁ దప్తుఁడైనపాపకర్ము నిట్లు దయాపూర్వకముగాఁ జేరఁదీసి సాంగత్యసౌభాగ్యము ననుగ్రహించుటయే క్షమార్పణము.

ఇంతవఱకు పాప మనఁగా నేమియో, పాపక్షమార్పణ మన నేమియో, తెలిసికొనియున్నారము. ఇఁక బ్రాహ్మమతప్రకారము మోక్ష మన నెట్టిదో గ్రహించుటకు ప్రయత్నింతము. బ్రాహ్మసమాజ మీజీవితము నొకయనర్థముగా భావింపక వరదానముగా నెంచుచున్నది. అందుచే జన్మరాహిత్యము నే మోక్షముగాఁ దలంచెడుహిందువుల పురాతనాభిప్రాయముతో నేకీభవింపఁ జాలదు. మోక్ష మనునది ముం దెన్నడో స్వర్గలోకమునందు మన మనుభవింపఁ బోయెడు నొకవిధ మైన సంపూర్ణసుఖస్థితియును గాదు; క్రైస్తవులు తలంచునట్లు జన్మపాపమునుండి పూర్తిగా విముక్తిఁ జెందుటయుఁ గాదు. భగవంతునిచే నిషేధింపఁబడిన జ్ఞానవృక్షముయొక్క ఫలముల నాదిమజననీజనకులు భుజించి రనియు, నక్కారణముచే మానవకోటికిఁ బుట్టువుతోడనే పాప మంటుకొని యున్న దనియు బోధించెడుక్రైస్తవసిద్ధాంతమునందు బ్రాహ్మసమాజమునకు విశ్వాసము లేదు. అటులయిన మోక్షమునుగూర్చి బ్రాహ్మమతముయొక్క యభిప్రాయ మేమి?

జీవాత్మ స్వకీయేచ్ఛను నీశ్వరేచ్ఛతోఁ జిరకాలాభ్యాసమువలనఁ గ్రమక్రమముగాఁ జేర్చుచు భేదశూన్యమైనసంపూర్ణైక్యభావమును సాధించుటయే మోక్షము. ఇట్టిజీవేశ్వరులసామరస్యమే యధ్యాత్మికజీవనముయొక్క సారాంశము. మనయిచ్ఛలను భగవదిచ్ఛతో నొకప్పుడించుక యైనను ననుసంధింపలేకపోవుటయు, మఱియొకవేళ గొంతవఱకు మాత్రమే చేయఁగలుగుటయు, వేఱొకసమయమున సంపూర్ణముగా నైక్యము చేయఁగలుగుటయు నెల్లవారలకు ననుభవసిద్ధమై యున్నది. మనయాత్మప్రియత్వమును, మనయింద్రియలోలత్వమును, నక్రమములును, ననార్యము లగు ననేకకార్యములను జేయ మనల ననవరతము ప్రేరేపించుచుండును. ఆహేతువుచేతనే యాత్మాభివృద్ధికర మగు శ్రేయోమార్గ మొకటియు, ఆత్మహానికర మగుప్రియమార్గ మొకటియు నేర్పడినవి. మనయభీష్టములను, మనయోజనలను భగవంతునియిచ్ఛానుసారముగా నేర్పఱచుకొనుటయే యాత్మాభివృద్ధికి సాధనము. ఇదియే శ్రేయోమార్గము. మనయాత్మ లభివృద్ధిని గాంచినకొలఁది నీచము లైనయభిలాషలును, అయోగ్యము లైనయనురాగములును, అనర్థదాయకము లైనయాలోచనలును నడఁగిపోయి యుత్తమము లైనయభిలాషలును, యుక్తము లైనయనురాగములును సుఖప్రదము లైనయాలోచనలును నంకురించును. ఈవిధమున నానాఁటఁ బెంపొందు భగవంతునికి ననిష్టము లగుపనులను జేయు జీవాత్మకు నసమ్మతముగా నుండును. తుట్టతుదకు భగవత్ప్రీతికరముగాఁ దప్ప నన్యథా నొనరింపవలె నను తలంపు గూడ నంతరించును. అప్పుడు మనుష్యుఁడు చేయ నెంచునదియు దేవుని కిష్టమయినదియు నొక్కటే యగును. ప్రియశ్రేయోమార్గముల భేదము రూపుమాసి జీవాత్మకుఁ బ్రియ మైనదే శ్రేయోదాయకముగూడ నగును. జీవాత్మ యిట్లు పరమాత్మతో సామరస్యమును సాధించుటయే, సంపూర్ణముగా స్వార్పణము చేసికొనుటయే, స్వేచ్ఛ నీశ్వరేచ్ఛతోఁ జేర్చి యానందరసాబ్ధి నోలలాడుటయే మోక్షము. శాశ్వతబ్రహ్మానందానుభవరూప మైన యీమోక్షముయొక్క భావము నెఱింగినవారు "నేనును నాతండ్రియు నొక్కటే" యని భక్తాగ్రేసరుఁ డగు జీసను చెప్పినవాక్యముయొక్క యంతరార్థమును, తత్త్వమసి యనెడునుత్కృష్టవేదాంతోక్తియొక్క రహస్యమును గ్రహింపఁ గలరు.

---

## ఆఱవప్రకరణము

### అవతారమూర్తులు — మధ్యవర్తులు

దేవునిఁగూర్చియు, నుపాసననుగుఱించియు బ్రాహ్మసమాజమునకుఁ గల యభిప్రాయములు లోకములో వ్యాపించియున్న రెండుముఖ్యమతసిద్ధాంతములకు విరుద్ధములుగా నున్నవి. అం దొకటి యవతారములనుగూర్చినసిద్ధాంతము. మఱియొకటి మధ్యవర్తులనుగుఱించినసిద్ధాంతము. జనబాహుళ్యముచే నవలంబింపఁబడుచున్న యనేకమతములు దేవుఁ డొక్కఁడే యని నుడువుచున్నను, భగవదంశసంభూతులై ప్రజలయొక్క యుపయోగార్థము మహాత్ములు గొంద ఱప్పుడప్పుడు భూలోకములో నవతరించుచుందు రని గూడఁ బ్రకటించుచున్నవి. ఇందునకు పౌరాణికహిందూమతమును క్రైస్తవమతమును దార్కాణములు. ఈశ్వరుఁ డద్వితీయుఁడే యని యంగీకరించుచున్నను మానవులప్రయోజనమునిమిత్త మతఁడు పలుమా ఱీప్రపంచమున ననేకరూపములతో నవతరించు నని హిందూమతస్థులయభిప్రాయము. క్రైస్తవులు నిట్లే భగవంతుఁడు మనుష్యులను పాపవిముక్తులఁ జేయుటకై జీసనురూపమున భూతలమునం దుద్భవించె నని నుడువుదురు. ఇట్లుభయమతములకును సామాన్యముగా నున్నయీసిద్ధాంతమునకుఁ గారణ మేమి? దేవుఁడు సద్గుణోపేతుఁడును, సర్వశక్తిసంపన్నుఁడు నగుటచేఁ బాపాత్ములును, స్వల్పప్రజ్ఞావంతులు నయినమనుష్యులు తమ కాతఁడు సులభుఁడు గాఁ డని సంశయించుట సహజమే కదా! ఈసందేహకారణముచేతనే తమ్ము సర్వేశ్వరునితో సమాధానపఱుచుట కొక్క రేని యొకమహానుభావుఁ డుదయించు నని జనులు సామాన్యముగా నిరీక్షింపసాగిరి. దుష్టపరిపాలనమువలనఁ గాని యధర్మవ్యాపనమువలనఁ గాని ప్రజలు మిక్కిలి బాధపడుసమయములం దిట్టినిరీక్షణ యధికముగా నుండినట్లు చరిత్రలవలనఁ దెలియవచ్చుచున్నది. హిందూక్రైస్తవమతములు మానవునకును భగవంతునకును సఖ్యత గలిగించుటకయి యీయవతారసిద్ధాంతమును స్థాపించియుండ మహమ్మదీయమత మాదిగాఁ

గలయితరమతములు మఱియొకమార్గము నవలంబించినవి. ఈశ్వరుఁడే మానవాకారమును దాల్చె నని యీమతస్థులు బోధింపకపోయినను నీశ్వరాంశను విశేషముగాఁ గలిగి మనుజులకును దేవునికిని సమాధానము నొడఁగూర్చుసామర్థ్యము గలమధ్యవర్తులు గొందఱు ప్రపంచములోఁ బుట్టుదురు నని విశ్వసించి యట్టిమహనీయులయెడల భగవంతునియందువలెనే భక్తిగౌరవములఁ గనఁబఱచుచున్నారు.

అసమానశక్తియుతుండును, నపారకరుణాసమేతుండును నగుభగవంతునియందు విశ్వాస ముంచెడుబ్రాహ్మసమాజ మిట్టియేవిపరీతసిద్ధాంతమును నావశ్యకముగా నెంచఁజాలదు. అతఁడు మనయాత్మలకు నాత్మయై పరమాత్మ యను పేరఁ బరగుచున్నాఁడు. అతిసమీపవస్తువులకంటె మన కాతఁడు సమీపస్థుఁడు. ఆతనినుండియే మనము పుట్టినారము. ఆతనియందే చలించుచున్నారము. ఆతనియందే జీవించుచున్నారము. జలధిలో వసించెడుజలచరములవలె మనము విశ్వాత్మకుఁ డగుభగవంతునియందు నివసించుచున్నారము. ఇఁక మనకును నతనికిని సమాధానముఁ గూర్చుటకు మధ్యవర్తి యేందుకు? అవతారమూర్తియొక్క యావశ్యక మేమి? ప్రపంచము నొకమహాయంత్రముగను పరమేశ్వరు నొకయంత్రకారునిఁగను భావించినపురాతనకాలమం దీమతాభిప్రాయము బయలుదేరియుండవచ్చును. ప్రత్యణువునందును, ప్రతిజీవాత్మయందును బరమాత్మను దర్శించెడునిక్కాలమునం దట్టిమధ్యవర్తులయందును ప్రవక్తలయందును మనము విశ్వాస ముంచవలసినపని లేదు. పూర్వపుమతము లన్నియు భగవంతునకును మనుష్యునకును మొదల నెడముఁ గలిగించి తరువాత దానినిఁ దొలగించుటకుఁ బ్రయత్నించినవి.

నిత్యుఁడై నిరాకారుఁడై యనంతుఁడైన సర్వేశ్వరుఁ డనిత్యమై సాకారమై రక్తమాంసవిశిష్టమైనశరీరధారణము చేసె ననియు నానావిధబాధల ననుభవించె ననియు నూహించుట యసాధ్యము గాకపోయినను, విశ్వసించుట కనర్హముగను నసందర్భముగను విపరీతముగను దోఁపకమానదు. ఈసిద్ధాంతము తత్త్వాన్వేషకులకే హాస్యాస్పదముగాఁ గానుపించెను. అందుచేఁ దొల్లింటికిరస్తుచరిత్రకారు లతఁడు సకలేతరమానవులవలెనే పుట్టె నని యొప్పుకొనక పరిశుద్ధాత్మమూలకముగా నుద్భవించినట్లుగా మఱియొకనూతన

సిద్ధాంతమును బ్రతిపాదించిరి. హిందూతత్వజ్ఞులును సగుణబ్రహ్మ మనియు నిర్గుణబ్రహ్మ మనియు భేదమును గల్పించి సగుణబ్రహ్మమే యవతారముల నెత్తుచుండు నని నుడివియుండిరి. ఈసమాధానములు బుద్ధికి సంతుష్టినిఁ గాని హృదయమునకు [illegible]మును గాని కలిగింపఁ జాలవు.

సహజముగాఁ బ్రతిమానవునకును భగవంతునియందుఁ గలయాకాంక్షను నీయవతారసిద్ధాంత మెంతమాత్రమును దీర్పఁజాలదు. దుఃఖబాధితము లగుమనహృదయములకు శాంతియు, ప్రలోభనములబారినుండి తప్పించుకొనుటకు బలమును, మున్నెప్పుడో భూతలమునఁ బుట్టి 'పరమోపకారమును జేసినభగవంతునిఁ దలఁచుకొనుటవలన రాఁజాలదు. సర్వాత్మకుఁడై శాశ్వతుఁడైనపరబ్రహ్మమును భక్తియోగముచే సాధించుటచేతనే యట్టిశాంతియు బలమును సమకూరనలయును. అంతియే గాక యీసిద్ధాంతము దేశకాలబద్ధుఁడై యుండక యెల్లెడల నిండియున్నపరమేశ్వరునియందు నిలుపవలసిన బుద్ధిని మరలించి యేకల్పితపురుషునియందునో, యేప్రసిద్ధుఁ డగుయదార్థపురుషునియందునో లగ్నము చేయుచున్నది. అధ్యాత్మికాభివృద్ధికి నిది యొకయనర్థ మని చెప్పక తప్పదు.

మనుష్యకోటియొక్క మోక్షప్రాప్తికి నిట్టియవతారములే యావశ్యకమైనచో నేకృష్ణుఁడు గాని క్రీస్తు గాని జన్మింపకపూర్వ మీభూమండలముమీఁద వసించియుండిన లక్షోపలక్షలజనులయొక్క గతి యేమి? ఈయవతారములమాటయైనఁ దలపెట్టక మృతినొందుచున్న మనుజులయవస్థ యేమి? మానవరూపమున భగవంతుఁ డవతరింపవలసిన యావశ్యకమే యున్నచోఁ బ్రతిమనుష్యునికిని నుండవలసినదే! సర్వకాలములయందు నుండవలసినదే! శరీరధారిగాఁ దప్ప వేఱొకవిధముగా భగవంతుని గ్రహించుటకు వీలులేనిచో నాయవతారమూర్తియొక్క సమకాలికులకుఁ గాక యితరుల కాతనియందు విశ్వాసము కుదురుటకు వలనుపడదు. 'మాకు సాకారుఁడై ప్రత్యక్షము గానియెడల మేము పరమేశ్వరుఁ డున్నాఁడని నమ్మ'మని యెవరైన నన్నచోఁ బ్రత్యుత్తర మిచ్చుటకు వీ లుండదు.

మనుష్యునికిని భగవంతునికినిఁ గలయెడబాటును దీర్చుటకుఁ గాని, యీశ్వర జ్ఞానమును లోకమునకు వెల్లడించుటకుఁ గాని దేవుఁ డవతరింప లేదనియు, మానవకోటికి మార్గదర్శకుఁడుగా నుండునిమిత్తమై యవతరించె ననియుఁ గొందఱు లోకయుక్తి చెప్ప వచ్చును. ఈహేతువు కొంతవఱకు సమంజసముగానే యున్నది. ధర్మములను ప్రసారపముగా బోధించుటవలనఁ గాక స్వాచరణమునందుఁ జూపుటవలననే మనుజులకు మఱింతస్పష్టముగాఁ దెలియఁజేయవచ్చు ననుటకు సందియము లేదు. కాని యామార్గదర్శకుఁడు సర్వశక్తుఁ డగునీశ్వరుఁడు గాక మనవంటి మానవమాత్రుఁ డగుటయే లాభకరము. ఏసుక్రీస్తు మానవుఁడు గాక యద్భుతశక్తిసంపన్నుఁ డగుభగవంతుఁ డైనచో నతనికిఁ బట్టించినశోధనలును, అతఁ డనుభవించినకష్టపరంపరయు, నతఁడు తుదకు సాధించినవిజయమును వ్యర్థశూన్యము లగును. అది గాక సర్వసమర్థుఁ డగుపరమేశ్వరుఁడు సహించినపరిశోధనలును, గనఁబఱచినమహిమలును, మిక్కిలి యల్పశక్తిసంతుల మగుమన కేమిధైర్యము నొసంగఁ గలవు? మన కేమిప్రోత్సాహము నియ్యఁగలవు? అతని సామర్థ్య మెక్కడ? మనసామర్థ్య మెక్కడ? అరణ్యములో సంభవించినశోధనయు గెత్సెమనెలోఁ బడినపరితాపమును, సిలువమీఁదఁ జూపినస్థైర్యధైర్యములును మానవునిగా భావించినచో, జీవనునందవి మహిమోపేతములుగా నుండును గాని భగవంతుని కారోపించినచోఁ బరిహాసపాత్రముగాఁ గాన్పింపకపోవు.

మతాచార్యులను, దేశవీరులను నీశ్వరావతారములుగా భావించుటలోఁ గలయుద్దేశము శ్లాఘనీయముగనే యున్నను, నామహాపురుషులజీవితముయొక్క పరమార్థమున కనర్థము తటస్థించుచున్నది. ఈయభిప్రాయము రెండువిధములుగా నష్టదాయకము. ఒకవైపున భగవంతునిసర్వశక్తిత్వమునకు లోపము; ఇంకొకవైపున దైవసమానులుగాఁ జేయఁబడిన యామహనీయులసామర్థ్యాతిశయమునకు లోపము. మానవు లని మన మెంచుచో, నామహాపురుషులజీవచారిత్రము లత్యంతమనోజ్ఞము లై పూజ్యము లై యనుకరణీయము లగును. ప్రజానురంజకముగా రాజ్యము చేసియో, దుష్టులను శిక్షించియో, శిష్టులను సంరక్షించియో, పాపాత్ములను పావనులఁ జేసియో, యింకేదేని

యాలోకసామాన్య మగుఘనకార్యము సాధించియో పేరు వడసిన పురుషవరేణ్యులే గదా యిపు డవతారమూర్తులుగా భావింపఁబడుచున్నవారు. తమకు మహోపకారము చేసినకారణముచేఁ గలిగినగౌరవభావమునుబట్టి ప్రజలు మహాపురుషుల నీశ్వరావతారములను జేసిరి. అందువలన వారిమాహాత్మ్య మపార మైనభగవన్మహిమలో లీన మై సామాన్యమానవుల కాదర్శముగా నుపకరింప దయ్యెను. వారిస్వభావము మనస్వభావము వంటిదే యనియు, వారికిని మనకువలెఁ బ్రలోభనములు తటస్థించె ననియు, వారును మనవలెనే పాపజాలముతోఁ బోరాడి రనియు, వారికిని మనకువలె మనోదేహములు వాటిల్లె ననియు, వారు పటుతర మైనయీశ్వరభక్తిసమేతు లై విగతపాపు లై సత్కార్యాచరణపరాయణు లై సుఖముగా జీవయాత్రను గడపఁగలిగి రని భావించినపుడు వారిచరిత్రములు మన కత్యంతప్రీతిపాత్రము లగును. ఈరీతిగాఁ దలంచువా నాపురుషసత్తముఁడు పడినకష్టములను, ననుభవించినదుఃఖములను నాత్మానుభవముతోఁ బోల్చి చూచుకొని యెల్లవారును దమప్రవర్తనమును సవరించుకొనుటకు వీ లుండును. అట్లు గాక యాతఁడు లోకనాయకుఁ డగుభగవంతుఁడే యనియు, తనకుఁ దటస్థించినయవస్థాభేదములలో నెల్ల నతఁడు తాను సర్వశక్తిమంతుఁడ నని యెఱిఁగియే యుండె ననియు నాభేదములచే నాతఁడు రవంతయేనిఁ జలింపలే దనియు, మోదఖేదము లాతనికి సంభవింపలే దనియు, నంతయు ఛాయామాత్ర మైననటనయే యనియు నెంచినపుడాజీవితముయొక్కమాధుర్య మంతయు విచిత్రముగా విఱిగిపోకమానదు. అనంత మైన విశ్వమును బరిపాలించెడుమహాప్రభు వొకగొప్పరాజ్యము నేలినాఁ డనిన నేమి యాశ్చర్యము? సకలమానవకోటినిఁ బ్రేమించి పోషించెడి యాపరమపిత యొక సామాన్యసంసారమును సంతుష్టిగా నడపిన నేమి యద్భుతము? ధర్మసంరక్షణార్థ మై నిత్యమును బ్రపంచమునం దనేకసమరములను జరిగించుచుండెడుమహాతంత్రజ్ఞుఁ డేదో యొకమహాయుద్ధమునందు రథసారథిగా నున్న నేమి వింత? తానే పరబ్రహ్మ మై యుండునాతఁ డీశ్వరకారుణ్యమునుగూర్చి నిర్విచారుఁ డై యుండిన నేమి విచిత్రము? శత్రుకోటి తనను బరిపరివిధముల బాధింప నిశ్చలుం డై యుండిన నేమియబ్బురము? దైవసమానులను జేసినపుడు రాముఁడు, కృష్ణుఁడు, క్రీస్తు మొదలైన మహాత్ములనిరుప

మానసామర్థ్యమంతయు నిరర్థకమగుచున్నది. సామాన్యమానవులై స్వబుద్ధిపాటవముచేతను, స్వగుణాధిక్యముచేతను, స్వమహిమావిశేషముచేతను, నాపురుషాగ్రేసరు లట్టియుత్తమపదవిని సాధించిరని భావించినపుడు వారిజీవనచారిత్రము లెల్లజనులకును విశేషలాభదాయకములై విలసిల్లఁగలవు.

అవతారసిద్ధాంతమువలెనే మధ్యవర్తులను గూర్చినసిద్ధాంతము మానవులయాత్మాభివృద్ధికి భంగకరము. ఇందు రెండుముఖ్యలోపములు గలవు. తనబుద్ధికిఁ దోఁచినసదుపదేశముల బోధించి జనులకుఁ బరమోపకారము చేసినగురువరేణ్యుని సిద్ధాంత మమోఘసత్యములను బ్రకటించెడుపవిత్రునిగాఁ జేయుచున్నది; అంతియే గాక యతఁడు తప్ప మఱియెవ్వాఁడును మోక్షమార్గమును జూపలేఁడని వెల్లడించుచున్నది. వీనిలో మొదటిలోపమువలన నామహాపురుషులయాధిక్యమునకే న్యూనత తటస్థించును. వారు చేసినయుపదేశములు చాలవఱకు యదార్థములుగా నున్నను నాకాలపుస్థితిగతులను బట్టియు జాతీయసాంప్రదాయములనుబట్టియుఁ గొంతకొంతదోషములతోఁ గూడ మిళితములై యుండెను. అమోఘవచనునిగా భావించినపుడవి గొప్పప్రమాదము లైనను, సామాన్యమహాపురుషునియందవి యంతగా గణనార్హము లగులోపములు గానేరవు. సద్ధర్మములఁ జురుకుగా గ్రహించుటయందును, గ్రహించినవానిని ధైర్యోత్సాహములతోఁ బ్రజానీకమున కుపదేశించుటయందును, నుపదేశించునపుడు సంభవించుకష్టసంఘాతముల సహించుటయందును, సహించి తమధర్మముల నానాముఖముల వ్యాపింపఁజేయుటయందును వాస్తవముగా వారిమహత్త్వ మంతయు నిమిడి యున్నది. తమయుపదేశము లన్నియు సత్యము లనియు, లోపరహితము లనియు వారు నుడువలేదు. అట్లు తలంచుట శిష్యులదోషము గాని యాపుణ్యపురుషులది గాదు. ఇఁక రెండవలోపము మతమాత్సర్యములకుఁ గారణ మయినది. ఆమతస్థు లందఱును దమమూలపురుషుఁడే మహోత్కృష్టుఁ డనియు, నతనియందు విశ్వాసము లేనివారు నరకాగ్నియందుఁ బడుదు రనియు, జాటుచు తమమతమునకుఁ జెందనివారి నెల్ల "హీదను" లనియు "పాషండు" లనియు, "మ్లేచ్ఛ" లనియు, "కాఫరు" లనియు ననేకవిధముల దూషింపఁ దొడంగినారు.

సిద్ధాంతములుగా నీయవతారములనుగూర్చియు మధ్యవర్తిత్వమునుగుఱించియు పూర్వోక్తము లైనయాక్షేపణములు చేయఁబడియున్నను, నొకవిధముగా వానియందు సత్యము లేకపోలేదు. ప్రతిమానవునియొక్క స్వభావమును ద్వివిధ మై యుండుట సుప్రసిద్ధమే గదా! మనుజునియందు దుస్స్వభావ మణఁగి సత్స్వభావ మతిశయించిన కొలఁది నీశ్వరుని సమీపించుచుండును. అనవరతపారచింతానిమగ్ను లగు సామాన్య మానవులయందుకంటె పరోపకారధురంధరు లై సద్గుణసమన్వితు లై రాజిల్లెడు మహనీయులయందు భగవంతుఁడు విశేషముగాఁ బ్రకాశించుచుండు ననుటకు సంశయము లేదు. ఈశ్వరాంశను దమలోఁ బెంపొందించుకొనినంతవఱకు వారిని భగవదవతారము లనుటలో నాక్షేపణ ముండఁ జాలదు. అదేతీరున మధ్యవర్తిత్వమునుగూర్చి కూడఁ జెప్పవచ్చును. పరమేశ్వరుఁ డీలోకములోఁ దనకార్యము నంతయు మానవుల మూలకముగనే జరుపుచుండును. శిశువును దల్లిమూలకముగాఁ గాపాడును. ప్రతి వ్యక్తిని కుటుంబద్వారమునను, ప్రతికుటుంబమును సంఘముద్వారమునను సంరక్షించును. మానవజాతియొక్క నైతికాభివృద్ధిని రాజులు మతసమాజములమూలమునను, ఆధ్యాత్మికాభివృద్ధిని సద్గురువులమూలమునను బోధించుచుండును. ఈవిధముగా యోజించినచో సకలమానవులు నేదోయొకవిధముగా మధ్యవర్తులుగనే యున్నారు. మానవకోటియొక్క మతాభ్యుదయమును ప్రవక్తలద్వారమున జరుపుచుండుటచే వారును మధ్యవర్తులే యన నొప్పుదురు.

భగవంతుఁడు మానవవేషమున భూమండలముమీఁద నవతరించె నని కాని యెవ్వరేని యొకమహాపురుషునిఁ బ్రత్యేకముగా నేదోయొకజాతివారికిఁ బంపె నని కాని బ్రాహ్మసమాజము విశ్వసింపఁజాలదు. అట్టివిపరీతపురుషులు లోకమునకు నావశ్యకమును లేదు. హృదయపూర్వక మైనప్రార్థనములవలనను దృఢ మైనశ్రద్ధలవలనను, నిర్వికల్ప మైనభక్తివలనను, మానవులు గొంద ఱసమానమహిమను సాధింపఁగలిగిరి. విపత్పరంపరచే మన మావరింపఁబడినపుడు వారిజీవితములు మనకు ధైర్యమును బ్రసాదించుచున్నవి; దుఃఖాగ్నిచేఁ దప్తము లగు మనహృదయములు వారిచరిత్రస్మరణచే శాంతినిఁ గాంచుచున్నవి. అజ్ఞానాంధకారమునఁ దడవులాడునపుడు వారిపవిత్ర

చారిత్రములు దివ్యజ్యోతులవలె మనకు మార్గదర్శకము లగుచున్నవి. మనుష్యజాతియందు ధర్మప్రతిష్ఠాపన చేయుటకొరకా నానాసమయముం దామహాపురుషులు విచిత్రమైన యీశ్వరశాసనానుసారముగా భూలోకమున జన్మించుచుందురు. వారియుపదేశము లెల్ల నిర్దోషము లని చెప్ప వీలు లేకపోయినను, లోకముయొక్క శ్రేయోభివృద్ధికి వారి యాగమము సర్వవిధముల నావశ్యక మని మాత్రము నుడువక తప్పదు. భగవంతులనుగఁ గాని, తత్సమానులనుగఁ గాని మానవాతీతులనుగఁ గాని బ్రాహ్మసమాజము వారిని భావింపకపోయినను ప్రేమపాత్రులు, పూజ్యార్హులు నగునగ్రసోదరులనుగ నెంచుచున్నది. అద్వితీయుఁడగు పరమేశ్వరునికిఁ జెందవలసిన నిరుపమానభక్తిగౌరవములను వారికిఁ జెల్లించుటకు బ్రాహ్మసమాజ మనుమతింపదు. జగత్పితకుమాత్రమే సమర్పింపఁదగు నారాధనను నామహాపురుషులను నభిలషింపదు. లోకమాన్యు లగునిట్టిమహనీయులను, గురువులను, మునిపుంగవులను, యోగులను గౌరవించుటలో బ్రాహ్మసమాజము జాతిమత వర్ణవిభేదమును గాని, దేశకాలభేదమును గాని యించుకేనియు పాటింపదు. ఏదేశమునకు జెందినను, ఏయుగమునకుఁ జెందినను, ఏజాతికిఁ జెందినను వారివారియుపదేశప్రాబల్యమునుబట్టి సకలమహానుభావులను బ్రాహ్మసమాజము సంభావించుచున్నది.



# ఏడవ ప్రకరణము.

## ప్రమాణగ్రంథము—ఈశ్వరప్రత్యాదేశము.

ప్రతిమతమందును బ్రమాణగ్రంథ మొకముఖ్యాంగముగా నున్నది. హిందూ మతమునకు ఋగ్యజుస్సామాథర్వణము లనెడుచతుర్వేదములు ప్రమాణములు. మహమ్మదీయమతమునకు ఖొరానును, పారసీమతమునకు జెండవస్తాయును, క్రైస్తవమతమునకు బైబిలును ముఖ్యప్రమాణములై పరగుచున్నవి. ఈమతస్థు లందఱు తమమతగ్రంథములను బ్రమాణములనుగాఁ జేకొని తమధర్మజీవనమును జరుపుకొనుచున్నారు. "కావున బ్రాహ్మసమాజముయొక్క ప్రమాణగ్రంథ మెద్ది? ఏగ్రంథము ననుసరించి బ్రాహ్మమత మేర్పడినది?" అని యెల్లమతావలంబులును సామాన్యముగాఁ బ్రశ్నించెదరు. "సత్యమ్ శాస్త్ర మనశ్వరం" సత్య మొక్కటియే యనశ్వర మైనశాస్త్రము. సత్యమే యెప్పటికిని మనుజులకుఁ బ్రీతిపాత్రమై యొప్పుచుండుటచే బ్రాహ్మసమాజము సత్యము నే పరమ ప్రమాణముగా నంగీకరించుచున్నది. తదితరము లయినగ్రంథప్రమాణములను బ్రాహ్మ సమాజము నిరాకరించును. ఏపుస్తక మేని ప్రమాణ మయినయెడల నందలియేయంశమును గూర్చి సందియము తోఁచినను, తన్మతముయొక్క ప్రాశస్త్యమునకే న్యూనత సంభవించును. అక్కారణముచే నేమానవులచేతనో, యేకాలమునందో, యేభాషయందో, రచియింపఁబడిన యెట్టిమతగ్రంథములను బ్రాహ్మమతము ప్రమాణములనుగా సమ్మతింపక, యెవ్వరిచే బోధింపఁబడినను, నేకాలమునందు బ్రకటింపఁబడినను, నిత్యమై సర్వసాధారణ మైనసత్యము నే యమోఘప్రమాణముగా స్వీకరించుచున్నది.

'సత్యమును మనము తెలిసికొను టెట్లు? ఆసత్యగ్రహణమున కాధారము లెవ్వి?' అనుప్రశ్నలు విచారణీయములు. ప్రతిమతమును సత్యమునకే బద్ధమై యున్న దనియు, వేదాదిగ్రంథములమూలమునఁ గాక సత్యము నెఱుంగుటకు మార్గాంతర మింకేమి యుండఁగల దనియుఁ గొందఱకు సంశయము కలుగవచ్చును. అందున కొక్కసమాధానము గలదు. ఎవనినుండి సకలమహర్షులును, ప్రవక్తలును, తమయుపదేశములను గ్రహించిరో యెవ్వానిచే సమస్తప్రమాణగ్రంథములును బ్రేరేపింపఁబడుచున్నవో, యట్టిమహాశ

దేశకుఁడే, యాయాదికారణుఁడే బ్రాహ్మసమాజమునకు సత్యోపదేశమును జేయుచున్నాఁడు. వేదరచనకు నతఁడే గదా యాధారభూతుఁడు! ఖోరాను మున్నగు నితరమతగ్రంథములకును నతఁడే కదా ప్రేరేపకుఁడు! సకలమతములకును, సమస్తసత్యములకును నతఁడే కదా మూలకారణుఁడు! అఖిలమతస్థులును దమకు భగవంతుఁడే సత్యమును బ్రకాశింపఁజేసినట్లు ప్రకటించుచున్నారు. ఋషులును, జ్ఞానులును, యేసునాథుఁడును, మహమ్మదును, వేదగ్రంథస్థములై యున్నతమయుపదేశములను పరమేశ్వరుఁడే తమ కనుగ్రహించినట్లు నుడివియుండిరి. ఈప్రమాణగ్రంథములయొక్క గాని, యీయుపదేశములయొక్క గాని యధికారము నొప్పుకొనుటకు మున్ముందు దేవుఁ డొకఁడు గలఁ డనియు, నతఁడు పవిత్రుఁ డనియు, మానవులను ధర్మబోధచేఁ బావనులను జేయ నిచ్ఛ గలవాఁ డనియు మనము విశ్వసింపవలసియున్నది. అట్టిచో మతజ్ఞానమును బడయుటకు ప్రవక్తలే గాక, పవిత్రగ్రంథములే గాక, వీనిని మించి శ్రేష్ఠమై ప్రత్యక్షమైనమతియొకయుపాయము గల దని యెల్లరకును దెల్లము గాకమానదు. ఈశ్వరజ్ఞానమును సాధించినప్రవక్తలయందును, ఈశ్వరదత్తము లయిన గ్రంథములయందును విశ్వాస ముంచుటకుఁ బూర్వము ప్రతిమానవుఁడును దనసహజశక్తుల మూలమున సర్వేశ్వరునిఁ దెలిసికొని యతనియందు విశ్వాస ముంచవలయును. దేవుని యునికినిఁగూర్చి యెఱిఁగినవాఁడు, ఆతనిసద్భావమును దెలిసికొనినవాఁడు, ఆతనినుండి యెట్టియుపదేశమును నైనఁ బొందుటకు నర్హుఁడుగాఁ నెంచఁదగియుండును. కాని హిందూమత మాదిగాఁ గలప్రాచీనమతస్థులు భగవంతుఁడు మతసత్యముల నెవరో కొందఱకు మాత్రమే యుపదేశించియుండె నని నుడువుదురు. అటు లయినచోఁ బరమేశ్వరుని గుఱించినయాసత్యముల నాపుణ్యపురుషు లెట్లు గ్రహింపఁగలిగిరి? మానవుల కందఱకు సామాన్యముగాఁ గలసహజశక్తులమూలముననా? లేక విశేషశక్తు లేవి యయిన వారి కుండెనా? సర్వజనసాధారణము లైనశక్తులవలననే యైనచో, నెల్లవారును నాధర్మముల గ్రహింపఁగలిగియుందు రని యొప్పుకొనక తప్పదు. సకలేతరమనుజులకును లేనిదివ్యశక్తు లే వైన వారి కున్నచో, నట్టిశక్తులను గుఱించియు, నామహాత్మ్యలనుగూర్చియు జనుల కెల్లప్పుడు ననుమానముగ నే యుండునని రూఢిగాఁ జెప్పవచ్చును. లోకములో నెందఱో తమకు భగవంతుఁడు ప్రత్యక్షమై మహత్తరము లయినశక్తుల ననుగ్రహించె నని జనులను నమ్మింపఁ జూచుచుండుట మన మెఱుఁగుదుము. అక్కడక్కడఁ గొందఱు వారిమాటలను నమ్మి పాదపూజలు చేసినను, వివేకవంతులు వారిని మొట్టమొదట మోసగాండ్రనుగా

భావించి పరిశోధించుచుందురు. జాగరూకతతోఁ బరీక్షించినమీఁదటఁ గపటవేషధారులు గా నిర్ణయింపఁబడినమహాత్ములఁ బలువుర మన మెఱుంగుదుము. ప్రజలు వారిపట్లునఁ గనఁబఱచెడువిశ్వాసమున కొక్క హేతువు గలదు. జ్ఞానసంపాదనమునిమిత్తమై నిష్పాక్షికబుద్ధితో సమస్తమనుష్యులకును పరమేశ్వరుఁడు గొన్నిశక్తులఁ బ్రసాదించియున్నాఁడు. ఎవ రేవిషయమును జెప్పినను బ్రతిమానవుఁడును స్వీయసహజశక్తులద్వారమునఁ దా నార్జించుకొనినజ్ఞానముతోడను, లోకానుభవముతోడను బోల్చి చూచుకొనును. అట్లు పరీక్షించినపిమ్మట వాస్తవముగాఁ దోఁచినపక్షమున నావిషయమును విశ్వసించును. లేనిచో ననుమానించి నిరాకరించును. ఇక్కారణముచేతనే దివ్యప్రభావసమేతుల మని చాటుకొనెడు నెల్లకపటపురుషులయొక్కయు కల్లబొల్లిమాటలచే మోసపడక జనులు కొంతవఱకు నిలువఁగలుగుచున్నారు. అంతమాత్రముచే యథార్థప్రజ్ఞాధురంధరు లగువారుచితగౌరవమును గాంచుట లే దని మన మెన్నటికినిఁ దలంపఁగూడదు.

ఈశ్వరజ్ఞానమును గడించుటకు నలోకసామాన్యము లగువిశేషశక్తు లక్కఱ లేకపోయినను, నొక్కసంగతిమాత్ర మెవ్వరును శంకింప వీలు లేదు. ప్రపంచములో ననేకశాస్త్రములు వెలసియున్నవి గదా! ప్రతినరుఁడును నాశాస్త్రముల నభ్యసించుటకు స్వాతంత్ర్యమును గలిగియున్నాఁడు. అయినను నెల్లవారును నావిద్యలలోఁ బ్రావీణ్యమును గాంచఁ గల్గుచున్నారా? మిక్కిలి స్వల్పసంఖ్యాకులు మాత్రమే యాశాస్త్రములలోఁ దగినపాండిత్యమును గడించి వాసి కెక్కుచున్నారు. ఎవరు తచ్ఛాస్త్రజ్ఞానమును బడయఁగలశక్తి నుచితరీతిని వృద్ధిఁ జెందించుకొనెదరో, వారు మాత్రమే యాశాస్త్రమునందు నైపుణ్యమును సాధింపఁగలుగుదురు. అటులనే యీబ్రహ్మవిద్యావిషయమునందును విశేషసాధనము చేసి దమయాధ్యాత్మికశక్తులను బెంపొందఁజేసికొనినవారు మాత్రమే పరబ్రహ్మమునుగుఱించి విశేషజ్ఞానమును సంపాదింప సమర్థులై యుందురు. అంతియే గాని పూర్వ మెవ్వరికో తప్ప యిక్కాలమునం దట్టిబ్రహ్మజ్ఞానము గలుగ దని వాదించుట యతిసాహసము. అసత్యము.

పయినిఁ జూపినహేతువులనుబట్టి బ్రహ్మజ్ఞానమును సంపాదించుటకు సకలమానవులకును వారివారిసామర్థ్యమునుబట్టి వీలు గల దని కరతలామలక మగుచున్నది గదా. అందుచే నెవ్వరికో యేదోయొకకాలమునందు సాక్షాత్కారుఁడై భగవంతుఁడు తనను గుఱించినధర్మములను బోధఁ జేసె నని యెంచక, సర్వదేశములయందును సర్వకాలములయందును, సర్వజనులకును దనహితోపదేశముల నెఱిఁగించుచుండు నని బ్రాహ్మసమాజికుఁడు దృఢముగా నమ్ముచున్నాఁడు. సత్యప్రకాశన మంతము లేక యనంతకాలము

నుండి మహాప్రవాహమువలె నిప్పటికిని బ్రహ్మముఖమునుండి వెడలుచున్నది. ఏ సీనేయి పర్వతశిఖరమునందో యేసరస్వతీనదీతీరమునందో, యేజీసనునకో, యేమహమ్మదునకో దర్శన మిచ్చి కొన్నిసత్యములు నుపదేశించి యనంతర మూరకున్నవాఁడు గాఁడు. నిత్యుఁడై, సర్వవ్యాపకుఁడైనయాపరమేశ్వరుఁ డనవరతము మానవులసమస్తశక్తుల నుత్తేజింపఁ జేయుచు నొకయుగమునకంటె మఱియొకయుగమునందుఁ దనమహిమలను మఱింతయెక్కువగాఁ బ్రచురించుచున్నాఁడు. ఓహో! నిర్మలమానసంబుతోఁ దన కొఱకై ప్రతీక్షించిన యెవ్వరి కాతఁడు ప్రత్యక్షము గాక యుపేక్షించెను? మహాభక్తులమాట యటుండ, నీశ్వరవాక్కుల నాలకించి తమజీవయాత్ర నానందముతో గడపెడుసామాన్యభక్తు లెందఱు లోకమున నున్నారు గారు!

జీవాత్మయే యీశ్వరునిమహోత్తర మైనదేవాలయము. మానవుల కాతఁడు హేతుజ్ఞానమార్గమునను, అంతరాత్మద్వారమునను, నధ్యాత్మికజ్ఞానమూలమునను దన ప్రజ్ఞను వెల్లడించుచుండును. ఏపురుషాధికారమును గాని, యేగ్రంథాధికారమును గాని మత మాధారము చేసికొని యుండలేదు. మనుష్యునియొక్కమతప్రకృతియే సమస్తమతములకును శాశ్వతమైనపునాదియై తనరారుచున్నది. మతసమాజములు మాఱవచ్చును. వేదములు పురాతనములై ప్రమాణములుగా నంగీకరింపఁబడకపోనచ్చును. కాని మానవుఁడు మానవుఁడుగా నున్నంతకాలము నేదియో యొకమతమును నవలంబింపక యుండఁజాలఁడు. ఈశ్వరజ్ఞానమునందు మనుజునకుఁ గలసహజానురాగమే మతవిశ్వాసమునకు హేతుభూతమై యలరుచున్నది.

అయినను ప్రమాణగ్రంథము లీశ్వరచోదితములుగా వని బ్రాహ్మసమాజ మెన్నటికిని జెప్పదు. వేదములయందును, ఖోరానునందును, బైబిలునందును, తదితరగ్రంథములందును గలసత్యము లన్నియు నీశ్వరోపదిష్టము లనుటకు సందేహము లేదు. బ్రహ్మజ్ఞాన మంతయు నెద్దియో యొకజాతివారికే యుపదేశింపఁబడె నని గాని, యెద్దియో యొకగ్రంథమునందే యున్నదని గాని బ్రాహ్మసమాజము సమ్మతింపదు. ఎవ్వరో యొకమతకర్తకే, యొకమతసమాజమునకే యీశ్వరజ్ఞానము గలిగె నని కూడ బ్రాహ్మసమాజ మంగీకరింపదు. గ్రంథగౌరవమునుబట్టి సత్యమున కాదరము గలుగ దనియు, సత్యగౌరవమునుబట్టి గ్రంథమున కాదరము గలుగు ననియు బ్రాహ్మసమాజముయొక్క నిశ్చితాభిప్రాయము. సత్యము లుండుటచేతనే వేదగ్రంథ మైనది, గాని వేదగ్రంథ మని పేరు బెట్టుటచే నందలిసంగతు లన్నియు సత్యములు గాలేదు. పురాతనమతములు తమ పుస్తక మొక్కటియే ప్రత్యేకముగా నీశ్వరదత్త మైన దనియు, నందలివాక్యము

లన్నియు నమోఘము లనియుఁ బ్రమాణము అనియు నుగ్గడించును. ఆగ్రంథములో నున్నది యెల్ల యథార్థ మనియు, నందులో లేని దెల్ల యథార్థము గా దనియుఁ దన్మతస్థులు నుడువుచుందురు. ఇట్లనుటవలన దుర్గ్రాహ్యము లైనయనేకానర్థములు సంభవించినవి. ప్రప్రథమముగా దినదినాభివృద్ధిఁ గాంచుచున్న ప్రకృతిశాస్త్రపరిజ్ఞానమునకును, నమోఘసత్యములుగాఁ బ్రకటింపఁబడినయాగ్రంథస్థవిషయములకును వైరుధ్యము కలిగినది. నూతనశాస్త్రపరిశోధనములప్రకార మందలియనేకాంశములు సత్యవిరుద్ధము లని నిర్ధారణ చేయఁబడినవి. ఇవి యటుండఁ బ్రతిమతస్థుఁడును దనగ్రంథమే భగవద్దత్త మనియు, నమోఘప్రమాణ మనియు, నందలివిశ్వాసమే మోక్షైకసాధన మనియు నొక్కి వక్కాణించుచుండును. ఇట్టిసందిగ్ధసమయములో సత్యమతార్థి యగువాఁ డేగ్రంథమునందు విశ్వాస ముంచవలయును? ఒకపుస్తకమునందుఁ బ్రశ్నింపక నమ్మక ముంచినచో నితరగ్రంథములమాత్ర మేల నిరాకరింపవలయును? హిందువులవేదము నంగీకరించుటకెంతటిప్రబలకారణములు గలవో, యంతటిహేతుప్రాబల్యమే ఖొరాను బైబిలు మున్నగుప్రమాణగ్రంథముల నంగీకరించుటకును గలవు. ప్రమాణగ్రంథములలోఁ గూడ నిట్లు పరస్పరవివాదము వాటిల్లుచున్నది. పక్షపాతబుద్ధి లేనిసత్యాన్వేషి యీశ్వరప్రసాదితము లగుతనజ్ఞానశక్తులసాహాయ్యమున సన్మతమును, సద్గ్రంథమును నిర్ణయించుకొనును. అప్పుడు సత్యనిరూపణమునకు వేదగ్రంథములు సాధనములు గాక సర్వజనస్వాభావికము లైనబుద్ధ్యాదిశక్తులే యుత్తమసాధనము లయినవి గదా! బుద్ధి వికసింపనిబాలుఁడు పసితనమున జననీజనకులు చెప్పినవిషయముల నెల్ల విధేయముతో సత్యములుగా సమ్మతించి, వయోధికుఁడై జ్ఞానాభివృద్ధిఁ గాంచినకొలఁది తల్లిదండ్రులయొక్క వాక్యముల యాదార్థ్యమునుగూర్చి తర్కించునట్లు, మానవజాతియొక్క బాల్యావస్థలో వేదాదిగ్రంథములు ప్రమాణములుగాఁ బ్రశ్నింపక యంగీకరింపఁబడెను. కాని యుక్తకాలమునందు వాని ప్రామాణ్యము శంకాస్పదమై చర్చింపఁబడుచున్నది. జ్ఞాన మభివృద్ధిఁ గాంచినకొలఁది నట్టిగ్రంథములు ప్రమాణములుగా నిలువక సత్యమే విశ్వాసపాత్ర మగు ననుటకు సంశయము లేదు.

ఒరగల్లుమీఁద రాచి సువర్ణముయొక్క వన్నెను నిరూపించుచందమున, నాయాగ్రంథములయొక్క సారాసార మందలిసత్యపటుత్వమునుబట్టి నిశ్చయింపఁబడును. వివిధదేశీయులచే, వివిధమతావలంబులచే, వివిధయుగములయందు విరచితములై విశేషముగాఁ వినుతింపఁబడి గౌరవింపఁబడుచున్న యెల్లమతగ్రంథములను మానవకోటియొక్క యధ్యాత్మికజ్ఞానధన మంతయుఁ బదిలముగా దాపురము చేయఁబడినయమూల్యాగారము

లనుగా బ్రాహ్మసమాజము భావించి యానందించుచున్నది. పశ్చిమదేశస్థు లుపదేశించి నను, ప్రాగ్దేశస్థు లుపదేశించినను, ప్రాచీనులు బోధించినను, నవీనులు బోధించినను, సత్యము సర్వత్ర సమాదరణీయ మని బ్రాహ్మసమాజముయొక్క దృఢమైనవిశ్వాసము. ఇట్టిసమదృష్టితోఁ జూచినపుడు శాస్త్రవిజ్ఞానమునకు మతమునకుఁ గాని, యొకరివేదము మఱియొకరివేదమునకుఁ గాని యేమియు విరుద్ధభావ ముండ నేరదు. పూర్వాచారబద్ధు లగుగొందఱుమతస్థులవలెఁ గాక బ్రాహ్మసమాజము విశ్వాసముతోడను, నుత్సాహము తోడను వర్తమానమునందు నడచుచున్న నూతనశాస్త్రజ్ఞానాభ్యుదయమును గాంచి యభి నందించును. ఏశాస్త్రమునం దభినవజ్ఞానోదయము గలిగినను, నీశ్వరసాన్నిధ్యమును బొందుటకు మఱియొకసుకరమార్గ మేర్పడినట్లు బ్రాహ్మసమాజికుఁడు సంతోషించును. సత్యాన్వేషణఫలితముగా మానవునిచే రచియింపఁబడినపత్రిప్రమాణగ్రంథమును, ప్రతి లౌకికాలౌకికగ్రంథరాజమును కోటిసూర్యప్రభాభాసమానుఁ డగుసర్వేశ్వరునినుండి బయలువెడలెడునొకకిరణమువలెను, కాలబద్ధము గాక యనాదిగాఁ బరమేశ్వరునుండి ప్రవహించుచున్న ధర్మప్రవాహమునందలి యొకజలబిందువుపలెను, శ్రవణానందకర ముగా నతఁడు మనుష్యకోటికి వినిపించుచున్నమహాగానమునందలియొకస్వరమువలెను బ్రాహ్మసామాజికుఁడు భావించుచున్నాఁడు.

బ్రాహ్మసమాజముయొక్క వేదగ్రంథ మొకప్రదేశమునకుఁ గాని, యొకదేశచరి త్రకుఁ గాని సంబంధించినది గాదు. అది యొకభాషలో రచింపఁబడినదియుఁ గాదు. సకలజాతీయులయొక్క భాషోపభాషలయందు లిఖింపఁబడినదై యున్నది. ప్రకృతి యందు భగవన్మహిమను బొడగాంచినను, దేశచరిత్రయందు నీశ్వరోద్దేశమును గనిపెట్టి నను, నిజహృదయమునందు దేవునికల్యాణగుణాతిశయమును దెలిసికొనినను, నెక్కడ మానవుఁడు పరమేశ్వరుని నిర్వచనీయ మగుమహాత్మ్యమును గ్రహించి స్తుతించి యానం దించినను, నక్కడక్కడనే బ్రాహ్మసమాజికునియొక్క వేద మేర్పడుచున్నది. ఈవేదము పురాతనమై, నూతనమునై, సర్వజనసామాన్యమై నిరంతరాభివృద్ధినిఁ జెందునదియై రాజిల్లుచున్నది. సకలమానవులచేతను బూర్వయుగములలో నార్జింపఁబడినయాత్మీయజ్ఞాన ధనము నంతయుఁ దనకు వారిచే దయాపూర్వకముగా నొసంగఁబడినదాయభాగముగా బ్రాహ్మసమాజము తలఁచుచున్నది. సత్యాన్వేషమునందు బ్రాహ్మసమాజము దేశకాల వర్ణభేదమును గాని, జాతిభాషాదిభేదములను గాని యించుకేనియుఁ బాటింపదు. బ్రాహ్మసమాజముయొక్క దేవుఁడు సర్వసాధారణుఁడు; వేదము సర్వసాధారణ మైనది. సర్వసాధారణమైన యిట్టిబ్రాహ్మసమాజమునకు నిరంతరాభివృద్ధియు సాధారణము గదా!

# ఎనిమిదవ ప్రకరణము.

## సాంఘికాదర్శము.



బ్రాహ్మమతమునుగూర్చి యోజించునపుడు బ్రాహ్మసమాజముయొక్క సాంఘికాదర్శమునుగూడ విచారించుట ముఖ్యావశ్యకము. అన్యులసంబంధము లేకుండ నొక్కొక్కనిచేఁ బ్రత్యేకముగా నేకాంతమున ననుష్ఠేయమగుమతమే బ్రాహ్మమతమని భావింపఁదగదు. మనుష్యునియొక్క సకలవ్యాపారములను సన్మార్గమునఁ బెట్టి యాతనిగృహకార్యములను, సమస్తసంబంధబాంధవములను సంస్కరించి యున్నతస్థితికిఁ దెచ్చునది బ్రాహ్మమతము. తత్కారణముచే బ్రాహ్మసమాజమునందు సంఘనిర్మాణవిషయమున నొకయుత్తమమైనయాదర్శ మేర్పడినది. "న స్త్రీ స్వాతంత్ర్య మర్హతి" యనెడు వాక్యము పరమప్రమాణముగాఁ గైకొనఁబడి దుర్లంఘ్యము లగుననేకజాతిభేదములచే శాఖోపశాఖలుగఁ జీలియున్న మనదేశమునం దాయాదర్శము జనబాహుళ్యమునకు గంటకప్రాయమై బహుకలహములకుఁ గారణభూత మయ్యెను. అందువలన నాయాదర్శమును గుఱించి యొకింత యిచట ముచ్చటించుట యప్రస్తుతము గాదు. దేవునిగుఱించియు, దేవునకును మానవులకును గలసంబంధమును గూర్చియు బ్రాహ్మసమాజికులకుఁ గలయభిప్రాయములను బట్టియే యీయాదర్శముగూడ నిర్ణయింపఁబడినది. జగత్పిత యగు నేకేశ్వరునియందలివిశ్వాసము ననుసరించి కులజాతివర్ణభేదములు లేక మానవులంద ఱొక్క కుటుంబమునకుఁ జెందినవా రనువిశ్వాసముగూడ సహజముగా నుత్పన్నమైనది.

దేవుఁడు మనకుఁ దండ్రి యగుటచే, మనుష్యు లందఱు నాతనిసంతానము గదా! ఆహేతువువలన స్త్రీలును బురుషులును బరస్పరసోదరీసోదరభావమును గలిగి వర్తిల్లవలసినవా రగుచున్నారు. కులదేశవర్ణభేదములనుబట్టి పుట్టుకతోడనే యొక రెక్కువ యనియు, నొకరు తక్కువ యనియు నిరూపించుటకు వీలుపడదు. బుద్ధివికాసమునందును, పాండిత్యవిశేషమునందును, భాగ్యగరిమయందును, అధికారప్రాబల్యమునందును మనుష్యుల కొండొరులలో నేరీతి వ్యత్యాసము లున్నను, నొక్కయీశ్వరకుటుంబమునఁ జేరినవా రగుటచే నెల్లరును సమానులై పఱగుచున్నారు. జన్మసిద్ధమైన యెట్టియాధిక్యము గాని

న్యూనత గాని యుండవలె నని యభిలషించుట మన కందఱకుఁ బరమజనకుఁ డగుభగవంతునియెడల నపరాధమును గావించుట గాని వేఱు గాదు. అత్యంతనిందాపాత్రమైన యిట్టిభేదములను బాటించుటకు బ్రాహ్మసమాజము సమ్మతింపదు. ఏమానవునకుఁ గాని యేసంఘమునకుఁ గాని స్వతస్సిద్ధమైనయాధిక్యము గల దని బ్రాహ్మసమాజ మెంచఁజాలదు. ఒకమనుష్యునకును మఱియొకమనుష్యునకును, నొకశాఖకును మఱియొకశాఖకును నకారణముగాఁ బెరుగుచున్న భేదభావములను బోనడచి సర్వసౌభ్రాతృమును స్థాపించుటయే బ్రాహ్మసమాజముయొక్క సాంఘికాదర్శము. మనుజులకు గురువులుగా నుపకరించునిమిత్తమై యుద్దేశింపఁబడినయేప్రత్యేకజాతియు భూతలమున భగవంతునిచే సృష్టింపఁబడినట్లు బ్రాహ్మసమాజము విశ్వసింపదు. ఎల్లమానవులకును మతప్రకృతి నిసర్గ మగుటచే నీతిజ్ఞానములందువలెనే యీయధ్యాత్మికవిషయమునందును మనుజు లందఱును నిరంతరాభివృద్ధిఁ బొందఁగలరు. ప్రకృతమునఁ గానవయ్యెడుస్థితిభేదములకు నాయాసంఘస్థులజన్మవిశేషము కారణము గాక, శతాబ్దములనుండి కారణాంతరములచే వా రనుభవించుచు వచ్చిన యధికమైనప్రాబల్య మనుటకు సందేహము లేదు. అక్రమములైననిబంధనములును, శాసనములును నిట్టివిపరీతతారతమ్యములకు మూలహేతువులై యుండెను. ఆయక్రమములను గాని, యాభేదములను గాని యంతరింపఁజేయక యింకను సాగనిచ్చుట గాని, జోక్యము కలిగించుకొనక తటస్థముగా నుండుట గాని మహాపాతకముగా బ్రాహ్మసమాజము భావించును. పంచముఁ డైనను, బ్రాహ్మణుఁ డైనను, హిందు వయినను, మహమ్మదీయుఁ డైనను, నల్లనిచర్మము గలయాఫ్రికాదేశస్థుఁ డైనను, తెల్లనిచర్మము గలయిరోపాదేశస్థుఁ డైనను బ్రాహ్మసమాజికునకు భ్రాతయే. సకలమానవులను సహోదరులనుగా భావింపలేకపోయినచో భగవంతుని "తండ్రీ" యని పిలుచుటకు మనకు యోగ్యత లే దని చెప్పవచ్చును.

హిందూదేశములోఁ గులద్వేషములు మిక్కుటముగా నుంటచే మనుజు లందఱు సోదరు లనియు సమాను లనియు నొక్కి వక్కాణించుట మిక్కిలి యావశ్యక మయ్యెను. జాత్యుపజాతులుగాను, శాఖోపశాఖలుగాను, మనదేశమునందు సంఘమంతయు నానావిధములుగా విడివడియున్నది. తేనియతుట్టియలోనిగదులవలె వేఱువేఱుగా నున్న హిందూమహాసంఘములోనిచిన్నిచిన్ని తెగలలోఁ బరస్పరభోజనబాంధవ్యములు నిషేధింపఁబడినవి. భోజనాదులమాట యటుండ నూరక సమీపించి పలుకరించి, యాదరించు

టయుఁ బ్రతిషేధింపఁబడిన పలుతెగలును మనదేశమునఁ గలవు. కటకటా! యస్వాభావికములై యమానుషములై యనర్థదాయకములైన యీమానవకల్పితభేదజాలముచే మనుష్యమాత్రులలోనెల్ల జెల్లుఁ గల్లుకొనవలసినయనురాగవల్లరి మెల్లమెల్లగా శోషిల్లుచున్నది. అకృత్రిమమున నీశ్వరధర్మ మగునీమానవభ్రాతృత్వమును సర్వవిధముల నీసాధారణమతసమాజమునందుఁ బోషింపఁ బ్రయత్నించుట పరమకర్తవ్యము.

పశ్చిమదేశస్థులలోను నుద్యోగభాగ్యాదితారతమ్యముల ననుసరించి గొప్పవారనియుఁ గొలఁదివారనియు భేదములు గల వనియు, నొకనికిని మఱియొకనికిని భేదము లేకుండఁ జేయుట దుస్సాధ్య మనియుఁ గొందఱుబుద్ధిమంతులు లోకయుక్తినిఁ జెప్పుదురు. మనుజులలోఁ బరస్పరాంతరము లుండవ వని యెవ్వారును నొడువఁజాలరు. కాని యట్టి తారతమ్యములు తరతరాంతములవఱకు నంతు లేక నడచుచుండవలె నని గాని, యవి మానవు లొండొరులలో నుండవలసిన స్నేహపాశమును ద్రెంచి ద్వేషాసూయలను బుట్టించి పెంచెడుకులభేదములుగా మాఱవలె నని గాని బుద్ధిమంతుఁ డెవ్వండును గోరనేరఁడు. పాశ్చాత్యులలో వర్గభేదములును, నిమ్నోన్నతభావములును బ్రబలియున్నచో నపుడు వారిస్థితియు శోచనీయమే యగును గాని శ్లాఘనీయము గాదు. అయినను వారిలో నున్న భేదములు మనదేశమునందలికులభేదములవలె దురతిక్రమములును శాశ్వతములు నయినభేదములు గావని మనము గ్రహింపవలయును. అచ్చటివిభాగములు యోగ్యతనుబట్టియు విద్యాసంపదనుబట్టియు నేర్పడినవి గాని పుట్టుకతోడనే నిర్ణయింపఁబడినవి గావు. భూపతనమైనతోడనే యొకఁడు సమ్మానార్హుఁడో గాఁడో యాతని కులగౌరవమునుబట్టి నిశ్చయింపఁబడుచున్నది. ఇతరదేశములందును మనదేశములందును వర్తించుచున్నభేదములలోఁ గలవిశేష మిచ్చటనే యున్నది. స్వప్రయత్నమూలకముగా నున్నతిని బూజ్యతను గాంచుటకు మనదేశపుస్థితిగతు లవకాశ మియ్యవు. కడమజాతీయుఁ డెంతటిగుణవంతుఁ డైనను, నెంతటివిద్యావంతుఁ డైనను గౌరవపాత్రుఁడుగా నెంచఁబడఁడు. ఉత్తమజాతీయుఁ డెంతటియధముఁ డైనను, మూఢుఁ డైనను, గౌరవార్హుఁడుగా నెన్నఁబడును. గుణాధికుఁ డైనవాఁడు, జ్ఞానాధికుఁ డైనవాఁడు సంఘములో నెట్టిగౌరవపదవి యైనను బొందుటకు పాశ్చాత్యులలో సంపూర్ణస్వాతంత్ర్యము గలదు. పాదరక్షలను గుట్టికొని జీవనముచేసిన పేదవానితనయుఁడు తనగుణజ్ఞానాతిశయప్రభావముచే రాజ్యచక్రమును ద్రిప్పెడుసమర్థుఁడో మతబోధఁ జేసెడు

సామాన్యుండో గ్రా. సకలజనస్వామ్యములై చేరియుండుట కేవలమునైనయభ్యంతరములు నా దేశములందు లేవు. అధమమార్గములో బుట్టి యుత్తమగౌరవమును సాధించినపురుష వరేణ్యులు, విదుషీమణులు పవిత్రీమ్యులలో వేనవేలు గలరు. ఇక మనదేశమునందలి కులభేదములో, యెన్నడో యేకారణముననో యుద్భవించినవై కాలక్రమమున స్థిరపడి సంఘమునం దిప్పటికిని దిటవుగా నాటుకొనియున్నవి. అనేకశతాబ్దములక్రిందట నేర్పడినయానిబంధనములకు గానులై కోట్లకొలఁది ప్రజలు సకలమానవసామాన్యము లగు స్వామ్యములకుఁ గూడ వెలియైనవారై యనంతములైనయిడుమలఁ గుడుచుచున్నారు. ఆనిర్బంధముల గోరంత నతిక్రమించినను ఘోరపాపముగాఁ బరిగణింపఁ బడుచున్నది. ఇట్టి యన్యాయములు పవిత్రమైన మతముపేరిట జరుగుచుండుట మరింతసంతాపకరము గదా! సకలాభివృద్ధికి భంగము నాపాదించుచుఁ జిరకాలమునుండి మనభరతఖండము నావేశించి యున్నయీవర్ణవైషమ్యపిశాచము హతమగునంతవఱకు విడువక యుద్ధము సలుపుటకై బ్రాహ్మసమాజము సంసిద్ధమై యున్నది. ఎట్టియాటంకములు తటస్థించినను వెనుకంజ వేయక, యెద్దియోతీరున సమాధానము చేసికొన వెగపడక స్వభావవిరుద్ధములును, న్యాయవిరుద్ధములును, నీశ్వరోద్దేశప్రతికూలములు నైనయీభేదభావము లంతరించు దనుక నీసమరము సాగించుటకు బ్రాహ్మసమాజికులు కృతప్రతిజ్ఞులై యున్నారు.

సంఘమునందలియెల్లరును సమానులనియెడునీయాదర్శమూలముననే బ్రాహ్మ సమాజముపై ననేకులకు ననూయత పొడముటకు హేతువు గలిగినది. జాతిభేదము లను నిరసించినందునఁ బూర్వాచారపరాయణులగుహిందువులు బ్రాహ్మసమాజముమీఁద ద్వేషము వహించిరి. ఈకులభేదములను నిరసించక పోయినచో హిందూసంఘ మొకవేళ బ్రాహ్మసమాజముయొక్క యేకేశ్వరవాదమును, నేకేశ్వరోపాసనమును సహించియుం డును. కాని సర్వానర్థదాయక మైన యీకులభేదమహీరుహమును గూఁకటివేరుతో నూడఁబెఱుకుట బ్రాహ్మసమాజము తనముఖ్యధర్మములలో నొక్కటిగాఁ జేసికొనియు న్నది. ఒకవైపునఁ బూర్వాచారపరులను గోపోద్దీపితులను జేసియు, మఱియొకవైపున వంశపరంపరగా దీర్ఘకాలమునుండి కొంద అనుభవించుచున్నయధికారగౌరవములకు భంగము నాపాదించియు, యిట్లు పలువురకు ననిష్టము గలిగింపవలసివచ్చినను నోర్చి తన యుద్దిష్టధర్మమైనమానవభ్రాతృత్వమును మాత్రము బ్రాహ్మమతము విడువక నిలుపఁబెట్టు చున్నది. నిమ్నజాతులుగా నెంచఁబడెడుపంచమాదులయొక్క సముద్ధరణము బ్రాహ్మ

సమాజముయొక్క మహత్కార్యములలో నొకటి. బహుశతాబ్దములాదిగా నిప్పటి వఱకును కఠోరము లగు సాంఘికశాసనములఁబట్టి నిర్దయతోఁ జూడఁబడుచున్న యీ యంత్యజాతులవారికి బ్రాహ్మసమాజ మభయహస్తమిచ్చి కాఁచుచున్నది. ఈహీనజాతులకు సాహాయ్యము చేయఁగల్గుట తనమహాభాగ్యముగా బ్రాహ్మసమాజము భావించును.

సకలమానవులును సమాను లనియెడునీయుత్తమధర్మమును స్త్రీలపక్షమునను వర్తింపఁజేసి బ్రాహ్మసమాజము జనప్రీతికి మఱింత దూరమయ్యెను. హిందువులు నాగరికాగ్రగణ్యులై జ్ఞానాధికులై యుండినప్రాచీనకాలమునందు హిందూస్త్రీలును నున్నతదశయం దుండి సమస్తకళల నభ్యసించుచు సంఘమునకు వన్నెయు వాసియుఁ దెచ్చి రనుట కనేకనిదర్శనములు గలవు. కాని కడచినకొన్నివందలసంవత్సరములనుండి హిందూభామినులయవస్థ యతిహీనమై శోచనీయముగా నున్న దనుటకు సంశయము లేదు. స్త్రీవిద్య యొకగొప్పదోషముగా నెన్నఁబడెడుదుర్గతి తటస్థించినది. భర్తలకు విధేయురాండ్రై గృహమును దిద్దుటకుఁ దప్ప తక్కినయేపనులకును గొఱగానివారుగా వనిత లెన్నఁబడుచున్నారు. పరులఁ జూడనీక తెరలమఱుగునఁ బదిలముగా నుంచఁబడుచున్నారు. ఈశ్వరునిచే దయాపూర్వకముగ నొసంగఁబడినచక్కనివెలుతురునందుఁ దిరుగాడుటకు వారికి నవకాశములేదు. నిర్మలవాయువును పీల్చుటకు వారికి వీలు లేదు. బుద్ధిని వికసింపఁజేసికొనుటకుఁ గాని, శరీరారోగ్యమును గాపాడుకొనుటకుఁ గాని యవకాశమే లేకయుండ నిఁక వారియాధ్యాత్మికస్థితిని గూర్చి యోజించువా రెవ్వరు? ఇవ్విధమున జ్ఞానవిషయమునను శారీరవిషయమునను ఆత్మవిషయమునను మనదేశపు నుదతులయొక్కయవస్థ యత్యంతవిచారకరమై భారతీయుల కెల్లరకు మిగుల లజ్జాకరముగా నున్న దనుటకు సందియము లేదు. పురుషులయొక్కప్రయోజనమునిమిత్తమును సౌఖ్యమునిమిత్తమును స్త్రీలు సృజింపఁబడినట్లు తలంపఁబడుచున్నారు. పవిత్రగ్రంథములుగాఁ బరిగణింపఁబడు భారతాదిగ్రంథములయందలి వనితలనుగూర్చి వర్ణనము లక్కడక్కడ నతిహేయములుగా నుండును. అనేకభాగములయందు వారు కామైకప్రధానలుగాను, విశ్వాసానర్హలుగాను నభివర్ణింపఁబడిరి. తండ్రియో, భర్తయో, కుమారుఁడో శ్రద్ధఁదీసికొననిచోఁ జెడిపోయెడుచంచలమతులుగా స్త్రీలు వర్ణింపఁబడిరి.

మానవస్వభావమునుగూర్చి తనకుఁ గలయున్నతభావమున కనుగుణముగా బ్రాహ్మసమాజము ప్రప్రథమముననే స్త్రీపురుషులకు స్వాతంత్ర్యము సమానముగా నుండవలె

వని నియమించియుండెను. ఆ మొట్టమొదటియేర్పాటు ననుసరించి సంఘమునందలిసర్వవిషయములను సవరించుచున్నది. స్త్రీలకు మిక్కిలివేదనాకరములుగా నుండెడు నెల్లదురాచారములను మెల్లమెల్లగా నిర్మూలముచేయుటకు బ్రహ్మసమాజము దృఢప్రయత్నములను జేయుచున్నది. అతిఘోరమైన ఘోషాపద్ధతినిఁ దొలఁగించి పరమేశ్వరునిచేఁ బ్రసాదింపఁబడిన స్వచ్ఛమైనవాయువును సూర్యరశ్మిని స్వేచ్ఛగా ననుభవించుచు విద్యాలాభమును బొందుట కవకాశ మిచ్చుటయే గాక, విద్యలలో నెల్ల నగ్రగణ్యమై, యీశ్వరసద్భావమును బ్రకటించెడుబ్రహ్మవిద్యను గూడఁ బడయుటకు సదుపాయము చేయుచున్నది. సంఘమునం దిట్టిస్వాతంత్ర్యమును సతులకు నొసంగఁ బూనుకొనుటచే బ్రాహ్మసమాజము ప్రజలయొక్క యాదరమును బోఁగొట్టుకొనెను. స్త్రీల నుద్ధరించెడువారని బ్రాహ్మసమాజికులను గొంద ఱొకకాలమునందుఁ బరిహసించియుండిరి. ఆహాస్యము చేసినవా రిప్పుడు బ్రాహ్మసమాజ మొనరించినమహోపకారమును గుర్తించి ప్రస్తుతించుచున్నారు. యుగయుగములనుండి యంధకారమునఁ దపవులాడుచున్నవారికి బ్రాహ్మసమాజము సూర్యకాంతియొక్క సౌఖ్యమును జవిచూపిన దని చెప్పవచ్చును.

ఇదేతీరున గృహసంబంధములైనవిషయములందును సంఘసంబంధములైనకార్యములందును సాధ్యమయినంతవఱకు ధర్మన్యాయానుసారముగా బ్రవర్తించుటకు బ్రాహ్మసమాజము గడంగుచున్నది. యీశ్వరసమ్మతములైనయిట్టిసకలసంస్కారములను గావించి గృహమును భూతలస్వర్గముగా మార్చుట బ్రాహ్మసమాజముయొక్క యాశయము. ఎవ్వరో కొందఱుజ్ఞానులకు మాత్రమే సాధ్య మగుమతము బ్రాహ్మమతము గాదు. ప్రశాంతములగుపర్ణశాలలలో మాత్రమే యనుష్ఠేయ మగుమతము బ్రాహ్మమతము గాదు. సంఘమునం దుండుసమస్తజనులు నవలంబించి యానందింపఁదగుమతము బ్రాహ్మమతము. సకలాభీష్టప్రదాయకుఁ డగుసర్వేశ్వరునియనుగ్రహమువలన భారతమహాసంఘమును ధర్మానుగుణముగను, న్యాయానుసారముగను, ప్రేమానుకూలముగను బునర్నిర్మాణము చేయుట బ్రాహ్మసమాజముయొక్క ముఖ్యాభిలాష.

---

# తొమ్మిదవ ప్రకరణము.

## ఉపసంహారము.

కడచిన ప్రకరణములయందు బ్రాహ్మసమాజముయొక్క ప్రధానసిద్ధాంతములను విశదపఱచియున్నారము. ఆసిద్ధాంతము లొకవేళఁ గేవలము నూతనములుగాఁ దోఁపక పోవచ్చును. బ్రాహ్మసమాజమునవలె నుత్తమాదర్శములు గలిగియుండిన భక్తాగ్రేణ్యులచే నట్టిసద్ధర్మములు పూర్వకాలమునందు నయితము ప్రకటింపఁబడియుండనోపును. అయినను నానావిధకష్టజాలములు చుట్టుముట్టినను వెనుదీయక యుదారము లైనయాధర్మసముదాయమును సంఘజీవనమునందుఁ బ్రవేశపెట్టుటకు బ్రాహ్మసమాజము చేసినప్రబల ప్రయత్నములు హిందూదేశచారిత్రమునందే గాక ప్రాపంచికమతచరిత్రమునందును బ్రశంసాపాత్రము లై ప్రకాశింపఁగల వనుటకు సంశయము లేదు. ఈశ్వరానుగ్రహమున బ్రాహ్మసమాజముయొక్క మనోరథము సిద్ధించు నేని లోకము నంతయుఁ గలవరపఱచు చున్నయొక మహాసమస్య పరిష్కరింపఁబడఁగలదు. అమోఘమగు ప్రత్యేకప్రమాణ గ్రంథము లేక, అమోఘవచనుం డగు భవిష్యద్వక్త లేక, యొక సర్వసాధారణమత సమాజమును స్థాపించుట యసాధ్య మని దాదాపుగా సకలజనులయొక్క యభిప్రాయమై యుండెను. అయినను సర్వోత్కృష్ట మైనయామతస్వభావమును నెఱింగినవారు లేక పోలేదు. మేటికవీశ్వరులు తమయనర్గళకవితాలహరియం దట్టియున్నతమతభావములను బ్రవహింపఁజేసియున్నారు. భావిదర్శులయొక్క హృదయాకాశమునం దీయాదర్శము విద్యుల్లతవలె మెఱసియున్నది. తత్త్వవిచారు లీయుత్కృష్టాదర్శమును దమభావ ప్రపంచమునందు దర్శించియున్నారు. అయినను నయ్యది సమస్తజనులకును హృదయ సంతుష్టినిఁ గలిగించునట్టియు సమస్తమానవులచే ననుష్ఠేయ మగునట్టియు మతముగా మాత్ర ముపకరింపఁజాల దని బుద్ధిమంతులయొక్కయు భక్తులయొక్కయు నభిప్రాయ మై యుండెను. పూర్వమతచారిత్రములనుబట్టి చూచితి మేని యిట్టియనుమానమునకుఁ గావలసినంతయవకాశము గలదు. లోకమునందలిమతములయొక్క చరిత్రములను బరీ

క్షించితిమేని ప్రతిమతమును ప్రారంభమునఁ బర్వతాంతరాళమునుండి వెలువడెడు జలప్రవాహమువలె మిక్కిలి నిర్మలమై కాలక్రమమున బహువిధజాతిమాత్సర్యముల తోడను మూఢాచారములతోడను గలసి కలుషిత మయినట్లు మనము గ్రహింపఁ గలము. పరిశుద్ధమై సాధారణమై యాధ్యాత్మిక మైనమతము మనదేశములో మిగుల నధోగతిని జెందియున్నది. సన్మతోద్ధారణము మనదేశములో సాధ్య మగునా యను సందేహమును గూడఁ బొడమించునంతటిదుస్థితి ప్రాప్తించినది. ప్రతిమారాధనము ప్రబలమైనది. ఆచార్యు లసంఖ్యాకులు గలరు. ప్రమాణగ్రంథములు పెక్కు లున్నవి. కులజాతిమాత్సర్యములకు మితి లేదు. బౌద్ధయుగానంతరమున నీయనర్థము లన్నియు మనమతమునందు మూలాంగములుగాఁ బ్రవేశించియున్నవి. ఎందఱో మతాచార్యులు భక్తవర్యులు మనదేశమునందు జన్మించినను వారీప్రతిబంధకములను నతిక్రమింపఁ జాలరైరి. కోట్లకొలఁది దేవతలను గల్గి యనేకజాత్యుపజాతులుగాను, శాఖోపశాఖలుగాను భిన్నభిన్నమై యున్న యీభరతఖండమునందు సకలమానవులకును సమానజనకుండగు నేకేశ్వరునియొక్క యాధ్యాత్మికోపాసనమును స్థాపింపఁ బూనుకొనుట బ్రాహ్మసమాజముపట్టిన నతిసాహసకార్యముగా నెంచవచ్చును. ఎన్నియిక్కట్టులు తటస్థించినను సుస్రిక్కక ప్రతిఘటించి నిలిచి "దేవుఁ డొక్కఁడు; మానవకోటి యొక్కటి" యనుధర్మమును బ్రాహ్మసమాజము లోకమునకుఁ బ్రకటించుచున్నది. ఎందఱు సదుద్దేశముతో విగ్రహారాధన మావశ్యక మని వాదించినను, నిం కెందఱు కపటవాదులు హేత్వాభాసములచేఁ బ్రతిమారాధనమును సమర్థింపఁ బూనినను, బ్రాహ్మసమాజము రవంతయైనను జళింపక యావాదములనెల్ల ఖండించుచు నట్టి యారాధన మనావశ్యక మనియు నాత్మానందభంగకర మనియుఁ జాటుటయే గాక ప్రతిమారాధనముతో నెట్టిసంబంధము నైనను గల్గియుండుట గాని ప్రతిమారాధనముగా భావింపఁదగినయెట్టిచిహ్నమైనను దాల్చుట గాని తగ దని ఘంటాపథముగా వెల్లడించుచున్నది. స్వకీయజీవనమునందే గాక గృహసంబంధములైనట్టియు సంఘసంబంధములైనట్టియు సర్వకార్యములయందును బ్రాహ్మసమాజికుఁడు విగ్రహారాధనమును విసర్జింపవలెను. పుట్టినదాది మరణపర్యంత మతఁ డనంతుఁడును నద్వితీయుఁడు నగు పరబ్రహ్మమునే యాత్మపూర్వకముగా యథార్థముగా నుపాసింపవలయును. అతని నొక్కనినే సేవింపవలయును. బ్రాహ్మసమాజముయొక్క యుపదేశములవలన

మనదేశమునందు నాత్మస్వరూపుఁడగుభగవంతుని నధ్యాత్మికముగా నుపాసించెడునభ్యాస మేర్పడుచున్నది. వందలకొలఁదిగా నందందు వెలసియున్న యీబ్రాహ్మోపాసకసమాజములే యిందులకు నిదర్శనములు. ఆత్మపూర్వకమైన యుపాసనయొక్క ప్రాశస్త్యమును బ్రకటించుటకు మహర్షి దేవేంద్రనాథుఁడు, కేశచంద్రసేనుఁడు, ఆనందమోహనబోసు మొదలగు మహనీయులే సాక్షీభూతులుగా నున్నారు.

వర్ణభేదములగూర్చియు బ్రాహ్మసమాజము సందిగ్ధము లేనినిశ్చితాభిప్రాయములఁ గలిగియున్నది. వర్ణశాఖాభేదములను గాని జాతికులవివక్షతలను గాని బ్రాహ్మసమాజము పాటింపనొల్లదు. బ్రాహ్మణాదిసమస్తకులస్థులును బ్రాహ్మసమాజమునఁ జేరవచ్చును; చేరియున్నారు. భారతదేశమునందలి యెల్లజాతులవారిని బ్రాహ్మసమాజము సమ్మేళనము చేయుచున్నది. నానాప్రాంతములందలిబ్రాహ్మసమాజికులు సమావేశ మయినపుడు చూచుట కెంతయు నుత్సాహకరముగను మనోహరముగను నుండును. సకలమతావలంబులును సమస్తజాతులవారిని నాసమావేశమునందుఁ జూడవచ్చును. హిందువులు, మహమ్మదీయులు, క్రైస్తవులు, యూదులు, బంగాళీలు, మహారాష్ట్రులు, అరవలు, ఆంధ్రులు, కర్ణాటులు, మళయాళీలు, పాంచాలులు, విహారీలు, ఒరియాలు, ఆస్సామీలు, వీరందఱును నొక్కకుటుంబమునకుఁ జెందినవారుపోలె సోదరభావమున నచ్చటఁ గూడియుందురు.

మతసాంఘికవిషయములందుఁ గల్పింపఁబడినయనేకకృత్రిమతారతమ్యములనుబట్టి యెల్లదేశములందును నందు ముఖ్యముగా మనహిందూదేశమునందు స్త్రీలు పలువిధములైన యిడుమలఁ బాలుచేయఁబడుచున్నారు. బ్రాహ్మసమాజమునందలియంగనామణుల కట్టి కష్టము లేమియు లేవు. పురుషులతోఁ బాటు వారు సమానస్వాతంత్ర్యమును గల్గియున్నారు. బ్రాహ్మసమాజమునందుఁ జేరినమగువలందఱు స్వేచ్ఛానుసారముగాఁ దమబుద్ధిని నీతిని మతజ్ఞానమును బెంపొందించుకొనవచ్చును. పురుషులతోఁ బాటు సమస్తవిశేషాధికారములను స్వామ్యములను బరిగ్రహించుటకు సంపూర్ణావకాశము నొసంగుటయే గాక వానిని బడయునట్లు చేయుటకును బ్రాహ్మసమాజము స్త్రీలకుఁ గావలసినప్రోత్సాహము నొసంగుచుఁ దోడ్పడుచున్నది. పురుషులకువలెనే నారీమణులకును సుఖదాయకము లగు నెల్లవిషయములందును బాల్గొనుటకుఁ బరిపూర్ణాధికారము గలదు. పురుషులకుఁ గూడ వర్తింపనియేశాసనములను గాని యేనిబంధనములను గాని ప్రత్యేకముగా స్త్రీలకొఱకు

బ్రాహ్మసమాజ మెన్నటికిని జేయదు. సర్వకళాశాలాపరీక్షలయందును భాషావైదుష్య మునందును నిఖిలకళానృత్తులయందును బ్రాహ్మనారీమణులు పేరువహసియున్నారు.

సామాజికపరిపాలనమునందును బురుషులకుంబలె స్త్రీలకును సమానాధికారము గలదు. మతోపదేశికురాండ్రై సుందరీమణులు గొందఱు తమకార్యములను శ్లాఘాపాత్రముగా నిర్వహించియున్నారు. వివాహసంబంధములయందును బురుషులు పాటింప నావశ్యకము లేనివిశేషనియమములు గాని విధులు గాని పడంతులకుఁ బ్రత్యేకముగా నేమియు లేవు. బాల్యవివాహములను బ్రాహ్మసమాజము నిషేధించినది. ఇష్టముండినచోఁ బునర్వివాహమాడుటకు వితంతువులకు సంపూర్ణస్వాతంత్ర్యము గలదు. బ్రాహ్మసమాజమునందు వివాహ మొకపవిత్రమైనవిధాయకకృత్యముగా భావింపఁబడుచున్నది. పరులబలాత్కారమువలనఁ గాక వధూవరుల యాన్యోన్యసమ్మదముప్రకారము బ్రాహ్మసమాజమునందు వివాహములు జరగుచుండును.

ఇట్లు శ్రేష్ఠములై, శాశ్వతములై, యుదారములై, సకలజనాంగీకరణములైన న్యాయప్రీతిధర్మములఁ బునాదిగాఁ జేసి యొకసాధారణమతసమాజభవనమును భారతవర్షమున నెలకొల్పుటకు బ్రాహ్మసమాజ ముద్యమించుచున్నది. గతించిన నుమారెనుబది సంవత్సరములలో నట్టిమతసమాజమహీరుహముయొక్క బీజాంకురములు భరతఖండముయొక్క వివిధప్రాంతములయందు నాటఁబడినవి. బ్రాహ్మసమాజముయొక్క సాంఘికాదర్శములను మతాదర్శములను నను మోదించువారు పెక్కండ్రు గలరు. కాని ప్రకృతమునందు హిందూసంఘమున నవలంబింపఁబడుచున్న విగ్రహారాధనమును కులభేదములను తదితరదురాచారములను దురభ్యాసములను బరిత్యజించుటకుఁ గావలసిన ధైర్యస్థైర్యములనేకులకుఁ గొఱవడియున్నవి. సంఘసంస్కారమును దమపనిగాఁ బూనుకొనిన యనేకమతసమాజములవలెనే బ్రాహ్మసమాజము గూడఁ బూర్వాచారపరులకు మిక్కిలి యనిష్ట మయినది. బ్రాహ్మమతమును స్వీకరించినయెల్లవారును సంఘమునుండి బహిష్కరింపఁబడి ప్రేమాస్పదులైన జననీజనకులనుండియు బంధువర్గమునుండియు జీలిపోవలసినవారగుచున్నారు. అక్కారణముచే సత్యమునందు దృఢానురాగము గలవారు, ఏకేశ్వరునియందు నిశ్చలభక్తిగలవారు, అకుంఠితములైన ధైర్యసాహసములు గలవారు, సర్వసంపదలకన్నను దేవునినే మిన్నగాఁ జూచెడువారు ఇట్టిసుగుణాభిరాములు మాత్రమే బ్రాహ్మమతమును స్వీకరింప సమర్థులై యుందురు. హిందూసంఘమునందుఁ గల

కఠినములైన కట్టుబాటులవలనను, పురోహితకోటికిఁ గలయధికప్రాబల్యమువలనను బ్రాహ్మసమాజము తనకార్యమును ధారాళముగను సులభముగను సాధింపఁజాలదయ్యెను. అయినను నింతదనుక బ్రాహ్మసమాజము పొందినయభివృద్ధి యెంతమాత్రమును నిరుత్సాహ జనకము గాదు. హిందూస్థానమునందలి ప్రతిజాతియందును బ్రాహ్మసమాజము ప్రవేశించియున్నది. యిరోపా అమెరికాఖండవాసు లీయుద్యమమును సంస్తుతించి యున్నారు. భరతఖండమునందలి యెల్లభాషలలోను బ్రాహ్మసమాజమునుగూర్చిన గ్రంథములు రచింపఁబడుచున్నవి. అన్నిటిని మించి విద్యాధురీణులసకలప్రయత్నములును సమస్తాలోచనములును బ్రాహ్మసమాజముయొక్క యాదర్శముల కనుగుణముగా మాఱుచున్నవి. వారు తలంచుతలంపులయందును, ఇచ్చునుపన్యాసములందును, రచించు గ్రంథములందును ప్రదర్శించునాదర్శములందును బ్రాహ్మసమాజముయొక్క యభిప్రాయములే గానవచ్చెడు. కాలనిర్ణయము చేయుటకు సాధ్యము గాకపోయినను, అనతి కాలములో బ్రాహ్మసమాజము సర్వజనాంగీకారపాత్రమై దిగ్విజయము గాంచి భారతవర్షమునంతయు నూతనవికాసభాసురము సేయు ననుటకు సంశయము లేదు.

సత్యమేవ జయతే

ఓమ్ తత్సత్



(వీరులను గనుదానవును, దేవతాభక్తికలదానవు నగుము మాకు సుఖముఁ గలిగించుదానవు గమ్ము.)

సుప్రజాభివృద్ధియు, దంపతుల పరస్పర సౌఖ్యాభివృద్ధియు వివాహముయొక్క ముఖ్యోద్దేశములుగాఁ పైశ్లోకద్వయమువలన గోచరమగుచున్నవి. స్వజాత్యభివృద్ధి జేయుటలో మానవునకును నితరజంతువులకును భేదమేమియు లేదు. జ్ఞానాంతఃకరణయుతుఁడై సుఖసంతోషలాభములఁ బొందఁగలవాఁడగుటచే మానవుఁడు సంసారము నపేక్షించు సాంఘికజీవి యగుచున్నాఁడు. అందువలన నెట్టమొదట స్వజాత్యభివృద్ధినిమిత్తమై యాతనికి స్త్రీతోఁ గలిగిన సమావేశమంతటితోఁ దీఱక యొండొరులు ప్రపంచమునందు సజీవులై యుండువఱకు నిలిచియుండెడు గాఢమైన బంధముగా నేర్పడినది. "వివాహపరిణామ" మను మహాగ్రంథమును రచియించి వాసిగాంచి నలీటార్నో యను పండితశేఖరుఁడును నిందు జేర్కొనఁబడిన వివాహోద్దేశములతో నేకీభవించుచున్నాఁడు.

పూర్వోక్తములైన వివాహోద్దేశము లేవిధముగా మానవసంఘమునం దంకురించి కాలక్రమమునఁ బెంపొందెనో పరికింతము. వివాహపరిణామమునందు ముఖ్యముగా మూఁడువిధములైన యవస్థ లున్నట్లు లీటార్నో వ్రాసియున్నాఁడు. ప్రథమమున వివాహానుబంధము లేక స్త్రీపురుషులు స్వేచ్ఛానుసారముగాఁ గలియుచుండిరి. తరువాతను వివాహబంధ మేర్పడినను పురుషులు, బలాఢ్యులగుటచేఁ దమ కిచ్చవచ్చినంతమంది భార్యల స్వీకరించుచుండిరి. పిమ్మట మనుష్యుఁ డేకపత్నీవ్రతస్థుఁడై యుండవలెనను నిబంధన మేర్పఱుచుకొనిరి. ఈ త్రివిధావస్థలును హిందూశాస్త్రములలోఁ జేర్కొనఁబడిన యష్టవిధవివాహములను దెలుపుచున్నవి.

సకలేతరదేశములందువలెనె మనదేశమునందును ఆదికాలమునందు మనుష్యులరణ్యములలో సంచరించుచుఁ దోఁచినట్లు మృగములవలె సంతానాభివృద్ధిఁ జేయుచుండిరి. కాని కాలము గడచినకొలఁది మానవుఁడు జ్ఞాననేత్రసహాయముచేఁ దన హీనస్థితిని దెలిసికొని, వివాహానుబంధమువలన నున్నతదశను బొందుటకు మార్గమేర్పఱచికొనెను.

సహజముగా బలవంతు లగుటచేఁ బురుషులు మోహావేశపరవశులై బలహీనలగు యువతులను బలాత్కారముగాఁ దీసికొనిపోయి వివాహముఁ జేసికొనుచుండిరి. కొన్నిసమయములయందుఁ దదుష్కార్యముల కిష్టమువచ్చిన వస్తువుల

బంధులగు బంధువులను జంపి హతశేషులగు చుట్టములును నాపెయు విలపించుచుండ, నాయువతిని గొంపోయి పురుషులు వివాహమాడసాగిరి. కామాంధులైన పురుషులచే జరుపఁబడుచుండిన యీకిరాతవివాహములను మనపూర్వులు రాక్షస పైశాచవివాహము లని పేరుపెట్టి మనుష్యమాత్రులకివి యయోగ్యములని విధించిరి. దుష్టమృగసామాన్యమగు క్రూరస్వభావము కొంచెము తగ్గి సభ్యత హెచ్చ నారంభించిన కొలఁది తొల్లిఁటి రాక్షసకృత్యములు క్రమముగా నంతరించెను. కాని జననీజనకులు తమపుత్రికలను పశువులవలెఁ జూచుకొనుచు వివాహాపేక్షితులై తమవద్దకు వచ్చిన పురుషులవద్దనుండి భూపశ్వాదిరూపమైన ప్రతిఫలముల స్వీకరించుచుండిరి. ఇట్టి వివాహములను మనపూర్వులు ఆసురవివాహము లని శాసించిరి. పెద్దలయనుమతినిఁ బాటింపక వధూవరు లొండొరులఁ బ్రేమించుకొని పరిణయమాడుకొనెడు గాంధర్వవివాహములు జరుగసాగెను. ఉత్తమవివాహమునకు ప్రధానాంగమగు వధూవరుల యన్యోన్యప్రేమ నీవివాహములు గలిగియున్నను, ఈప్రేమ కొన్నియెడలఁ దాత్కాలికమే యగుటచే నివియును కామైకప్రధానము లనియే చెప్పవలసివచ్చుచున్నది. కాని సదుద్దేశసంయుతములై యొప్పనేని ఈవివాహములు నీతిదాయకములై సుఖప్రదములై విలసిల్లు ననుటకు సందియము లేదు. కామోద్రేకమును శమింపఁజేసికొనుటయే ముందు పేర్కొనఁబడిన నాల్గురీతుల వివాహములలోను ముఖ్యోద్దేశముగా నుండినకతమున, బహుభార్యాస్వీకారము సామాన్యమయ్యెను. ఇది వివాహపరిణామమునందు ద్వితీయావస్థ.

ఈచతుర్విధవివాహములే గాక యార్ష, ప్రాజాపత్య, దైవ, బ్రాహ్మము లనియెడు మఱి నాల్గుతరగతుల వివాహములును గలవు. పరులసంబంధ మించుకైనను లేక యన్యోన్యసమ్మతమున వివాహము లందందు జరగుచుండినను మాతాపితలకుఁ దమకుమారితలమీఁదఁ గల యధికారము మాత్రము సన్నగిల్లినది కాదు. ఆసురవివాహములందువలె కొలఁదికిమీఱిన ప్రతిఫలములను గోరక వధువుతల్లిదండ్రులు వరునివద్దనుండి రెండుజతలయావులనో యెద్దులనో గ్రహించెడు నార్షవివాహపద్ధతి యొకటి యారంభమయ్యెను. ఈవివాహములందు దీసికొనెడు కన్యాశుల్కము మిక్కిలియల్పమే యైనను,

"శ్లో॥ ఆర్షే గోమిథునం శుల్కం కేచిదాహుర్మృషైవతత్।
అల్పోవాపి మహాన్వాపి విక్రయస్తావదేవసః"

# మానవసేవ.

అను శ్లోకము ననుసరించి క్రయరూపము గల్గుచుండుటచే హేయముగాఁ జూడఁబడసాగెను. అయినను ఈకల్పమునందు క్రయలక్షణము లైన వృద్ధి క్షీణతలు గాని బేరమాడుట గాని లేకపోవుటచే క్రయ మనిచెప్పుట సరికాదని శ్రీ మాధవాచార్యులవారు తమ వ్యాఖ్యానములోఁ బొందుపఱచిరి. ఆసురవివాహములే మాఱి యార్షవివాహము లైనవనియు, రథగోశతాదివస్తువులనే వరుఁడు పేరునకు మాత్ర మిచ్చిపుచ్చుకొనుచు వ్యవహరించి యాచారమును గొంతకాలము నిలువఁ బెట్టుచుండిరనియు, తదనంతరము మది క్రమక్రమముగా పశువులు పుచ్చుకొనుట మాత్రమై తల్లిదండ్రులు పుచ్చుకొనెడు శరణముగా నేర్పడిన దనియు హిందూన్యాయశాస్త్రము రచించిన మెయినుదొరగారు అభిప్రాయపడుచున్నారు.

ఎట్టులైన నేమి యార్షవివాహములకంటె గౌరవనీయములగు ప్రాజాపత్య, దైవ, బ్రాహ్మవివాహములు ప్రశంసింపఁబడినవి. "శ్రుతిసమ్మతమైన యాచారముతో యుక్తమైనకన్యను కప్పి పూజనేసి తానే (వధువుతండ్రి) పిలిచి దానమిచ్చుట బ్రాహ్మవివాహ మనియు, ఋత్విజుఁడు యాజ్ఞికము సేయించుచుండగా నాకాలమందు కొమార్తె నలంకరించి దానము సేయుట దైవవివాహ మనియు, మీరుభయులు కలిసి ధర్మమును ననుష్ఠింపుచుండు డని నోటఁజెప్పి కన్యాప్రదానము సేయుట ప్రాజాపత్యవివాహ మనియుఁ బిలువఁబడుచున్నవి." ఈవివాహములు తృతీయావస్థను దెలుపుచున్నవి.

ఇట్లు విశదీకరింపఁబడిన యష్టవిధవివాహములు తంతువులును వివాహకారోద్దేశముల కనుగుణములుగా నున్నవో విచారింతము. కన్యాపహృతికి విధముగా జరుపఁబడెడు రాక్షస పైశాచవివాహములు సుప్రజాభివృద్ధికిఁ గాని సంసారసుఖమునకుఁ గాని సాయపడఁజాలవని నిస్సందేహముగాఁ జెప్పవచ్చును. ఆకారణముచేతనే ధర్మశాస్త్రకారుఁడగు మనువు ఈద్వివిధవివాహములను నిషేధించియున్నాడు.

శ్లో॥ షడానుపూర్వ్యా విప్రస్య । క్షత్రస్య చతురోవరాన్

విట్శూద్రయోస్తు తానేవ । విద్యాద్ధర్మ్యాన్నరాక్షసాన్

మనుస్మృతియం దంగీకరింపఁబడిన మిగిలిన యారువిధములలో ప్రస్తుతము మనము విచారింపఁదగినవి బ్రాహ్మ ఆసుర గాంధర్వము లనెడు మూఁడు మాత్రమే. నాగరికతఁ జెందిన యేదేశములలోను ఆర్షవివాహపద్ధతి యిప్పు డాచరణమునందు లేదు. దైవ, ప్రాజాపత్య, బ్రాహ్మవివాహములలో బ్రాహ్మణు

ప్రధానమైనవగుటచే ప్రస్తుతము సామాన్యముగా జరగెడు వి[illegible] వివాహము లనియే భావింతురు. కాని వాస్తవ మాలోచించితి మేని తఱుచుగా జరుగుచున్న వివాహము లన్నియుఁ గొంతవఱకు అసుర వివాహము లని చెప్పవలసియుండు నేమో యని తోఁచుచున్నది. అయినను అసురవివాహపద్ధతిలోఁ బరిణయాపేక్షఁ గల వరుఁడు వధువుతల్లిదండ్రులకు ధనాదు లిచ్చి సంతృప్తిఁ జేయుట కలదు. కాని యీనాఁడు జరుగుచున్నట్లుగా వధువుతల్లిదండ్రులే వరునికి వేయినూటపదియార్లు లిచ్చుట గాని, న్యాయపరీక్ష గడతేఱువఱకు గుధన మొసంగునట్లు ప్రతిజ్ఞాపత్రము వ్రాసి యిచ్చుట గాని లేదు. అక్కడక్కడ కామప్రాధాన్యములగు గాంధర్వవివాహములును జరుగుచుండును. ఐరోపా, అమెరికా మొదలైన దేశములలోఁ జేయఁబడు వివాహములు గాంధర్వము లని యందురు కాని, యావివాహములలో కామమే ముఖ్యముగాఁ జూడఁబడక గుణవిద్యాదులు గూడ గణింపఁబడుటచే నవి గాంధర్వ వివాహము లనుట యంతగా నొప్పిదము కాదు.

కన్యకాంగీకారము గాని వరునివిద్యాగుణాదులు గాని గణియింపఁబడక ధనసంగ్రహణమే ముఖ్యముగా నెంచఁబడుటచే అసురవివాహములవలన సంసారసుఖము చేకూరునటుకు వీలు లేదు. సద్యఃకాలమునందుఁ గలిగిన కామోద్రేకముచే సంభవించెడు గాంధర్వవివాహములవలనను కుటుంబసౌఖ్యము సమకూర నేరదు. ఇఁక బ్రాహ్మవివాహములలో కన్యాప్రదానమే ప్రధానముగా గణింపఁబడుచున్నది. శుల్కగ్రహణము లేకపోయినంత నే వివాహనియమములన్నియు నెఱవేఱలేదు. వరునివిద్యాయోగ్యతలును, ఆరోగ్యభాగ్యములును కన్యకాభీష్టమును, శ్రేష్ఠమైన వివాహానుబంధమునందు విచారింపవలసియుండును. వివాహపరిణామగ్రంథకర్త హిందూవివాహమునుగూర్చి తనయభిప్రాయము నిట్లు తెలిపియున్నాఁడు.

“సామాన్యముగా నది (హిందూవివాహము) యేకపత్నీత్వము నెంత విధించునదియైనను నీతివిషయమున మిక్కిలి యధమము. భర్తకుఁ గల క్రూరమైన స్వామ్యము, నిరాతంకమైన యాతనియధికారము, భార్య (పతివ్రత) సేవకావృత్తి, పసితనముననే పరిణయ మొనరించుట, యన్నిటిని మించిన కులగర్వమును ధనాసక్తియు హిందూవివాహశాసనము, నీచములైన చిత్తవృత్తులచేఁ బురుషుల ప్రయోజనార్థము గల్పింపఁబడిన దని వేనోళ్లఁ జాటుచున్నవి.”

## ఉత్తమవివాహనిర్వచనము

అష్టవిధములైన వివాహములను వివాహోద్దేశముల నెరవేర్పఁజాలిచో నెట్టి యుద్వాహము తదుద్దేశముల ఫలింపఁజేయ సమర్థమైయుండును? దేహసౌష్టవము నందును బుద్ధివైభవమునందును, నయశీలమునందును, మతవిశ్వాసములందును ననురూపులగు స్త్రీపురుషు లిరువురకుఁ బరస్పరానురాగమువలన నమకూరిన సమాగమము నుత్తమవివాహ మన నొప్పుచున్నది. సకలవిధముల ననుకూలురగు భార్యాభర్తలు నిరంతరసుఖాబ్ధిం దేలుచు, సద్గుణసంపన్నమగు సంతానమును బడసి యిహలోకమందే స్వర్గలోకానందమును బొందుదురనుట కేమి సందేహము?

## ఎవరు తగినవారు?

ప్రజాభివృద్ధికరమును, సమస్తసుఖావహము నైన యిట్టి వివాహముల జేసికొనుట కెవరు తగినవారు? సర్వమానవులకును వివాహేచ్ఛ స్వాభావికమగుట చేతను, నారోగ్యభాగ్యమునకుఁ గారణభూతమగుటచేతను స్త్రీపురుషు లెల్లరును వివాహములఁ జేసికొన నర్హులనియే చెప్పవలసియుండును. అయినను నిరంతర వ్యాధిబాధచేతనో, యంగవైకల్యముచేతనో, వార్ధక్యముచేతనో సంసారసుఖమనుభవింపలేనివారు పరిణయమాడుట యుచితము కాదు; కుటుంబపోషణభారమును వహింపఁజాలనివారును వివాహముఁ జేసికొనుట యెన్నటికినిఁ దగదు. వెనుకముందు లారయక వివాహములకై సిద్ధమయ్యెడు యువకులు క్రిందిశ్లోకరాజమును జ్ఞప్తియందుంచుకొనుట యత్యంతావశ్యకము.

శ్లో. గృహస్థో లాలయేత్ దారాన్ విద్యామభ్యాసయేత్సదా
గోపయేత్ స్వజనాన్ బన్ధూ నేషధర్మస్సనాతనః॥

గృహస్థు భార్యను గారవింపవలయును; నిరంతరము విద్య నభ్యసింపవలయును; తనవారిని బంధువులను రక్షింపవలయును; ఇది సనాతనధర్మము.

సకలవిధముల వివాహమునకుఁ దగియున్నను దమబ్రహ్మచర్యదీక్షవలన లోకమునకు మహోపకారము చేయఁ దలచునట్టి పురుషవరులను మనము వివాహపాశముచే గృహమునకు బంధించుట యనుచితము. శ్రీశంకర, దయానంద వివేకానందాది మహాభాగులు ప్రపంచమున కొనరించిన మేలును మన మెఱింగినదే కదా! పశ్చిమఖండవాసులలో ననేక నారీమణులు బ్రహ్మచారిణులై పరోపకారమునందుఁ

దము జీవితములఁ గడపుకొనుచున్నారు. అట్టివారిలో నగ్రగణ్యయై ప్రపంచమునం దెల్లఁ గొండాడఁబడుచున్న మిస్ నైటింగేలు దొరసానియొక్క నామ మొక్కటి చెప్పిన చాలును. లోకశ్రేయోభిలాషులగు నీస్త్రీపురుషులే గాక ధర్మశాస్త్రతము లైన ప్రత్యేక కారణాంతరములచే వివాహేచ్ఛ విసర్జించియుండు మఱికొందఱు స్త్రీపురుషులును గలరు. నిజజనకుని వివాహసానుకూల్యార్థమై యావజ్జీవము బ్రహ్మచారిగా నుండిన మహాయోధుఁడగు భీష్ముఁడును, వికలాంగియైన తనప్రియ సోదరియొక్కయు వృద్ధుఁడైన తనజనకునియొక్కయు సంరక్షణార్థమై యవివాహి తుఁడుగా నుండిన చార్లుస్లాంబును, న్యాయయుక్తముగాఁ బ్రేమించిన స్త్రీపురుషుల దమ్ము నిరాకరించుటచేఁ బరిణయమాడక ధర్మబద్ధులై యుండు పురుషులను స్త్రీలును, నీసందర్భమున జేర్పఁదగియున్నారు.

## ప్రభుత్వమువారు—వివాహములు.

సంసారభారమును వహింపవలసినవారును, సుఖదుఃఖముల ననుభవింపవలసిన వారును వధూవరులగుటచేఁ దమవివాహమును నిశ్చయించుకొనుటకు వారే తగి యుందురు. అయినను నందుకు భిన్నముగా జరుగుచుండుట సర్వసామాన్యమై యున్నది. కొన్నికుటుంబములు వివాహసంబంధములవలన నేకమైనపుడు ప్రభుత్వ మునకు భంగము కలుగవచ్చును. ఇట్టి యుపద్రవము రాచకుటుంబములలోఁ గలు గుచుండును. నరపాలకు లిట్టి వివాహములలో సంబంధముఁ గలిగించుకొని వాని నివారించుచుందురు. సామాన్యముగా జరుగు వివాహములను ధర్మశాసనబద్ధము లుగా నంగీకరించి తన్మూలమునఁ గలుగు సంతానముయొక్క వారసత్వాదిస్వా తంత్ర్యములఁ గాపాడుట ప్రభుత్వమువారి ధర్మమై యుండును.

## మతగురువులు—వివాహములు

మతగురువులు చేయవలసిన విధాయకకృత్య మొకటి కలదు. స్త్రీపురుషు లిరువురు ప్రేమించుకొని మతవిధుల ననుసరించి తమపరిణయమును జరుపు మని మతగురువుల నభ్యర్థించినపుడు వీరు లేని ప్రతిబంధకములఁ దెచ్చిపెట్టక వారివివా హార్థులను దమ ప్రార్థనాదికములచేఁ బావనపఱుపవలసియుండును.

## తల్లిదండ్రులు—వివాహములు

స్త్రీపురుషు లొండొరుల ప్రేమించుకొని వివాహము చేసికొన నిశ్చయించు కొనునపుడు తల్లిదండ్రులు సామాన్యముగా నడ్డమువచ్చుచుందురు. ఇట్టి

యభ్యంతరములు తలచుచుగా స్త్రీ పురుషులకు వివాహస్వాతంత్ర్య ముండి, వయసువచ్చిన తరువాత నుద్వాహములు జరుగు జాతులలోఁ గలుగుచుండును. పాశ్చాత్యులలో నిట్టి యాటంకములు కలుగుట కెక్కువ యవకాశము కలదు. సంపూర్ణయౌవనలగు స్త్రీలకే యీదేశమునందలి మహమ్మదీయులలోను వెలమలు మున్నగు శూద్రులలోను వివాహములు జరుగుచున్నను, దుర్గంధ్యమైన ఘోషా పద్ధతివలన స్వతంత్రముగా వరుని నిర్ణయించుకొనుటకు మగువలకు వీలులేదు. తల్లిదండ్రులే తమపుత్రపుత్రికావివాహముల నిర్ణయించుచుందురు. ఇఁక బ్రాహ్మణ వైశ్యాది కులములలో విభాగజ్ఞానములేని బాలికలకే వివాహములు జననీజనకులచే స్వతంత్రముగా జరుపఁబడుచుండుటచే వరుని యోగ్యతా యోగ్యతలను దెలిసికొనుటకు వధువునకు నవకాశములేదు. మిక్కిలి బాల ప్రాయముననే వివాహితులగు పురుషులను నిందింపఁ బనిలేదు గాని యుక్తాయుక్తవివేకము గలిగి గొప్ప పరీక్షలలో గడతేఱిన విద్యార్థులు సయితము తల్లిదండ్రులచేత కీలుబొమ్మలై బాల్యవివాహములను సమ్మతించుట కడు శోచనీయము. సకలసౌఖ్యాధారమైన వివాహవిషయమునందయినను దమస్వాతంత్ర్యమును నిలువఁబెట్టుకొనుట పురుషుల ధర్మము. ఇది సంసారసౌఖ్యమునకే కాక సంఘాభివృద్ధికిని ముఖ్యావశ్యకమని నొక్కి వక్కాణింపవలసియున్నది. ఇట్లు స్వయముగాఁ దమయుద్వాహముల నిశ్చయించుకొనుటచేఁ దల్లిదండ్రులను ధిక్కరించుచున్నారని యెంచక తాము వారిమీఁద నున్న యొకగొప్పభారమును దొలగించినట్లుగా పురుషులు భావింపవలయును. యుక్తవయస్కులు కాకపూర్వమే స్త్రీపురుషులు వివాహము చేసికొనఁజూచునప్పుడును సహాయమపేక్షించినప్పుడును తల్లిదండ్రులు జోక్యము కలుగఁజేసికొనుట భావ్యమైయుండును. మనభారతమునందు శ్రీసావిత్రీవివాహవిషయమున నామె ప్రియజనకుడగు మద్రేశ్వరమహారాజు నుడివిన యీక్రింది వాక్యరత్నములు సామాన్యముగా తల్లిదండ్రులు తమకూఁతులవివాహమునందుఁ గనఁబఱచవలసిన భావమును దెలుపుచున్నవి.

గీ. "తల్లి నీగుణరూపవృత్తముల కెందుఁ । దగినవాని నీవ యిమ్ముగఁ దడవి నెమ్మి
నీమనస్సు కెక్కిన నృపకుమారుఁ । గోరి వరియింపు మిదియ నాకును ప్రియంబు"

## వివాహనియమములు.

ముందు నుదాహరింపఁబడినవిధమున నుత్తమవివాహములను మనసంఘము నందు నెలకొల్పఁ దలఁతుమేని మనము పాటింపవలసిన నియమములు కొన్ని కలవు.

"క. శ్రీయును, కులమును, రూపము, ప్రాయము, శుభలక్షణంబు, బాంధవ, విద్యా,
శ్రేయము గల వరు నిలఁ గన్యాయుతుగాఁ జేయువలయు నధిక ప్రీతిన్"

"విద్యాచారబంధుశీలలక్షణసంపన్నాయ దద్యాత్" (గౌతమసూత్రము.)

వీనినిబట్టి మనము వివాహములలో వరునివిషయమునఁ జూడవలసినలక్షణములు కొన్ని యెఱుకపడుచున్నవి. వరుని కులవిద్యారూపలావణ్యములును, భూగృహాది భాగ్యములును నీకాలమున వివాహమునకుఁ దగిన యోగ్యతలుగాఁ బరిగణింపఁబడు చున్నవి. ప్రతివివాహసంబంధమునందును నీవిషయముల గమనించుట యత్యంతా వశ్యకమే యైనను, నింతకంటె శ్రేష్ఠతరములైనవియు సామాన్యముగా నిర్లక్ష్యము చేయఁబడునవియు నైన పెక్కొన్ని ముఖ్యాంశములనుగూర్చి ముచ్చటింపవలసియున్నది

## ప్రాయము.

వధూవరుల యుక్తవయస్సులను గూర్చి యిపుడు బొత్తిగా నాలోచించుట లేదు. వివాహ మన నేమియో యెఱుఁగని పసిబిడ్డలకే సామాన్యముగా వివాహ ములు జరుగుచున్నవి. పదేండ్లబాలికకు వరుఁ డన నేమి తెలియును? సంసార గౌరవము నెట్లా బాల గుర్తింపఁగలుగును? పతిమర్యాదను గ్రహించినట్టియు మత ధర్మములఁ దెలిసికొన్నట్టియు కన్యయే వివాహముజేసికొన నర్హురాలని యీ క్రింది శ్లోకమువలన దెలియఁగలదు.

శ్లో. అజ్ఞాత పతిమర్యాదా, మజ్ఞాత పతిసేవనాం
నోద్వాహయేత్ పితాబాలా మజ్ఞాత ధర్మశాసనాం

ఇంతియేగాక, పైఁజెప్పఁబడిన పాణిగ్రహణసమయమున జరుగు వరుని ప్రతి జ్ఞవలనఁ గూడ స్త్రీపురుషులు బాల్యప్రాయులు గాక ప్రౌఢవయస్కులై యుండవలె ననియే స్పష్టమగుచున్న దని వేదవివాహవిధానమును రచించిన మైసూరునివాసు లగు శ్రీమాధవశాస్త్రివారు వ్రాసినారు. ఐరోపా అమెరికా దేశములందువలె మనకన్యకలకును వయస్సువచ్చినతరువాత వివాహముసేయుట మనదేశస్థితిలో నిషిద్ధమని కొందరు చెప్పుదురు. మనదేశములో గమనింపఁదగిన కన్యావివాహ ప్రాయమునుగూర్చి గణించిన బ్రహ్మానంద కేశవచంద్రసేనులవారు వైద్యశిఖామణు,

ణుల యభిప్రాయములను సేకరించి వివాహకాలమునకు యువతులకుఁ గనీసము పదు నాలుగేండ్లయిన నుండవలెనని నిశ్చయించిరి. అపుడు వయోనిర్ణయముచేసిన భిష జ్ఞణులలో ననేకులు కన్యలకుఁ బదునారేండ్లును బురుషులకు నిరువదిరెండువత్స రములును నుండుట శ్రేష్ఠతమ మని యభిప్రాయపడిరి. వివాహనిషేకమునకు వయ స్సు నిర్దేశించుటలో మనపూర్వవిఖ్యాతవైద్యశాస్త్రజ్ఞులగు సుశ్రుత, వాగ్భటులును నిప్పటి వైద్యవేత్తలతో నేకీభవించిరి. ఈసంగతులను బట్టి ప్రస్తుతము జరుగు చున్న వివాహము లశాస్త్రీయము లనియు, నక్రమము లనియు ననారోగ్యకరము లనియుఁ దేటతెల్లమగుచున్నది.

## బాంధవ్యము.

హిందువులలో బాంధవ్యమును నిలువఁబెట్టుకొనునిమిత్తము మేనత్తమేన మామల కొమార్తెల వివాహముజేసికొనుట యాచారమైయున్నది. తోఁబుట్టువుల కుమారితలను దమపుత్రులకుఁ బెండ్లిచేసికొనుటయు సామాన్యముగా జరుగుచుండును ఇట్టి వివాహములు మనశాస్త్రములలో స్పష్టముగా నిషేధింపఁబడినవి. సమీప రక్తసంబంధులగువారితో వివాహములు జరుగుట వలన వంశమునందు బలహీనులు పుట్టి కొంతకాలమునకు నాశమును జెందునని వైద్యశాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు.

“వివాహనిషేకధర్మప్రదీపిక” యను గ్రంథము రచించిన శ్రీజంగమకోట శ్రీనివాసరావుగా రీవివాహములనుగూర్చి యిట్లు వ్రాయుచున్నారు. “మేన మామకొమార్తెలను వివాహములు చేసికొనుటవలన నావంశములలో రూపవంతులును ధైర్యవంతులును బలిష్ఠులును బుట్టుట తగ్గుచున్నదని యూహింపవలసినదిగానున్నది. ఉత్తరదేశమందువలె దక్షిణదేశమందు జనులు దార్ఢ్యవంతులుగను, రూపవం తులుగను తరుచుగ లేరు. దక్షిణదేశమందు మేనమామకొమార్తెలను తప్పక వి వాహముచేసికొను వైశ్యులలో రూపవంతులు మిక్కిలి యరుదు. ధైర్యగుణమంత కన్న తక్కువ. ఋజుత్వము మఱియు లోపము. కంఠధ్వనియు నట్లనే యున్నది. ఇది యనుభవసిద్ధమని నాకుఁ దోఁచుచున్నది” “అసగోత్రా మసపిండా మసమాన ప్రవరాం కన్యాంవరయేత్” మొదలైన విధుల నేర్పఱిచి, వానిని నుల్లంఘించువారిని చండాలతుల్యు లని శపించుటయే గాక చాంద్రాయణాదిరూపమైన శిక్షలఁగూడ ననుభవింపవలెనని మనశాస్త్రకర్తలు నియమించియున్నారు.

## అన్యోన్యప్రేమ.

వయోవిద్యాదులయందు నెంత యేకీభావ మున్నను వధూవరులలో నన్యో న్యానురాగము లేకపోయినపక్షమున వారి వివాహమువలన సుఖమునకు మాఱుగ

దుఃఖమే ఘటిల్లును. అయినను నీప్రేమను గుర్తించుట మిక్కిలి దుర్ఘటము. ఎన్ని సుగుణము లున్నను ననుకూలత లేనిపక్షమున నవియెల్ల సంసారసుఖమును చేకూర్ప లేవనుటకు కీర్తిశేషుఁడైన లార్డుబైరను అను హాణకవీశ్వరుని వివాహము సాక్ష్య మిచ్చుచున్నది. ఈతఁడు గుణవతియు, రూపవతియు, విద్యావతియు నైన యొక సుందరిని బరిణయమాడెను. ఈయంగనామణియొక్క గుణాధిక్యతను బలువురచే వినినవాఁడగుటచేతను సౌందర్యమును గన్నులారఁ జూచినవాఁడగుటచేతను, వ్యా మోహితుఁడై యాతఁడు వివాహముచేసికొనెను. కాని వివాహానంతరము వారిద్ద ఱకు నన్యోన్యప్రేమ లేకపోవుటచేఁ బొసఁగదయ్యెను. తత్కారణముచే నాతఁ డాభార్యను విడువవలసినవాఁడాయెను. ఒండొరుల గుణవిశేషములనుబట్టి వధూ వరులకు నన్యోన్యానురాగము కుదురుట సద్వివాహబంధమునకు ముఖ్యావశ్యకము

## పరస్పరమతానుకూలము.

వివాహ మొనరించుకొనఁదలఁచు స్త్రీపురుషులలోఁ బరస్పరమతానుకూల ముండుటయు మిగుల నభ్యర్థనీయము. మతాభిప్రాయములలో సమత్వము లేనియె డలఁ దగినసఖ్యత భార్యాభర్తల కుండఁజాలదు. విరుద్ధమతాభిప్రాయులగు తలిదం డ్రుల శిక్షణమునందుఁ బెరిగెడు బిడ్డలు సద్వర్తనమునుగాని సద్విద్యాలాభమునుగాని బొందనేరరు. తండ్రి నాస్తికుఁడును తల్లి యాస్తికురాలు నయ్యేనేని యొండొ రుల యుపదేశములు సామాన్యముగా విరుద్ధములుగా నుండుటచే వారిబిడ్డలు మఱి యొకవిపరీతమతము నేర్పఱచుకొనవలసినవా రగుదురు. అంత దూరమేల? సంస్కరణాభిలాషులగు భర్తలకును, బూర్వాచారపరాయణలగు భార్యలకును గల సఖ్యతను మనము గాంచుటలేదా?

## స్నేహభావము.

గాఢమైనమైత్రి గల యిద్దఱుపురుషు లొకరిని విడిచి మఱియొక రుండఁ జాలరు. ఫలనిరపేక్షముగా వీరొండొరులఁ బ్రేమించుకొందురు. అట్టులే స్త్రీపురు షు లిరువురు భార్యాభర్త లనినకారణమున నేగాక యన్యోన్యబుద్ధిగుణాదులమూల మున స్నేహభావమును గలిగియుండవలయును. అంతియేకాక తమయర్ధాంగులపై నిరంకుశాధికారమును జెల్లించుట పురుషుల కెన్నటికిని దగదు. లేడిపిల్లపైకి దుముక నుంకించు బెబ్బులివలె భర్త తనభార్యపైకి రేఁగుచుండును. క్రూరుఁడగు యజ మానికిని సేవకునకును వెన్నడైన సఖ్యము గలుగనేర్చునా? వివాహబంధఫలవలని యమోఘలాభములఁ బొంద నభిలషించెడు భర్తలు తమయహంభావత్వమును

వీరుకాని భార్యల మర్యాదతో జూడక సలకలుముకొనజాలరు. వృద్ధుఁడగుటచే మగనిముఖము ముడుఁతలుపడి వివర్ణమైయున్నను సత్పత్ని యాతని మొగమునందు యౌవనమునందు దనమనస్సు నపహరించిన వికాసమునే కనును. వార్ధక్యముచేతనో రోగబాధచేతనో భార్య విరూపిణిగానున్నను సత్పతి యామెయందు వివాహకాలమునందుఁ దనహృదయచౌర్యముగావించిన రూపరేఖావిలాసములనే చూచును.

## వివాహబంధచ్ఛేదము.

ఈ యభిప్రాయము హిందువుని మనస్సునకు మిక్కిలి వెగటుగాఁ దోఁచును. బాగుగ నాలోచించి చేసికొనెడు వివాహములలో నిట్టి వివాహబంధచ్ఛేదమున కావశ్యకమే యుండఁజాలదు. ధనాశచేతనో కామోద్రేకముచేతనో జరిగెడు వివాహములలో నిట్టి యావశ్యకత తఱుచుగాఁ గలుగుచుండును. హృదయపూర్వకముగాఁ బ్రేమించి యొకపురుషునిఁ బరిణయమాడిన నారీమణి మున్ను మహాపతివ్రత సావిత్రి చెప్పిన యీక్రిందివాక్యములనే నుడువును.

క॥ వినుము మనోవాక్కాయము, లనఁ మూఁడుదెఱఁగు లందు నంతఃకరణం
బనఘా! ప్రధానము గావున, మనమున నైకొన్న భర్త మానందగు నేఁ॥ ఆరణ్యపర్వము

ఉత్తమవివాహభాగ్యమును బొందిన సుందరీమణి యేదేశమునకుఁ జెందినదైనను నీవాక్యములనే చెప్పును. అనురాగ మద్వితీయమగుటచే మనసారవరించి పరిణయమాడిన స్త్రీపురుషులు పునర్వివాహమునకు నంగీకరింపఁజాలరు. అయినను నొండొరుల బ్రేమింపకొనని స్త్రీపురుషులను సంసారముచేసి సౌఖ్యమనుభవించున ట్లెవ్వరును జేయఁజాలరు. కాన నట్టి యదృష్టహీనులగు దంపతులకు వివాహబంధచ్ఛేదముఁ జేసికొన దొరతనమువా రనుజ్ఞయిచ్చుటె భావ్యమని తోఁచుచున్నది.

## ఉపసంహారము.

బహుభార్యాస్వీకార మస్వాభావికమును, సంసారసుఖభంగకరము నగుటచే పురుషుఁ డేకపత్నీవ్రతస్థుఁడై యుండుట యుత్తమవివాహమునకు ముఖ్యలక్షణము. ఇంతియెగాక వధూవరులు వయోవిద్యాగుణాదులలో నేకీభావముఁగలిగి సంసారచక్రము నడుపుటకు సర్వవిధముల సమర్థులై యుండవలెను. పరస్పరానురాగబద్ధులై యేకమతాభిమానులై, యహంభావశూన్యులై పరమేశ్వరప్రీత్యర్థముగా దమయిహలోకయాత్ర సలుపుదురేని యట్టి భార్యాభర్తలు, ఆరోగ్యవంతులును, గుణవంతులును, విద్యావంతులు నగు సంతానమును గల్గి సుఖసౌభాగ్యములందులఁదూఁగుచు దా మానందించుటయే గాక ప్రపంచమునకంతకు మేలుబంతులై రాజిల్లుచుందురు.



శ్రీరాజా రామమోహనరాయలు.

అభినవభారతీయులకు

# శ్రీ రాజారామమోహనరాయలవారి సందేశము.



ఉ॥ "స్వార్థముద్రుంచి దుర్విషయ • వర్గముఁ ద్రుంచి భజించి సత్యమ
త్యర్థము దేశభక్తి నన • యంబును నింపి హృదిన్ పరోపకా
రార్థమి దంశరీరమను • నంచితధర్మము నెంచి ధీరులై
యర్థిఁ జరించి మించెదము • హాత్ములు పొల్తురు గొంకటిద్ధరన్".

అతి పురాతనమైన వేదకాలమాదిగా నీకాలము వఱకును మన భరతఖండమునందు మహానుభావుల నేకులు జనన మొందుచున్నారు. ఎందఱో బ్రహ్మజ్ఞానులు, ఎందఱో మతోద్ధారకులు, ఎందఱో కవీశ్వరులు, ఎందఱో రాజనీతి విశారదులు మన భరతవర్షమునందు నుదయించి తమ మాతృదేశముయొక్క కీర్తిని దిగంతముల దనుక వ్యాపింపఁజేసిరి. అట్టి మహాపురుషులు పలువురు కడచిన నూరుసంవత్సరములలోను మన భారతభూమియందు నుద్భవించిరి. నూతనశకమని చెప్పనొప్పు నీవర్షశతములో భారతమాత గర్భమునఁబుట్టిన నవీనపురుషావతంస సంతతికెల్ల మూలపురుషుఁడు శ్రీరాజారామమోహనరాయలు.

మహనీయుల మహాత్మ్యమును సామాన్యజనులు కాలక్రమమునఁగాని గ్రహింపఁజాలరుగదా! ఇంగ్లాండు దేశమునందలి బ్రిష్టలునగరములో రామమోహనుఁడు ప్రాణవిరామమునొంది యిప్పటికి డెబ్బదియేఁడు సంవత్సరములు గతించినవి. మన హిందూదేశ హితార్థమై కృషిచేయునిమిత్తమే యీమహాత్ముఁడు దూరప్రయాణాద్యనేక ప్రయాసలకులోనై పరదేశమున కరిగి యచట మృతిఁజెందినను, అజ్ఞానాంధకారావృతులై యున్న మన దేశవాసులపుడు చీమకుట్టినంతమాత్రమైనను నొచ్చుకొనరైరి. కానిస్వీయ సద్గుణవిశేషముచే నావిదేశమునందు నయిత మాయన సంపాదించుకొనిన స్నేహబృంద మెల్లఁ దమయత్యంత సమీపబంధువొకఁడు కాలధర్మమొందినట్లాతని మరణమునకుఁగన్నీరు మున్నీరుగా విలపించిరి. మనదేశము నపుడావహించి యుండిన యజ్ఞానదేవత యిపుడు చాలవఱకుఁ దొలఁగుటచేఁ గ్రమక్రమముగా నామహాపురుషుని గొప్పతనమును దెలిసికొని మనమందఱమాతనిని గౌరవింపఁజూచుచున్నారము. శుక్లపక్ష చంద్రికలవలె నాపురుషోత్తముని కీర్తిద్యుతులు దినదినాభివృద్ధిఁగాంచుచు హిందూదేశముయొక్క నల్దెసల నల్లుకొనుచున్నవి. ముప్పది సంవత్సరముల క్రిందట నామహితాత్ముని నామము విన్నవారు మనయాంధ్రదేశములో నత్యల్ప సంఖ్యాకులే యుండియుందురు. ఇపుడన్ననో విద్యా

సంపన్నులగువారిలో నాయన పేరెఱుఁగని వారుండుట యరుదని నిస్సంశయముగాఁ జెప్పవచ్చును. మన తెలుఁగుదేశము మాటయేల? ఆయనజన్మస్థానమైన వంగదేశమునందుఁ గూడ ముప్పదిసంవత్సరములక్రిందట నాతనినిఁ దెలిసినవారు విశేషసంఖ్యాకులుండిరియుందురా యని సందేహించవలసియున్నది. ప్రకృతమునందు నెక్కడనో మాఱుమూలలందక్క మిగిలిన సమస్తప్రదేశములయందు నతని పవిత్రచారిత్రము మిక్కిలి మక్కువతోఁ జెప్పుకొనఁబడి శ్లాఘింపఁబడుచున్నది. ఎక్కడ వీక్షించినను రామమోహన రామమోహన రాయల పేరిటి ప్రతిష్ఠాపనలే కానవచ్చెడు. ఎన్నియో విద్యాలయములు, ఎన్నియోభక్తకూటములు, ఎన్నియోపఠనమందిరములు, ఎన్నియోముద్రాయంత్రస్థానములు రామమోహనుని యందలి గౌరవసూచకముగా నెల్లెడలను స్థాపింపఁబడినవి. ఇఁక రామమోహనుని నామముఁ దాల్చినవారో పెక్కండ్రుగలరు.

ఈరీతిగా జగద్విశ్రాంతమైన యశస్సును సంపాదించిన యీమహామహునివద్ద నవభారతీయులకు సందేశముపదేశింపఁగల యోగ్యతలేమికలవో, యాసందేశములెవ్వియో తెలిసికొనఁగడంగుటకుఁ బూర్వము పందొమ్మిదవ శతాబ్దారంభకాలమున మనదేశమెట్టి స్థితియందున్నదో యెఱుంగుట ముఖ్యావశ్యకము.

## దేశస్థితి.

హిందూదేశ చరిత్రలో నీకాలము మిగుల ప్రశస్తమైనది. దేశముయొక్క భావిస్థితిని నిర్ణయించెడు గొప్పమార్పులనేకములు నాఁడుజరిగియుండెను. వంగదేశపు నవాబును అతికౄరుఁడునునైన సురాజితడౌలా సింహాసనభ్రష్టుఁడుగావింపఁబడెను. పరదేశవాసులగు నాంగ్లేయులు వంగదేశరాజ్యమును స్వీకరించి హిందూదేశములోఁ దమప్రభుత్వము స్థాపించుకొనుటకుఁ బునాదిని వేయుచుండిరి. పురాతన రాజ్యములెన్నియో యణఁగి వానిస్థానమున నూతనరాజ్యములు బయలుదేఱెను. చిరకాలగతమైన హిందూనాగరికతయెల్ల మెల్లమెల్లగా నాఁలకుఁదొలఁగి మహమ్మదీయ నాగరికతకు జోటియ్యసాగెను. భారతభూమి యందప్పుడపుడే కాలుస్థిరముగాఁగుదురుపఱచుకొనుచున్న యాంగిలేయుల నాధారము చేసికొని పాశ్చాత్యనాగరికతయు దేశమునందుఁ బ్రవేశించి హిందూ మహమ్మదీయ నాగరికతల రెంటిని దిగమ్రింగ నుంకించుచుండెను. పరస్పర విరుద్ధములైన యీత్రివిధనాగరికతలును నొకచోఁగూడిన కారణముచే మనదేశవాసుల కులమతాచారములు క్రమక్రమముగా మార్పునొంద నారంభమయ్యెను. వేయేల? భారతమాత చాలకాలము ధరించుటచే వినుగుఁజెంది తన ప్రాతవలువను విడిచి వేఱొక నూతన వస్త్రధారణముఁ జేయుచున్నదేమోయనునట్లు తోచెను.

అత్యుత్తమమైన యుపనిషన్మతమును బరిత్యజించి జనులు నానావిధదేవతలనారాధింపసాగిరి. ఏకామేవాద్వితీయమ్మను వేదవాక్యమును నాఁడు గ్రహించువారులేరైరి. శక్తిపూజలు సిడియాటలు దేశమునందు మెండయ్యెను. విగ్రహారాధన మెల్లెడలవిరివిగావ్యాపించెను. "ఆత్మానమేవప్రియముపాసీత" యనెడునార్యోక్తియాకాలమునందునర్థశూన్యమాయెను. "యథాదేవస్తథాభక్త" యనినట్లు నారాధించెడు బొమ్మలవలె

నారాధికుల హృదయములును ఱాతిబండలు కాఁగా వారు కరుణావిరహితులై పలుదెఱంగుల బలుల నర్పింపఁ దొడఁగిరి. గణనాతీతములైన వృషభ మహిష మేషాద్యనేక సాధు జంతువులు కాళికాదేవిసమక్షమున నిత్యమును వధింపఁబడుచుండెను. ఆజంతుహింసాకారణమున భూమిమీఁదఁబడిన రక్తము మహాప్రవాహమై కాళికాదేవాలయమునుండి వీథుల వెంటఁబాఱుచుండెడిదని చెప్పుదురు. ఈక్షుద్రజంతువులనే గాక, తోడిమానవులను సయితము తమదేవీప్రీత్యర్థముగా బలివేయుటకు నాశక్తిపూజాధురంధరులు సంకోచింపరైరి. దయమాలితల్లులు తమకన్న గారాబుకూతులను గంగామాతకర్పించి, తమకేదోమేటిలాభము సమకూరునని భ్రమించి సంతసించుచుండిరి. తలఁచిన మాత్రముననే మేనుజలదరించెడి యీఘోరహత్యలు నాఁడు సర్వజనసామాన్యములై సాగుచుండెను. కటకటా! మతమెంతటి దుర్దశపాలయ్యెను. పురోహితులును, పూజారులును పరమగురువులైన దేశమునందింతకంటె నెక్కుడైన మతమెట్లు వర్ధిల్లఁగలుగును? స్వార్థపరులైన పురోహితకోటియొక్క వాక్యములే వేదవాక్యములకంటె నధిక ప్రామాణ్యమును వహించి మూఢులైన యానాఁటి ప్రజలచే శిరసావహింపఁ బడుచుండెను. శాక్తేయుల మతప్రభావమిట్టులుండఁగ నింక నాఁడు దానితో వ్యాపనమునందులఁదూఁగుచున్న వైష్ణవమత ప్రభావము దానినిమించుచుండెను. వైష్ణవమతావలంబులు కేవల మవినీతిపరులై లజ్జాభిమానములఁ ద్యజించి యిచ్చవచ్చినట్లు సంచరింపసాగిరి. వేదములను, శాస్త్రములను, జ్ఞానమును నావలకునెట్టి యాచారమే యుత్తమోత్తమప్రమాణమై జనులపై నిరంకుశాధికారము నెఱపదొడంగెను. మూఢాచారపిశాచవివశులై యుండుటచే వివేకశూన్యులై జనులు కృత్యాకృత్యములఁ బాటింపక యెంతటిహీనకార్యములఁ జేయుటకైనను వెనుదీయకుండిరి. పలుపలుకులేల? భారతీయుల పూర్వప్రాభవమునకు గారణభూతమైన యాధ్యాత్మికాధిక్యత యంతయు నడుగంటి దుర్మత దేవత దేశమునందు యథేచ్ఛముగాఁ దాండవమాడుచుండెను.

సన్మతము జనులలో సన్నగిల్లినతోడనే సంఘసౌష్ఠవమును సడలనారంభమయ్యెను. విద్యానాగరికతలు వ్యాపించిన యీకాలమునందే వైదికులఁజూచిన నియోగులకుఁ బడక యీనియోగులఁగనుగొన్న వైదికులకుఁ గిట్టకయు నొండొరులు గలహించుకొనుచుండ, జనులు విద్యావిహీనులును అనాగరికులునై యుండిన యానాఁడు మతద్వేషము లధికములై యుండుట యొకవింత గాదు. శాక్తేయులును వైష్ణవులును బరస్పరవైరములఁ బెంచుకొని యెల్లప్పుడు కయ్యములకు డీకొనుచుండిరి. వీరి కలహాగ్ని యంతకంతకు నభివృద్ధియై పెనుమంటయై యెన్నటికిని జల్లారక రావణాసురునికాష్ఠమువలె నిరంతరము మండుచుండెను. బ్రాహ్మణులను బరమ గురువులనుగా భావించి వారి యుపదేశముల ననుసరించి వర్తించెడు నితరజాతులవారును జ్ఞానోపదేశమునకు మాఱుగా మతమాత్సర్యములనే గురూపదేశములుగా గ్రహించినవారగుటచేఁ దాముగూడ మతవిరోధములఁబూని తగవులాడుకొనుచుండిరి. ఇట్లు సంఘమంతయు కలహక్రోధములకుఁ దావలమైయుండెను. ఇంతియేగాక దుర్మతాభిప్రాయ ఫలితములుగా సంఘమునందుఁ బ్రవేశించిన దురాచారములును పెక్కులుండెను. వానిలోనెల్ల నతిఘోరమైనది

కవిచంద్రులగు హాఫిజు సాడీలయొక్క మహోపదేశములఁ బఠించెను. ఈమహనీయులు కవిపుంగవులగుటయేగాక తత్త్వవేత్తలునై యున్నతములైన యుపదేశ వాక్యములను లోకమునకు వెల్లడించి శాశ్వతమైన కీర్తిని బడసిరి. గ్రీసుదేశ తత్త్వవేత్తయగు అరిస్టాటలు చేతను గణితశాస్త్రజ్ఞుఁడగు యూక్లిడు చేతను రచింపఁబడిన యుద్గ్రంథముల భాషాంతరీకరణములను రామమోహనుఁడు అరబ్బీభాషయందుఁ జదివినట్లు యోగీంద్ర చంద్రఘోషు వ్రాయుచున్నాఁడు. అనంతరము రామమోహనుఁడు గీర్వాణభాషకుఁ బుట్టినిల్లనఁజెల్లు కాశికాపురికిఁజని తన పదునాలవయేఁడు వఱకు నచట గడపి వేదవేదాంగములను భాషావిషయక గ్రంథములను సమగ్రముగాఁ బఠించెను. మహమ్మదీయవేద గ్రంథములను జాగరూకతతోఁ బరిశీలించిన మీఁదట విగ్రహారాధన యెడఁ గలిగినయసూయ హిందూ వేదములను బఠించుటచే స్థిరపడి యతని హృదయము తరువాత నెన్నఁడును ప్రతిమా పూజ వైపునకుఁ బోవక పూర్ణముగా నేకేశ్వరోపాసనము వైపునకు మరలఁజొచ్చెను. ప్రతిమారాధనము దేశానర్థదాయకమని గాఢముగా మదినెంచినవాఁడగుటచే తద్విషయక ఖండనము నొక చిన్నపుస్తకరూపమున నాతఁడు తన పదునాఱవ యేఁటను బ్రచురించెను. ఈగ్రంథప్రకటనమువలన గ్రామమునందంతట గొప్పయల్లకల్లోలము కలిగెను. అందుపై క్రోధావేశపరవశుఁడై రమాకాంతరాయలు కరుణామాలి కుమారుని నింటనుండి వెడలఁగొట్టెను. గృహమునుండి యీవలకుఁ దఱుముటయే మంచిసమయముగా భావించి పరమేశ్వరుని మీఁదభారమునుంచి ఉత్తరహిందూస్థానమునందును టిబెత్తు దేశమునందును యథేచ్ఛముగా సంచరించి తండ్రి పిలువనంపుటచే నతఁడు మూఁడు నాలుగు సంవత్సరములలోఁ దిరిగి యింటికి వచ్చెను. ఇరువదియైదవ యేఁడు వఱకు గృహముద్దనుండి యాంగ్లేయభాషను బట్టుదలతోఁ జదివెను. కుశాగ్రబుద్ధియగుటచేఁ గొలఁదికాలములోనే యాతఁడా భాషలో ధారాళముగా ముచ్చటింపను, ప్రౌఢమైనశైలిలో వ్రాయను నేర్చెను. పయిచెప్పిన పంచభాషలయందే గాక హిబ్రూ గ్రీకు భాషలలోను నతఁడు పండితుఁడనియే చెప్పవచ్చును. ఈభాషలలో వ్రాయఁబడిన క్రైస్తవ బౌద్ధమత వేదగ్రంథములగు బైబిలు త్రిపేటికములయొక్క మూలగ్రంథముల నాతఁడు పఠించెను. ఇంతియేగాక ఫ్రెంచిభాషను గూడనతఁడాఱు నెలలో నేర్చెనని రామమోహన చరిత్ర రచించిన మిస్ కాలెటు దొరసాని వ్రాయుచున్నది. ఈ రీతిగా నవలీలగా ననేకభాషలఁ జదివి యుండుటచేతనే యలోకసామాన్యమగు నాతని గ్రహణధారణ శక్తులు మనకు విదితములగుచున్నవి. అయినను నామహనీయుని బుద్ధిప్రాబల్యమునకు నుదాహరణముగా నుడువఁబడిన యొకసంగతి నిట వక్కాణించుట యనావశ్యకము కానేరదు.

"ఒక నాఁడొక పండితుఁడీతని (రామమోహనుని) కడకేతెంచి తంత్రశాస్త్రమునుగూర్చి చర్చచేయఁగోరెను. కాని తత్పూర్వమాసంబంధమగు సంగతుల నీతఁడు తెలిసికొనకుండుటచే నాపండితుని రేపిదేసమయమునకు దయచేసినచోఁ గొంత సంభాషింతునని చెప్పిపంపి తోడనే శోభాయను వీధికివెళ్లి యచ్చటి పుస్తకాలయమునుండి తద్విషయక గ్రంథమును దెచ్చి యాదినమెల్ల నాసక్తితోఁ బఠించి తన కుశాగ్రబుద్ధిచేఁ దాని

లోని యంశములనెల్ల గ్రహించి మఱుదినము పండితుఁడు సకాలమునకు వచ్చినంతనే చక్కని యనుభవజ్ఞునివలె వాదించి జయమొందెను. ఇది చూచిన యా పండితుఁడీతని విద్యకును యోగ్యతకును తన సంతోషమును జూపుచుఁ బనివినియెను" (రామమోహన చరిత్ర ఆం॥ భా॥స)

బహుభాషలఁ బఠించి, బహుగ్రంథముల శోధించి బహుదేశములఁ జరించి విశేషజ్ఞాన ధనమునుగడించి, రామమోహనుఁడు శూరాతిశూరుఁడై ధర్మసంస్థాపనార్థము యుద్ధముఁ జేయ నారంభించెను. ప్రప్రథమమున నాతఁడు విగ్రహారాధన మీఁదికి ధ్వజమెత్తెను. ప్రతిమాపూజ వేదప్రతికూలమనియు సకలదురాచారమనియు ప్రమాణములను హేతువులను జూపి జనులతోఁ నాతఁడు వాదింపసాగెను. వాగ్వాదములనే గాక యాతఁడు పత్రికాముఖమునను తీవ్రముగా నీవిషయమును గూర్చి చర్చలు నడపెను. అతని ప్రతిమారాధన ఖండనము వలన ప్రజాసమూహమంతయుఁ గలంగి మహాసంక్షోభము జనించెను దేశమంతయు నట్టుడికినట్టుడక దొడంగెను. జనులందరాతనికి బద్ధశత్రువులైరి. బంధువులు దూరము తొలఁగిరి. స్నేహితులు విడనాడిరి. తలిదండ్రులు గృహమునుండి వెడలఁగొట్టిరి. పర్వతభూములలోను వనప్రదేశములలోను నాతఁడేకాకియై యెండనక వాననక క్రుమ్మర వలసివచ్చెను. అనన్య సహాయుఁడై లెక్కలేని యిక్కట్టుల ననుభవింపవలసిన దుస్స్థితి సంభవించినను, భగవదాధీన మనస్కుఁడై యాతఁడు తన ప్రయత్నమును మానక సమయము సమకూరినపుడెల్ల విగ్రహారాధనను ఖండించుచుండెను.

ప్రతిమారాధనను నిరుత్సాహపఱచుటయే గాక యాతఁడు సహగమనాది దురాచారములు సంఘాభివృద్ధికి భంగకరములని ఘంటాపథముగాఁ జాటుచు వానిని రూపుమాపఁ బ్రయత్నించెను. సాగుమానముయొక్క క్రూరత్వమును గూర్చియు కులీనవివాహదురాచారముయొక్క యమానుషత్వమునుగూర్చియు హిందూభామినుల దీనత్వమును గూర్చియు నాతఁడెన్నియో వ్యాసములవ్రాసి, ఎన్నియో యుపన్యాసములఁ జేసి, దేశమును మూఢాచారవ్యాఘ్రముఖమునుండి విముక్తముచేయ యత్నించెను.

మతసాంఘిక విషయముల యందేగాక రామమోహనుఁడు దేశపరిపాలనా విషయమునందును జోక్యముఁ గలుగఁజేసికొని యందలి లోపములను సంస్కరింపఁ బూనుకొనెను. నిరంతర దారిద్ర్యబాధితులగు కృషీవలుల కాతఁడు ప్రాణమిత్రుఁడై యథాశక్తిగా వారిస్థితిని బాగుచేయుటకుఁ బాటుపడెను. దేశపరిపాలనమును జక్కపఱచుట కొనరింపవలసిన సంస్కారముల నాతఁడు ఇంగ్లాండు నందలి యధికారసంఘమువారికిఁ దెలియపఱచెను.

మతమునందును సంఘమునందును దేశపాలనా విషయమునందును గల లోపముల సవరింపఁ గడంగుటయే గాక దేశాభివృద్ధికరములగు సన్మతాభిప్రాయములను బోధించియు, ఉత్తమసాంఘిక ధర్మములఁ బ్రతిపాదించియు, నూతనరాజకీయాదర్శముల వ్యక్తీకరించియు, భారతజాతీయ భవననిర్మాణమునకు రామమోహనుఁడు శంకుస్థాపనముఁ జేసెను. 1908 సంవత్సరమున కలకత్తానగరమున జరగిన యావద్భారతదేశ పరిశుద్ధాస్తికమత మహామండలియందు శ్రీరఘుపతి వేంకటరత్నముగారు రామమోహనరాయలవారినిగూర్చి యీ ప్రకారముగా నుపన్యసించిరి. "అతనికిఁ బూర్వముదయించిన మహాపురుషులందఱికంటె

రామమోహనుఁడు భిన్నుఁడని నాయభిప్రాయము. భారతదేశవీరులలో నొకనూతన సంతతికి నతఁడు పితరుఁడు. హిందూదేశ చరిత్రమునం దాతఁడొక నూతన శకమును బ్రకటించుచున్నాఁడు. తమ పవిత్ర చరిత్రములచే భారతదేశమునకు ధర్మమును, సౌజన్యమును నవ్వాలిగాఁ బ్రసాదించిన యతనిపూర్వులగు ప్రసిద్ధపురుషులందఱిలో ననేకులు ఋషీశ్వరులు, కొందఱు లోకశ్రేయోభిమానులు కాని యతఁడు హిందూదేశమున జన్మించిన ప్రథమ గణ్యుఁడును, మహోత్తరుఁడును నగు జాతీయోద్ధారకుఁడు. మహానుభావుల నేకులు మనదేశమునందుఁ బూర్వకాలమునందుఁ బుట్టినను రామమోహనునివలె జాతీయ భావమును మనదేశ వాసులలో నెవ్వరును నెలకొల్పఁబూనకరిరి. అందువలననే యాతఁడు భారతజాతీయ నిర్మాతలలో నగ్రగణ్యుఁడనఁదగియున్నాఁడు.''

పలుకష్టములనుసహించి దేశదురాచారములతోఁ బోరాడుటయేగాక భారతజాతీయభవన నిర్మాణమునకు మూలబంధము నాటుటయేగాక దూరదృష్టిని బరికించి మనదేశవాసులు సాధింపఁబ్రయత్నింపవలసిన యుత్తమాదర్శముల నయితమాతఁడు ప్రదర్శించెను. అతఁడు తాను వ్రాసిన వ్రాతలలో నెల్ల నత్యంతమైన దీర్ఘదర్శికత్వమును వెల్లడించెను. అతఁడెన్నడో నుడివియుండిన యనేకాంశములను సాధించుటకు మన భారతీయులిప్పటికిని విడువక కృషి చేయుచున్నారు.

జన్మించిన కుటుంబ గుణాధిక్యతచేతను, అనుభవించిన కష్టపరంపరలచేతను, సాధించిన పాండిత్య విశేషముచేతను, స్థాపించిన సత్ప్రీతిస్థాపనల చేతను, ప్రదర్శించిన యుత్తమాదర్శముల చేతను, రామమోహనరాయలు నవభారతీయులకు సందేశమొసఁగఁగలయోగ్యతలనెల్లఁ గలిగి యున్నాఁడనుటకు లేశమైనను సంశయములేదు.

## జాతీయ జీవనము.

సర్వవిధములచేతను సమర్థుఁడైయొప్పెడు నీమహాపురుషుఁడు నవ్యభారతపుత్రులకు నుపదేశించెడు సందేశముయొక్క స్వభావమెట్టిది? అశాంతియు, అసంతుష్టియు, అజ్ఞానమును దట్టముగా దేశము నందావరించి యున్న కాలమున నందుదయించిన వాఁడగుటచే శాంతమును, సంతృప్తిని దేశము నందు వ్యాపింపఁ జేసి సుజ్ఞాన బీజముల ప్రజల హృదయ సీమలయందుఁ బాదుగొలుపుటయే యాతని ప్రధానోద్దేశము. వీణాగానోపకరణముల యందలి వేర్వేఱు తంత్రులు చేసెడు వివిధధ్వనులను మేళవించి నిపుణుఁడైన గాయకుఁడు మనోజ్ఞమైన సంగీతమును వినిపించు నట్టులె రామమోహనుఁడు స్వీయనైపుణ్య ప్రభావముచే భారత దేశము నందలి వివిధోద్యమములకు సామరస్యమును గలిగించి భారతజాతీయ జీవనమనెడు నత్యంతశ్లాఘ్యమైన గీతరాజమును లోకమునకు వినిపింపవలెనని మదినెంచి తత్సాఫల్యార్థమై విసుగువిరామమెఱుఁగక త్రికరణశుద్ధిగాఁ గృషి చేసెను.

(సశేషము)

## మతవిశ్వాసము ఆచరణము.

అత్యంతాభ్యర్థనీయమైన యీజాతీయ జీవనమును సాధించు నిమిత్తము తదంతర్భాగములైన మతసాంఘికాది విషయములయందు సామరస్యమును గలిగింప రామమోహనుఁడు పూనుకొనెను. ప్రప్రథమముగా మానవుని జీవనోన్నతికి మూలసూత్రమైన మతమును సంస్కరింపనెంచి యామహానుభావుఁడు మీ మతవిశ్వాసమునకు ననురూపమైన ప్రవర్తనముఁగల్గియుండుఁడని జనుల కుపదేశించెను. ఇదియాతని ప్రథమసందేశము ఇట్టి సందేశమునకు నావశ్యకమేమియని కొందఱు సందేహపడవచ్చును. హిందూదేశమతచారిత్రము నొక్కింత జాగరూకతతోఁ బరీక్షించిరేని వారికా సంశయము నివారణముకాకమానదు. ఉపనిషత్తులు మొదలైన యుత్తమ మతగ్రంథములయందు పరమేశ్వరుఁ డద్వితీయుఁడను సిద్ధాంతము స్పష్టముగాఁ గానవచ్చెడు. కాని సర్వోత్కృష్టమైన యీ సిద్ధాంతము గ్రంథస్థమై యుండుటయేగాని ప్రజల యనుభవములోఁ గానరాదయ్యెను. మీఁదుమిక్కిలి యందుకుఁ బ్రత్యక్షవిరుద్ధములైన నానావిధ ప్రతిమారాధనలును ప్రజలలోఁ బ్రబలమయ్యెను. పుస్తకములలోఁ బొందుపఱుపఁబడిన యీ మతధర్మ మెవరో ఋషీశ్వరులు కొందఱు వ్రాసిరని నుడువుటకు వలనుపడదు సకలజ్ఞాన సంపన్నులును అగ్రవర్ణపువారును నగు బ్రాహ్మణులు మొదలుకొని జ్ఞానలవశూన్యులును అధమవర్ణపువారును నగు పంచములవఱకును హిందూమతమందంతట నామతవిశ్వాసము ధారాళముగా వ్యాపించియున్నది. సర్వేశ్వరుఁడొక్కఁడని సర్వహిందువులలోను సామాన్యముగాఁగల యీయభిప్రాయమొక మతకర్తయొక్కగాని ప్రవక్తయొక్కగాని యుపదేశ ప్రాబల్యముచే హఠాత్తుగా జనులలోఁ బ్రవేశించినదికాదు. బహు శతాబ్దములనుండి యీయుత్కృష్టవిశ్వాసము జనులలోఁ గ్రమక్రమముగా వృద్ధిఁజెందినది. తుకారాము నామదేవు కబీరు నందుఁడు మున్నగు మహాభక్తులందఱు శ్రేష్ఠతమములైన తమ యాస్తికబోధనలచే మనదేశస్థులలో నేకేశ్వరవిశ్వాసమును వర్ధిల్లఁజేసిరి. ఈభక్తగణములో బ్రాహ్మణులును,శూద్రులును, పంచములును సకలవర్ణములవారును గలరు. అద్వితీయుఁడును, ఆత్మస్వరూపియునగు పరమాత్మయందు విశ్వాసమొకప్రక్కను బహుదేవతలయొక్కయుఁ బ్రతిమలయొక్కయు నారాధనయు మఱియొకప్రక్కను జనులలో వృద్ధియయ్యెను. జనులమతవిశ్వాసమునకును, ఆచరణమునకును గల యీవ్యత్యాసమునకు గతించిన శ్రీమహాదేవగోవిందరనేడిగా రిచ్చిన సమాధానము నిట వివరించుట యనవసరముకాదు. అద్వితీయుఁడగు పరమేశ్వరుని యాధికారము

సకు లోఁబడియున్న దేవతలుగొన్ని తమయిచ్ఛవచ్చినట్లు మనుష్యుల బాధించుటకును వర్తింపఁజేయుటకును నాతని యనుజ్ఞను బొందియున్నవనియు, నా దేవదేవుని కొలఁదిపుఁగా కయీచిల్లర దేవతల ప్రీత్యర్థముగా కర్మలను పూజలను సలుపవలెననియు జనసామాన్యమునందుఁగల దృఢమైన నమ్మికమె యీ తారతమ్యమునకుఁ గారణమై యుండనోపు నని యీ బుద్ధిశాలి నుడివియుండెను.

తమ హృదయసీమలయందు వేరూనియున్న మతవిశ్వాసమునకును, ఆచరణమునకు ను సామరస్యమును గలిగించుటకే రామమోహనుఁడు ప్రయత్నించినను జనులందఱాతఁడే వియో దేశానర్థదాయకములగు నూతన సంస్కరణములను సంఘమునందుఁ బ్రవేశపెట్టఁ జూచుచున్నట్లుభావించి కళవళపడసాగిరి. అంతియేకాక యతనితో వాదమునకు దొరఁకొనిన యొక లేఖకుఁడు తనయుత్తరములో రామమోహనునొక హిందూ సంఘసంస్కర్తయని సంబోధించెను. అందునకుఁ బ్రత్యుత్తరముగాఁ దాను వ్రాసినలేఖలోఁ దననుగూర్చి రామమోహను డిట్లువ్రాసికొనెను "నేను వ్రాసిన యేవ్రాఁతలలోగాని (చేసిన)యేవాగ్రూపమైన వాదములలోఁగాని యేకేశ్వరుని గూర్చిన సిద్ధాంతములను నేనుసంస్కరించినట్లుగాని క్రొత్తగాఁ గనిపెట్టినట్లుగాని నేనెప్పుడు నటించియుండలేదు. సంస్కర్తననిగాని క్రొత్తగాఁ గనిపెట్టినవాఁడ ననిగాని నేనెన్నడును బిరుదమును దాల్పలేదు. అట్లు చేయక పోవుటయేకాక నేనింతవఱకుఁ బ్రచురించిన ప్రతిగ్రంథమునందును మనపూర్వులచే ననుసరింపఁబడినట్టియు నీకాలపు బ్రాహ్మణ పండితులకు సయితము తెలిసియున్నట్టియు నేకేశ్వరవిషయక సిద్ధాంతములే వాస్తవమైన హిందూమతమని వ్రాసినాఁడను"

ఇట్లు పరిశుద్ధాస్తికమత విశ్వాసమును హిందూసంఘమునందు నిలువఁబెట్టఁబ్రయత్నించినవాఁడు రామమోహనుఁ డొక్కఁడె కాఁడు. ఈతనికిఁబూర్వ మనేకమతకర్తలు అనేకభగవద్భక్తు లిదేవిధమున జనులకుపదేశించియుండిరి. కాని యతఁడవలంబించిన మార్గమునకును వీరవలంబించిన మార్గమునకును గొప్పతారతమ్య మొక్కటికలదు. పూర్వపు భక్తులు గొందఱు పరిశుద్ధాస్తిక మతమును బోధించినవారే యైనను దమ్ము బ్రజలాదరింపరనియో, యేకేశ్వరోపాసన యెల్లవారలకు సులభసాధ్యముగాదనియో, మఱియేకారణము చేతనో, ప్రతిమారాధనమును బహుజనులు సలుపుచుండినను జూచియూరకుండిరి. కాని రామమోహనుఁడట్లుపేక్షింపక దేశమంతయు నొక్కటియై తనను బాధింపఁదలపడినను, అకుంఠితమైన ధైర్యమవలంబించి ప్రతిమారాధనమును ఖండించుటయే గాక, మానసికారా

ధనమును బ్రోత్సాహపఱచుటకు ఆత్మీయసభయను పేరిట నొకసమాజమును స్థాపించెను. ఈసభ నేర్పాటుచేయుటలో నాతనికిఁ దనహిందూసోదరులలో మానసికోపాసనయందు నభిరుచిఁగలిగింప వలయుననియే కాని వేఱుతలఁపేదియు లేదయ్యెను. అపుడాతఁడు తానొక నూతన మతమును లోకమునకు వెల్లడించుచున్నట్లు భావింపకపోయినను, కేవలమొక మతసభగా నేయున్నపక్షమునఁ దన యుద్యమము తనతోడనే యంతరించునను భయమున దానికి బ్రహ్మసమాజమని పేరుఁబెట్టి తత్సమాజోపాసన నిమిత్తమొక మందిరమును గట్టించి భారతవర్షమునందు పరిశుద్ధాస్తిక మతమునకు స్థిరమైన పునాదిని వేసెను. స్వానుగామిసమేతుఁడై రామమోహనుఁ డనేకపర్యాయము ఏకేశ్వరోపాసన మక్కడక్కడ జరపినవాఁడే యైనను స్వయముగాఁ దా నిర్మించిన మందిరమునందు మహదానందముతోఁ బ్రహ్మోపాసనను సలిపిన దినము హూణమాసము జనవరి 23 తేదీకి సరియైన మాఘశుద్ధైకాదశి యగుటచే నాఁడు గొప్పనుదినముగా భావింపఁబడి బ్రాహ్మలచే మహోత్సవము సలుపఁబడుచున్నది. బ్రాహ్మసమాజ చరిత్రమునందే గాక హిందూదేశ మతచారిత్రమునందుఁగూడ నిది యొక పర్వదినమనుటకు సందియములేదు. ఈ దినమున రామమోహనుఁడు పునరుజ్జీవింపఁజేసిన యాధ్యాత్మికారాధనమునందు భిన్నజాతీయులును భిన్నమతావలంబులు నగు ముప్పదికోట్ల భారతీయులను నేకజాతిగా బంధింపఁగల మేటిసామర్థ్యము గలదు.

## ప్రత్యేకోపాసన-సామాజికోపాసన.

తన దేశస్థులు తమ మతవిశ్వాసానుగుణముగా వర్తించునట్లు చేయుటకుఁ గాను రామమోహనుఁడు నెలకొల్పిన బ్రహ్మోపాసనయందు మనము గమనింపవలసిన విశేషాంశమొకటి కలదు. అతఁడు తాఁ బ్రారంభించిన యీశ్వరోపాసనయందుఁ బ్రత్యేకోపాసనకును, సామాజికోపాసనకును సఖ్యతనొడఁగూర్చెను. ఇయ్యది యాతని ద్వితీయసందేశము.

చిరకాలమునుండి మనదేశము భక్తవరులకును, యోగీశ్వరులకును, ఋషిపుంగవులకును నిలయమని లోకవిఖ్యాతినిఁ గాంచియున్నది. వీరలందఱు స్వప్రయత్నబలముచేత బ్రహ్మజ్ఞాన ధనమును సముపార్జించిన మహనీయులు. పరమేశ్వరునిగూర్చి యుత్తమోపదేశముం జేసెడు సద్గ్రంథములన్నియు నీమహాత్ముల కృషియొక్క ఫలితములనియే తప్పక చెప్పనొప్పును. ఒక్క మనదేశమునందే యన నేల? ప్రతిదేశమునందు భక్తితత్పరములును బ్రహ్మజ్ఞానబోధకములునగుపద్యముల రచించి కీర్తనలఁజేసి,ఉపదేశముల నొనరించి సమస్తజనుల మోక్షబుభుక్షను దీర్చినమహాత్ములందఱుస్వయంకృషివలననే తమ తత్వజ్ఞానమునుబడసిరి.

ప్రత్యేకమానవాభివృద్ధికిఁ బ్రత్యేకోపాసన యెట్లావశ్యకమో యాసందముననే సంఘాభివృద్ధికి సామాజికోపాసనయు నావశ్యకమే. ఈవిషయమును విస్మరించి మనపూర్వులు సాంఘికోపాసనలయందు శ్రద్ధవహింపరైరి. ఏకరుఁడై యుపాసన సల్పువాఁడు తనకుఁదా నభివృద్ధిఁ జెందఁగల్గునేకాని పరుల నున్నతస్థితికిఁ దెచ్చుటకుఁ దోడ్పడ నేరఁడు. మానవుఁడు సాంఘికజీవియగుటచే తోడిమనుష్యుల స్థితిగతులఁగూర్చి యుదాసీనుఁడై యుండఁజాలఁడు. పూర్వపుమునివరు లందఱు పరులకంటఁబడకుండ కాననసీమలయందును పర్వత గుహలయందును గూరుచుండి తపస్సుచేసి యీశ్వరతత్వమును గ్రహించిరి. అందువలన నట్టియుత్తమ విద్యాలాభమును బొందుటకు వార వలంబించినసాధనములు సామాన్యజనులకు సాయముఁజేయనయ్యెను. లోకములో విశేషజనులు ముందొకరు నడచిన మార్గముననె తాము నడచుటకే సంసిద్ధులైయుందురుగాని తాముగాఁ గ్రొత్తత్రోవఁద్రొక్క-సాహసింపఁజాలకుందురుగదా! అత్యంత కష్టసాధ్యమైన మోక్షమార్గమున యాత్రసేయు ప్రయాణికుఁడు మార్గదర్శకుఁడుగాని సహవాసులుగానిలేక యొంటరిగాఁబోవ నెట్లు సమర్థుఁడగును? మోక్షాపేక్షులగు మనుష్యులంద అన్యోన్యసాహాయ్యముచే నాత్మీయాభివృద్ధిఁబొందుటకు సామాజికోపాసన లెంతయుఁదోడ్పడుననుటకు సందేహములేదు. అంతియెగాక యిట్టి సాంఘికప్రార్థనలవలన సామాజికులలోఁ బరస్పరప్రేమము వర్ధిల్లును. అన్యోన్యవిశ్వాస మతిశయిల్లును. ద్వేషాసూయలు సన్నగిల్లును. సంఘము బలపడును. ఇట్టిమహోపయోగముల నోడఁగూర్చెడు సామాజికోపాసనలను హిందూసంఘమునందుఁ బ్రవేశపెట్టి రామమోహనుఁ డధికమైన ప్రయోజనముఁ జేసెను.

రామమోహనుఁడవలంబించిన బ్రహ్మోపాసన పద్ధతికిని నిప్పటిపద్ధతికిని గొంత భేదము కలదు. ఏప్రయత్నమైనను మొట్టమొదటనే యుచ్చదశయందుండ నేరదుగదా! అతఁడనుసరించిన మార్గమే యిప్పటికిని బ్రహ్మసమాజమునం దనుసరింపఁబడుచున్నను మేలైనమార్పులు గొన్ని చేయఁబడినవి. అప్పటియట్లే యిప్పుడును శాస్త్ర్యములైన బ్రహ్మగీతములు ఉపాసనాసమయమునందుఁజదువఁ బడుచున్నవి. భగవత్కీర్తనలతో నుపాసన ప్రారంభింపఁబడిన తరువాత నుపాసికులందఱు "ఓంతత్సత్" "ఏకమేవాద్వితీయంబ్రహ్మ" యను వాక్యములనుగూర్చి కొంతకాలమేకాగ్రచిత్తముతోఁ జింతించి, తైత్తిరీయోపనిషత్తులలోని "యతోవా ఇమాని భూతాని జాయన్తే యేన జాతాని జీవన్తి యత్ప్రయన్త్యభిసంవిశన్తి తద్విజిజ్ఞాసస్వ తద్బ్రహ్మ" యను శ్లోకార్థమును గుఱించి యించుక విచారించి, మహానిర్వా

ఆ తంత్రిముననుండి గైకొనఁబడిన యొక స్తోత్రమును జపించి తమ బ్రహ్మోపాసనను ముగించు చుండిరి. ఆనాఁడు జరుపఁబడుచుండిన యుపాసనయందు జ్ఞానాత్మకములగు శ్లోకరాజములే విశేషముగాఁ జేర్పఁబడెను. కాని భగవంతుని హృదయసన్నిహితునిగాఁ జేయు ప్రార్థన శ్లోకములుగాని ప్రార్థనగీతములుగాని యందుఁ బొందుపఱుపఁబడినవి కావు. ఆ లోపములిటీవల బ్రహ్మమతాభివృద్ధికిఁ గృషిచేసిన దేవేంద్రనాథ ప్రభృతులు సవరించి యుపాసకుల భక్తిజ్ఞానవైరాగ్యముల నుత్తేజింపఁజేసి హృదయసంతుష్టిఁ గలిగించున ట్లుపాసనను మార్చిరి.

## ఆస్తికత్వము—వేదాంతము.

మహోన్నతమైన తన మతతత్త్వమునందు ఆస్తిక మతమునకును వేదాంత మతమునకు నుసంయోగము గలిగించి ప్రపంచమునకుఁ రామమోహనుఁడు తన మూఁడవ సందేశమును బ్రకటించెను. అత్యుదారమును, అత్యంత పరవగాహము నైన యాతని మతస్వభావమును గ్రహింప నేరక యెల్లమతములవారును నతఁడు తమమతావలంబకుఁడని చెప్పుకొన సాగిరి. హిందువులాతఁడు హిందువనిరి. మహమ్మదీయులాతఁడు మహమ్మదీయుఁడనిరి. క్రైస్తవులతఁడు క్రైస్తవుఁడనిరి. తన మరణానంతరము తనమతమునుగూర్చి జనులు పరిపరివిధముల నభిప్రాయ పడుదురనియు, ప్రస్తుతము వ్యాపనమునందున్న యేమతమునకు బానుజెందననియు నతఁడు తన శిష్యునొక్కనితో నుడివిన ట్లతనిచరిత్రలో వ్రాయఁబడినది. వివిధమతావలంబులీ రీతిగా నతని మతమునుగూర్చి తలంచుటకుఁ గారణము లేకపోలేదు. ఏమతలోపముల నాతఁడు సవరింప సమకట్టినను, ఆయామతగ్రంథముల నుండియే యాలోపములను ఖండించు ప్రమాణములఁ జూపుచువచ్చెను. అంతియెగాక యేమతమునందు సత్యమున్నను దానిని సంస్తుతించుచుండెను. ఈ రెండుకారణములచేఁ బ్రతిమతస్థుఁడును రామమోహనుఁడు తన మతగ్రంథములందు విశ్వాసముగలవాఁడని భ్రమపడుటకు నవకాశము గలిగెను. వేదాంతసూత్రములను బ్రమాణములుగాఁ జూపి యాతఁడు విగ్రహారాధనమును ఖండింపఁ బూనుకొనఁగా హిందువులు గొందఱాతఁడు వేదాంతియని వినుతింపసాగిరి. క్రైస్తవమతవేదగ్రంథమైన బైబిలందలి నీతిబోధకములగు వాక్యములను జనులకు వెల్లడించి సంఘమునందు నీతిని వృద్ధిజేయఁజూడఁగాఁ గొందఱు క్రైస్తవు లాతఁడు క్రైస్తవుఁడని ముచ్చటపడిరి. దేవుఁడొక్కఁడేయను సత్యమసిద్ధాంతమును మహమ్మదీయమతము ఖండితముగాబోధించుచున్నదని మెచ్చుకొనగా నతఁడు తమమతములోఁ గలిసినట్లు మహమ్మదీయులు సంతోషింపఁదొడంగిరి.

ఈ త్రివిధమతములలో నొక్కదానియందును రామమోహనుఁడు చేరకపోయినను సకలమతసారమై తనరుచుండెడి యుత్తమమైన యాస్తికమతము నాతఁడు తనహృదయపూర్వకముగా నమ్మియుండెను. ఇట్టిమత విశ్వాసము మహనీయునికిఁ గలదని యతనిచే వ్రాయఁబడి యేకేశ్వరునియందు విశ్వాసముగల సకలమతముల వారికిని బహుమానముగా నొసఁగఁబడిన తఫుతల్ మొహదీను గ్రంథమే సాక్ష్యమిచ్చుచున్నది. అంతియెగాక యాతఁడు

రచించిన రమ్యములైన భగవత్కీర్తనలును బ్రహ్మసమాజ దానపత్రమును నాయభిప్రాయమును బలపఱచుచున్నవి. అయినను రామమోహనుఁడు నమ్మియుండిన యాస్తికమతధర్మములకును నిప్పటి ధర్మములకును గొంతవ్యత్యాసముగలదు. అతని యాస్తికత్వము వేదాంతమతముతో మిశ్రమమైయుండెను.

అట్లనుటచే జగమంతయు మిథ్యయనియు నంతటను బ్రహ్మమొక్కటియే నిండియున్నదనియు బోధించి తామే బ్రహ్మలమని విఱ్ఱవీగుచు పామర జనుల వంచించు మిట్టి వేదాంతుల స్వయంబ్రహ్మసిద్ధాంతము నాతఁ డణుమాత్రము నంగీకరించినవాఁ డని తలఁపఁ దగదు. "ప్రపంచకమంతయు మాయయనియు, దేహముమీఁది మమతను వదలుఁడనియు నుపదేశించు సంస్కృతవిద్యమాకిప్పుడక్కఱలేదని" యతఁడు లార్డుఅమ్హెర్స్టునకు వ్రాసిన యుత్తరమే యందుకుఁ గొప్పనిదర్శనముగా నున్నది.

జనులు సామాన్యముగా వేదాంతమని భ్రమపడెడు విపరీతాభిప్రాయముల నాతఁడు విశ్వసింపక పోయినను మానవు లందఱియందును బ్రహ్మమునే చూచుచు జనసేవయే బ్రహ్మసేవగా భావించి మానవుల యభివృద్ధికిఁ బాటుపడినవాఁ డగుటచేతను, సకల జంతువులయందును బ్రహ్మమునే కనుఁగొనుచు భూతదయాపరుఁడై యుండినవాఁ డగుటచేతను, సృష్టియంతటను బ్రహ్మమునే తిలకించుచు నానందించినవాఁ డగుటచేతను, నాతఁడు వాస్తవమైన వేదాంతియనుటకు సందేహింపఁబనిలేదు. నిరాకారుఁడై యిట్లు విశ్వమెల్ల నిండియుండుటయేగాక సకల సద్గుణాకరుఁడును, భక్తవత్సలుఁడునై తనను సేవించు సద్వజనులకును సమస్తగుణగణములను, మనోరథసిద్ధిని గలిగించెడు మహామహుఁడనిగూడ నాతఁడు నమ్మియుండుటచే పరిశుద్ధాస్తికుఁడనియుఁ జెప్పనొప్పుచున్నాఁడు. ఇక్కారణముచేతనే యాతనిని హిందూఆస్తికుఁడని గాని "ఆస్తిక వేదాంతి" యనిగాని పిలువవచ్చునని యతని చరిత్రకారుఁడొకఁడు వ్రాయుచున్నాఁడు. ఉన్నతమైన జ్ఞానమునునుత్కృష్టమైన వైరాగ్యమును నతని మతతత్త్వమునం దమరియుండెను.

## గ్రంథాధికారము — హేతుజ్ఞానము.

సర్వమత ధర్మములను దనకుశాగ్రబుద్ధిచేఁ బరిశీలించి స్వమతమును స్థాపించుకొనినవాఁడగుటచే రామమోహనుఁడు హేతుజ్ఞానమునకును గ్రంథాధికారమునకును సామరస్యమును సమకూర్చెను. ఇది నవభారతీయుల కాతఁడు చేయు తురీయసందేశము. ఒక గ్రంథములో వ్రాయఁబడినదనిగాని యొకమతకర్తచే నుపదేశింపఁబడినదనిగాని యేధర్మము నాతఁడంధప్రాయముగా నమ్మినవాఁడు గాఁడు. విశ్వసించిన ప్రతిధర్మము నతఁడు సూక్ష్మమైన తన జ్ఞానచక్షువుచే శోధించి యంగీకరించెను. స్వభావమున కెంతవిరుద్ధముగా నున్నను సత్యమునకెంతదూరముగానున్నను మతగ్రంథమునందుఁ జెప్పఁబడిన దనిన మాత్రముననే యేవిషయమునైనను విశ్వసించెడు ప్రమాణ బద్ధులకందఱకు నతని చరిత్రమొక గుణపాఠమును బోధించుచున్నది. రామమోహనరాయల వారిచే రచింపఁబడిన హ్యూణగ్రంథ సంపుటమునకు నుపోద్ఘాతమును వ్రాసిన బుద్ధిమంతుఁడు "ఏవేదములోఁగాని యేప్రవక్తయు నేగురువుయొక్కయునుపదేశములోఁగాని యుండిన యేసత్యము నాతఁడు ని

ంగీకరింపలేదు. అన్నిటియందలి సత్యమును గౌరవించి స్వీకరించెను. అయిన నేపుస్తకము నమోఘముగాను, నేగురువు నమోఘవచనునిగాను నతఁడంగీకరింపలేదు" అని వ్రాసియున్నాఁడు. రామమోహనునికిఁ బూర్వమనేకమతకర్తలు వేదాంత సూత్రములకు భాష్యములు రచించిరి. ఆమతకర్తలయందలి గౌరవముచే వారివ్యాఖ్యానములే యథార్థములని మిన్నకుండక స్వజ్ఞానవిశేషముచే వానినిఁబరీక్షించి స్వయముగా నొక నూతనవ్యాఖ్యానము వ్రాసి పరస్పర విరుద్ధములైన పూర్వమతకర్తల యభిప్రాయముల సమన్వయపఱచి స్వబుద్ధిపాటవమును లోకమునకు వెల్లడించెను. గీర్వాణ భాషయందుండుటచే సామాన్యజనులకు దురవగాహములుగానున్న మనమతగ్రంథములగు వేదాంతసూత్ర వేదాంతసారములు, కేన, ఈశ, కఠ, ముండక, మాండుక్యాద్యుపనిషత్తులకు వంగభాషలో వ్యాఖ్యానములను రచించి ప్రచురించెను. తరువాత వీనినే హూణభాషలోనికిఁగూడ భాషాంతరీకరించెను. తమచేతనే పరమార్థములని పరులకుఁ దెలియకుండ భద్రముగా దాఁచియుంపఁబడిన మతరహస్యముల నాతఁడిట్లు స్త్రీలకును బురుషులకును బీదలకును భాగ్యవంతులకును స్వదేశస్థులకును పరదేశస్థులకును జదువనేర్చిన యెల్లవారలకును నభేదముగా సులభసాధ్యము చేయగా బ్రాహ్మణోత్తము లందఱు తమపుట్టిమునిగినట్లు గొల్లునగోలపెట్టిరి. అధ్యాత్మికజ్ఞాన ధనమొక కులమువారియొక్కగాని, ఒక సంఘమువారియొక్కగాని సొమ్ముగాదనియు దానిని సర్వజనులును దెలిసికొనుట యత్యావశ్యకమనియు నుడువుచు రామమోహనుఁడు స్వప్రయత్నమును మానుటకు మాఱుగా నినుమడించిన యుత్సాహముతోఁ బనిచేసెను. ఆహాహా! యందనిమ్రానిపండ్లవలెనున్న యాత్మీయజ్ఞానఫలముల నందఱకును గరతలామలకము చేసిన యీమహనీయుని గుణాతిశయమును మనమెంతని కొనియాడఁగలము!

హిందూమతగ్రంథములలో నణిగిమణిగియున్న సత్యములను బయటకుఁదీసి లోకమునకు వెల్లడించుటకు దానుపయోగించిన హేతుజ్ఞానసాధనమును రామమోహనుఁడు మహమ్మదీయ క్రైస్తవమత గ్రంథములయందును ధారాళముగా వినియోగించెను. ఆంగ్లేయభాషాంతరీకరణమునుగాక బైబిలుయొక్క మూలగ్రంథమును హెబ్రూభాషలోఁ బఠించి యందలి సారమును గ్రహించి "జీససుయొక్క ధర్మసూత్రములు శాంతసౌఖ్యమార్గదర్శకములు" అనునొక గ్రంథమును బ్రచురించెను. సామాన్యముగా సకలవర్ణముల వారిచేతను అసూయతోఁజూడఁబడు తమమతధర్మములను బ్రపంచమున వెల్లడిచేసినందులకు క్రైస్తవమతబోధకులు రామమోహనునికి కృతజ్ఞులై యుండుటకు మాఱుగా కృతఘ్నులై నిందింపసాగిరి కాని వారిట్లతనిని దూషించుటకు హేతువు లేకపోలేదు. తన గ్రంథముయొక్క పీఠికలో రామమోహనుఁడీవిధముగా వ్రాసెను "జీససుయొక్క వాక్యములలో స్వాభిమానప్రాధాన్యములగు మతవిషయక బోధనలను వదలి ప్రపంచములో నన్నితెగలవారికిని ననుకూలములనియు ననుసరింపఁదగినవనియుఁ దోఁచిననీతులనే నేనిందుఁ జేర్చినాను" బైబిలులోఁ గలవిషయములన్నియు భగవద్వాక్యములనియు, సర్వజన సమ్మాననార్హములనియునంధులై విశ్వసించెడి పూర్వాచారపరాయణులగు నాక్రైస్తవ మతబోధకులకు రామమోహనుఁడు వ్రాసినవాక్యములు కర్ణకఠోరములుగానుండెను. విగ్రహారాధనమును నిర

సించినపుడు మేటిసన్యాసుఁడని యాతనిని భూషించిన యామతగురువులిపుడు పరమధూర్తుఁడని దూషింపసాగిరి. హిందూమతమునందలి యక్రమములు ఖండించినపుడు రామమోహనుని స్వమతములోనికిఁ జేర్చుకొనవచ్చునని పొరబడి క్రైస్తవమతబోధకులు కొందఱాతనిని దగ్గఱకుఁదీసి మైత్రి చేసిరి. ఇట్లాశపడి యాతనితో స్నేహము నెఱపినవారిలో నొకఁడైన రెవరెండు విలియము ఆడేము అనునొక బోధకుఁడు రామమోహనునితో వాదములు చేయఁ జేయ, స్వమతమునందు విశ్వాసముఁదప్పినవాఁడయి దానినిద్యజించి రామమోహనుని యాస్తికమతమును భజించెను. తనమనస్సాక్షి బోధించిన సత్యమును ధైర్యముతో స్వీకరించి యవలంబించిన యాసత్యసంధుని మూఢమతావలంబులగు నితర క్రైస్తవమతబోధకులు పరిహసించిరి కాని, సత్యాభిలాషియగు ఆడేముదొర పట్టువదలక యూనిటేరియన్ క్రైస్తవమతమును ఈదేశమునందు వ్యాపింపఁజేయుటకుఁ గృషి చేసెను తమబోధకుఁడే స్వమతమును వదలి రామమోహనుని పక్షమును జేరుటచే క్రైస్తవమతబోధకులు దురాగ్రహగ్రస్తులై రామమోహనునితో వివాదమునకు గడంగిరి. కాని యసమానమేధాసంపన్నుఁడగు నాతనితో యుక్తియందుఁగాని గ్రంథజ్ఞానమునందుగాని సరితూగఁజాలక యోడిపోయి తమవాదమును గట్టిపెట్టిరి. మార్షమాన్ టైలరు మున్నగు మతబోధకులందఱు స్వమతమునుగూర్చి తమకుఁగల జ్ఞానముకంటె నాతనిజ్ఞానము హెచ్చుగానుండుటచే నాతనితో యుక్తులతోఁ బోరాడలేక దూషణభాషణములతోఁ దమ ప్రసంగములను నింపిరి. స్వమతదురభిమానులగు బోధకులు రామమోహనుఁడు తమమతమును జక్కఁగా గ్రహింపలేదని యిప్పటికిని నప్పుడప్పుడు పలుకుచున్నను నిష్పాక్షికహృదయులగు డాక్టరు కార్పెంటరు (Dr. Carpenter) వంటి మహనీయులాతని బైబిలు గ్రంథజ్ఞానమును, విమర్శనానైపుణ్యమును హేతువాదసామర్థ్యమును వేనోళ్లవినుతించి వాదములలోఁ గెలువఁజాలక క్రైస్తవమతబోధకులతనికి ననేక ప్రతిబంధకములను గల్పించిరి. తాము రామమోహనునివ్రాఁతలను తీవ్రముగా ఖండించుచు నతని ప్రత్యుత్తరములను దమపత్రికలలోఁ బ్రచురింపరైరి. అందువలన నాతఁడు స్వయముగా నొకముద్రాయంత్రమును గొనిపింప వలసివచ్చెను. పత్రికలెంతగాఁదనను నిందించినను రామమోహనుఁడు మిక్కిలి మర్యాదతో వారికి నుత్తరము లిచ్చుచుండెను. దూషించుటయేగాక యాతని ప్రత్యుత్తరములను బ్రచురింపక పోవుటయేగాక యాతనిని దనపక్షమునకు లాగుకొనుటకు మఱియొకయుక్తిని గూడపన్నిరి. డాక్టరుమిడిలుటన్ అను క్రైస్తవమతబోధకుఁడు తమమతమును అవలంబించినయెడల గౌరవమును, అధికారమును, పలుకుబడిని బడయవచ్చునని యెఱఁజూపి యాతనిని వలలో వేసికొనఁ బ్రయత్నించెను. కాని యాత్మగౌరవసంపన్నుఁడగు రామమోహనుఁడాదొరగారిని వెట్టిమోహము వదలుకొనుమని బుద్ధిచెప్పి యాతనితో స్నేహముమానెను కాసుకు గస్సువాసించి పరులచేతి కీలుబొమ్మలై వారెట్టిహీనకృత్యముఁజేయుమని నిర్దేశించినను సిద్ధమయ్యెడు నాశ్యసంచకులు రామమోహనునివద్ద నాత్మగౌరవమును నేర్చుకొనవచ్చును.

## సంఘాధికారము— మానవస్వాతంత్ర్యియము.

మతమునందు గ్రంథాధికారమునకును హేతుజ్ఞానమునకును సమాధానము సమకూర్ప సమకట్టినట్టులే రామమోహనుఁడు సంఘమునందు సంఘాధికారమునకును మానవస్వాతంత్ర్యమునకును సామరస్యమును సాధింపఁ బ్రయత్నించి తన పంచమసందేశమును బ్రపంచమునకుఁ బ్రకటించెను. పురుషులైనను, స్త్రీలైనను అగ్రజాతివారైనను అధమజాతివారైనను సంఘమునందలి యెల్లవారును మానవజన్మమెత్తిన కారణముచేతనే స్వాభావికముగాఁ గొన్నిహక్కులను గలిగి యున్నారనియు వానిని మన్నించుట, ప్రతిసంఘమునకును గర్తవ్యమనియు నాతని యభిప్రాయము. అందుకు విరుద్ధముగా నేపురుషుఁడుగాని యేజాతిగాని యేసంఘముగాని నిరంకుశాధికారముఁ బూని ప్రాణ జ్ఞాన మానముల విషయములందైనను సాంఘికుల కుండవలసిన స్వాతంత్ర్యమును బాటింపక యథేచ్ఛముగా వర్తించుట యాతని కణుమాత్రమును నిష్టము లేదయ్యెను. అట్లగుటచే సంఘమునం దేవిధమైన నిబంధనము లుండఁగూడదని యాతని యభిప్రాయముగాదు.

హిందూసంఘ మాకాలమునందు నారీమణులపై నెఱపుచుండిన యక్రమాధికారమునకు మేర లేదయ్యెను. స్వేచ్ఛముగా నాహారము భుజించుటకుఁగాని యుదకముఁ ద్రావుటకుఁగాని, వాయువుఁ బీల్చుటకుఁగాని స్వాతంత్ర్యము లేకపోవుట యటుండ నధమ మేదోవిధముగా జీవములు నిలుపుకొనుటకైన వారికి స్వతంత్రత శూన్యముగా నుండెను. అమానుషమును, అనార్యము నైన సహగమనదురాచారము దేశమునందుఁ బ్రబలియుంటచే ననేక పుణ్యాంగనలు నిత్యమును హవ్యవాహనునికి నాహుతి సేయఁబడుచుండిరి. అతిదయనీయమైన మగువల దుస్థితిఁ బరికింప నవనీతసమమైన యాతని హృదయము కరఁగఁ దన్నివారణార్థమై కృషిసేయఁ గృతనిశ్చయుఁడగునట్లాతనిని బురికొల్పెను.

" ద్వి॥ వనిత సేమమె మగ * వాని సేమంబు
వనజాక్షి యభివృద్ధి * వానికివృద్ధి
పడఁతి యౌన్నత్యంబుఁ * బడయకయున్నఁ
బురుషుఁ డేగతిఁ బెంపుఁ * బొందంగ నేర్చు?
ఘనకార్యము లొనర్ప * జ్ఞానంబుఁ గూర్ప
స్వాస్థ్యంబుప్రవృత్తి జీ * వనమును నప్పఁ
బరిపూర్ణమైనట్టి * స్వాతంత్ర్య మామె
పురుషునిచందానఁ * బొందంగ వలయు. "

ఈరీతిగా నుపదేశించిన హూణకవికుల సార్వభౌముఁడగు కెనిసనువలె రామ మోహనుఁడును దన హిందూసోదరులకు బోధించెను. ఉపన్యాసములఁ జేసియుఁ బుస్తకములను వ్రాసియు దొరతనమువారికి విజ్ఞాపనముల నివేదించియు నతఁడు సాగుమానము మన దేశమునందు సమయువఱకుఁ బూనికతోఁ బనిచేసెను. అతని ప్రోత్సాహమువలననే ప్రభుత్వమువారొక రాజశాసనమును జేసి యట్టిఘోరకృత్యములు ముందెన్నఁడు జరుగకుండునట్లు కట్టుదిట్టములఁ జేసి సర్వహిందూజనులకును బ్రత్యేకముగా స్త్రీజాతికిని మహోపకార మొనరించిరి.

అవకాశము లభింపమిచే నాతఁడు స్త్రీవిద్యానిమిత్తము విద్యాలయముల నిర్మించినవాఁడు గాకపోయినను వనితలకు విద్య పనికిరాదని కుయుక్తులను జెప్పెడి పూర్వాచారపరుల కతని గ్రంథములలో నొకచోఁ జక్కని సమాధాన మిచ్చెను. స్త్రీలకు నవగాహనశక్తి లేదని కొందఱొకకుయుక్తి చెప్పుచుందురనియు, బుద్ధిని వృద్ధిపఱుచుకొనుట కవకాశ మొసంగిన యెడల వారును బురుషులతోఁ బాటెంతటిగొప్పవిషయములనైనఁ దెలిసికొను సామర్థ్యముఁ గలిగియుందురనియు నిందుకుఁ బూర్వకాలమునందు మేటివిదుషీమణులని పేరొందిన భానుమతి, లీలావతి, కర్ణాటరాజపత్ని మొదలైన సతీమణులే తార్కాణలనియు నతఁడు వ్రాసియుండెను, ఆకాలమునందు ముమ్మరముగానుండిన యితర దురాచారములగు కులీనవివాహములను కన్యాశుల్కములను బోనడచుటకు నాతఁడు శక్తికొలఁదిని బ్రయత్నించెను. విదేశప్రయాణముయొక్క యావశ్యకతను జను లంతగా గుర్తింపఁజాలరని యాకాలమునందే రామమోహనుఁడు ఇంగ్లాండుదేశమునకుఁ జని సముద్రయానమునందు మనదేశపు బ్రాహ్మణుల కంగఱకు నతఁడు మార్గదర్శకుఁ డయ్యెను. ఈవిషయమును బట్టియే యతనికి వర్ణాశ్రమ ధర్మములయం దెంత విశ్వాసమున్నదిగూడఁ గొంతవఱకు మనము గ్రహింపవచ్చును. వర్ణభేదమును ఖండించుచు మృత్యుంజయాచార్యలవారిచే వజ్రసూచి యనుగ్రంథమునందుఁ బొందుపఱుపఁబడిన మొదటియధ్యాయమున కాతఁడు బంగాళీభాషాంతరీకరణము రచించి ప్రచురించెను. తమయాధిక్యమును కల్పాంతస్థాయిగా నిలుపుకొనవలెనను దురాశచే బ్రాహ్మణప్రముఖులచే నిర్ణయింపఁబడిన వర్ణనిబంధనల నాతఁడు మన్నింపలేదు. సహగమనమును మాన్పించినను కులీనవివాహాదికములైన యితరమూర్ఖాచారముల నిరుత్సాహపఱచినను వర్ణభేదముల నడంపఁ బ్రయత్నించినను రామమోహనుని యొక్క ముఖ్యోద్దేశము సంఘనిరంకుశాధికారమును వర్జించి వ్యక్తిస్వాతంత్ర్యమును సంరక్షించుట యైయుండెను.

## పాశ్చాత్యవిద్య—ప్రాగ్దేశవిద్య.

మత సాంఘిక విషయములయందె గాక రామమోహనుఁడు మనదేశము విద్యాభివృద్ధినిమిత్తమైకూడ విశేషముగాఁ గృషి చేసెను. ప్రాగ్దేశ విద్యకును పాశ్చాత్యవిద్యకును సామరస్యమును గలిగించుట యాతని యుద్దేశము. ఇది యీమహనీయుని సప్తమసందేశము. బహుభాషా విశారదుఁ డగుటచే రామమోహనుఁ డాయాభాషలలోఁ గల యాధిక్యత నెఱిఁగియుండెను. హిందూదేశములో వ్యాపింపఁజేయవలసిన విద్యావిషయమును గూర్చి యతనికాలములో ప్రభుత్వవర్గములో గొప్పవివాదములు వాటిల్లెను. కొందఱు బుద్ధిమంతులు ప్రాగ్దేశభాషలనే బోధింపవలెనని పట్టుపట్టిరి. సంస్కృతము పారసీకము, అరబ్బీభాషలను హిందూదేశముయొక్క నానాభాగములలో వాడఁబడు భాషలను ప్రజలకు నేర్పినఁ జాలునని వీరిమతము. మఱికొందఱు బుద్ధిశాలు రీభాషలతోఁ బాటు నాంగ్లేయభాషనుగూడ బోధించుట యావశ్యకమని తమ యభిప్రాయమును దెలిపిరి. ఈరెండవపక్షము నవలంబించి లార్డు విలియము బెంటింకు మొదలైన సత్పురుషులతోఁ గలిసి రామమోహనుఁ డాంగ్లేయవిద్యను మనదేశమునందుఁ బ్రవేశపెట్టుటకుఁ బ్రయత్నించెను. తననిశ్చితాభిప్రాయము నెఱుకపఱచుచు నీవిషయమునుగూర్చి యప్పటి రాజప్రతినిధియగు లార్డు ఆమహర్స్టు దొరగారికి నతఁ డొక పెద్దలేఖను వ్రాసెను. భావగాంభీర్యమునకును భాషాసౌష్ఠవమునకును సుప్రసిద్ధిగాంచిన యాయుత్తరమునందు ప్రాగ్దేశ పాశ్చాత్య విద్యలకుఁ గల తారతమ్యమును మిగుల నిపుణముగాఁ జర్చించెను. దేహమనిత్యము గాన దేహసంబంధులయెడఁ గలమమతఁ ద్యజింపవలె ననియు, దృశ్యపదార్థములు మిథ్యలనియు బోధించు వేదాంతశాస్త్రములవల్లను, పశ్వాదియజ్ఞముల యుక్తాయుక్తముల నిర్ణయించెడు మీమాంసాది గ్రంథములవల్లను, ముక్కుమొగములను వర్ణించెడు శృంగార ప్రబంధములవలనను లోకవ్యవహారమునకు నుపకరించెడు జ్ఞానాభివృద్ధి కలుగఁజాల దనియు, హిందూదేశీయులు విద్యవలని ప్రయోజనము నొంది బాగుపడవలయునను నభిప్రాయము నిజముగా దొరతనమువారి కున్నచో శారీర, రసాయన, భూగర్భశోధనాది ప్రకృతి శాస్త్రబోధకుల నింగ్లండునుండి రప్పించి పాశ్చాత్యనాగరికత ప్రజలయందు వ్యాపించుటకు ననువగునట్లు దీనిని (అనగా సంస్కృతకాలేజిని) ఇంగ్లీషుకాలేజిగా మార్పు మనియు వేఁడుచు పెక్కుహేతువులతోఁ దనవిద్యాకౌశలము నంతయు వినియోగించి యాలేఖను వ్రాసెను. ఈవిజ్ఞాపనలేఖనుగూర్చి చర్చించుచు “ సంస్కృతకళా

## స్వజాతీయము—విశ్వమానవజాతీయము.

మహావిశాలమైన రామమోహనుని హృదయమునందు స్వజాతీయమును విశ్వమానవజాతీయమును సామరస్యమును జెందెను. ఇయ్యది యామహాత్ముని నవమ సందేశము. స్వజాతిసంబంధములైన విషయములయం దాతని కెంతటిప్రేమ గౌరవము లుండెనో యంతటి ప్రేమ గౌరవములే సకలేతరజాతులవారియెడలను నాతఁడు గలిగియుండెను. తన జాతియందలి మతజ్ఞానాధిక్యముల నెట్లు సన్నుతించెనో యట్లె యితరజాతులవారి మతజ్ఞానాతిశయమును వినుతించెను. స్వజాత్యభిమానమే పరిపూర్ణముగా నాటుకొని యున్నచో పరజాతులవారియెడల నిరసనభావమును, తమ జాతిసంబంధము లన్నమాత్రముననే యను చితమైన యాదరభావమును బుట్టునని యెఱిఁగినవాఁడై విశ్వమానవజాతీయాభిమానము నను స్వాచరణమువలనఁ జూపించెను. అందువలననే యాతఁడు తమజాతియందుఁగల దోషము ల నెట్లుఖండించెనో అట్లె పరులయందుఁగల దోషములను ఖండించెను. తనజాతివారికి మేలు కలిగినప్పుడెట్లు సంతోషించెనో యాచందముననే యితరజాతులవారికి మేలు కలిగిన పుడుంకూడ సంతసించెను. ఇట్టియుదారమనోభావము గలవాఁడగుటచేతనే స్పెయినుదేశమునకు గొన్ని రాజకీయస్వాతంత్ర్యములు లభించినపు డవి తనదేశమునకు దొరకొని నట్లె సమ్మోదము నొందెను. అంతియెగాక నేపిల్సుదేశమునకు రాజకీయవిషయమునఁ గొన్ని యనర్థములు తటస్థించినప్పు డతండెంతయు మనస్సునందు ఖిన్నుఁడైనొందెను.

## ఉపసంహారము.

నవభారతీయులారా! దేశస్థుల కందఱకు సంతోషమును దుఃఖమును నొకేకాలము నందుఁ గలిగించెడు గొప్పసందిగ్ధస్థితియందు మనదేశము ప్రస్తుతమునం దున్నది. మత సాంఘికాది విషయములం దనుదినమును సంస్కరణము లనేకములు జరుగుచున్నవి. దేశాభిమాను లెట్లువర్తించుటను వలయు దోఁపక తహతహపడుచున్నారు. ఇట్టితరుణమున భారతభూమియందు శాంతము, సౌఖ్యము, సామరస్యము, స్థాపింప నత్యంతసమర్థములైన రామమోహనుని సందేశములు మీమనంబులయందు నిలుపుకొనుఁడు. దేశవీరుఁడును, హైందవ జాతీయోద్ధారకుఁడును,నగు నామహాపురుషుఁడుపదేశించిన నవసందేశములును నవరత్నములో యనఁ జెల్లుచు దేదీప్యమానములై ప్రకాశించుచున్నవి. సందేశరూపమైన యారత్నమాలను మీరలందఱు హృదయాభరణముగా ధరింపుఁడు. ఆమాణిక్యహారము మీమానసపద్మములను నిశ్చల దైవభక్తితోడను, నిర్మల దేశసేవానురక్తితోడను నత్యంత శోభా భాసమానములుగాఁ జేయునుగాక!



౨౦.

# బాబా నానకుని జీవనచరిత్రము.

క్రీస్తుశకము ౧౪౬౯ సంవత్సరము కార్తికశుద్ధపూర్ణిమాదివసంబున లాహోరు నగరమున కనతిదూరమున నున్న తాలవండీనామకగ్రామమున మహాత్ముఁడగు నానాకు జన్మగ్రహణము చేసెను. ఆతనితండ్రి యగు 'కాలు' అనువాఁడు వేదివంశీయక్షత్రియుఁడు. ఆతనితల్లిపేరు 'త్రిపతా.' తండ్రి యగుకాలు జాట్ జాతికి చేరినవాఁడు; కృషివలనను స్వల్పవర్తకముమూలమునను నాతఁడు జీవితయాత్ర గడపుకొనుచుండెను. నానాకు పుట్టుకయందే వైరాగ్యస్వభావము గలవాఁడుగ నుండెను. సాధారణముగ చిన్నవాండ్రు కాలమున ధూళిధూసరములతో నిండి యాట లాడుకొనుచుందురో, యట్టిసుకోమల వయస్సునందే నానాకు చింతాశీలుఁడుగను, మితభాషిగను, ఉపాసనాపరాయణుఁడుగ నుండెను. అయిదుసంవత్సరములకాలమున నాతఁడు గ్రామములోని గోపాలోపాధ్యాయుని యొక్క పాఠశాలకుఁ బంపఁబడెను. ఆచిఱుతప్రాయమునందే "ఈశ్వరుఁ డున్నాఁడనుటకు ప్రమాణ మేమి?" యనెడితత్త్వమూలకము లగుజటిలప్రశ్నలను వేసి పాఠశాలలోనియుపాధ్యాయులను భ్రమింపఁ జేయుచుండెను. పాఠశాలలో చదువుటకును వ్రాయుటకును నేర్చి వైద్యనాథపండితునివద్ద సంస్కృతభాషయును, కుతుబుద్దీన్ మౌల్వీవద్ద పారసీభాషయును నభ్యసించెను. ఆబాలకునియొక్క ధీచాతురిమయును, చరిత్రమాధుర్యమును కనుగొనినయాయుపాధ్యాయు లిరువురును ముగ్ధు లయిరి. సంస్కృతపారసీవర్ణమాలలోని ప్రతియక్షరము నొక్కొకపంక్తికి మొదట వచ్చునటుల నానాకుచే ఆధ్యాత్మికభావాపన్నము లగుశ్లోకములు కవనము చేయఁబడె నని 'జన్మసాక్షి' యనెడిగ్రంథములోఁ జెప్పఁబడి యున్నది. ఈకవన మాయుపాధ్యాయులను విస్మితు లగునటులఁ జేసె ననిన నొకవింతయా?

నానకునిబాల్యజీవనమునం దనేకము లగునలౌకికక్రియలు (**Miraculous deeds**) ఆతనిచే జరుపఁబడినటుల నెన్నఁబడుచున్నవి. కాని మనము వానిని విశ్వసింపలేము.

అంతే గాక వాని నిచ్చట పేర్కొనుటయు ననావశ్యకమే. అందులో విశ్వాసయోగ్య మగునొక్క ప్రసిద్ధఘటనమును మాత్రి మిచట వివరించెదము.

ఒకనాఁడు బాలుఁ డగునానాకు విపాశా (Bias) నదికి స్నానము చేయుటకు వెడలెను. సమీపమునఁ గొందఱుబ్రాహ్మణులు తర్పణము చేయుచుండుటను జూచి తానును చేతులతో నదీతీరమున జలసేచనము చేయుచుండుట కారంభించెను. అల్పవయస్కుఁ డగుబాలుఁడు కారణ మేమియు లేకయే యీవిధముగ జలసేచనము చేయుచుండుటను జూచినబ్రాహ్మణులు "నీవు బాలుఁడవు, నీళ్లతో నీ వేమి చేయుచున్నా" వనిరి. బుద్ధిమంతుఁ డగునాబాలుఁ డాప్రశ్నకు జవాబు చెప్పక "యీవిధముగ మీరందఱును జలమును చేతులలోఁ దీసికొని యేమి చేయుచున్నా" రని యడుగ, బ్రాహ్మణులలో నొకఁడు "మేము మాపరలోకగతపితృదేవతలకొఱకై జలదానము చేయుచున్నా" మనెను. ఆమాటలు వినిన నానాకు వెంటనే తానును తాళవండీగ్రామమున నుండుకూరపాదులకు నీళ్లు గట్టుచున్నా ననెను. అందున కాబ్రాహ్మణుఁ డాశ్చర్యపడి "నీవు మూర్ఖుఁడవు, కానిచో తాళవండీలోనికూరపాదు లెక్కడ? నీవు నీళ్లను పోయుట యెక్కడ? ఒకటి కొకటి సంబంధము లేదే. నీవు నీళ్ల నిక్కడ పోసిన నీకూరపాదులు తడియుట యెట్లు పొసగు" నని యధిక్షేపించెను. సమయమునకై వేచి యుండినానాకు తక్షణమే దానికి బదులుగ "మూర్ఖుఁడవు నీవా లేక నేనా? మనలో పరమమూర్ఖుఁ డెవఁడు? కొన్నికోసులదూరమున నుండు తలవండిగ్రామమునే యీనీళ్లు చేరవే, నీచే ప్రదత్త మగునీజలము పరలోకగతు లగునీపూర్వపురుషుల నెట్లు చేరఁ గలదు?" అని యుత్తర మిచ్చెను. ఆబాలునిమాటలను వినిన యాబ్రాహ్మణులు మఱుమా టాడక పోయిరి.

నానాకును తొమ్మిదవసంవత్సరమున కులపురోహితుఁ డగు పండిత హరిదయాళుని వద్ద నుపవీతునిగఁ జేయుటకు వానితండ్రి యత్నింప, నానాకు జన్నిదమును స్వీకరింపకయే యాకులగురువును స్తంభితునిగఁ జేసెను. తొమ్మిదిసంవత్సరములప్రాయుఁ డయ్యు నుపవీతమును మెడను ధరించుటకు పూర్వ మాహరిదయాళుపండితు నీవిధముగ ప్రశ్నించెను, "మీ రీయుపవీతము నిచ్చుటకై తెచ్చితిరి, దానిని మెడలో ధరించుకొనిన నా కేమిలాభము? ధరించనియెడల నష్ట మేమి?"

పండితునియుత్తరము:—“నీ కుపనయనసంస్కార మయినయెడల నీవు పరిశుద్ధుఁ డగుదువు. యావద్ధర్మములకును కర్మలకును నీ కధికారము జనించును.” పండితుని యుత్తర మేమాత్రమును నానాకునకు సంతృప్తికరముగ నుండ లేనందున నాతఁడు యుక్తియుక్తముగ నాపండితునివాదమును ఖండించి యీక్రిందిభావము నిచ్చుశ్లోకమును రచించెను:—

దయ యనెడిప్రత్తి, సంతోష మనెడిసూత్రము, ఇంద్రియదమన మనెడిగ్రంథి సత్యరూప మగుదండి యేయుపవీతమునకుఁ గలదో, అదియె యాత్మయొక్క యదార్థ మయినయుపవీతము. ఓపండితుఁడా! ఇటువంటియుపవీత మున్నయెడల ధరించుము. ఇది తెగిపోదు. మురికి గాదు. అగ్నిచే దగ్ధము గాదు. ఏమానవుఁ డిట్టియుపవీతమును ధరించి సంసారమున చరించునో వాడు ధన్యుఁడు.

నానాకునకు వయస్సు హెచ్చినకొలఁదిని ధర్మానురాగ మతిశయించుచు వచ్చెను. ఆతనికి సాధువులు, బైరాగులు, పకీరులు మున్నగుమతసన్యాసులయెడ నతిభక్తి. సాంసారికకృత్యములందును, ధనోపార్జనమునందును నానాకు అతియుదాసీనుఁ డయి యుండెను. పుత్రునికిఁ గలసంసారమునందలియౌదాసీన్యతను జూచి మిక్కిలి ధనలోభముచేతను, సంసారేచ్ఛతోడను కట్టువడిననానాకునితండ్రి యగుకాలు మిక్కిలి పరితపించుచుండును. ధర్మభావముచే విహ్వలుఁ డగుతనపుత్రుని భూతగ్రస్తునిగ నెంచి మధ్యమధ్య దుఃఖించు చుండును. నానాకునిమనస్సును ధనము గడించునుపాయముల నరయునిమిత్తమై వానితండ్రి నాతనిని గోమహిషములను మేపి కృషికార్యములందు ప్రవేశపెట్టఁ దలఁచెను. నానాకు తండ్రియాజ్ఞానుసారము పశువులను మేపుచు బయళ్లకుఁ జని యచ్చట పశువులను స్వేచ్ఛగా వదలి తా నొకతరుతలమున నాసీనుఁ డై ధ్యానవిమగ్నుఁ డగుచుండును. ఇట్లుండ నాతనిపశువు లితరులపొలములపైఁ బడి నాశనము చేయ నానాకునకు వానిని వెదకి మఱలఁ దెచ్చుట కయినను సమయ ముండునది కాదు. తండ్రి యగుకాలు మిక్కిలి విసుగు జెందినవాఁ డై నానాకు నాకార్యమునుండి తొలఁగించెను. కాని అప్పు డప్పుడు మాత్రము నానాకును కృషికర్మయందు శ్రద్ధ యుంచు మని బోధించుచు వచ్చెను. ఇట్లుండ నొకానొకదినమున యథారీతిని నానాకును వ్యవసాయమునందు దృష్టి యుంచు మని చెప్ప నాతఁ డందుల కిట్లనెను:—

"ఓతండ్రీ! నే నొకనూతనక్షేత్రమును సంపాదించితిని. ఆక్షేత్రముయొక్క సాగుబడి యారంభ మైనది. అందులో నూతనము లగునంకురములు బయలు వెడలుచున్నవి. ఈసమయమున నేను మిక్కిలి జాగరూకుఁడ నై యుండవలయును. ఇటువంటిసమయములో నే నితరులయొక్క క్షేత్రములపై దృష్టి యుంచ నవసరము లేదు. అంతియే కాదు, నే నాభారమును సహితము వహించ లేను."

ఈవిధముగ నానాకు తనతండ్రికి తనయొక్క నవీనధర్మానురాగమును నానాప్రకారములుగఁ దెలియఁజేయు చుండెను. కాని సంసారమున పూర్ణముగ మునిఁగి యుండినయాతనితండ్రి యాభావములయొక్క గభీరతను తెలిసికొన ప్రయత్నించినవాఁడు కాఁడు. అందుచే నతఁడు నానాకును కేవలము పనికిమాలినవానిఁగా నెంచెను.

ఈనూతన మగునీశ్వరప్రేమచే నానాకు ప్రమత్తుఁ డై మృతజీవునివలె రాత్రింబగళ్లు నొక్కస్థానముననే కూర్చుండి యుండుటచే నాతనిశరీరము క్షీణదశకు వచ్చెను. అప్పుడు జనని యగు త్రిపతాయొక్క యనురోధముచే కాలు వైద్యుని పిలిపించెను. చికిత్సకుఁడు వచ్చి రోగియొక్క నాడిని పరీక్షింప మొదలుపెట్టినంతమాత్రముననే నానాకు ఒకగీతమును పాడ నారంభించెను. దానియొక్క భావ మిది:—

"వైద్యుఁడు వచ్చి చేతిని పట్టుకొని నాడి పరీక్షించు చున్నాఁడు; కాని భ్రాంతిమతి యగువైద్యుఁడు తనహృదయము దుఃఖముతో నిండి యున్న దని తెలిసికొన నేరఁడు. ఓవైద్యుఁడా! నీవు మంచివైద్యుఁడవు. మొట్టమొదట యేమిరోగమొ దానిని స్థిరపఱచుకొనుము. దేనిద్వారా సమస్తరోగములును, దుఃఖములును నివారణ మగునో యట్టి యౌషధము కావలసి యున్నది. కావున నీవు మొట్టమొదట నీరోగమును తొలగించుకొనుము. అప్పుడే నీవు సుచికిత్సకుఁ డగుదువు."

నానాకునివంటిసుచికిత్సకులు లేకయే మనదేశజనుల నావరించి యుండుభవరోగములకు నౌషధము లేక యున్నది. "భగవన్నామామృతము గొనుఁడీ, భవరోగము మందు" అని యేమహనీయుఁడు ౪౦౦ సంవత్సరములకు పూర్వము మనపవిత్ర ఆర్యావర్తమునఁ బాడి కఠినహృదయులమనంబుల సహితము కఱఁగునటుల తనమధురగానముచే నాబాలగోపాలమును భక్తినదీప్రవాహమున ముంచివేసెనో, యట్టి మహాభక్తపరాయణులు నేఁ డెచట నున్నారు?

నానాకునితండ్రి మఱల నొకపర్యాయము తనపుత్రుని సంసారకార్యములందు ప్రవేశపెట్టవలయు ననెడితలంపుతో మఱియొకపర్యాయము ప్రయత్నించెను. ఈసారి నానాకునకు కొన్నిరూపాయల నిచ్చి యొకమాట యుప్పును గొని విక్రయించుకొని రమ్మనెను. నానకు అందుకు సమ్మతించి రూపాయలను దీసికొని బాలసింధు అనుపేరు గలయొక సేవకుని వెంటఁ బెట్టుకొని యుప్పును గొనుటకయి బయలుదేరెను. అప్పుడు దారిలో కొందఱు ఫకీరులను నానకు చూచుట తటస్థింప నాసాధుపురుషులను జూచి యాతఁడు పరమానందభరితుఁడయి వారితో ధర్మాలాప మొనర్ప నగు నని వారిని సమీపించెను. వారన్నను మూఁడుదినములనుండియు నుపవాసము చేసి యుండుటచే నానాకునితో మాట్లాడుట కయినను శక్తి లేకుండిరి. వారియొక్క వాడినముఖములను జూచి ధర్మానురాగి యయిననానాకునకు వారలయందు దయ గలుగుట సహజమే గదా? అప్పుడు తనభృత్యుఁ డగు బాలసింధును జూచి “నాతండ్రి ధనాకాంక్షితుఁడై నన్ను ఉప్పువ్యాపారము చేయ నియోగించినను ఆలాభమువలన సమకూడుధన మెంతకాలము నిలుచును? ఈనిరుపేద లగు సాధుపుంగవులదుఃఖమోచనము చేసి యనంతకాలమును స్థాయిరూపమున నుండుపుణ్యము నుపార్జించెద” నని నానకు భయపడుచు చెప్పెను. బాలసింధుయును నానకునియొక్క మంచియాలోచనకు సమ్మతించినందున నాతఁడు తనధన మంతయును ఫకీరులకు దానము చేసెను. వారును నానైకముతో నాహారసామాగ్రిలను తెచ్చుకొని బాగుగా భుజించినతరువాత నానాకునకు ధర్మసంబంధ మగుమధురసంభాషణమును వినిపించిరి. ఇక నానాకునియానందమును గూర్చి చెప్పవలయునా?

నానాకునితండ్రికి తనకొమరునిచేఁ గావింపఁబడిన యీదానము సంతృప్తిని గలుగఁ జేయనందున నాతఁడు నానాకుని నతితీవ్రముగ దండించెను.

నానాకునకు బాల్యకాలము దాటినది. ఆతని కిప్పు డిరువదివత్సరములప్రాయ మగుటచే వయోవృద్ధితోఁ బాటు ఈశ్వరభక్తియును నాతనికి హెచ్చుచుండెను. తండ్రి కుమారునిసంసారమునందు ప్రవేశపెట్టవలయు ననెడియుద్దేశముతో తలపెట్టిన కార్యములలో నొక్కటి యయినను సఫలత నొంద లేదు. ఆతనికి (నానాకునకు) సన్యాసులతోడను, ఫకీరులతోడను కలసి మెలసి యుండుటయందు మిక్కిలి ప్రీతి. మఱియొకసమయమున నాతఁ డొకానొకసన్యాసి కొకపైడియుంగరమును నొక కమండలమును దానము చేసెను. కుమారుఁ డీదానము చేసె ననెడివార్త తండ్రియొక్క

చెవినిఁ బడినంతమాత్రమున నాతఁ డతిక్రుద్ధుఁడై నానాకును గృహమునుండి వెడలఁ గొట్టెను. ఆహా! కాలుని (నానాకునితండ్రి) యొక్క భాగ్యము! ఈకాలమున తండ్రి మంచిపనులను చేయునటుల పురికొల్పినను పుత్రులు దుష్కార్యములందే నిరతు లయి యుండుటను మనము చూచుచున్నారము. "ఏకోపి గుణవాన్ పుత్రః నిర్గుణేన శతైరపి ఏకచంద్రప్రకాశేన నక్షత్రః కింప్రయోజనమ్" అనునట్లు గుణహీను లగుపుత్రులు నూర్గు రుండుటకంటె సద్గుణోపేతుఁ డగు నొక్కపుత్రుఁడు చాలఁడా? భూమండలము నంతటిచల్లనికాంతులతో నింపివేయఁ గల్గుచంద్రునకు బదులుగ కోట్యానుకోటి నక్షత్రము లుండినంతమాత్రమునఁ బ్రయోజన మేమి?

తాళవండీగ్రామమునకు భూస్వామి యగురాయిజలారువద్ద మననానాకునితండ్రి యగుకాలున కుద్యోగము. జలారున కన్ననో, నానాకు పరమసాధు వని యెఱిఁగి యుండుటచే నాతని మిక్కిలి గౌరవపరచుచుండును. కావున నాతఁ డీసమయమున నానాకును సుల్తానుపురములో నుండెడు నానకీ యనెడిసోదరివద్దకుఁ బంపెను. ఆతని నీసమయమున దగ్గఱ చేరఁ దీయఁ గల్గునాత్మబంధు నాసోదరి యొక్కతియే. బావ యగు జయరాముఁడు నవాబు దౌలతుఖాన్ లోడీయొక్క కమిశరేట్ కు సంబంధించిన మోదీఖానాకు యజమానుఁడుగా నుండెను. కొంతకాలము నానాకు ఈముదిఖానలో నౌకరీచేసి తాను సంపాదించిన దంతయు సాధుసేవార్థమై వినియోగపరచుచుండెను.

ఇట్లుండ నానాకునితండ్రి యగుకాలు తనకొమరుని కేమాత్రమును సంసారము నందు మనసు తిరుగకుండుటను జూచి సులఖ్నాచౌని యనుపేరు గలబాలికను తెచ్చి నానాకునకు పరిణయము చేసెను. వివాహ మయినపిదపఁ గొంతకాలమువఱకు నానాకు తనభార్య యగుసులఖ్నావిషయమై యుదాసీనుఁ డయి యుండె నని ప్రతీతి. వివాహము చేసినప్పటికిని కాలూయొక్క మనోరథ మీడేరినది కాదు. నానాకుయొక్కమనస్సు పరివర్తన మగుట బహుదుష్కరముగ నుండెను. ఆతఁడు మునుపటివలెనే సంపూర్ణోదాసీనభావముతో ముదీఖానాలోనే మఱికొంతకాలము పని చేయుచుండెను. ఇట్లుండ నొకానొకసమయమున నానాకునకు ఈశ్వరునిదర్బారునుండి యాహ్వానమువచ్చెను. ఆతనిజీవితమునందలి యుత్కృష్టాదర్శమును నాతఁ డొక్కసంఘటమువలననే లోకులకు తెలియఁ జేసెను. పుష్పము లున్నచోట తావియు, తేనె యుండుచోట ఈఁగలును నుండుట యెట్లు స్వాభావికమో, యటులనే భక్తు లుండుస్థలమున సహితము భక్తినది

ప్రవహించుట సహజ మయి యున్నది. నానాకున కీశ్వరసాక్షాత్కార మయిన దనుట కీర్తలమున వ్రాయఁబడుసంఘటనమే తార్కాణము. ఒకానొకదినమున నానాకు తన కార్యస్థాన మగుమదీఖానాలో కూర్చుండియుండ నచ్చటి కొకసన్యాసి రాఁదటస్థించెను. అతఁడు ప్రసంగవశమున నానకునితో "భగవంతుఁడు నిన్ను మహాత్కార్యముయొక్క భారమును వహించునిమిత్తమై యీవిశ్వసంసారమునకుఁ బంపి యున్నాఁడు. నీపేరు నానాకునిరహంకారి. నీవు నిరాకారపరబ్రహ్మముయొక్క మహాత్మ్యమును కీర్తన జేసెదవా, లేక యీమదీఖానాలో నీజీవితమును గడపెదవా?" యని యడిగెను. సన్యాసియొక్క మాటలు నానాకునియొక్క హృదయము నంటి నాతనియంతరతమ ప్రదేశమును స్పర్శించెను. అతఁ డాశుభముహూర్తమునందే యీశ్వరునియొక్క యభిప్రాయమును తెలిసికొనఁ గల్గెను. ఆతనియొక్క మదీఖానానౌకరి యాక్షణములోనే యంత మయ్యెను. పైఁ గనినరీతిని పరిత్యాగిష్ఠుఁడై నానాకు తనముప్పదిరెండవ సంవత్సరమున తనజీవితమును ఈశ్వరుని కర్పించెను. ఆహా! ఈశ్వరవాణిని వినుట యన్న నిట్టిదే కదా! మన మందఱమును నిట్టివాణిని వినుట లేదా?

నవాబు దౌలత్ ఖానులోడియును, నానాకునియొక్క బంధువర్గమును నాతనిచే గావింపఁబడిన యీకార్యమునకు సమ్మతింప రైరి. ఆతని పలువిధముల నిందింపసాగిరి. కాని నానాకుమాత్ర మెవరిమాటలను వినిపించుకొనలేదు. అతఁడును, అతనిపత్ని యగు సులఖ్నా, నాల్గుసంవత్సరములువయస్సు గల పుత్రుఁడు శ్రీచందు, చిన్నిపాప యగు లక్ష్మీదాసు, అందఱును ఆత్మబంధువర్గమును విడనాడి యొక్కక్షణమున ఈశ్వరుని పాల్పడిరి. ఈశ్వరుని నమ్మినవారికి కొఱత యేమి? సమయాసమయంబు లెఱుఁగక అధ్యాత్మికరహస్యములను గూర్చి వ్యాఖ్యానింప నేర్చి నంతమాత్రమున లాభ మేమి? "అనన్యా శ్చిన్తయన్తో మాం యేజనాః పర్యుపాసతే, తేషాం నిత్యాభియుక్తానాం యోగ క్షేమ వహామ్యహం" అని శ్రీకృష్ణులవారు గీతయందు "ఎవరు ఇతరుల నెవరిని నాశ్రయింపక, స్వశక్తిని నమ్మకొనక, యెల్లప్పుడును నీశ్వరునియందే చిత్తమును జేర్చినవారై యాతనినే కొలుచుచున్నారో, యట్టివారియోగక్షేమములను నాతడే వహించుచుండు"నని చెప్పియుండుటను అందఱు నెఱింగినవిషయమే. కాని ఈశ్వరుని కొఱకు సర్వస్వమును అర్పించి యాతనిసేవకై ఆత్మసమర్పణము జేసినవారు మాత్రము బహుఅరుదు. నానాకు, కబీరు, తుకారాం, చైతన్యాదిమహాభక్తు లుదయించిన యీ పవిత్రార్యావర్తమున ప్రస్తుతము సాధుపుంగవులు కనఁబడకుండ యెట్లు తటస్థించె?

నానాకునిచరిత్రమునం దొకయాశ్చర్యమయినవిషయము కలదు. ఆత డందరిని వదలినను ఆతనినిమాత్రి మెవరును వదలకుండిరి. భృత్యుడగు బాలసింధు నానాకుతోడనే యుండెను. తండ్రి యగు కాలు కొమరుడు గృహత్యాగమును జేసినవార్త విని మర్దానా మిరాసి యనువానిని నానాకునొద్దకు పంపెను. ఆతఁడు నానాకును పట్టుకొనవలయు నని వెళ్లి యాతఁడే నానాకుచే పట్టుబడెను. నానాకుతోబాటు మర్దానాయును సంసార త్యాగము జేసెను. మర్దానా మంచిపాటకు డగుటచే నానాకుచే రచియింపబడినశ్లోకము లును, గీతములును నాతఁడు మిగులశ్రావ్యముగా రాబాబ్ అను వీణ మీటుచు బాడుచుండెడివాడు. సంగీతసహాయమున మానవులయందు భక్తి నెటుల పురిగొల్పవగునో యనుటకు నానాకుమర్దానాలపరస్పరసహకారముచే నుద్బోధితము లయి శీఖ్ మతము నవలంబించిన వేనవేల భక్తాగ్రిణులే ప్రమనిదర్శనములు.

భక్తిరసమును జిల్కుచు మానవుల నొక్క పెట్టున నానందరసాబ్ధిని ముంపగల్గునది సంగీతము గాక మఱియేది? కావుననే భక్తులగు చైతన్య, తుకారాము, కబీరు, త్యాగరా యాదులు తమస్తోత్రములను, తమధర్మబోధనముల నతిశ్రావ్యముగాఁ బాడిరి.

నానాకు ఫకీరువేషముతో దేశదేశములు గ్రుమ్మరి నానామతములవారిని దర్శించి వారితో తర్కవితర్కములు జేయుచు సర్వమతములలో శ్రేష్ఠ మగు దాని నరయుటకయి సింహళము, మక్కా, పరిసియా, కాబూలు మొదలగుప్రదేశములలో యాత్రజేసెను. ఆతడు మక్కానగరమునకు వెళ్లినపుడు ఒకదినమున మసీదువంక కాళ్లు చాచి నిద్రించుచుండెను. దీనిని చూచిన మందిరాధ్యక్షులలో కొందరు నానాకుపై కోపగించి ఆతనిని నిద్రనుండి లేపి "నీ వేమి మూర్ఖుడవుగ నున్నావు. ఈశ్వరునిమందిరము వైపు కాళ్లు చాచఁచ్చునా" యని ప్రశ్నింప "నేను మార్గాయాసముచే కడుబడలి వచ్చితిని. నేను ఈశ్వరునిమందిరమువైపు కాళ్లు చాచినందున నపరాధి నైతి నని నీవు చెప్పితివిగదా! మంచిది. ఈశ్వరుడులేనివైపే దైనయుండిన దానిని నాకు చూపుదువేని నే నావైపున కాళ్లు చాచుకొనెద"నని నానాకు ప్రత్యుత్తరము చెప్పెను. ఆయధి కారులు నానాకునకు బదులుచెప్పలేక నిశ్చేష్టితులయిరి. మొగల్ సామ్రాజ్యాధిపతియగు బాబరు ఒకపర్యాయము నానాకుని చూచుట తటస్థించెను. చక్రవర్తి నానకునియొక్క సాధుభావముచే ముగ్ధుడై ఆతనికి విశేషపురస్కారములీయ నుద్యమింప నానాకు వానిని స్వీకరింపక "ఏయీశ్వరుడు అందరికిని యాహార మొసంగుచున్నాడో, ఆతనివద్దనుండియే నేను దండనము గాని లేక పురస్కారమును గాని స్వీకరింతును, కాని మనుజునివద్దనుం డియు స్వీకరించ"నని చెప్పెను.

బాబానానకు డీశ్వరప్రేమచే ననుప్రాణితుఁడయి మిగుల నుత్సాహముతో సత్యధర్మమును బ్రచారము చేయ నారంభించెను. విశ్వమయుఁడగు భగవానునియొక్క యాశ్చర్య మగుమహిమను జూచి నానాకు ధన్యుఁ డయ్యెను. ఆతనిచే నీశ్వరునికొఱకు రచియింపఁబడిన హారతియొక్క భావ మిదియ:— "హే పరబ్రహ్మ! పరమేశ్వరా! గగనరూప మగుపళ్లెరమున రవిచంద్రు లనెడిరెండుదీపముల నుంచి తారకావళు లనఁ బరగెడిముక్తసరులతో శోభాయమాన మగుచుండ, సుగంధములయానిలము నీకు ధూప మగుచుండ, మఱియు పవనుఁడు చామరములు వీవ, వనరాజి యుజ్జ్వలపుష్పములు ప్రదానము చేయ, హే భవఖండనహారీ! నీ కెటువంటియారతి జరుగుచున్నయది! అనాహతశబ్దము లన్నియు భేరీలవలె మ్రోయుచున్నవి. నీకు సహస్రనయనము లున్నను నయనహీనుఁడ వయి, సహస్రమూర్తు లుండియు, మూర్తిహీనుఁడ వయి, సహస్రపదము లుండియు, పాదహీనుఁడ వయి, గంధహీనుఁడ వయ్యును, సుగంధయుతుఁడ వయి, యున్నాఁడవు. ఏమి నీయొక్క మనోహరచరిత్రము!

ఎచ్చట ప్రకాశ మున్నను అది యాతనిజ్యోతియే. ఆతనియొక్క ప్రకాశము చేతనే యన్నియు ప్రకాశితము లగుచున్నవి. గురుసాక్షాత్కార మయిన నీజ్యోతి ప్రకాశిత మగును. సాధకులారా! మీ రెప్పు డాతనిని భక్తితోఁ గొల్తురో, అప్పుడే యాతనికి హారతి యగును. నాయొక్క మనసు హరిచరణారవిందముయొక్క మకరందముచే ముగ్ధ మగుచున్నయది. అహర్నిశము నే నాతనికొఱకే దప్పికగొనియున్నాఁడ. నానా కనెడిచాతక మెల్లప్పుడును నీయొక్క నామమునందే నిత్యవాసము చేయునటుల నీకృపావారిని వర్షింపుము"

రసస్వరూపుఁ డగునీశ్వరుని నానకు ధ్యానము చేయఁ జేయ నాతనిహృదయ మీశ్వరప్రేమచే రసపూరిత మయి యొప్పుచుండు. ఆతఁడు నిష్కాపట్యము గల శిశువువలెఁ గోమలహృదయుఁడు. ఆతఁడు దేశయాత్ర చేయుకాలమున బిడ్డలను సమీపించినపుడు వారలతోఁ దానును బిడ్డవలెఁ గలసియాడుచుఁ బాడుచు మురిసెడివాఁ డని వాడుక. సన్యాసివేషముతో నానాకు మతప్రచారార్థము బయలువెడలినపుడు విపాశా (Bias) నదీతీరమున 'క్రోడీరా' యను పేరు గలయొకధనికులసంతానముతో నాతనికిఁ బరిచయము కల్గెను. నానాకునియొక్క యలౌకికభావమునకు వారు ముగ్ధులయి యాపుణ్యపురుషునిపాదములకు మ్రొక్కి భక్తిని జూపిరి. అది మొదలు వారు, నానాకుని సంతోషపెట్టుటకై యేపని నిర్వహించుటకైనను వెనుకంజ వేసినవారు కారు.

వారు నానాకునికై విపాశానదీతీరమున నొకనగరమును గట్టించి యిచ్చిరి. దానికే నానాకునియాదేశానుసారమున 'కర్తార్పూరు' అనెడినామ మిడఁబడినది. ఈనగరము పిదప శీఖులచేఁ బవిత్రముగ నెన్నఁబడి యొకప్రసిద్ధ మయినతీర్థయాత్రాస్థలముగ మారినది. ఈస్థలమునందే యిప్పటికిని 'సహజాది' అనఁబడు నానాకునియొక్క వంశస్థులు వాసము చేయుచున్నారు.

నానాకు నానాదేశములను పరిభ్రమణము చేసి స్వగృహమునకుఁ దిరిగి వచ్చెను. అప్పుడు సన్యాసివేషమును బరిత్యాగము చేసి మరల గృహస్థధర్మము నవలంబించెను. ఆతఁడు "కొరానునందును, పురాణములందును, శాస్త్రములందును ఈశ్వరుఁడు లేఁడు; ధర్మశాస్త్రప్రణేత లందఱును నీశాస్త్రములలోఁ దమతమపాండిత్యమునే ప్రకటన చేసికొనిరి. శాస్త్రము లన్నియు భ్రమతోఁ గూడికొని యున్నవి. భగవానుని పొందవలయు నన్న సంసారత్యాగము చేసి సన్యాసి గావలసినయగత్యము లేదు. మన యొక్క ప్రతిదైనికజీవనమునందును నీశ్వరుఁ డుండియే యున్నాఁడు. పర్వతగహ్వరములయం దుండెడికఠోరయోగులును, రాజప్రసాదములందు నివసించెడిధనవంతులును, ఇరుతెగలవారును నీశ్వరునికి సమానులే. ఎవ రేయేజాతికి సంబంధించినవారో యను విషయమును గూర్చి యాతఁ డెప్పుడును సంధానము చేయఁడు; కాని యెవరు సంసారమునందుఁ బ్రవేశించి యేరీతిని వ్యవహరించుచుందురో, దానిని మాత్రమే కనిపెట్టుచుండును" అని యుపదేశించుచుండెడివాఁడు. హిందూమతమునందు సహితము గార్హస్థ ధర్మ మెప్పుడును ధర్మజీవనమునకు ప్రతిబంధకము గానేరదనియే యీక్రింద వివరించిన శ్రీమద్భాగవతమునందలిపద్యములనుండి మనము గ్రహింపవచ్చును.

చ. అరయ గృహస్థు లయ్యును మదర్పితకర్ములు నస్మదీయసుం
దరచరితామృతశ్రవణతత్పరమానసయాతయాములున్
సరసగుణాఢ్యులై తనరుసాధుల కీగృహము ల్దలంప దు
ష్కరభవబంధహేతువులు గావు నృపాలతనూజ యెన్నడున్. ౮ స్కంధము.

చ. అనుపమవేదవేద్యు లగునంచితయోగిజనానుగీయమా
ననిజకథాసముత్సుకుఁ డనం దగునేను మదీయులందు నూ
తనముగ నుండుఁ గావున సదారత వారికి నీగృహావళుల్
ఘనభవబంధహేతువులు గా విది యంతయు నిక్క మారయన్. ౮ స్కంధము.

మొత్తముమీద నానాకునిధర్మబోధము, హిందూసంఘమునందలి మూర్తిపూజ, జాతిభేదము మొదలుగాఁ గల కుసంస్కారములను రూపుమాపి, యుత్కృష్టమయిన పరిశుద్ధాస్తికధర్మమును నెలకొల్పుటకును, మహమ్మదీయులయేకేశ్వరవాదము నొప్పుకొనుచు వారిచేఁ గావింపఁబడుచుండెడి గోహత్యాది యధర్మకృత్యములను ఖండించుచు రెండుసంఘములవారిని పరబ్రహ్మోపాసనమునందుఁ బ్రవిష్టు లగునట్లు చేయుటకును నుద్దేశింపఁబడిన దగుటచే నానాకు తనయావచ్ఛక్తియుక్తులను సన్మతస్థాపనమునకై మరణకాలపర్యంతము వినియోగపఱచుచు వచ్చెను.

నానాకు బాగ్దాదునగరమునకు వెళ్లి యుండినప్పు డచ్చట మహమ్మదీయులనందఱిని యుపాసనమునకు నాహ్వానము చేయుమంత్రమును మార్చి సర్వధర్మములవారును నొక్కస్థలమునందే చేరి యుపాసించుటకై యన్నిమతస్థులకును సన్వాయించునట్లు లందఱిని నాహ్వానము చేసెను. అందుపై నానగరమునందలి మసీదులోనిప్రధానముల్లాలకును (ఆచార్యులు, లేక యుపదేశకులు) నానాకునకును వాదప్రతివాదములు జరిగెను. అప్పుడు నానాకు ముల్లాతో నిట్లనెను:— "భూలోకమునందును స్వర్గలోకమునందును నెవఁడు నిత్యకాలమును విరాజిల్లుచున్నాడో, ఆయేకమేవాద్వితీయుఁ డగుపరమేశ్వరు నొక్కనినే నేను స్వీకరింతును. మఱి యేసంప్రదాయమునకు సంబంధించిన దేవతను నే నొప్పుకొనను" నానాకుయొక్క మతసారము నీక్రిందియుపదేశమునుండి తెలిసికొనవగును:— "లక్షలకొలఁది మహమ్మదులును, కోట్లకొలఁది బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులును మహాప్రసిద్ధులగు రాములును, కృష్ణులును, ఆమహాపురుషుని (పరబ్రహ్మము) మందిరద్వారమునఁ గనిపెట్టుకొని యున్నారు. వీ రందఱకును వినాశము కలదు. ఏకమాత్రుఁ డగు నాపరబ్రహ్మ మొక్కఁడే అవినశ్వరుఁడు. అందఱును నాతనియొక్క గుణగానము చేయుచున్నా రనుట నిజమే కాని వారివారిమతములను గుఱించియే యొండొరులలో విరోధము ప్రబలుటను జూచి యయినను వారు సిగ్గు వహించుట లేదు. దీనివలన మనకుఁ దెలియునదే మన, ద్వేషభావము గలవా రందఱును సంకీర్ణభావము గలవారయి సాంప్రదాయిక (Sectarian) పిశాచముచే నోటువడిరనియే. ఎవనికి న్యాయనిష్ఠ గలదో వాఁడే నిజ మయినహిందువు; ఎవనికి పవిత్రహృదయము గలదో వాఁడే నిజ మయినముసల్మానుఁడు"

బాబానానకు హిందూముసల్మానుధర్మములను సమన్వయము చేసి, మతవైషమ్యములచేఁ గలహించుకొనుచుండిన యిరుసంఘములవారి నీశ్వరోపాసనచే బంధింప నెంచుటయే యాతనిసార్వభౌమిక (Universal) సాధన మై యుండెను. ప్రతిదేశమునందును సమయోచితము లగుమార్పులను గలుగఁజేసి శాంతిరాహిత్యు లగుమానవులకు జ్ఞానబోధము చేసి, ధర్మమును పునఃస్థాపనము చేయునిమిత్తమై యీశ్వరుఁడు తనయొక్క శక్తిని విశేషరూపముగ నుస్థాపితము చేయుచుండును. పంజాబుదేశమునందు ముఖ్యముగను, ఉత్తరహిందూస్థానమునం దంతటను, మహమ్మదీయరాజ్యములు స్థాపింపఁబడి, ముసల్మానుసంఘములు మనభారతవర్షమున స్థిరముగా నివాసము చేసికొన మొదలుపెట్టినది మొదలు ప్రతిమార్చనలతో మునిఁగియుండిన హిందువులకును, నేవిధ మైనరూపమును గాని యీశ్వరునికిఁ గల్పించుట కలవాటు పడనిముసల్మానులకును ఘోరసంగ్రామము తటస్థించెను. ఈశ్వరునిమంగళోద్దేశమును మనపవిత్రభారతవర్షము కేవలము హిందువులకు మాత్రమే గాక సోదరముసల్మానులకును నంద గావలసివచ్చుటచే వారును భారతమాతగర్భమున నే యుండి మనకు సోదరు లయిరి. హిందువు లింక ముసల్మానులను సోదరులవలె భావించి యాలింగనము చేసికొని హిందూముసల్మానుసోదరులు 'అలఖ్ నిరంజనుని' పితృత్వమును స్వీకరింపవలసి యుండెఁ గాని, ఒండొరులతోఁ గలహించుకొని మాతృభూమిని పరులపాలు చేయుట కది యదను గా కుండెను. కావున నీశ్వరునిచేఁ బ్రేరేపితుఁడై బాబానానా కాసమయమున నుద్భవించి హిందూముసల్మానుల ధర్మతత్త్వములను గ్రహించి యామతద్వయమునందలిసార మొక్కటిగ నుండుటను దెలిసికొని, హిందూమహమ్మదీయమతములం దనిష్టకే ప్రవేశించినదురాచారములను మాత్రము తూలనాడి యిరుతెగలవారిని స్నేహపాశమునఁ గట్టివేయుటకుఁ బ్రయత్నించెను. "ఈశ్వరుఁ డొక్కఁడు, మనుష్యు లందఱు సోదరతుల్యులు" అనునదియే యామహనీయునిమూలవాక్యము. దానినే యాతఁడు తన శిష్యత్వమున కొప్పుకొనినవారి కందఱకు నుపదేశించెను. ఇదియే యాతనిచే స్థాపింపఁబడి కాలక్రమమున నిరుపమానతేజస్సును, అపూర్వసహనమును, అనన్యసామాన్య మగుస్వార్థత్యాగమును జూపినశీఖ్ ధర్మము మొక్క బీజమంత్రము. ఆతఁడు తన్ను మృత్యుశీలుఁ డనియును, పరమపాపి యనియు దలంచుచుండెడివాఁడు. సర్వశక్తిమంతుఁడును, స్వయంభువును, స్వప్రకాశుఁడును నైనపరబ్రహ్మమునందు విశ్వాస ముంచుటయే ముక్తిని బొందుటకు సరియైనమార్గ మని బోధించుచుండెడివాఁడు. ఆతఁడు ఆదిగ్రంథమునం దీవిధముగ వ్రాసెను:—

"మానవుడు కొరానును గాని వేదమును గాని పఠించి తాత్కాలికానందమును బొంద వచ్చును, కాని యీశ్వరుని బొందనియెడల నాతని కెప్పుడును ముక్తి లభించదు." అలౌకికక్రియలను చేసి చూపి యెవరినిగాని యెప్పుడును నాతఁడు మోసపుచ్చ లేదు. కాని యాతనిచే నలౌకికక్రియ లనేకములు జరుపఁబడినట్లు నాతనిశిష్యు లనేకులచే నమ్మఁబడు చున్నవి. ఒకానొకసమయమున నెవరో యాతని నొకయలౌకికకార్యమును జేసి చూపు మనినపు డాతఁడు "నాకు కేవలము పవిత్రమయినమతమును గుఱించి మాత్రము తెలి యును గాని మఱి యేదియుఁ దెలియదు. ఈశ్వరుఁ డొక్కఁడే సత్యస్వరూపుఁడు, మిగిలిన దంతయు నస్థిర" మని చెప్పెను.

అంత్యదినములలో నాతఁడు సపరివారముగ విపాశానదీతీరమునందలి కర్తార్పుర మున నివసించుచుండెడివాఁడు. అప్పుడు నానాస్థలములనుండియు ననేకులు వచ్చి యాతనికి శిష్యు లగుచుండెడివారు. ఆతనియేకాంతధర్మనిష్ఠకును మధురసంభాషణము నకును, సరళసౌజన్యభావమునకును నాతని సమీపించినవా రందఱును మోహితు లగు చుండెడివారు. ఆతఁడు హిందువుల కుపదేశించునపుడు వేదములనుండియు, మహమ్మ దీయులతోఁ బ్రసంగించునపుడు కొరానునుండియు శ్లోకములను జదివి వినుపించుచుండెడి వాఁడు. ఈవిధముగ భక్తసమాగమముచే కర్తార్పుర మొకతీర్థయాత్రాస్థల మైనది. అచ్చటికి నందఱును గుంపులుగుంపుగా వచ్చి శాంతిని బొందుచుండెడివారు.

నానాకునిసహచరులలో మర్దానా బాలసింగుల గుఱించి యిదివఱకే చెప్పఁబడియున్నది. తుంగగ్రామమునుండి రామదా సనెడి మఱియొకగొల్లవాఁడు సయితె మాతని సహచరవర్గములోఁ జేరెను. నానాకుని యాశ్చర్యమైనశక్తిచేతను, భావముచేతను ముగ్ధుఁడై యాతఁడు నానాకునితోఁ జిరకాలానుగతుఁ డయ్యెను. రామదా సందఱికంటెను వయస్సునం దధికుఁ డగుటచే వానిని 'బుడ్ఢా' యని పిలుచు చుండెడివారు. నానాకునిసహచరులలో 'లాహినా' సర్వశ్రేష్ఠుఁడు. శ్రద్ధాభక్తి యందును, ధర్మజీవనమునందును నాతఁ డందఱికంటెను నధికుఁ డని తెలిసికొని నానాకు ఆతనిని పుత్రునికంటె నెక్కువగఁ బ్రేమించుచుండెడివాఁడు. నానాకు పరలోకగతుఁ డగుటకుఁ బూర్వమే 'లాహినా' నే 'గురుఅంగద' అనునామముతోఁ దనస్థానమున నియోగించెను. 'లాహినా' క్షత్రియవంశీయుఁడు. ఆతఁ డొకపర్వకాలమున కాంగ్రా యనుప్రదేశమునకు విగ్రహదర్శనార్థమై పోవుచు మార్గమున నానాకును గలిసికొనెను.

గురునానాకుని సుమధురధర్మసంభాషణమును విని యాతఁడు నానాకునిశిష్యత్వమున కొప్పుకొనెను. నానాకు చాలకాలము మతప్రచారము చేయుచు డెబ్బదియొక్కటవ సంవత్సరమున, క్రీస్తుశకము 1529 సంవత్సరమున ఆశ్వయుజశుద్ధదశమినాఁడు మానవ లీలాసంవరణము చేసెను.

ఈసంక్షిప్తజీవితమునందు బాబానానాకునిధర్మోపదేశములను వ్రాయఁ దలఁచు కొన లేదు. ఆంధ్రపాఠకప్రపంచము నానాకును గురించి యెక్కువ తెలిసికొనఁ నుద్యుక్తమగునటుల నాకు స్ఫురించెనేని బాబానానాకునిజీవితమునే సవిస్తరముగ వ్రాయఁ దలచుకొన్నాఁడను. ఈశ్వరుఁడు ఆంధ్రులమనంబుల నానాకువంటిభక్తులవంక కాకర్షింపఁ జేయును గాక!

ఓం శాంతిః, శాంతిః, శాంతిః.

# ఆనందశతకము

శా. శ్రీవిశ్వేశ! కృపాకటాక్షనిలయా! క్షేమంకరా! శ్రీకరా!
జీవాధార! వికారశూన్య! యమలా! చిద్రూప! భద్రాత్మకా!
దేవా! సేవకకోటికేము లడుపన్ దిక్కెవ్వ రీవే కదా!
హా! వందారుసురద్రుమా! మనుపవే యానందతేజోమయా! 1

మ. ఎవఁ డీలోకములన్ సృజింప నజుఁడౌ, నెవ్వాఁడు పోషింప మా
ధవుఁడౌ, జీవుల నెల్లఁ ద్రుంప హరుఁడౌ, దాత్రీశ్వరుం డెవ్వఁ డా
దివిషత్పూజ్యుఁ ద్రిమూర్తిరూపధరు సద్దీప్తిప్రభావాఢ్యు ని
న్ననలంబించి భజింతు భావమున నే నానందతేజోమయా! 2

శా. నీవే మోక్షము నిచ్చుదాత నను మన్నీభక్తి గోప్యంబుగా
భావంబందున చేయుచు న్సకల మీబాహ్యప్రపంచంబునం
దేవంక న్గన నీవుతక్క నితరంబే లే దటం చెంచునో
యావిజ్ఞానికి బంధ ముంపవు గదా యానందతేజోమయా! 3

మ. జననం బందిననాఁటఁగోలె మది యజ్ఞానంబుచే నెన్నియో
ఘనపాపంబులఁ జేయఁగా, నవి నను న్పీడాగతి న్ద్రోసె నా
మనము న్గాసిలఁ జేయుచున్నది సుధీ! మన్నించి రక్షింపవే!
యనయంబు న్మదిలోఁ దలంతు నిను నే నానందతేజోమయా! 4

శా. ఏజంకిన్ జరియింతు మన్నను దినం బెన్నో మహాదుష్కృతుల్
గావింపంబడుఁ గాద మావలన, లోకస్తుత్యయశా సత్కృపన్
నీ వెల్లప్పుడు మాయఘంబులను మన్నింపన్వలెన్ లేనిచో
నాసంతైనను మేలు మాకుఁ గలదా యానందతేజోమయా! 5

మ. నినుఁ గాదంచును జక్రవర్తులయిన న్నిగ్రహింపఁగాఁ జాల రే
పనిమైన న్దలపోసి మోక్షానికై నెవ్వార ల్సమర్థు ల్గాగం
బున నీయాజ్ఞలఁ ద్రోసిపుచ్చుటకు నోపుణ్యాత్మ! నీచేతిబొ
మ్మన నొప్పారెదమన్న బ్రోవఁగదవే యానందతేజోమయా! 6

శా. లోపం బేమియు లేనిభోగ లీలక భూలోకంబుకన్న న్సుఖం
బాపాదిల్లఁగఁ జాల దెచ్చట నటం చానందము న్బొంపరే?
కూపంబే జగ మంచు నెంచి మునుపు న్గొన్నట్టి మండూక మ
ట్లాపాషండుల కేమిశిక్ష గలదో? యానంద తేజోమయా! 7

మ. ఎవఁ డీలోకమునందు సద్వ్యసనుఁడై యేప్రాణి కైన న్సదా
లవలేశంబును నేగి సేయక మనోలక్ష్యంబు నీమీఁద నే
తవుల్గంజేయునో యట్టివానిభవబంధంబు న్దొలంగించి నీ
పదలీలం దరిఁ జేర్చుచుందువు గదా! యానంద తేజోమయా! 8

శా. దోసం బెప్పుడుఁ జేయఁ జూచి మన సెంతో చాపలం బందెడు
న్వ్యాసం బైన సుఖంబు లేదు తలప న్విశ్వంబులో నేరికి
న్గాసం బైనను వెంట రాదు గద లక్షాధ్యక్షుఁ డైన న్దదన్
హా! సంసారపుఁజిక్కుఁ బాపగదవే! యానంద తేజోమయా!

మ. పరిశీలింపఁ గుటుంబరక్షణమహాభారంబు మానెత్తిపై
నొరగ న్మోయను శక్తి లేక వెతతో నుడ్డాడి దాటంగ నే
తెరవు న్గానక చిక్కుకొంటిమి గదా దీనావనాబంధనన్
హరము న్జేసియుఁ దోవ జూపఁగదవే! యానంద తేజోమయా! 10

శా. నాపాపంబులు కొండలై తరుగకే నన్నెప్డు పీడింప సం
తాపం బందఁగలేక యుక్కి పటుచింతావారిధి న్మున్గ న
న్గాపాడంగను నీవు శక్తి నిరుల్గన్పట్టుమిం జేసి యో
ఘాపద్బాంధవ! గొల్తుఁ బ్రోవఁగదవే! యానంద తేజోమయా! 11

మ. వెసను ల్కొండఱు స్వల్పకార్యములఁ గావింపంగ నే యుబ్బి సం
దడితో దాము మహాప్రయోజకులుగా దైవాజ్ఞన ల్లెంచుచు
జ్జైడై నేని న్దమబుద్ధిలోప మనుచు న్జింతింతు రేదైన నీ
వడరం జేయకయున్న వారివశమా? యానంద తేజోమయా! 12

# ఆనందశతకము.

శా. నానాజాతులు భావభేదములు విన్నాణంపుఁగంఠధ్వనుల్
నానారంగులు గల్గుజీవసమితిన్ జన్మింపఁగాఁ జేసితో
నీనేర్పున్ బొగడంగ నేరితర మా? నిక్కంబు నీభక్తిఁ జేన్
హానిం బాపి యొసంగు రక్షణము నానందతేజోమయా.

మ. జనకుం డైన తండ్రి యొసంగుసంపదను వేశ్యస్త్రీల సర్వంబుఁ గో
ల్పడుకేతిన్ బ్రకృతిపరిభావనశతన్ బాలింపనకం బౌసుఖం
బడుదుష్కార్యములన్ మనిన్ జొనిపి నే నేవేళ దుఃఖింతు, నీ
యడలున్ బాపియు నిత్య మానుషము నిమ్మానందతేజోమయా.

శా. ధారల్ గట్టి యనారతంబు పడుచున్ దైన్యాశ్రు నానాంసలో
దారిన్ బోయెడుపాంథుఁ డట్లు గృహమున్ దాఁ గోరున, ట్లేను సం
సారంబందు ప్రియాస కోర్వకరిమె పారిశ్వ స్వర్గంబునన్ జెల్లు ని
న్నారాధింతును నన్నుఁ గావఁగదవే! యానందతేజోమయా.

మ. చెడుబుద్ధుల్ హరియింపఁ జేసి, మదిలోఁ జీకాకు బోఁ గొట్టి, యిం
పడరన్ జత్తములో విచింతలను బాయన్ ద్రోసి, పాపంబులన్
వెడలన్ ద్రోపి, యపేక్షఁ బాపి, తెలివిన్ బెంపొందఁగాఁ జేసి, నీ
యడుగుల్ ప్రాపుగఁ జూపి, ప్రోవఁగదవే! యానందతేజోమయా.

శా. యాగంబుల్ జపతీర్థముల్ పరిపక్షధల్ యాత్రల్ సమారాధనల్
భోగంబుల్ ఘనదానముల్ జలకముల్ మొక్కుల్ నివేదించుటల్
జాగారంబులు వీనిమూలమున మోక్షం బెట్లు రాఁజాలు? నీ
దౌగారాముఁ గాక భక్తినరదా! యానందతేజోమయా

మ. పురుషార్థంబుల నిచ్చి ప్రోచుకరుణాపూర్ణుండవౌ నిన్ దెంచి నే
నిరతంబున్ భవదీయనామభజనన్ నిష్కామి నై చేయుదున్,
దురితంబుల్ దరిఁ జేరకుండఁ గృపతో మారంబు గావించి నా
దురితవ్యర్థముఁ బాపి కావఁగదవే యానందతేజోమయా.

శా. నీవే దిక్కని నమ్మి నీమహిమలన్ నిత్యంబు సంప్రీతితో
భావంబందు తలచుచుందును కృపాపారీణ! నామొఱ్ఱలన్
నీ వాలించి మనోవ్యథల్ గెడపుచున్ నిశ్చింతునిన్ జేయలే
వా? వందించుట బాడియే? మనుపవే! యానందతేజోమయా.

మ. ఘనకారుణ్యవిశేషతన్ వెలయుచు న్గత్యంతరం బీవ యై
మనుపంజాలుదు వంచు నమ్మికొని నీమం బొప్పఁగా నెప్పుడున్
నిను నర్చించెడుసజ్జనావళికి నెంతే నాపదల్ వాపు దో
యనఘా! ప్రోవవె నీదుసేవకుఁడ నే నానందతేజోమయా.

శా. ఊహింపన్ నెత కాలవాల మయి ప్రత్యూహంబు గావించునా
మోహభ్రాంతిని జిక్కి మానవుఁడు సమ్మోహంబుతోఁ దుష్కృతుల్
ద్రోహంబు ల్పచరించుమన్ నియతమాత్రన్ విడంజేసి తా
నాహా! కాలునిచేతఁ గూలుఁ దుదకో యానందతేజోమయా.

మ. నిగమంబుల్ వినుతింపఁ జాలవు గదా నిక్కంబుగా నీకథల్
జగతీచక్రములోనిపండితులకున్ శక్యంబె వర్ణింప? నేఁ
డగ నం చెంచక చెప్పఁ బూనితిని తండ్రీ! యుపేక్షించి త్రో
యఁగఁబో కజ్ఞుఁడ నన్నుఁ బ్రోవఁగదవే! యానందతేజోమయా.

శా. నీకారుణ్యము నీమహామహిమ నీనిర్దోషచారిత్రముల్
నీకాలానుగుణప్రవర్తనము నీసత్కంపుసద్భావముల్
నీకే చెల్లుఁ గదయ్య పుణ్యపురుషా! నిర్ముక్తులం జేసి మా
యాకాంక్షల్ పరిపూర్తిఁ జేయఁగదవే యానందతేజోమయా.

మ. జనభానంబున సంచరించుతతి నిశ్శంకన్ సదా పూనికన్
దుడుకుల్ పెక్కు లొనర్చి కావరమునన్ దుష్టుండ నైనాఁడ; నా
యెడ గారుణ్యకటాక్షవీక్షణముతో నెగ్గుల్ దొలంగించి, యే
యపలున్ గల్గఁగనీవ రక్షకుఁడ నై యానందతేజోమయా.

శా. ఓనిష్కల్మష! యోపురాణపురుషా! యోసచ్చిదానంద! యో
దీనోద్ధారకృపాబ్ధి! వేదవినుతా! దివ్యప్రభాభాస్కరా!
యోనవ్యప్రతిభాసమంచితమతీ! యోభక్తసంధాయకా!
జ్ఞానాధీశ! ప్రపంచరక్షకమణీ! యానందతేజోమయా!

మ. అజ! ప్రాపంచకచర్య కొండలను గ్రాహ్యంబైన యీమేదినీ
సృజకర్తన్ నిను మానిదర్య లెడపన్ జింతింపలేకున్నచో
నిజమా నీమహిమాతిరేకము గన న్నేనెంత? నీ చింతకున్
యజమానుండవు గాన బ్రోవవలె న న్నానందతేజోమయా.

శా. నాయంబు న్విడనాడి ముష్కరమునన్ సట్టాడుచున్ సౌమ్యమై
యేయజ్ఞానపుగార్యముల్ సలుపగా నింతేని భీతిల్ల; రా
మాయోపాయవిధానజీవనులదుర్మార్గంబు బోదోలి యీ
యాయాసం బుడిగింప లోకమున కోయానందతేజోమయా.

మ. జలధిన్ దాటగ బూనువానికి ప్లవనకున్ జర్చింప బోతంబు గా
వలె, సంసారపయోధి దాటి సుఖులై వర్ధిల్ల నీప్రేమ గా
వలయున్ దానికి పూన్కిమై నిను మదిన్ భావించి సేవింతు నీ
యలఘుప్రేమ లభింపజేయగదవే! యానందతేజోమయా

శా. ఘోరంబైనసుఖంబు లేదు తలపన్ గోటానకోట్లైన ధిన్
వారింపందగనట్టిచిక్కు లెప్పు డాపాదిల్లు సంసారమం
దేరీతి న్నిను జేరి నీకరుణనే నేసేవ గావించుచో
నారాటంబు దొలంగునో తెలుపవే! యానందతేజోమయా.

మ. భవబంధంబుల జిక్కి నీచ మగుతోవన్ బోవుచున్ దూలుచున్
వివరింపన్ బహుళంబు లౌవెతలతో వేసారుమా బోంట్లకున్
భవదీయం బగుసత్కృపారసఝరుల్ ప్రాప్తంబు గాకున్నచో
నవలంబించి తరింప నేది తెరవౌ? యానందతేజోమయా.

శా. ఆలోకింపను నెంత హాస్యులను రోయంగల్ గొనన్ బూన్కొతో
గాఢానం జనరానిపట్టున దగన్ గాసిల్లులేశ్వల్లు సూ!
మే లింతేనియు లేనిదానికయి కామింపంగరా దంచుఁ దా
మాలోచింపక మానవుల్ విషముగా! యానంద తేజోమయా.

మ. రమణీయాంబర భూష్యలక్ష్మిఁ గని తా రంజిల్లరే కంధకా
రములో నిల్చి వివాంధమట్లు, ప్రజ నీపర్జ్ఞావిశేషం బెఱుం
గమిచే వీడి యవిద్యలోఁ దవిలి చీకాకొందుచున్ రోయఁబో
రమలాత్మా! యది సౌఖ్య మన్నభ్రమతో నానంద తేజోమయా

శా. బాల్యాయుంబు మదాంధ రీతి నడుచున్ బాపాత్ములై మేము ని
న్నేలీలం దెలియంగ నేరము తండ్రీ! మమ్ము రక్షింపవా?
బాలుర్ వ్యాధిని దిక్కులేక పడలుచున్ బాధింపబడ్డప్పు డా
మాలోకించి పితల్ సహాయపడరా? యానంద తేజోమయా.

మ. సుఖమెంతేఁ గల దంచు పామరతచే సుంతైన యోజింపకే
ముఖ మీ లేనివికారమోహవశతన్ ముప్పొందిరి పాపైతి, న
న్నుఖిలీకారముఁ జేయు దేని నరకాగ్నోరాశిపాలౌదు ను
మ్మఖిలాత్మా! యెటు గాచెదో కరుణనై యానంద తేజోమయా.

శా. పరిత్యాసక్తిని మంచిచెడ్డలెవియున్ బాటింపకే గర్వినై
నిత్యం బీయిహసంపదన్ మురియుచున్ నిశ్చింతతో నుంటి; నే
సత్యం బైనపదం బెఱుంగమిగదా సంస్తుత్య! పాపైతి, న
న్నత్యర్థం బగునీకృపన్ మనుపవే! యానంద తేజోమయా.

మ. కమనీయంబుగఁ దోఁచు లోకనటనన్ గామించి భోగంబె మో
క్షముగా నమ్మి సతీసుతాదియుతుఁడై సౌఖ్యం బిదే యంచు దే
హము సార్థం బగు నంచు మత్తుఁడయి మాయన్ జిక్కు మూఢాత్ముఁ డో
యమితంబ్రా! నినుఁ గొల్చి ముక్తుఁ డగునా? యానంద తేజోమయా.

శా. ఆశల్ బొందుటచేత మత్ప్రాణము నిరాశాభావముల్ జేయఁగా
లేశం బైనఁ దలంపకే మనుజులన్ లీలారతిన్ గుట్టి తా
నాశం బందెడురీతి మాగతియు నన్యాయంబుగా మాఱు నా
నాశాపాశము గోసి కావఁగదవే! యానంద తేజోమయా!

మ. మహనీయంబగుసూర్యమండలము సామర్థ్యంబుచే సర్వదా
గ్రహసంఘంబును గక్ష్యలందు దిరుగంగాఁ జేయునట్లే ప్రజల్
బహుబంధం బగులోకవృత్తమునఁ ద్రిప్పం జేసె దేరీతి హే
మహాంశా! నీకృపఁ బొంది నిర్గలియ నా నానంద తేజోమయా!

శా. ఎన్నో నీచము లైనజన్మముల నన్నెత్తించి కర్మంబులన్
మున్నే వంతలఁ గూర్చితో యిపు డిదే ముప్పొంది వేసారితిన్
ఖిన్నుం బౌను భజింతు గర్భనరకంబు న్బాపి రక్షింపుమా
యన్నా! బాములఁ బొందఁ జాల నిఁక నే నానంద తేజోమయా!

మ. మును నిన్నర్చనఁ జేయువారలకు నేమో ప్రాపుతో మోక్షసా
ధన మై తంచును విందు సత్యమొ యసత్యంబో గదా నే నెఱుం
గను నన్నెప్పుడుఁ గాచి తుట్టతుద మోక్షం బిచ్చి కాపాడి నా
యనుమానం బుడుగంగఁ జేయఁగదవే! యానంద తేజోమయా!

శా. సుజ్ఞానం బడఁగంటఁగా మదముచే క్షోణీతలంబందు నేఁ
బ్రజ్ఞావంతుఁడ నంచు నెంచుకొనుచున్ బాపంబులన్ జేయుచో
నాజ్ఞోల్లంఘన మంచు దుర్గతికి డాయన్ జేయ కేపట్ల న
న్నజ్ఞానిన్ శరణాగతున్ మనుపవే! యానంద తేజోమయా!

మ. నిను నారక్షకుఁ డంచు నెంచుకొనుచున్ నిక్కంబుగాఁ గొల్చెదన్
నను శోధించినఁ నిల్వఁజాలను జుమీ నాతండ్రి! రక్షింపవే
వినవే మొఱ్ఱలఁ దీర్పవే తనువువే వెంపొందఁగాఁ జేయవే
యను వౌమార్గముఁ జూపవే మనుపవే! యానంద తేజోమయా!

శా. ఎందే జిత్తము వర్తిలంగఁ దనమాతృశ్రీని జూడంగ లే
కిం దందుక్ బసిబిడ్డ గాంచుగతి, నీ వెందుందువో యంచు నే
సందేహంబున సంచరించి తుదకున్ సత్యంబుగా నీవు నా
యందే యుండు టెఱింగితిన్ మనుపవే! యానందతేజోమయా!

మ. తనసామ్రాజ్యము పెంపు తాల్మి గుణముల్ దానంబు ధైర్యంబులన్
దనివిన్ బొందక దైవగాథలవలెన్ దైవాఱ వర్ణించుచున్
వినలే రెవ్వరు నాక సిగ్గతి మదిన్ వేసారకే దుర్మదుం
డనయంబున్ జెలరేగుచుండుఁ దనలో నానందతేజోమయా!

శా. తెల్లం బై ముద మిచ్చి మోక్షదము నై దీపించి చోద్యంబుగా
నెల్లం జూడను జూడఁ బ్రాణమయ మై యేకంబుగాఁ దోఁచుచున్
ముల్లోకంబుల నిండు నిన్ను గనకే మూర్ఖుండు తా మాయలో
నల్లాడున్ దుద కెట్లు ముక్తుఁ డగు నో యానందతేజోమయా!

మ. వలకిందన్ గలధాన్యమున్ దినుట కై వాంఛించి బంధంబులో
వలఁ బడ్డట్టిపులుంగురీతిని ననల్పం బైనసౌఖ్యంబు రాఁ
గల దం చెంచుచుఁ గామ్యసంచయముచేఁ గర్మాఖ్యసూత్రంబునం
దలవోకన్ బడి చిక్కితిన్ మనుపవే! యానందతేజోమయా!

శా. నిద్దం బైనకృపావిశేషగరిమన్ నిన్గోరకుండంగ నే
ముద్దౌపాపల నిచ్చి గేస్తులకు నామోదంబు సంధించి యా
ముద్దున్ ముచ్చట లల్పకాలమున నే బోఁజేయుదీమాత్రపున్
హద్దున్ బద్ధుకు గోర నేమిటికయా! యానందతేజోమయా!

మ. అనుమానింపక దీపమున్ మిడుత లాహారంబె యన్ భ్రాంతితో
జని దానిన్ గబళింపఁ జూచుగతి సంసారంబు పై నాశచే
తను దానన్ బడి కష్టముల్ తొడరినన్ దప్పించుకో లేము నీ
వనుకంపన్ మము గాచుచుండవలె నో యానందతేజోమయా!

శా. నే నీలోకమునందు మంచికొఱకై నిక్కంబ వర్తింపఁగాఁ
బూనన్ మేలును బొందవచ్చు ననుచున్ బుద్ధిన్ విచారించి యెం
తే నిర్దోషపుఁగృత్యముల్ సలిపినన్ జిక్కుల్ తటస్థించె న
య్యా! నిర్మూలముఁ జేయఁ దోడుపడవే! యానంద తేజోమయా!

మ. భవనాశా! భువనైకపోష! సుఖదా! బాహ్యాంతరవ్యాపకా!
రవికోటిప్రతిమానతేజ! వరదా! రాజత్కృపాసాగరా!
భువనాధార! పరాత్పరా! హితకరా! పూర్ణప్రభాశ్రీకరా!
యవివేకప్రవిభంజనా! నుతగుణా! యానంద తేజోమయా!

శా. ఏలీలన్ జరియింప నీకు ముదమో యేలీల నెం దుందువో
యేలీలన్ నిను గొల్వఁ దృప్తి యగునో యేలీల గాన్పింతువో
యేలీలన్ గృప జూపి కావఁ గలవో యేలీల నిన్ జేర్తువో
యాలోచించి వచింపవయ్య వరదా! యానంద తేజోమయా!

మ. మనుజుం డై జనియించినందులకు దుర్మార్గంబునన్ బోక పా
వనచారిత్రముతోడ జ్ఞానమయుఁ డై వర్తించి నిన్ గొల్చినన్
మును దాఁ జేసినపాతకం బెడలఁగా ముక్తుం డగున్ జన్మి యే
యనుమానంబును లేదు దీన నిఁక నో యానంద తేజోమయా!

శా. నాకర్మంబు బలీయ మౌకతన సాద్రం బైనయాపత్తు నన్
సోకన్ బాధ సహింప లేక మదిలో శోకించుచున్ మూఢతన్
జీకాకొందుచునుంటి దానిఁ దొలఁగం జేయంగదే పాపి నై
యాకార్యం బన నెంత నీకు విను మో యానంద తేజోమయా!

మ. మితి లేకున్నవి చెడ్డకార్యము లహో మే లంచు నేఁ జేసినన్
వెతలన్ మున్గుచుఁ జింతతోడను సదా వేసారి వేసారి యే
గతి లేమిన్ జెడిపోదుఁ గానఁ గొలుతున్ గాపాడి దుర్బుద్ధులన్
హతమున్ చేయుముఁ జిక్కు దీర్పఁ గదవే యానంద తేజోమయా!

శా. నాక్రోధంబు నడంప శాంతగుణమే నా కున్న నెండేని భూ
చక్రంబందున శత్రుబృందముఁ గలండా? స్వామి! యపాయంపుక్రో
ధోగ్రం బెడలించి శాంతగుణ మీయం జూడుమా ప్రాపవై
యాక్రందించెద దాని కేను సదయా! యానందతేజోమయా!

మ. లసు వేషాటలచేత మిత్రత్వముగా లాలించి విశ్వాస మొం
తో ఘటిల్లంగను సంచరించి తుదకున్ ద్రోహం బొనర్పంగఁ బొం
చి ఘృణన్ దూరము చేసి మానవుల గాసిం బెట్టుదుర్మార్గు లో
యఘనాశా! పర మందఁ గల్గుదురొకో! యానందతేజోమయా!

శా. ఈపాపిష్ఠపుజన్మమున్ మొదట నా కిమ్మంచు నేఁ గోరుదున్
నీపాదంబుల నాశ్రయించితినొకో నిష్కల్మషా! చెప్పు నా
కీపాట్లేటికి తెచ్చిపెట్టితివి నీ కేయోగ్యు గావింపలే
దాపాపెల్లినచెట్ట బాపఁగదవే యానందతేజోమయా!

మ. గణుతింపన్ శతపక్షుల్ మితిగఁ బల్కన్ విందుమా మానఁగన్
క్షణ మైనన్ సరె మంచు నమ్మఁ జన దీజన్మంబు; పాటించి స
ద్గుణమం దింతకబుద్ధి చూపక సదా దుర్బుద్ధితో నుండి ని
న్ననుమాత్రంబు తలంపఁబోరు చెనువా రానందతేజోమయా!

శా. నీకున్ జెప్పెడి దేమి లేదయిన నానిర్భాగ్యచిత్తంబు తా
రాకాసిం బలె పట్టు నట్టి యిడుముల్ రానీకుమా యంచు నిన్
లోకాధీశ్వరు వేడఁగా దొడఁగె నాలోపంబు మన్నించి నీ
వాకోర్కెన్ నెరవేర్చి కావఁగదవే యానందతేజోమయా!

మ. పతితున్ ధార్మికుఁగా నొనర్తు ననుమన్ బల్కంగ నాలించి స
మ్మతితో నీపదదాస్య మే నెపుడు నేమం బొప్పఁ గావింతు స
ద్గతిఁ జూపించి మనంబు నింది కృపతోఁ గాపాడు మోరక్షకా!
యతిదీనుండ నుపేక్ష సేయకు సుమీ! యానందతేజోమయా.!

శా. నేమం బించుక సత్పథం బెఱుఁగకే నీచప్రవృత్తుండనై
క్షేమం బించుక లేక మిక్కుటముగాఁ జింతించుచున్ భీతిచే
స్వామీ! కావవె యంచు మ్రొక్కిడ నాశ్వాసించి యాప్తుండవై
యామోదం బిడుచున్ భయం బుడుపవా! యానందతేజోమయా!

మ. వడి గారామున నిన్ భజించి కృపకై వాంఛించుచున్నట్టి నేఁ
గడగండ్లం బడి చింతతో మిడుకుచున్ గాపాడు దీవం చహో!
కడు నాసన్ బడియుంటి నీ విఁకను నిష్కారుణ్యమున్ బూనుచో
నడలు న్బాప నిఁ కేవిదిక్కు? జనకా! యానందతేజోమయా!

శా. వేలున్ లక్షలు కోట్లు గల్గుకొలఁదిన్ విత్తంబు సౌఖ్యంబుగాఁ
గాలంబున్ గడుపంగఁ జూడఁగ వృథాకాంక్షాపదేశోజ్జ్వల
జ్వాలం బడ్డగ బంధముక్ బడెడు నాస్వాంతంబు సంతృప్తి యి
మ్మాలంబించి తరింతు సాధనముగా నానందతేజోమయా!

మ. ధరలో నాబ్రతు కుండునంతపఱకున్ దారిద్ర్యమాలిన్యతో
కరుజోపద్రవబాధలం గెడపుచున్ గాపాడి యంత్యంబునన్
స్థిరసౌఖ్యంబును బొందఁ జేయుటకు నాచిత్తంపుఁజాంచల్యమున్
హరియింపించి విముక్తిఁ జూపఁగదవే! యానందతేజోమయా!

శా. క్రోధం బించుక లేక మేలు ప్రజకున్ గూర్పంగ నే రెంతు, రా
మేధావంతులె చిక్కులం బడుదురా మే లింతయున్ లేక, యే
సాధుప్రజ్ఞయొ లేనిమాగతి యిఁకన్ శంకాకళంకంబె గా
యాధారం బయి దేవ! కావఁ గదవే! యానందతేజోమయా!

మ. కడలిన్ బోవుచు యానపాత్రి నడుమున్ గాసిల్లుమట్ గాలిచే
సుడిగుండంబునఁ జిక్కి ముంపఁబడు నౌకన్, జగంబందు నేఁ
గడుకష్టంబులలోన మున్గి మిగులన్ చేటొంది యున్నాఁడ; నా
[illegible]లున్ బాపి సుఖంబుఁ గూర్పఁ గదవే! యానందతేజోమయా!

శా. ఏమాత్రంబును రెక్కపార్చి పెడపకే యెల్లప్పుడుం బిల్లలం
బ్రేమన్ బెంచెడుకుక్కుటంబువలె, న స్వీడ్పాటుగా నియ్యకే
మోమోటంబుగ లోఁగొనెన్ బ్రకృతి యీమాయ ప్పింక దాటింప వ
య్యా! మాయన్ విడ జివ్మ్ర; బాధఁ బడలే నానందతేజోమయా!

మ. తనువే నిత్యము గా దటం చెఱిఁగియున్ దార్మిన్ దిగన్ద్రోసి సా
ధనసంపత్తిని జేర్చి పామరతచేఁ దప్పొప్పులన్ జూడకే
జనసంఘంబును మోసపుచ్చి పగచే సాధింపఁగాఁ జూతు రీ
యనృజాల్ మోసము బొందరా? తెలప రే? యానందతేజోమయా!

శా. నేఁ గావం దగునాఁడఁ గానవిధిగా నిత్యంబు జాగ్రత్తతో
రాగం బొప్పఁగఁ గొల్చి కోర్కులను గోరన్ లోభి వై కొంకి నా
బాగున్ జూడక యున్న నేమిగతి? దేవా! తీర్చినన్ నీదుభాం
డాగారంబు కొంత గల్గఁ జెడెదో? యానందతేజోమయా!

మ. నను సన్మార్గమునుండి పాపి చెఱుపన్ నాయింద్రియానీకమే
మనమున్ గాసిలఁ జేసి సంతతము దుర్మార్గంబునన్ ద్రిప్పెడున్
నిను సేవించెద నింద్రియాదులవెతల్ నిర్మూలముం జేసి న
న్ననుకంపన్ గుణయుక్తతన్ మెలపవే! యానందతేజోమయా!

శా. దాసోహం బని దోసి లొగ్గి యడుగన్ ధాతృత్వమున్ జూపవా
నీసామ్రాజ్యము కొల్ల బో దిడఁగదే నీభక్తు లెల్లప్పుడున్
గ్రాసిం జెందిన నీకె లోపము గదా కాపాడఁగాఁ బూని నీ
వాసాదింపుము వారికోర్కు లిఁక నో యానందతేజోమయా!

మ. సుగుణాత్మా! తలపోఁతకున్ గడగి నేఁ జూడంగఁ జూడంగ నీ
జగతీచక్రమునందు నీమహిమలే సర్వత్ర గన్పట్టె నా
పగ బాపెన్ నినుదక్క నే నితరుఁ గొల్వం బోను జిహ్మరత నా
యగచాట్లం దొలగింపుమా కరుణామ్మై యానందతేజోమయా!

శా. భూతాత్మా! ఫల మేమి కద్దనుచు నీబుద్ధిన్ విమర్శింపవా
దాతన్ బేదను జేసి లోభిని ధనాఢ్యత్ముండు గాఁ జేయుదో
నీతాత్పర్యము మార్పవేని వృథగా నింద్యుం డితం డన్న దుః
ఖ్యాతిం బొందెద నయ్య యల్పమున కై యానందతేజోమయా!

మ. తనకౌతుకన్ గణియింపఁ బో కెపుడు గోతన్ గూల్చుబాబావలెన్
దనదారిన్ బడిపోవుఁ దుందుడుకుగాఁ దర్శించి భర్జించినన్
మన నేమాత్రము లోఁగ కుండియు ననున్ మాప న్విజృంభించు నా
కనుకూలంబుగ దానిఁ ద్రిప్ప గదవే! యానందతేజోమయా!

శా. శ్రీకళ్యాణగుణాకరా! శుభకరా! సేవాకరశ్రీకరా!
లోకాధార! పరోపకార! సుకృతీ! లోకోత్తరా! యీశ్వరా!
యాకారాదివికారభావరహితా! యవ్యక్త! యాద్యంతశూ
న్యా! కారుణ్యనిధీ! సనాతనవిభూ! యానందతేజోమయా!

మ. సతతంబున్ బహుజాగరూకతను నేఁ జర్చించి యోజించినన్
బ్రతియంశంబున శంక దోఁచి కలఁపన్ భావంబు భీతిల్లు నా
గతి తబ్బిబ్బును బొందఁ జేయక గొటన్ గాపాడ ని న్నిప్పుడే
నతిదీనంబుగ వేడెదన్ మనుపవే! యానందతేజోమయా!

శా. వేరై యుండుట మాని జీవులకు నేవేళన్ దయాబుద్ధితో
మేలున్ జేయుమ భేదమున్ విడచి తా మేధావి యై యుండు నే
మూలాధారము సర్వభవ్యముల కాపాంత న్ననుం జేర్పవే
యాలస్యం బగు నేని మోస మగు నో యానందతేజోమయా!

మ. వినుచున్ బల్కుచు నీతిబోధలను దా వేమారు నుంతేనియున్
దనచాంచల్యముఁ బాయదే దిరిగి సంతాపించెడున్ బిమ్మటన్
మన సింకెట్టులు నేఁ బరంబు గనుటల్ మన్నించి సన్మార్గమం
దనయంబున్ జరియింపఁ జేయఁ దగవే! యానందతేజోమయా!

శా. నీచం బైనపదంబునన్ నడచినన్ నిందింతు రన్నట్టిసం
కోచం బింతయు లేక యే తిరుగుటన్ గోల్పోయితిన్ మేలు నే
నాచర్యన్ గొన ముక్తి యబ్బుటరయ లేదంచున్ వినన్ వచ్చెనా
యాచింతన్ నిను మంచి నియ్యావలె నం చానందతేజోమయా!

మ. సదయా! లోపము లేనిమర్త్యునిఁ గనన్ జన్మింపఁగాఁ జేయ నే
ముదమున్ బొందితి నంగసౌష్ఠవమునన్ ముం దైన రా నీకుమా
కొదువన్ నా కని నిన్ను నే ననయమున్ గొండాడుచున్నాఁడ నా
యాదరున్ దీరఁగఁ జేసి నా కభయ మి మ్మానందతేజోమయా!

శా. ప్రాచుర్యం బగుబాధ లేనిమిష మాపాదింతువో తేట గా
దీచర్యం గడుఁ జిక్కులం బడిన నీ కేమీ వినోదంబె యా
నా చూడంగను మూషంబునకుఁ బ్రాణం బూడుటల్ పిల్లి కా
రా చర్లాట లటన్నరీతి తగునా! యానందతేజోమయా!

మ. అవనీనాటకసూత్రధారుఁడవు నీ వాడించిన ట్లాడుమా
నవలోకంబున కేల గూర్చితివి హీనం బైనప్రారబ్ధతా
లవమం దెందుల కింతకాల మిటు లాలాపింపఁగాఁ జేయు ది
ట్లవమానించుట మంచి గాదు వినుమా! యానందతేజోమయా!

శా. వాతం బించుక వీచినం గదలు దీపం బట్లుగా వ్యాకులం
బై తూగాడుచునుండి చిత్త మనయం బాయాసమున్ బొందుమఙ్
భీతిన్ జింతిలుచుండు దానివెఱపున్ దీర్పంగ నే ర్పున్న నీ
వాతోడ్పాటును జేయఁ బూనుకొనవే! యానందతేజోమయా!

మ. వడచే శోషిలునట్టిమానవునకుం బానంబె ప్రాణ మౌనటుల్
వెడసంసారములోనఁ జిక్కి వెతలో వేసారుచుం దూలుచుం
దడబా టొందెడుప్రాణికోట్లకును నీదాక్షిణ్యధాటిన్ శ్రమం
బడఁగుం గావున జూడు మట్లు కృపతో నానందతేజోమయా!

శా. నీ లౌనంతకు పొంచి నిల్చియు సమీపింపన్ బకం బల్లనన్
మీలన్ బట్టను జెట్టుకొన్నగతిఁ దా నేకొప్పుఁగా మృత్యు వా
లీలన్ మ్రింగుచు నుండు నెల్లగను జాలిం బొంది రక్షింప నీ
వాలోచించి యకృత్యముఙ్ గెడపవే! యానందతేజోమయా!

మ. చదువన్ నేర్చినయంత నే గలుగునా సత్యం బుదారత్వ మా
పద దప్పించెడుబుద్ధి శాంతతయు విశ్వాసంబు సారస్యముఙ్
సదయత్వం బివి లేనివారిగతి యోసర్వేశ! యె ట్లున్నదో
జ్ఞాని నీకే విశదం బెఱుంగ రొరు లో యానందతేజోమయా!

శా. సామీప్యంబునఁ జేరి ప్రార్థింపఁ బాదేశున్ వీడక్కే నేఁడునో
నామారాముని దిర్చుత్ల్గతి నిన్నాశించి యేవేళలన్
నీమం బొప్పఁగఁ గొల్చి కోరుకొనముల్ నిశ్శేష మౌనట్లుగా
నాహ్లాదంబున నిల్చి కావఁగదవే యానంద తేజోమయా!

మ. తినుచున్ మూర్కొనుచున్ ధరించుచును వృద్ధిన్ బొందుచున్ జూచుచున్
వినుచున్ సౌఖ్యము నొందుచున్ మఱియుమున్ విజ్ఞానహీనుండు తాఁ
దనియున్ నిత్య మటంచు నమ్మి, యది నిత్యం బైనయానందమా?
యనువర్తించిన మంచికర్మయె సుఖం బానంద తేజోమయా!

శా. నీస్పృష్టిం గలనారికేళతరువే నీర్వట్టునన్ బెంచినన్
వేసంగిన్ బ్రజకోర్కె దీర జలతృప్తిం జేయుచుండెం గదా
గాసిం జెందినవారు నిన్ గొలువ నీకారుణ్య మీఁ జాల నే
లా? సంతృప్తిని జేసి కావఁ గదవే యానంద తేజోమయా!

మ. చెవులున్ గన్నులు పాటవం బుడిగినన్ క్షీణించినన్ రక్తమున్
జవసత్త్వంబులు రూపు మాసినను వీసం బేనియున్ మాన్పఁ జెం
దవు లోభంబును కామమోహములు క్రోధం బింక వేళ్యాని; యీ
యవయోగంబును మాన్ప నిన్ గొలతు నే నానంద తేజోమయా!

శా. నీమం బై చెడు నందు నెంచి సుతునిన్ నిత్యంబు జాగ్రత్తతోఁ
జూచున్ సత్పథమందుఁ ద్రిప్పఁ బిత; యాజోకన్ బ్రమత్తుండ నై
యేచిక్కున్ బడ కుండ నుండుటకు సద్వృత్తిన్ బ్రసాదించి యి
మ్మాచంద్రార్కము నిన్నుఁ జేరి మననా నానంద తేజోమయా!

మ. ఎర యాశించున్ గబళించి గాలమున మీ నేరీతిగాఁ జిక్కు న
ట్లరయన్ బ్రాజ్ఞతలేమి నొందుచును నే నాశింతు నేకృత్య మే
దురితం బైనను నందునన్ బెడుదు నిర్దోషంబుగాఁ ద్రిప్పుమా
హా నీమార్గమునందు మేలు గన నే నానంద తేజోమయా!

శా. న్యాయంబందున దృష్టిఁ గల్గునరులే యాపత్తులన్ మున్గఁగా
హేయం బైనయకృత్యముల్ నెఱపువా రేకష్టముం బొంద; రీ
వేయుద్దేశముచేతఁ జేసితివొ యీయేర్పాటు లీరీతి న
న్యాయం బౌ నిది తీర్చి కావఁ గదవే యానందతేజోమయా!

మ. అనువౌ కోకిలకూజితంబులను దా మాలించి కాకంబు లో
ర్వనిరీతిన్ నిను మోక్షదాయకుని భావంబందుఁ జింతించువా
నెనువేరిటన్ విపయాళి చుట్టుకొని న న్వేధించు మాన్పింప; నీ
యనరున్ బాపుము నిన్ భజింతు శుభ మా నానందతేజోమయా!

శా. ప్రేమించున్ సుఖమన్నఁ గష్టమనినన్ జెగ్గిల్లు నామానసం
బేమో? సైఁపఁగఁ గల్గఁ గష్టము సుఖంబే యౌర యభ్యాసికిన్
సామాన్యంపువిపత్తులోర్వఁగలయోజన్ మాకు నేర్పింపవే
యామార్గంబున వచ్చి చేరుగుము ని న్నానందతేజోమయా!

మ. బలముం విద్యయు బుద్ధి కౌశలము సద్భావంబు సంపత్తియున్
గలవాఁ డయ్యును కార్య మూనుకొన నీకారుణ్యమే లేనిచోఁ
దొలఁగుం సాధ్యము గాక యం చెఱిఁగి నీతోడ్పాటుకై కొల్తు న
న్నలయం జేయక తోడునీడ యగుమా యానందతేజోమయా!

శా. నాతండ్రీ! గుణ మెంచఁ బోక సతతం బాసక్తితో స్వాంత మెం
తో తుచ్ఛం బగుకోర్కి గోరి విడ; దాదుర్బుద్ధి మాన్పించి యే
లా తెల్లంబుగ మేలుకీడులను దెల్పం జూపవో దీనర
క్షా! తప్పున్ సవరింపు పూర్ణముగ నో యానందతేజోమయా!

మ. చిలుకల్ పుష్పితశాల్మలిన్ గని భ్రమన్ జేరంగ నం దేమియుం
ఫలముల్ చేపడకుండినన్ విడువకే వర్తించునారీతి నే
నిల భోగంబుల నమ్ముచుం విడువలే నేమోస మే తెంచునో
యలవాటున్ దొలఁగించి కావఁగదవే యానందతేజోమయా!

శా. ఓభవ్యాత్మక! నీదు నామభజనం బొప్పారఁగాఁ జేయుచో
శోభించున్ గడజాతివాఁ డయినఁ దేజోమాననీయాత్ముఁ డై
నీభక్తిప్రభ నీచబుద్ధిఁ గెడపన్ నిక్కంబు ముమ్మాటికా
నాభాగ్యం బిడి చేరఁ దీసికొనవే యానందతేజోమయా!

మ. పడిగాలిన్ బనుమాది యైనఁ దుద కేపార్శ్వంబునందో క్షితిన్
బడురీతిన్ మనుజుండు కర్మవశతన్ వర్తించుచుండు దాననే
పడయున్ నీచఁపుజన్మ మట్టిగతి మాన్పన్ ద్రిప్పి రక్షింపు మే
యడలున్ గల్గఁగనీక ని న్గొలతు నే నానందతేజోమయా!

మ. ఘనుఁడౌ దేవుఁ డొసంగు ముక్తి యని దుష్కార్యంబులన్ జేసి ఘో
ఫున సామాన్యుని గొల్వ లాభ మగునా? పొందంగ సద్వర్తనన్
దనయంతం గృషి చేయు మాయొపడి మోదం బొప్పగా వాంఛితం
బనుసంధింతువు గాని యూరక కిము దే? యానందతేజోమయా!



# అభిప్రాయములు

రాజమహేంద్రవరమందుఁ బౌరపాఠశాలలో వ్యాయామశాస్త్రబోధోద్యోగము నందు నున్న మ॥ శ్రీ॥ సూర్యాబత్తుల సూర్యనారాయణగారు రచియించిన శతకములలో నానందశతకము పరిశీలించి చూచినాఁడను. వీరు బాల్యవయఃప్రభృతికవితారచనయందు నభిరుచి గలిగియున్నవారు. సర్వదా పండితాశ్రయణతత్పరులై వర్ధమానచంద్రస్థితిని వర్ధిలుచున్నవారు. కావుననే వీరు భక్తిజ్ఞానవైరాగ్యములను బోధించునట్టియీపొత్తంబును నింత సరసంబుగా రచించుటకుఁ గారణం బని నేఁ దలంచెదను. ఇంచుమించుగా నిందలి ప్రతిపద్యంబును లోకానుభవప్రసిద్ధంబైనదృష్టాంతంబులతో నిండి యుండి యుభయమాద్యలంకారంబుల భూషింపఁబడి యున్నది. ఇయ్యది చదివినచదువరులకు నానందమ్మును గలిగించుచు భక్తిజ్ఞానవైరాగ్యమార్గత్రయంబును గరతలామలకంబుగఁ గనఁబఱచు ననుట కెంతమాత్రమును సందియంబు లేదు. రచనాశైలి సమస్తజనులకును సుబోధం బగునట్లులు శోభిల్లుచున్నయది. కాఁబట్టి సదుపదేశంబులకుఁ గోశాగారంబైనయీకోశము సజ్జనసమాదరణీయంబై యుండు నని నే నెంచెద.

రాజమహేంద్రవరము
12 అక్టోబరు 1912

కల్లూరి వేంకటరామశాస్త్రి
ఆర్ట్సుకాలేజీ, ఉభయభాషాధ్యాపకపండితుఁడు

ఆనందశతకము—ఇది రాజమహేంద్రవరము టౌన్‌స్కూలునందు వ్యాయామశాస్త్రోపాధ్యాయుఁడుగా నున్న శ్రీ సూరాబత్తుల సూర్యనారాయణగారిచే మృదుమధురశైలిన్ రచింపఁబడిన నీతి, భక్తి, జ్ఞానశతకములలో నొకటి యగు భక్తిశతకమై ప్రతిపద్యరసాస్పదమై తనరారుచున్నది. ఇందు నేవేని కొన్నిస్వల్పదోషము లున్నను పెక్కుపద్యములు స్తోత్రపాత్రము లై పాఠకులన్ భక్తిపరవశులం జేయఁజాలు నని తలంచెదను. ఇదివఱలో సరసకవితాధురంధరులు కొందఱట్టి శతకములు కొన్ని రచించి యున్నవారు. అట్టిప్రౌఢకవులగ్రంథములకీబాలకవిగ్రంథ మెంతయును దీసిపోవక మిన్నయై యున్న దని వ్రాయుట కెంతయు సంతసించుచుం బరమేశ్వరుఁ డాయన కాయురారోగ్యము లొసంగుఁ గాత—

మ. నిగమంబుల్ వినుతింపఁ జాలవు గదా నిక్కంబుగా నీకథల్
జగతీచక్రములోనిపండితులకున్ శక్యంబె వర్ణింప నేఁ
దగ నం చెంచక చెప్పఁ బూనితిని నాతండ్రీ! యుపేక్షించి త్రో
యగఁ బో కజ్ఞుఁడ నన్నుఁ బ్రోవఁ గదవే యానందతేజోమయా!

అని ప్రార్థించు సుజనవిధేయుఁడు.
శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి.

# మహర్షి దేవేంద్రనాథచరిత్రము.

## వంశప్రశంస.

దేవేంద్రనాథునిపూర్వులు చిరకాలమునుండి 'ఠాకరు లేక టాగోరు' అనుబిరుదుతోఁ బిలువఁబడుచుండిరి. టాగో రనునది నాయకపదతుల్యమై మిక్కిలి ఘనత వహించినవారి కీయఁబడి యమితగౌరవచిహ్నమై యుండెను. ఇప్పుడు సుప్రసిద్ధిఁ జెందిన శ్రీమహారాజ సర్ జ్యోతీంద్రమోహనటాగోరు కె. సి. యస్. ఐ. గారీవంశస్థులే. వీరిపూర్వులు చిరకాలముక్రిందట జెస్సోరుమండలములో నివసించుచుండిరి. అష్టాదశశతాబ్దారంభమునఁ బంచాననటాగోరు తననివాసస్థానమును విడిచి ఫోర్టువిల్లియమునకు వచ్చి యచ్చటనే నివాస మేర్పఱచుకొనెను. ఆతనికుమారుఁ డగు జయరామటాగోరనునతఁ డిరువదినాల్గుపరగణాల కధికారిగా నుండి యమీ ననెడిమహాపదము నంది మిగుల కీర్తి వడసి పాతుర్యఘట్టముకడ నొకదివ్యమందిరమును గట్టించి 1762వ వత్సరమున మృతిఁ జెందెను. అతనికి నల్వురుపుత్త్రులు గల రందు ద్వితీయుఁ డగు నీలమణిటాగోరు ప్రసిద్ధిఁ జెందిన ద్వారకనాథటాగోరుతండ్రి యగు రామలోకనటాగోరుతండ్రియే.

పాశ్చాత్యులచే రాజా ద్వారకనాథటాగో రని మన్నింపఁబడునితని నాకాలములో భరతఖండమున మించినవా రెవ్వరును లేరు. ఇతఁడు సద్బ్రాహ్మణవంశసంభూతుఁ డైనను, నితనిపూర్వు లొకరు మహమ్మదీయులచే వండఁబడినమాంసము నప్రయత్నముగాఁ దెలియక వాసనచూచినమహాదోషమునకై తద్వంశస్థు లందఱును వెలివేయఁబడిరి! అయినను, ఈకాలములోఁగాని యేకాలములోఁగాని వెలి భాగ్యవంతులకడఁ దన పటుత్వమును జూపనేరదు గదా! ద్వారకనాథుఁడు కోటికిపడగెత్తిన యమితధనవంతుఁడై యుండెను. అతఁడు న్యాయవాది. ఇందుమూలమున వచ్చెడియాదాయమే గాక యతఁ డిరువురుపశ్చిమదేశస్థులతోఁ గూడి విదేశవ్యాపారము చేయుచుండుటచే దానివలనఁగూడ మితములేనిధనము ప్రతివత్సరమును వచ్చుచుండెను. భాగ్యమునకుఁ దోడుగా-

నతనిపాండిత్యమును, దేశాభివృద్ధికరము లగునభిప్రాయములును, ; సువాసన యబ్బినట్లు మఱింతకీర్తిని సంపాదించెను. సహగమనమును మాన్పుటయందును, హిందూ కలాశాలలరీతిని విద్య నేర్పుహిందూకలాశాలను స్థాపించుటయందును శ్రీరాజారామ మోహనరాయలకుఁ దోడ్పడిన దితఁడే. వేయేల? సంఘవిద్యాశిల్పకళారాజకీయవిషయ ములలో నీతనిపేరు లేని దాకాలములో లేనే లేదు. రామమోహనరాయలచే స్థాపింపఁ బడినపరిశుద్ధాస్తికసమాజమునుకూడ నితఁడు కొంతకాలము నడపుచుండెను. శ్రీరాజా రామమోహనరాయలు మొట్టమొదట సీమకుఁ బోయి యచ్చటనే యస్తమించినవెనుక, 1841వ వత్సరమున ద్వారకనాథుఁడును సీమ కేగి బ్రిస్టలునగరమున గతించినతనప్రియ మిత్త్రున కొకగొప్పసమాధిని గట్టించి, యటనుండి ఫ్రాన్సుదేశమునకుఁ బోవఁగా నీహిం దూదేశస్థునిఘనతను విని యాదేశాధిపతి, మహారాజుల నాహ్వానముఁ జేసినట్లు రావించి తనదర్శన మిచ్చుటయే గాక యతనికి గొప్పవిందును జేసి బహూకరించెను. అప్పుడు పారిసునగరములో విద్యాభ్యాసముఁ జేయుచున్న మోక్షమూలరుభట్టాచార్య లీతనిని మహారాజువలె జీవించినవానిగా వర్ణించెను.

ద్వారకనాథుఁడు 1842వ సంవత్సరములో హిందూదేశమునకుఁ దిరిగివచ్చి మరల 1845వ వత్సరములో సీమకుఁ బోయి యచ్చటనే లండనునగరములో మఱుసటి సంవత్సరమున మృతిఁజెందెను.

## బాల్యదశ.

లోకైకప్రసిద్ధి నందినయీద్వారకనాథునకు ముగ్గురుతనయులు గలరు. అందు దేవేంద్రనాథుఁడు ప్రథమపుత్త్రుఁడు. అతఁడు 1817వ సంవత్సరము మేనెలలో జనన మందెను. బాల్యమునుండియు నతఁడు తనపితామహిచే నెంతోగారాబముతోఁ బెనుపఁ బడెను. ఆమె మిగుల భక్తురాలయియుండి తాను సేవించినయాత్రలన్నిటికిని బాల దేవేంద్రనాథునికూడఁ దోడ్కొనిపోవుచుండెను. పూర్వాచారపరాయణులగు తన తండ్రితల్లివలెనే యతఁడును శైశవమున ననేకదేవతారాధనమును, విగ్రహపూజనమును

లోనయ్యెను. రాజారామమోహనరాయలచే స్థాపింపఁబడినయొకచిన్నపాఠశాలకుఁ బంపఁబడి యతఁ డక్కడ బంగాళీసంస్కృతభాషలు నేర్చినపిదపఁ బదునాల్గువత్సరముల వయసున హిందూకలాశాలలోఁ జేరి హూణపారసీకభాషల నభ్యసించి చక్కనిజ్ఞానమును సంపాదించెను. బ్రహ్మసమాజమును స్థాపించినరామమోహనరాయల నితఁడు కనిపెట్టకయుండలేదు. ఆమహానుభావునివిద్యాచారిత్రమును విని నిత్యమును సాయంతనవేళ నతఁడు నివసించుతోఁటలోనికిఁ బోయి దైవజ్ఞానమును మతావేశమును గలిగించెడు నతనిసంభాషణమును బాలదేవేంద్రనాథుఁడు వినుచుండువాఁ డని తెలియవచ్చుచున్నది. ఒకనాఁ డతఁడు తనగృహములో మహోత్సవముతో దుర్గపూజ జరుగుచుండఁగా రామమోహనరాయలను దానిని జూచుటకై రమ్మని యాహ్వానముచేయఁబోయెను. అప్పుడాయన యితనివాక్యములు విని యసమ్మతిని దెల్పుకంఠస్వరముతో, "ఏమి వత్సా! దానికి న న్నేల పిలువవలెను? నాకడకుఁ గాదు. నాసోదరునికడకుఁ బొమ్ము." అన నాబాలదేవేంద్రుఁడు రామమోహనరాయలకు విగ్రహారాధనమైఁ గలనిరసనభావమును గ్రహింపఁజాలకపోయెను గాని, యంతటిప్రసిద్ధిఁ జెందినమహాపండితుఁ డీవిగ్రహపూజ యన్నతోడనే యేవగింపును జూపుటకు హేతు వే మని మాత్ర మించుక వితర్కించెను. తరువాత దేవేంద్రనాథుఁడు మున్ముందు గొప్పవాఁడు కాఁగలఁ డని కొన్నికొన్నియంశములవలన రాజారామమోహనరాయలు గ్రహించినట్లు తెలియుచున్నది. అందుచేతనే యతఁడు సీను కేనునపుడు దేవేంద్రనాథుని బిలిచి ప్రియవాక్యములతో నతనికడ సెలవుపుచ్చుకొని వచ్చెనఁట! ఆగర్భశ్రీమంతుఁ డగుదేవేంద్రుఁడు మహారాజభోగములలోఁ బుట్టి పెరిగె నని స్పష్ట మగుచునే యున్నదికదా. తనబాల్యదశనుగూర్చి యతఁడే యీక్రిందివిధమునఁ జెప్పియున్నాఁడు.

"భాగ్యవంతు లగుతలిదండ్రులకు జనించి, మహాధనసంపన్నమై ప్రసిద్ధికెక్కినగృహమునఁ బెరిగి మితిలేనివైభవముతో మహారాజభోగ మనుభవించుచు భగవంతుఁ డన్న నేమాత్రము నభిప్రాయము లేకయే నేను పెరిగితిని. జనులందఱు నన్నతిగౌరవముతోఁ జూచుచు సమస్తసౌఖ్యములును గల్గించుచుండిరి. నాపనులను నెఱవేర్చుటకై లెక్కలేనిసేవకులు పిలువకుండఁగనే వచ్చి నాకు రవ్వంతయైనను గష్టము తోఁపకుండునట్లు చేయుచుండిరి. నాదగ్గఱ ధనము లేక, నే నిబ్బందిపడఁబోవునప్పుడు, ఎడతెగనిసముద్రతరంగములవలె మితములేనిసొమ్ము నాకడను వచ్చి పడుచుండెడిది. నాహృదయములోఁ

గోరిక జనించుటయే తడవుగా సర్వకార్యములును నత్యంతవేగముతోఁ గొనసాగుచుండెడివి. ఐశ్వర్యమును, సుఖజీవనమును, ననేకదుష్కార్యములకుఁ బురికొల్పగాఁ నేను వానికి సులభముగా వశమగుచుండువాఁడను. తాత్కాలికసుఖమే నా కప్పుడు ముఖ్యముగా నగపడుచుండెను గాని ముందుమాట యెన్నఁడుఁగాని నాహృదయములోఁ జొచ్చెడిదికాదు. ప్రాపంచికవిషయము లెల్లను నన్ను మోహపెట్టి యాకర్షింపఁగా నేను వానికి బానిస నై లోఁబడిపోతిని. నే నింద్రియలోలత్వమునఁ బూర్ణముగా మునిఁగిపోయితిని. ఆంతరాత్మను దానియున్నతపదవినుండి దిగలాగి యాస్థానమునఁ జంచలమైనచిత్తమును నిల్పితిని."

## ప్రథమ ప్రబోధము.

ఇంతటివిషయాసక్తుఁడై యున్నను దేవేంద్రనాథునిస్థితి యీప్రకారమే సర్వకాలమును నిలిచియుండలేదు. కాలగతిచే మార్పులు సహజముగాఁ గలుగుచుండునుగదా. ఇట్లుండఁగా నతనిపూర్వచరిత్రమునంతను దలక్రిందు చేసెడియొకసందర్భ మతనిగృహములో జరిగినది. ఇతనిని బెంచి పెద్దవానిని జేసినపితామహికి దుర్వ్యాధి సంభవించుటచే నామె యిఁక జీవింపనేరదని నిశ్చయించి యప్పటిదేశాచారముచొప్పున నామెను గంగానదీతీరమునకుఁ దీసికొనిపోయిరి. ఎవ్వరికైనను నవసానకాలము సమీపించునప్పుడు వారిని గంగయొడ్డునకుఁ గొనిపోయి మృతిఁజెందునప్పుడు పాదములను గంగలో నుంచిన పక్షమున వారికి మోక్షము కలుగు నని పూర్వులు తలంచి, యింకను బ్రాణ ముండఁగనే వ్యాధిగ్రస్తులను దీసికొనిపోయి హోరున వాన గురియుచున్నను, లేక మంచు దట్టముగాఁ బడుచున్నను గంగాతీరముననే చిన్నకుటీర మేర్పఱచి యక్కడనే మృతినందువఱకును గాచికొనియుండువారు. ఇట్లే దేవేంద్రనాథునినాయనమ్మకును సంభవించెను. ఆమెను నపరిమితమైనదుఃఖముతో డనే యామెవెంటనే మరణించునని యెంచి యెల్లవారును గూడి నదియొడ్డునకుఁ దీసికొనిపోయిరి గాని యామె మూఁడు నాళ్లవఱకును మృతిఁజెందనే లేదు. ఆమె మిగుల ధనవంతురాలని చెప్పి యెక్కడనుండియో బ్రాహ్మణులును వచ్చి మంచిసంభావన దొరకు నని చుట్టును జేరి వేదమంత్రములను జపముచుండిరి, వేరొకకొందఱు హరిసంకీర్తనములఁ జేయుచుండిరి.

అప్పుడు రాత్రి వెన్నెల పుచ్చపువ్వువలె బ్రకాశించుచుండెను. అచ్చటిశ్మశానభూమి భీకరముగా నుండు నని సాధారణజనులు భావించినను, ఆసమయమున నిశ్శబ్దముగా నుండి చిత్తశాంతిని గలిగించుచల్లనిచంద్రిక తెల్లదలను వ్యాపించియుండుటచేతను, నదీప్రవాహముపైనుండి వచ్చెడిశీతలవాతపోతములు హాయిని గలిగించుచుండుటచేతను, నదీజలము కరఁగించినస్వచ్ఛమైనవెండివలె ప్రకాశమాన మై పాఱుచు నేత్రపర్వముగా నుండి యమితానందదాయక మై పొలుచుచుండుటచేతను, మనోహరముగా నుండె ననియే చెప్పవచ్చును. దేవేంద్రనాథున కిప్పుడు పదునెన్మిదివత్సరములప్రాయము వచ్చినది. తన్నమితానురాగముతోఁ బెంచినతండ్రితల్లి లోకాంతర్గతురాలగుచున్నదికదా యని విలపించుచు నామెప్రక్కను గూరుచుండి, యక్కడ సంగీతము పాడెడువాక్యములతనిహృదయములోనికిఁ జొచ్చి జీవ మస్థిరముకదా యని యతఁడు తలపోయుచుండఁగా నతనియెదుట నద్భుతముగా జ్ఞానలోకము పొడకట్టెను. గౌతమసిద్ధార్థునకును, మహర్షి దయానందసరస్వతికిని నిట్టిసందర్భముననే ప్రబోధచంద్రోదయ మయ్యెను. అప్పుడు తనహృదయములోఁ గలిగినమార్పువిషయమై దేవేంద్రనాథుఁడే యిట్లు వ్రాసికొనియున్నాఁడు. “ఆశ్మశానమున నే నిదివఱ కెన్నఁడు నెఱిఁగియుండనిప్రాపంచికవిషయముల యస్థిరతనుగూర్చినయద్భుతమైనజ్ఞానము నాహృదయములోఁ బ్రవేశించెను. అప్పుడు నాపూర్వస్థితి యంతయుఁ బూర్తిగా మాఱిపోయెను. నేను రెండవజన్మ మెత్తినట్లు నాకుఁ బొడకట్టెను. సంపదలపై గాఢ మగునసహ్యము జనించెను. ఆసమయమున నేను గూరుచుండియున్నమతుక నెదురుచెళ్ళచాపయే నాకర్హ మైనయాసనముగాఁ గాన్పించెను. తివాసులును వెలగలరత్నకంబళ్ళును నాకెంతో యసహ్యముగాఁ గనఁబడెను. ఇంతకుమున్ను డెన్నఁడు ననుభవించియుండనియానందము నాహృదయమున నుద్భవించెను. అంతవఱకును స్వేచ్ఛావిహారమునందును సుఖలోలత్వమునందును నేను మునిఁగియుంటచే నేనాఁడు గాని తత్త్వజ్ఞానవిషయమై విచారించియుండలేదు. మతమన నేమి? ఈశ్వరుఁడన నేమి? యని నే నెప్పుడును విచారణ చేసియుండలేదు. నిశ్శబ్దముగా నున్నయాశ్మశానవాటికి మిక్కిలిస్వభావసిద్ధ మైనయందమును వహించి హృదయాకర్షకముగా నుండెను. ఆక్షణముననే గలిగినయానందమును నేను పట్టఁజాలనైతిని. అనుభవించినదానిని నే నెట్లు వర్ణింపఁగలను? భాష మిగులదుర్బలముగా నున్నది. ఏతర్కశాస్త్రము చదువునప్పు డట్టియానందము కలుగును? ఆయాసమాన మైనసంతోషముచే మనహృదయమును నింపుటకు భగవంతుఁడు తరుణముకొఱకు వేచియుండు ననియు సరిగా యుక్తసమయముననే యాబ్రహ్మానందమును దేవుఁడు కరుణాళుఁడై నాకుఁ బ్రసాదించె ననియుఁ జక్కఁగా ననుభవముపై గ్రహించితిని.” వేఱొకచోట విబ్రహ్మ

నందానుభవమును దేవేంద్రనాథమహర్షి యిట్లు వర్ణించెను. "మహాతేజస్స్వరూపుఁ డగు పరమేశ్వరుఁ డాతరుణమున నకస్మాత్తుగా నాహృదయమునెదుట సాక్షాత్కరించి నాయాత్మను బలవత్తరముగా నాకర్షించి సంతోషామృతముచే నాయాత్మను నత్యంత మాధుర్యముగా నొనర్పఁగా నేను కొంతవడికును సంతోషపారవశ్యముచే నానందాబ్ధి నోలలాడుచు నీశ్వరతేజములో సంపూర్ణముగా మునిఁగిపోతిని. బాహ్యలోకమును, నంతర్లోకముకూడ నీశ్వరతేజముచే దేదీప్యమానముగాఁ జేయఁబడి మాధుర్యముగను స్వచ్ఛముగను నావింపఁబడినదివ్యనదీప్రవాహములో స్నానమాచరించుచున్నట్లు నాకు గనఁబడెను. ఈకనఁబడిన దేమి? అదియే సత్యతేజము. అదియే ముక్తిదూత. నాకు గాన్పించినది మనఃకల్పితమై భ్రమోపాదితమైనస్వప్నసందర్శనమా యన్న నది కాదు. మఱేమది? నిర్వికారస్వరూపుఁ డగునీశ్వరసాక్షాత్కార మనుటకు సందేహ మేమి యుండును? నేను దానిని జూచితిని. నేను దానిని స్పర్శించితిని. అది నన్ను జ్ఞానమునకుఁ బురికొల్పెను. నిస్సంశయముగా నది యీశ్వరునికరుణావాత్సల్యముయొక్క ప్రత్యక్షమే. మధ్యాహ్నవేళ సువర్ణాక్షరములు స్పష్టముగాఁ గనిపించునట్లు, పరబ్రహ్మముయొక్కదయను నే నందు విస్పష్టముగాఁ గాంచఁగలిగితిని. నన్నురక్షించుటకై చాచినయీశ్వరహస్తములను స్పర్శమువలన నేను గ్రహించితిని. దిక్కులేనిదీనులను రక్షించువాఁడును, పాపులకు గతియైనవాఁడును, సర్వరక్షకుఁడును, నాతండ్రియుఁ దల్లియు నైనయాపరమేశ్వరుఁడే నాపైని గరుణించి తనదివ్యతేజముతో నాయాత్మయెదుటఁ గాన్పించినది. పాపిని, దుష్టవర్తనుఁడను, అజ్ఞానాంధకారనిమగ్నుఁడను, నగు నాయపవిత్రమగుహృదయములోఁ దననిస్తులదయావాత్సల్యముచే నామహామహుఁడు సాక్షాత్కరించినతోడనే, నే నంతటిదయకుఁ బాత్రుఁడను గా నని తెలిసికొనుటచే నాయొడలు వడఁకజొచ్చెను. పేదకు బెన్నిధానము దొరకునపుడు హృదయ మట్లే యుండునుకదా. అమలుఁడును, పవిత్రస్వరూపుఁడును, దయామయుఁడును, అయిన యంతటిమహానుభావునిసమీపమునకు నాదుష్టహృదయముతో నేఁ జేరలేకపోతిని. కొన్నినిమిషములవఱకును నాయనతో నైక్యమై యానందములో మునిగిపోతిని. ఆమోక్షానందమును నే నత్యాతురతతోఁ గ్రోలునపు డైహికవిషయములుగాని, చింతలు గాని న న్నాయనుభవమునుండి యడ్డుపెట్టక దూరముగాఁ దొలఁగిపోయెను."

## మనఃక్షోభము—ఈశ్వరాన్వేషణము.

దేవేంద్రనాథునకుఁ గలిగినప్రబోధమునకును, గౌతమబుద్ధుఁడు మొదలుగాఁగల మతకర్తలకుఁ గలిగినప్రబోధమునకును జాలభేదము గాన్పించుచున్నది. లోకము పాపభూయిష్ఠ మనియుఁ, గష్టభాజన మనియుఁ దోఁచి వారి కందఱకును వైరాగ్యము కలిగినది. దేవేంద్రనాథున కట్లు కా దని స్పష్టపడుచున్నదికదా. ఇతనికిఁ గలిగిన ప్రేరేపణ వాచామగోచర మైనసంతోషము. ఈశ్వరగ్రహణమునలనఁ గలిగిన ప్రేమ. ఆసమయమున దేవేంద్రనాథునకుఁ గలిగినయానందము శాశ్వతముగా నతనిహృదయములో నపుడు నిల్వలేదు. అది వెంటనే పోయి యతనిహృదయములో విచారమును మనోవికలత్వమును జనింపఁజేసెను. తరువాత నతనిహృదయస్థితినిగూర్చి దేవేంద్రనాథమహర్షి యేయిట్లు చెప్పికొనెను- "నాపితామహి చనిపోయిననాఁటిపూర్వపురాత్రి నాకుఁ గలిగిన యానందమును తిరిగి సంపాదింపవలె నని నే నెంతయినను బ్రయత్నముఁ జేసితిని గాని నా కది మఱల లభ్యముకా దయ్యెను. అప్పుడు ధైర్యము నన్ను వీడిచిపోయినమీఁదట నైహికవిషయములపైని వైరాగ్యము న న్నావహించుకొనెను. అపుడు నాహృదయములోఁ గలిగినవిచారమునకుఁ బరిమితి లేదు. అన్నిదిక్కులును నంధకారబంధురము లై చూపట్టెను. విషయాసక్తులు నన్నుఁ దమబలము చూపి యాకర్షించుట మానివేసెను గాని యీశ్వరజ్ఞానముమాత్రము నాకు సమీపముగా నుండలేదు. అపుడు నాకుఁ గలిగిన దే మనఁగా నైహికసౌఖ్యమును బరలోకసౌఖ్యమును రెండునుకూడ లేకపోయెను. జీవము కృశించెను. లోకము శ్మశానమువలె నయ్యెను. ఎక్కడను నాకు సంతోషమును, ఆత్మశాంతియుఁ గలుగలేదు." ఇట్లు వికలత్వముఁ జెందినమదితో నతఁ డీరీతిని రెండుసంవత్సరములు గడపెను. అడిగినవారి కెల్లను విలువగలవస్త్రములను, వస్తువులను నిచ్చివేసెను. ఇంగ్లీషుతత్త్వశాస్త్రముల నెల్లను దుదముట్టఁ జదివెను. అతఁ డనుభవించినయానందము మఱి దొరకలేదు. ఇట్టిస్థితియం దుండిన దేవేంద్రనాథుఁ డొంటరిగాఁ బ్రాతఃకాలమున లేచి వెళ్ళి యారామములోఁ గూరుచుండి నిమీలితనేత్రుఁ డై ధ్యానము చేయుచుండెను. ఎంతప్రొద్దెక్కినను నతఁ డచ్చటనుండి కదలుట లేదు. అతఁ డీలోకమునే మఱచిపోయి నడిమింటికి సూర్యుఁడు వచ్చినను నట్లే ధ్యానసమాధిలో మునిఁగియుంటఁ జూచి యతనిసేవకులు వచ్చి యెండ తగులకుండునట్లు గొడు

గల నతనిపైఁ బట్టుచుండెను. సుఖనిద్రాపరవశుఁ డైనవానివలె నతఁడు లేచివచ్చి యెప్పుడే కార్యముఁ జేయుచున్నను నేదో దీర్ఘచింతను దగిలినవానివలెనే యాతఁడు కన్పట్టుచుండును. ప్రతాపచంద్రముజుందారు డీయనచరిత్రమును వ్రాయుచు నీసందర్భమున నిట్లు వ్రాసియున్నారు. "ఈశ్వరునిగూర్చియు, నీశ్వరునకును జీవునకును గలసంబంధమునుగూర్చియు నతఁడు (దేవేంద్రనాథమహర్షి) మిక్కిలి స్వభావసిద్ధము లై సత్యము లైనయూహలను సంపాదించెను. ఈయభిప్రాయము లన్నియు సూర్యుఁడు, చంద్రుఁడు, నక్షత్రములు మొదలగుబాహ్యలోకములనుండియుఁ, దల్లి తనబిడ్డపైఁ జూపు ననురాగమునుండియుఁ, బడవవానికేకనుండియు గ్రహించినవే. ఇవన్నియు నతనికిఁ బరమాత్మజ్ఞానమును, శక్తిని, ప్రేమను, అనంతత్వమును వెల్లడిచేసెను." ఇందలిపడవవానికేకనుగూర్చి యొకకథ గలదు. "దేవేంద్రనాథుఁ డొకప్పుడు తనజమీందారిలోనుండి పన్నులను వసూలుజేసికొని యింటికి వచ్చుచుండెను. అప్పుడు సాయంకాలము కమ్ముచుండెను. దేవేంద్రనాథుఁడు తాను దాఁటవలసిననదియొద్దకును వచ్చునప్పటికి నొక పెద్దతుపాను ప్రారంభమయ్యెను. హోరుమని గాలి వీచుచుండెను. వానచినుకు లప్పుడప్పుడే చిటపట మనఁ జొచ్చెను. మేఘములు భీకరనాదములతో గర్జలను వృద్ధియగుటను మొదలుపెట్టెను. ఇట్టిసంక్షోభమున నతఁడు పడవవాండ్ర నేఱు దాఁటింపుమనియుఁ గావలసినసొమ్మిత్తు ననియు నడిగెఁగా వా రెవ్వరు నిట్టియపాయకర మైనపని కంగీకరింపరైరి. ఎట్టకేల కొకనావికుఁడు తాను దాఁటింతు నని చెప్పి దేవేంద్రనాథు నెక్కించుకొని తక్కినపడవవాం డ్రింకను వలదు వల దని వారించుచుండఁగనే యామాటలను లెక్కసేయక తెరచాప నెత్తి వాయువేగమున నావలియొడ్డునకుఁ బోసాగెను. నదీమధ్యమున కేగుసరికి ఝంఝామారుతము ప్రళయభీకరమై, తరంగములు తాళప్రమాణము లై, యొక్కపెట్టున నావ గిఱ్ఱునఁ దిరిగి తలక్రిందై నీటను గ్రమక్రమముగా మునిఁగిపోఁజొచ్చెను. నావికుఁడును దేవేంద్రనాథుఁడునుకూడ మునిఁగిపోవుచున్నపడవభాగమును బట్టుకొని నీటిపైఁ గొట్టుకొనుచుండిరి. ఈతరుణమున బోవల దని వారించిననావికులలో నొకఁడు కంఠ మెత్తి "భయపడకుఁడు. భయపడకుఁడు. భయపడకుఁడు" అని కేక వైచి యొక్కక్షణములోఁ దననావను దీసికొనివచ్చి వారి నెక్కించుకొని సురక్షితముగా నావలియొడ్డునఁ జేర్చెను.

## మహర్షి దేవేంద్రనాథచరిత్రము.

దీనినుండి దేవేంద్రనాథమహర్షి చక్కనిజ్ఞానమును సంపాదింపఁగలిగెను. దిక్కు లేక నదీమధ్యమున మునిఁగిపోవుచుండఁగా నావికుఁడు భయపడవల దని యభయమిచ్చి తన్ను రక్షించినట్లుగా నీశ్వరుఁడు తన కేల యభయ మీయకుండును? తన్నేల రక్షింపకుండును? అని తనలోఁ దాను వితర్కించి "ఓ పరమాత్మా! నాకు నీ వెప్పుడు భయపడవల దని, యభయ మిత్తువో; అప్పుడే నేను ధన్యుఁడ నగుదును. దయామయుఁడ వగు నో తండ్రీ! న న్నీయజ్ఞానభయమునుండి విడిపింపుము. అజ్ఞానాంధకారములో మునిఁగి పోవుచున్న యీదీనున కభయమిచ్చి కాపాడుము. నీశరణముపక్క నాకు వేఱుగతి లేదు." ఇట్లాతఁడు పరమేశ్వరుని బ్రార్థించుచుఁ గాలమును గడపుచుండెను. బ్రహ్మముతో నైక్య మై శాశ్వతానందము ననుభవించుటకుఁ బూర్వ మతఁ డెన్ని ప్రయత్నములఁ జేసి యెన్నికష్టములు పడి యెంతసాధనము చేసెనో, యెల్లవారును దెలిసికొనుట ముఖ్యము గావున జ్ఞానదాయకము లగు నతనివాక్యములే యిక్కడఁ బొందుపఱచుచున్నాను.

"ఆత్మాభివృద్ధికొఱకై యీప్రకారముగా నాయాత్మలోఁ బెద్దసంక్షోభము పుట్టెను. కరుణాళుఁ డైనయీశ్వరునిదివ్యసాన్నిధ్య మొక్కటియే నామనఃక్షోభము నడంచి నాకుఁ దృప్తిని గలిగించి శాంతిని సమకూర్చుటకు శక్తి గల దని నేను దృఢనిశ్చయుఁడ నైతిని. ఇదియే నాజీవితముయొక్క ముఖ్య మైనలక్ష్యమును గమ్యస్థానము నయ్యెను. దీనిని బొందుటకే నాయెల్లకోరికలను నిల్పి, నాయావచ్ఛక్తులను వినియోగ పఱచితిని. దినములును వారములును నెలలును సంవత్సరములును వేగముగాఁ బరుగెత్తఁ జొచ్చినకొలఁది, నాహృదయములో నంతరాత్మకు మనోవికారములకును, జ్ఞానతేజము నకు నజ్ఞానాంధకారమునకును బెద్దయుద్ధములు ప్రబలి తుదకు నాయాత్మ భీకరరణరంగము కాసాగెను. నాజీవితమును బవిత్రముగాఁ జేసికొని నేను చిరకాలమునుండి తదేక ధ్యానముతోఁ గోరుచున్న శాశ్వతానందపదవి నందుటకై యనువగుశక్తిని రక్షణమును దయసేయు మని హృదయపూర్వకముగాఁ దద్దయుఁ బ్రార్థించుచుంటిని. ఏకాగ్రతఁ జెందినదృష్టితోడను; అద్వితీయ మైనసంకల్పముతోడను; అంతరాత్మమూలముగా బోధించెడియీశ్వరునియాజ్ఞల ననుసరించి నేను చరించితిని. ఏకార్యముఁ జేపట్టినను సఫలము కాఁ జొచ్చెను. నాలోపములనుండియుఁ బాపములనుండియుఁ గ్రమముగా నేను తొలఁగిపోయి మంచిమార్గమునఁ బడుచుంటి నని గ్రహింపఁజాలితిని. ఆపరమేశ్వరుని

పవిత్రసాహాయ్యమువలన నేను బాల్యమునం దెలియక చేసిన దట్టముగాం బెరిగియున్న పాపములనుండి నాయాత్మను మెల్లగాం దప్పించి, నామార్గములో నడ్డుగాం బ్రతిబంధకము లై పడియున్నకష్టశతములను జయించి, యెన్నిచిక్కుల నైనను బెట్టువిషయాకర్షకములనుండి విడివడి యెన్నరానియిక్కట్టులకు లోనగుచుం గ్రమక్రమముగా జయమును బొంద సాగితిని. నాదుస్స్వభావము లన్నియు లొంగదీయంబడెను. అరిషడ్వర్గము యొక్కతీవ్రత యణంపంబడెను. అంతరాత్మ తనయెప్పటియున్నతపదవియం దుంచంబడెను. ఐహికవిషయములు బలవంతముగా నాకర్షించుట మానెను. పరమాత్మయే నాకు సౌఖ్యము నానందము నొసంగువాఁ డయ్యెను. ప్రియమాతవలె బ్రాహ్మధర్మము నాసత్యధర్మమును నాకు నేర్పి మానవవిధిని బోధించెను. ఈశ్వరునిదయయే, మనుజుండు చేయవలసినయథార్థకృత్యము లేవి యున్నవో వానిని నే జేయుటకు బురికొల్పెను. అదియే నాకార్యములలో నా కత్యంతసహాయముగా నుండెను. ఆయీశ్వరుని ప్రేమయే సత్యమైనయీశ్వరభక్తు లగుమిత్రులను సమకూర్పంగా వారిసంఘమే నాకు సంతోషదాయకమై కార్యాచరణమునకుం దగినశక్తి నీయంగా వారితోం గూడి మాయందఱితండ్రియు నైన సర్వేశ్వరుని సంఘముగాం జేరి యానందములో మునింగి ప్రార్థనం జేయుచుంటిని. నాహృదయ మెంతో యెక్కువగా మారిపోయెను. సత్యమును నేను కనుగొంటిని కదా యని నాహృదయములోం గలిగినయానందమునకు మేర లేదు."

## ద్వితీయ ప్రబోధము.

ఇట్లుండంగా దేవేంద్రనాథమహర్షిని సత్యాన్వేషణమున కై మేలుకొల్పిన వేఱొకసంగతి జరిగెను. స్వభావసిద్ధముగా నేదియో తలపోయుచు నొంటరిగాం గుర్చిలో నతండు కూరుచుండి యుండంగా, వాయువశమున నొకసంస్కృతగ్రంథములోనిచినింగి పోయినపుట యెగిరిపోవుచుండెను. అం దేమి యున్నదో యని చూచుట కై దానిని బైకెత్తి చూచి దానియర్థమును బూర్ణముగా గ్రహింపం జాలక తనగృహాచార్యున కిచ్చి సాయంత్రము తాను వచ్చులోపల నర్థము వ్రాసి యుంచు మని చెప్పెను.

దేవేంద్రనాథుఁ డిప్పుడు తనబ్యాంకులో సహాయకోశాధిపతిగా నుండి వడ్డీవ్యాపారము చేయుచుం డెను. ఇప్పటి యాతనివయ సిర్వదియొక్క వత్సరములు. నాఁడు పదిగంటల కతఁడు తనపనినిమిత్తము పోయి సాయంత్రము వాడుకవేళకుఁ బూర్వమే కోశాధిపతిగా నున్నయతనిపినతండ్రి యగుమహారాజా రామనాథటాగోరు సి. యస్. ఐ. అనునాతనికడ సెలవుఁ గైకొని వెంటనే తనపండితునికడకుఁ బోయి దానియర్థ మడుగఁగా నాతనికి బోధపడలే దనియు, బ్రహ్మసమాజకార్యదర్శి యగుపండితరామచంద్రవిద్యావాగీశునికడ కరిగిన సర్వమును సులభముగాఁ దెలియఁ గల దనియుఁ జెప్పఁగా నాతనికడకుఁ బోయి దేవేంద్రనాథుఁడు ప్రశ్నింపఁగా రామచంద్రవిద్యావాగీశుఁ డది చూచి ఈశోపనిషత్తులోనిశ్లోకము లని వెంటనే తెలియఁబఱచి వానియర్థమును స్పష్టముగాఁ దెలియఁ జెప్పి యీశ్వరతత్త్వమును నవి బోధపఱచు నని పలికెను. అందు మొదటిశ్లోక మీక్రిందిది:—

శ్లో॥ ఈశావాస్య మిదగ్ం సర్వం యత్కించ జగత్యాం జగత్
తేన త్యక్తేన భుఞ్జీథాః మాగృధః కస్యస్విద్ధనమ్.

[జగత్తునందలిసర్వము నీశ్వరునిచే వ్యాప్తమై యున్నది. దానియందు మమత్వమును విడిచి యానందింపుము. ఎవరిధనము నపేక్షింపకుము.]

ఈశ్లోకార్థములు దేవేంద్రనాథునిహృదయము నాటెను. వెంటనే యతఁడు సంస్కృతవిద్యను జక్కగా నేర్వ నారంభించి యింతటిజ్ఞానధనముతో దులదూఁగుచున్న యుపనిషత్తులను సంపూర్ణముగా గ్రహించుకోరికతో రేయింబవళ్ళు మితిలేనివ్యాసంగముఁ జేయ మొదలుపెట్టెను. దేవేంద్రనాథుఁ డిదివఱకే పశ్చిమదేశతర్కశాస్త్రముల సారమును గ్రహియించి యుండి, యుపనిషత్తులు వేదములలోనిభాగములవలెనే యనేకదేవతారాధన మంగీకరించు నని భావించి వానిని జూచుటయే మానివేసెను. ఇప్పుడన్ననో రాజారామమోహనరాయలచే స్థాపింపఁబడినబ్రహ్మసమాజమున కాచార్యుఁడుగా నున్నపండితరామచంద్రవిద్యావాగీశులయనుగ్రహముచే నుపనిషత్తులు బోధించి చెప్పినజ్ఞానములో మునిఁగిపోయి, యంత్యకాలమువఱకును వానిని జదువుటయే జ్ఞానదాయకముగా నెంచి యతఁడు కాలముఁ బుచ్చెను. ఇది యంతయు జరిగినవత్సరము 1838.

## ప్రయత్నము.

దేవేంద్రనాథుఁ డిప్పటికే దైవావేశము గలమహనీయుఁ డనియు, సత్యమతబోధకుఁ డనియు నెల్లవారిచే నంగీకరింపఁబడి ప్రసిద్ధి కెక్కెను. 1839 వ సంవత్సరములో నతఁడు తత్త్వబోధినీసభ యనునొకసమాజము నేర్పఱిచెను. ఇందు నిత్యమును పత్రికలఁ జదువుచుండుటయు, ప్రతివారమును పాఠములు సల్పుచుండుటయు, నెల కొకసారి యీశ్వరప్రార్థనము జేయుచుండుటయు జరగుచుండెను. మొట్టమొదట దేవేంద్రనాథుఁడును, అతనిబాల్యస్నేహితులు తొమ్మండ్రును గలిసి యొక చిన్నసమాజముగాఁ జేరి దేవేంద్రనాథునిగృహములోనే యొకగదిలో సమావేశ మగుచుండిరి. అయినను కొలఁదికాలములోనే ఘనులు సంపన్నులు నగుప్రసిద్ధపురుషు లీసమాజోద్దేశములు విని యందుఁ జేర మొదలుపెట్టిరి. అందు వర్ధమానమహారాజాధిరాజబహద్దూరు, నవద్వీప రాజా శ్రీశచంద్రరాయలు, భూకైలాసపురీపరిపాలకు లగుశ్రీరాజా సత్యశరణఘోషాల్ మొదలగువారు ముఖ్యులు. ఆసమాజోద్దేశములను సర్వజనులకును దెలియఁబఱచుటకై యతఁడు తత్త్వబోధినీపత్రిక యనుదానిని బంగాళీభాషలో నడుపసాగెను. అది యిప్పుడు సైతము మాసపత్రికగా నడుపఁబడుచునే యున్నది. ఇట్లుండఁగా నా సమాజమహోత్సవము మొదట 1842 వ వత్సరమునఁ గాని జరుగ లేదు. అచ్చటియుద్యోగస్థుల కందఱకు నాహ్వానపత్రికలఁ బంపినప్పుడు కలకత్తానగరమున తత్త్వబోధినీసభ యనునొకసమాజము కూడ నున్నదా యని యాశ్చర్యపడఁ జొచ్చిరి. వా రదివఱకు దానిపేరే విని యుండ లేదు. ఈచిత్రమును వేడుకతోఁ జూచుటకైనను ననేకులు నాఁటిసభ కేగి యుండిరి. అప్పటినుండియు సభ క్రమక్రమముగ వృద్ధి యయ్యెను.

## కార్యారంభము.

ఈసంవత్సరముననే దేవేంద్రనాథటాగోరు ప్రప్రథమమున బ్రహ్మసమాజమును సందర్శించెను. అప్పుడు బ్రహ్మసమాజము బలీయ మగుసంఘముగా నుండ లేదు. ప్రతివారమును వేదమంత్రములను గలిసి చదువుటకును, ప్రార్థన చేయుటకును మాత్రము కొందఱు కూడుచుండిరి. ఆసమాజమున కొక యచ్చటివారమునను, వేదపారాయణ

ణములును, ఉపన్యాసములను వినుచుండెడివారు. అందుఁ జేరినవారికిఁ బోయిన దేమియు లేదు. ఏవిధమైనప్రమాణములు గాని నిబంధనలు గాని లేవు. అప్పుడు సమాజమునకు వచ్చెడివారిలోఁ జాలమంది తమయిండ్లకడ విగ్రహారాధన చేయువారుగానే యుండిరి గాని సత్యమైనయాత్మోపాసనను గ్రహించి యుండ లేదు. ఇట్లని ప్రస్తుత బ్రహ్మసమాజమతబోధకుఁడగు శ్రీపండిత శివనాథశాస్త్రిగారు, ఆకాలమునందలిబ్రహ్మ సమాజస్థితిని గూర్చి వ్రాయుచున్నారు. మొట్టమొదట శ్రీరాజారామమోహనరాయలు బ్రహ్మసమాజమును 1828 వ సంవత్సరములో స్థాపించి రెండుసంవత్సరములవెనుక నొక మందిరమును గట్టించెను. అప్పటినుండియు నతనిసహాయిగా నున్నపండితరామచంద్ర విద్యావాగీశుఁడు తనశక్తి కొలందిని పాటుపడి దానిని నిలువబెట్టెను. అతఁడెంత ప్రయత్నించినను సమాజము చుఱుకుఁదనము లేక యేకేటను హీనదశను బొందుచుండుటచే నెంతయు విచారించుచున్నయవసరమున, దేవేంద్రనాథుఁడు వచ్చి బ్రహ్మసమాజమునఁ జేరి తనసర్వస్వమును దానియధీనము జేసి తనయావచ్ఛక్తిని వినియోగించి సమాజాభివృద్ధికై పాటుపడెద నని వాగ్దానము జేసినప్పుడు విద్యావాగీశునకుఁ గలిగినయానందమునకు మితము లేకపోయెను. మతావేశమును, ధీరచిత్తమును, సత్స్వభావమును, శాంతహృదయమును, గాంభీర్యమును, పాండిత్యమును గలప్రసిద్ధిఁ జెందిన దేవేంద్రనాథటాగోరు సమాజమున నెప్పుడు చేరెనో, యప్పుడే యది బాగుపడిన దనుటకు సందేహము లే దని విద్యావాగీశుఁడు తలంచెను. అంతకు ముందు బ్రహ్మసమాజ మున్న దనియే నల్వురకును దెలియకపోయినను, తత్త్వబోధినీసభకును, బ్రహ్మసమాజమునకును గూడ విద్యావాగీశుఁడే ప్రధానాచార్యుఁడుగా నుండుటచే దేవేంద్రనాథునికి దానివిషయము తెలిసిపోయి చూడఁగనే, తత్త్వబోధినీబ్రహ్మసమాజములయుద్దేశము లన్నియు సమముగానే యుండినట్లు స్పష్టము కాఁగా నారెంటిని నతఁ డేకము చేసి తానే దానికి నిరంకుశాధికారి యై, కార్యనిర్వాహకుల నేర్పఱచి, తానే స్వయముగా నన్నివిషయములను బరీక్షించుచు, ముఖ్యకార్యముల నెల్ల నిర్వహించుచు, నెంతధనము కావలసివచ్చినను దానే దానిని భరించుచు, మాసపత్రికను సైతము తనయాజమాన్యముక్రిందనే నడపించుచు, నీవిధముగా సర్వవిధముల బాటుపడసాగెను. అప్పటిబ్రహ్మసమాజము మిక్కిలి తుచ్ఛ వదశలో నుండె నని యిదివఱకే వ్రాయఁబడి యున్నది కదా! దేవేంద్రనాథ

మహర్షియే యిట్లు వ్రాసియుండెను. "నేను మొట్టమొదట బ్రహ్మసమాజములోఁ జేరి నప్పుడు, ప్రతిబుధవారమును గ్రమముగా సమాజమునకు వచ్చువారిలో నెవ్వరు గాని విగ్రహారాధనమును విడిచిపెట్టుటకుఁ దెగించియుండలే దని నాకుఁ దెలియవచ్చెను. ఇంతే గాక, సమాజవిధిప్రకారముగాఁ దమతమ్మయిండ్లకడ నీశ్వరోపాసనఁ జేయువారును నాకు గనఁబడ లేదు" అలోపములను సరి చేసి బ్రహ్మసమాజమును జక్కనిపునాదిపై నిల్పుఁ బెట్టుటకై యతఁడు 1843 వ సంవత్సరములో నీక్రింది బ్రాహ్మికప్రమాణపత్రికను నిశ్చయముగా సామాజికుఁడుగా నుండఁ దలఁచినప్రతివానిచేతను సంతకము చేయించెను.

ఓం

నేఁటికి సరి యైన——వ సంవత్సరము——వ నెల —వ తేదిని నే నిందు మూలమున బ్రాహ్మమతమ వలంబించుచున్నాను.

(1) సృష్టికర్తయు, రక్షకుఁడును, నాశకుఁడును, ముక్తిని బ్రసాదించువాఁడును, సర్వజ్ఞుఁడును, సర్వవ్యాపియును, ఆనందమయుఁడును, నిరాకారుఁడును, అద్వితీయుఁడును, అగుపరమేశ్వరుని ప్రేమించుచు, నతనికిఁ బ్రీతికరము లగుకార్యములు చేయుచు, నారాధన చేయుచుందును.

(2) సృజింపఁబడినయేపదార్థమును గాని సృష్టికర్తగా దలచి నేను పూజింపను.

(3) నాకు దేహములో వ్యాధి కలిగి శక్తి లేక యున్నపుడును, లేక యేది యేని విపత్తు సంభవించినప్పుడును దప్ప, నేను బ్రతిదినమును, పరమేశ్వరునియెడ ప్రేమ గౌరవము గలహృదయముతోఁ బ్రార్థింపక యుండను.

(4) సత్కార్యములను జేయుటకుఁ బ్రయత్నింతును.

(5) నీతిబాహ్య మైనపాపకార్యములను వర్జించుటయందు నేను జాగరూకతఁ గలిగి యుందును.

(6) విషయప్రాబల్యముచే నే నేపాపకార్యముల నైనను జేయునపుడు పాప విమోచనముకొఱకై పశ్చాత్తాపము పడి యిఁక ముం దట్టిదుష్కార్యములను మఱలఁ జేయ కుండుటకై ప్రయత్నముఁ జేయుదును.

(7) బ్రాహ్మమతాభివృద్ధికై ప్రతివత్సరమును బ్రహ్మసమాజమునకు శక్తికొలఁది దాసము చేయుచుందును. ఓయీశ్వరుఁడా! ఈబ్రాహ్మమతధర్మముల ననుసరించి ప్రవర్తించుటకుఁ దగినశక్తిని నాకుఁ బ్రసాదింపుము.

ఓం ఏకమేవాద్వితీయమ్.

మొట్టమొదట దేవేంద్రనాథుఁడును, అతనిప్రియమిత్రులు పందొమ్మండుగురును ఈప్రమాణపత్రికపై సంతకము చేసిరి. వీరందఱును పండితరామచంద్రవిద్యావాగీశుఁడాచార్యుఁడుగా నుండఁగా బ్రహ్మసమాజమున నూతనపద్ధతులమీఁదఁ జేర్చుకొనఁబడిరి. నాఁటిచరిత్రను గుఱించి పండితశివనాథశాస్త్రిగా రిట్లు వ్రాయుచున్నారు:— "బ్రహ్మసమాజ మీశ్వరప్రేరితమైనయాన్యోన్యసోదరభావము గలపారమార్థికసమాజముగాఁ జేయఁబడుటకిదియే ప్రథమప్రయత్నము. కావున 1843 వ వత్సరము మిగుల ప్రసిద్ధి నందిన దయ్యెను. నాఁ డీయిరువదిసామాజికులును, తత్పవిత్రసమయమున కర్హమగుదుస్తుల ధరించి, యాచార్యుని సమీపించి, భక్తిపూర్వకమైనభయముతో నాప్రమాణపత్రికలోనిపవిత్రవాక్యముల నొక్కొక్కటిగా నుచ్చరించుచుండఁగా, వృద్ధుఁడైనయాయాచార్యునిమనస్సు కరఁగి, వర్ణనీయముకానిలోనియానందము పొంగి పొరలిపోఁగా దానిని పట్టఁజాలక బాలునిరీతిగా నతఁడు కన్నీరు పోయుచుండఁగా విలపింపసాగెను. అందుచే నతఁడు తానాదినమునఁ జెప్పఁ దలచుకొన్నమతవిషయికోపన్యాసము నెంత మాత్రము చెప్పఁజాలక, వెక్కివెక్కి యాక్రందించుచు నేమియుఁ బలుక లేక, "శ్రీరామమోహనరాయలే యాదినమున నుండియున్న నెంతసంతోషముగా నుండును!" అని మాత్ర మామహానుభావుఁడు పండితరామచంద్రవిద్యావాగీశుఁడు వాపోయెను! ఈతరుణమున 'రామమోహనరాయలు' అన్నతోడనే మే నెల్ల జలదరించుచున్నది కదా! తనసోదరు లందఱును విగ్రహారాధనలో మునిఁగి యుండి సత్యమైనయీశ్వరుని మఱచి పోయి యజ్ఞానాబ్ధిలోఁ బడి యుండఁగాఁ జూచి విచారించి తనమాతృదేశమును వేయు పురుగై దొలిచి వేయుచున్నయీప్రతిమారాధనను నిర్మూలము చేయుటకై యహోరాత్రములు పాటుపడి, బ్రహ్మసమాజ మనెడిసద్బీజమును మాత్రము నాఁటి పిన్నమొలకను గావించి దానికి జిన్నతనములో సమస్తవిధోపచారములును జేయుమహాభాగ్యముఁ బొందకుండఁగనే యారాజా రామమోహనరాయలు విదేశమున నస్తమించెను. ఆమహామహుఁడే యాసమయమున నున్నచో దేవేంద్రనాథునియొక్కయు, విద్యావాగీశులయొక్కయు సత్ప్రయత్నములఁ జూచి తాను వేసినమొక్కను పెంచెడిదక్షులు కలిగిరి కదా యని యెంత సంతోషించి యుండును! అది నాశము కాకుండునట్లు మిక్కిలి యపేక్షతోఁ బాటుపడి పెంచి తనవార్ధక్యమున బాలదేవేంద్రనాథున కొప్పగించిన విద్యావాగీశుని మనము వేనోళ్ళఁ బొగడినను తీరదు కదా!

ఇట్లుండఁగా 1844 వ సంవత్సరములో దేవేంద్రనాథటాగోరు వేదాంతము చెప్పుటకును, ఉపనిషత్తులసార మగు నీబ్రాహ్మమతమును జనులకు బోధించుబోధకుల కభ్యాసము చేయించుటకును 'తత్త్వబోధినీపాఠశాల' నొకదానిని స్థాపించెను. మఱు సటిసంవత్సర మతఁడు నల్గురువిద్యార్థులను జెరియొకవేదమును బూర్ణముగాఁ బఠించి, తచ్ఛాస్త్రమును గఱచుటకై కాశీపురమునకుఁ బంపెను. ఇంతవఱకును దెలిపినసంగతుల నన్నిటిని బట్టి యంతవఱకును బ్రహ్మసమాజము పూర్తిగా వేదము ననుసరించునది యని స్పష్టపడుచున్నది కదా. ఇప్పటిబ్రహ్మసమాజ మన్ననో ధారాళమై, యనేకమతములనుండి వాస్తవముల నేర్చి కూర్చినది యైనమత మై యున్నది. ఇంతవ్యత్యస్తమునకు హేతు వప్పటివా రంధప్రాయముగా వేదమో యొకమతగ్రంథము దోషరహితమై యమోఘమైన దని తలంచుటయే. ఈయభిప్రాయము దేవేంద్రనాథునిహృదయము నుండి తొలఁగించి నైజసత్యమును వెంటనే సంప్రాప్త మయ్యెను.

ఈవిషయ మిట్లుండఁగా నాకాలములోఁ బశ్చిమదేశములనుండి యీదేశమునకు వచ్చియున్నక్రైస్తవమతబోధకులు తమయావచ్ఛక్తులను వినియోగించి హిందువులను దమమతస్థులనుగా మార్చవలెనని విశ్వప్రయత్నములను జేయుచుండిరి. ఇట్లు తమకార్యమునకు వారు కుతంత్రములఁ గొన్ని జంకు లేనివారై చోరకిరాతకృత్యములకు సైత మొడిగట్టి నీతివిదూరులై హిందూబాలకులను బాలికలను గూడ వారి వారి తల్లిదండ్రులయనుమతి లేకయే యెత్తుకొనిపోయి, ధనాదికములను జూపి యాశ గొల్పి తమమతములోఁ గలుపుకొనుచుండిరి. ఒకనాఁడు రాజేంద్రనాథసర్కా రను నతఁడు దేవేంద్రనాథునికడ కరిగి తనభార్య ప్రోద్బలమునఁ గ్రైస్తవమతములోఁ గలుపుకొనఁ బడిన దనియు న్యాయాధికారులకడ కేగి విన్నవించినను న్యాయము దొరక లే దనియుఁ దనకుఁ గలిగినవిపత్తును గూర్చి తెలియఁబఱచి కన్నుల నీరు జొటజొట రాల విలపింపఁగా సహజకోమల మగుహృదయము గలదేవేంద్రనాథునిమనసు కరఁగఁగా హిందూసంఘమునకుఁ గలుగనున్నయీప్రత్యక్షక్షయరోగమును క్షతము గావింప నాతనికి వెంటనే దృఢనిశ్చయము కలిగెను. ఈక్రైస్తవదౌర్జన్యములను నిర్మూలించుటకై యతఁడు హిందూబాలురను మిషనరీపాఠశాలల కంపుచున్నంతకాలము నీదురవస్థ తొలఁగి పోనేర దని యెంచి 'హిందూహితార్థివిద్యాలయ' మనుపాఠశాలను స్థాపించుటకై పెద్దజమీందారులసాహాయ్యమునఁ జాల ప్రయత్నములు చేసి శీఘ్రకాలములోనే యాకార్యమును గొనసాగించెను. ఈసందర్భమునఁ బూర్వ మతనిమతాభిప్రాయములను జూచి పరమశత్రువసమాను లైనపూర్వాచారపరాయణు లందఱు నీతని కమితసహాయ మొనర్చి రని తెలియ వచ్చుచున్నది.

క్రైస్తవదౌష్ట్యములనుగూర్చి జనులకు బోధించుటకై దేవేంద్రనాథుడు గొప్పసభలను జేసి హిందువులు క్రైస్తవు లగుటచే సంభవింపఁ గలనష్టములను విప్పి చెప్ప నారంభించి, మనయుపనిషత్తులలో నెట్టిమతము చెప్పఁబడి యున్నదో గంభీరముగా నన్నిచోటుల నుపన్యసించుచు నెల్లవారును దమతమబిడ్డలను గాపాడుకోఁ దగినసమయము వచ్చినదని హెచ్చరించుచుండెను. అట్టియాపత్కాలమున బ్రహ్మసమాజికులు చేసినమహోపకారమును మఱవఁ జాలక, యదివఱకు గర్హ్యముగాఁ జూచినబ్రహ్మసమాజమును స్వదేశోద్ధారణమునకై జన్మించినదానినిగా భావించి వంగదేశస్థు లందఱును దమయాదరణముఁ జూప సాగిరి. ఇర్వదియెనిమిదవయేటనే, యసన్యసామాన్యమైనశక్తితో దేవేంద్రనాథుఁ డీఘనకార్యములను నిర్వహించుచు జనులచే వినుతిఁ బడయుచుండఁగా 1845వ సంవత్సరమున నాతనితండ్రి యగుద్వారకానాథటాగోరు సీమలో మృతి జెందెననుకఠోరవార్త వినవచ్చెను.

## ఈశ్వరదత్తగ్రంథపరిశోధనము.

చతుర్వేదపఠనమునకై దేవేంద్రనాథుఁడు నల్వురువిద్యార్థులఁ గాశికాపురమునకు బంపె నని తెలిపి యుంటిమి కదా! అట్లు పంపఁబడినవారు:—పండితఆనందచంద్ర వేదాంతవాగీశుడు 2 పండితరామనాథుఁడు 3 వానేశ్వరుఁడు 4 తారకనాథభట్టాచార్యుఁడు ననువారు. అందు మొదటియతఁడు వేదాంతశాస్త్రమును, ఏబదిరెండుపనిషత్తులు గలయథర్వవేదమును నర్థముతోఁ బఠింప నాజ్ఞాపింపఁబడెను. తరువాతివారు ముగ్గురును వరుసగా ఋగ్యజుస్సామములఁ గూలంకషముగాఁ బఠింప నియమింపఁబడిరి. వేదాభ్యాసానంతరము వారు బ్రహ్మసమాజాచార్యులుగ నియమింపఁబడిరి.

ఇట్లుండఁగా బ్రహ్మసమాజస్థులకును క్రైస్తవులకును పూర్వమువలెనే పెద్దకలహములును వాదప్రతివాదములును సాగెను. క్రైస్తవు లెన్ని తెఱంగుల బ్రహ్మసమాజమతమును ఖండించుచు వచ్చినను దానిబల మెంతమాత్రమును తగ్గక క్రమక్రమముగా నున్నతస్థితికే వచ్చుచుండెను. అయిదుసంవత్సరములలో సామాజికులసంఖ్య 83 నుండి 573 వఱకును వృద్ధియగుటఁ జూడఁగా దేవేంద్రనాథుఁ డెంత పాటుపడి యుండవలెనో సులభముగాఁ దెలియ నగును. అయినను క్రైస్తవు లొకవిషయమున బ్రహ్మసమాజమున కెంతో మేలు చేసి రనియే చెప్పవలసి యున్నది. ఇంతవఱకును బ్రహ్మ

సమాజికులు వేదములు దోషరహితము లై యమోఘము లైన వనియే నమ్ము చుండిరి. క్రైస్తవమతప్రచారకుఁ డగు డాక్టరు డఫ్ దొరగారు బ్రహ్మసమాజికులు వేదముల నీశ్వర దత్తము లని నమ్మి యవి దోషరహితము లని చెప్పెడిగుడ్డివేదాంతు లని హేళనము చేయుచు నొకపత్రికలో వ్రాసినప్పుడు, బ్రహ్మసమాజములో వేదము దైవదత్త మగునా కాదా, అందు చెప్పఁబడిన వన్నియు సత్యము లగునా కావా, యనుశంకలు కలిగి, వాదములు ముదురసాగెను. వేదములను బరిశోధించి మిగులప్రసిద్ధి కెక్కిన అక్షయ కుమారదత్త పండితు డీవఱకే వేదములలో సర్వవిషయములును పరమప్రమాణముగా నంగీకరింపఁ గూడ దని వాదించు చుండెను. దీనికిఁ దోడుగా దేవేంద్రనాథునిహృదయములోఁ గూడ ననుమానము కలిగి చతుర్వేదములను బఠించి యున్న పైనఁ బేర్కొనఁబడినపండితుల నొక్కసభగాఁ గూర్చి వేదములయొక్కసత్యమును గూర్చి చాలకాలము వాదములు సలిపి పిదప నట జేరినపండితులయభిప్రాయము నడుగఁగా, పరస్పరవిరుద్ధము లై, సత్యమునకు దూరము లైనయెన్నోయంశములు వేదములలోఁ గానవచ్చుచుండుట చేత మనము వానిని పరమప్రమాణములుగా నంగీకరింపఁ జన దని యైకకంఠ్యముగా న్యాయైకదృష్టితోఁ దమహృదయమును వెల్లడించిరి. ఇది జరిగిన 1850వ సంవత్సరములో దేవేంద్రనాథుఁడు వేదములపైఁ దనకుఁ గలప్రామాణికబుద్ధిని వదలివేసి యం దెంతవఱకు సత్య మున్నదో యంతవఱకే మనము గ్రహింపవలెను గాని మనయంతరాత్మబోధములకును హేతువాదములకును బ్రత్యక్షవిరుద్ధములుగా నున్నపక్షమున మనము వానిని విసర్జింపవలసినదే యని వక్కాణించెను.

ఆసంవత్సరముననే యెల్లరచేతను మిక్కిలి కొనియాడఁబడిన "బ్రాహ్మధర్మము" అనుగ్రంథమును దేవేంద్రనాథుఁడు రచించెను. అది హిందూధర్మశాస్త్రముల నన్నిటి నుండియు నేర్చి కూర్చినరత్నాలహార మని చెప్ప నొప్పును. అక్షయకుమారుఁడు వ్రాయు చుండఁగా దేవేంద్రనాథునిచే ననర్గళధారగాఁ జెప్పఁబడి మూడుగంటలకాలములో గ్రంథము ముగింపఁబడెను! ఆగ్రంథము నొక్కసారి చూచినవారి కందఱకును మహర్షియొక్క విద్యావ్యాసంగమును, అమితజ్ఞాపకశక్తియు వెల్లడి కాక మానవు. హిందూమతసార మంతయు నందులో వడగట్టి దింపఁబడినది. మొట్టమొదట సంస్కృతములోను బంగాళీలోను బ్రచురింపఁబడి యాగ్రంథముయొక్కప్రాశస్త్యమును గని పెట్టి యున్నిభాషలలోనో దానిని బ్రకటించి యున్నారు. అది తెనుఁగున సైతము ప్రక

టింపఁబడి యున్నది. ఆగ్రంథముయొక్క యనుబంధములో బ్రహ్మసమాజమతమున కీక్రిందివి ముఖ్యధర్మము లనీ వ్రాయఁబడి యున్నది.

బ్రాహ్మధర్మబీజము

(1) బ్రహ్మ వా ఏక మిద మగ్ర ఆసీ నాన్యత్ కిఞ్చనాసీ త్తదిదం సర్వ మసృజత్

అనఁగా బ్రహ్మ యొక్కటే యాదియం దుండెను గాని వే ఱేదియు లేదు. ఆబ్రహ్మమే యీసమస్తమును సృజించెను.

(2) తదేవ నిత్యం జ్ఞాన మనన్తం శివం స్వతన్త్రం నిరవయవ మేక మేవాద్వితీయమ్ సర్వవ్యాపి సర్వనియన్తృ సర్వాశ్రయ సర్వవిద్ సర్వశక్తిమత్ ధ్రువం పూర్ణ మప్రతిమమ్.

అనగా ఆబ్రహ్మము నిత్యము. జ్ఞానస్వరూపము. అంతము లేనిది. మంగళ స్వరూపము. స్వతంత్ర మైనది. అవయవములు లేనిది. రెండు గాక యొక్కటి యైనది. అంతటను వ్యాపించి యన్నింటిని నియమించునది. అన్నిటి కాశ్రయ మైనది. సర్వజ్ఞతయు సర్వశక్తియుఁ గలది. శాశ్వత మైనది. పూర్ణ మైనది. సమానము లేనిది.

(3) ఏకస్య తస్యై వోపాసనయా పారత్రిక మైహికఞ్చ శుభ మ్భవతి.

అనగా ఒక్క ఆబ్రహ్మమునే యుపాసించుటచేత నైహికాముష్మికసుఖములు కలుగుచున్నవి.

(4) తస్మిన్ప్రీతి స్తస్యప్రియకార్యసాధనంచ తదుపాసన మేవ.

అనఁగా నాబ్రహ్మమును ప్రేమించుటయు, తత్ప్రీతికరము లైనకార్యములు చేయుటయు నే దానిని ప్రార్థించుట యగును.

గీ. ఒప్పుగా నీతు లెన్నేని జెప్పవచ్చుఁ
జెప్పినట్టులె కార్యముల్ చేయ నగునె?
లోన నొకటను నొకరీతిగానె నడుచు
వాఁడె లోకైకపూజ్యుఁడు, వాఁడె ఘనుఁడు.

# అనాథాభ్యుదయము.

## ప్రథమరంగము—శయనమందిరము.

(ఒకవితంతువు ప్రభాతకాలమునఁ గన్నుల నులుముకొని లేచుచు)

చ. అనదను నాకు దిక్కగుట కన్యు లిఁకెవ్వరు లేరు భాగమె.
ల్లను భవదీయపాదయుగళంబున నిచ్చలు నిల్పి మొండిపై
తనువున నిల్లు ప్రాణములఁ దాల్చి చరించుచు నుంటి నయ్య నే
గను కృపఁ జూచి నాదుకడగండ్లఁ దొలంగఁగఁజేయు మీశ్వరా!

అక్కటా! యెంతబలవంతముగా నిద్రింతు నన్నను నిద్ర పట్టకున్నయది. హా! జీవితమా! సంతోషాంబుధి నోలలాడఁదగునీవు నేఁడు శోకవహ్నిని బాల్పడి కృశింప నలసివచ్చెను గదా! సకలైశ్వర్యంబుల ననుభవించుచు మహదవస్థ నుప్పొంగఁ దగునీవు నేఁడు కడుపార భుజింపక కన్నులార నిద్రింపక మనసార సంతసింపక కాలంబు ప్రచ్చుట తటస్థించెను గదా! అయ్యో!

సీ. సుమశయ్యలను జేరి సుఖియింపఁ దగు మేను బండనేలల నిట్లు పండవలసె
సరససల్లాపముల్ సలుపఁదగినజిహ్వ యార్తనాదంబుల నార్పవలసె
పతిపాదసేవలఁ బచరింపఁదగుకేలు కఠినవ్రతంబులఁ గంపవలసె
చెలువునిమన్ననఁ జెలరేగు నెలప్రాయ మొరులదూషణముల నొందవలసె
అతులసౌభాగ్యవైభవోన్నతులఁ దనరి
సౌఖ్యవారధిఁ దేలెడుజన్మ మిట్లు
బూదెఁ బోసినపన్నీటిపోల్కి నయ్యె
కాల మొకరీతి నుండదుగాదె జగతి?

హా! [illegible]ారమా! నీ వెన్నఁటికైన నుపశమింతు వేమో యని తలంచుచున్నకొలఁది నయ్యారె మా[illegible] నానాఁటికి వృద్ధి యగుచుంటివి. అయినను నిన్నన నేల? నేనే నిన్ను వీడఁజాలకుంటిని.. కట్టా!

సీ. ఆటపాటల నాడి యార్తి నీడెద నన్న, తోడివారలు నన్నుఁ గూడ రారు
మాటలచేత నారాట మణఁతు నన్న, నొరు లెవ్వరును నాదుదరికి రారు
శుభకార్యముల కేగి శోక మార్చెద నన్న, నందుల నాకు నగ్వాతిల నీరు
బందుగులము జేరి వంత బాసెద నన్న, నెలమి వారలు నన్ను బిలువఁబోరు
గోరుచుట్టుపై రోకటఁ గుమ్మినట్లు
సంఘమందలి యీదురాచారసమితి
నాయవస్థకుఁ దోడయి నాదుదుఃఖ
మంతకంతకు నభివృద్ధి నందఁజేయు.

హా! సంఘవ్యాఘ్రిమా! మాబోటిదీనురాండ్రను హింసించుటంజేసి నీకుక్షి కెట్టి సంతుష్టి కల్గు? ఏమీ!

చ. పురుషుఁడు భార్య పోవునెడ మూడవనాఁడె పునర్వివాహుఁడై
తరుణినిఁ గూడి తాఁ గడుముదంబున నుండఁగ ధర్మశాస్త్రముల్
సరి యనుఁ గాని, బాల్యమునఁ జానకు నాథుఁడు పోవునేనియున్
బరమనిషేధమా? కరముపాపమ? వెండియుఁ బెండ్లియైనపోన్

అక్కటా! హైందవసంఘమా! అంతపక్షపాతము నిన్నిప్డు వదలనేరకున్నను మా కంతస్వేచ్ఛ నీ విష్టపడొసంగఁజాలక యున్నను, మమ్ముల నొక్కింత గౌరవింపనైనను రాదె? మే మంతకనిష్ఠుల మైతిమా? అంతకొఱగానివారల మైతిమా?

సీ. ప్రాణప్రియుం డగుభర్త గతించినఁ, బడతికి సర్వైకభర్త లేడె?
శుద్ధమామంగళసూత్రంబు పోయినఁ, దరుణికి ధర్మసూత్రంబు లేదె?
భాగ్యభోగైకసంపత్తి యుండకయున్న, భామకు సుగుణసంపత్తి లేదె?
చెలువంపుకుంకుమతిలక ముండకయున్న, లలనకు మానతిలకము లేదె?
యువతిఁ బ్రాపంచసౌఖ్యంబు లందకున్న
నాతికి ఘనమనుష్యజన్మంబు లేదె?
విధికృతంబున నక్కటా! విధవ యైన
వనితకు స్త్రీ యటంచును వినుతి లేదె?

కావున వీనిచే నైన నిమ్మానవంతు లొక్కింత మాననీయులు కారే? అయినను విద్యావిహీనవై స్వార్థపరాయణతానీతవై ధనాపేక్షాపరభృతవై యున్న నోసంఘమా! నిన్నన నేల?

(గడియఁ దీసినధ్వని విని యులికిపడి) అదే! తెల్లవారినదా యేమి? మాయమ్మ వీధితలుపు దీయుచున్నది. ఇంకను నెంతయో రాత్రి యున్న దని యెంచుచుంటిని. విచారసాగరంబున మునింగియుంటంజేసి నావీనులకుఁ గోడికూత యైన వినఁబడలేదు. ఇఁక లేచి యింటిపనుల నిర్వర్తించుకొనుచు నైన నాదుఃఖభారము నడంచుకొందును గాక!

(అని లోనికిఁ బోయి నేపథ్యమున) హా! పొరపాటున వచ్చితి. పొరపాటున వచ్చితి. తండ్రి నన్ను క్షమింపుము. (అనుచు మఱలఁ బ్రవేశించి) హా! తండ్రీ! ఈదురదృష్టవంతురాలిం జూచి యే మనుకొంటివి?

ఉ. "ఏమె దరిద్రురాల! యిటు లింకను తిన్నఁగఁ దెల్లవారకుం
డేమి మునింగిపోయినటు లీ వెగురైతి? వరిష్టమైన నీ
మోమును జూడనయ్యె మునుముందుగ నయ్యయొ! నేఁడు నాకుఁ గీ
డేమి తటస్థమానొకద! శ్రీహరి! శ్రీహరి! పాహి పాహిమాం"

అని నన్ను దిట్టుచు నీభావిస్థితికై విచారించుచు దైవమును స్మరించుచు మోమటు వెట్టుకొని పోయితివా? అక్కటా! తిర్యగ్జంతువులకంటెను మే మరిష్టుల మైతిమా? కటకటా! ఇతరులవలెనే మేమును పుట్టితిమి కదా! ఇతరులవలెనే మేమును మానవులము కదా! మమ్మింతనీచముగఁ జూడ నేల?

(శ్రవణ మభినయించి) హా! ఏమీ! మఱల నెవ్వియొ వాక్యములు వినవచ్చుచున్నవి. కర్ణకఠోరంబు లగుజనకునివాక్యములె నాహృదయమును భేదించుచుండ, పిడుగువంటి మాజననివాక్యంబులుగూడ విననయ్యెడిని. జననీ! ఏ మనుచుంటివి?

ఉ. "ఓసియభాగ్యురాల! యరుణోదయమై యొకజాము దాటె, నీ
వీసరి కైన లేచి గృహకృత్యములన్ జరియింపవైతి వే
మే! సుకుమారముల్ బలిసినే? యవి యెల్లను మున్నె చెల్లెఁగా
దే! సరిలే! పనుల్ సలుపు, మింటను నెట్టిది యట్టె యుండెఁగా"

అనియా? హా! తల్లిదండ్రులారా! మీ కానందము గల్గించుటకు మాఱుగ దుఃఖమును క్రోధమును జనింపఁజేయుచు మీకు హృదయశల్యమై జీవించియుండుటవలన ఫలం బేమి? హా! బంధుగులారా! మీకు మాననీయను కాఁజాలనిదానను మనినను ప్రయోజన మేమి? హా! సంఘమా! నీకు దూష్యమైనదానను బ్రతికియుండియు నుపయోగ మేమి? హా! లోకమా! నీకు నిష్ప్రయోజనకారి నగుదానను ప్రాణయుక్తనై యున్నను గార్య మేమి? మిమ్ముల నందఱ నింక నేమన్న నేమిలాభము?

సీ. నాపాపకర్మంబు లీపంట లీయంగ, జననిరో! నిను నింద సలుప నేల?
నాపాలిభాగ్యంబు లీపగిదిని నుండ, జనకుఁడా! నిను నింద సలుప నేల?
ఈనుదుట విధాత యీవ్రాత వ్రాయంగ, సంఘమా! నిను నింద సలుప నేల?
నాజాతకము దుఃఖభాజనంబై యుండ, సర్వేశ! నిను నింద సలుప నేల?
మిమ్ము నిందింప నేమిఫలమ్ము దక్కు?
తెగువజేసి యెట్టులో యీదేహమందు
వాంఛ బోనాడి మున్నె యీప్రాణములను
వదలకుండుట నాదియే మొదటితప్పు.

అయిన నిప్పుడుమాత్రము మించిన దేమి? (అని గొంతున కురి వోసికొని)

చ. పొలఁతికి భర్త పోవునెడ భూతలమం దిసుమంతగౌరవం
బలవడనేర దయ్య! పరమాత్మ! కృపాకర! దీనరక్ష! ని
ష్ఫలమగుజీవనంబు గడపంగ నిఁకేఁటికి? నిన్నుఁ జేరఁగాఁ
దలఁచితిఁ జేరఁదీసి నను ధన్యఁగఁ జేయుము వేగ మిత్తరిన్.

(అని బిగించుకొనఁబోయి) అయ్యో! కంఠము నొప్పియెత్తుచున్నది. కరము లేలొకో వెనుదీయుచున్నవి. బిగువు సడలుచున్నది. ప్రాణము తనువును బాయుట కిచ్ఛగించుట లేదు. ఓజీవమా! నీ కింకను నేనైనఘనకార్యముల నొనర్ప నాస యున్నదా యేమి? లేకున్న నీ కీదేహముపై నింతకాంక్ష యేల? అవును. కా కేమి?

# ప్రథమరంగము.

ఆ. వె. క్షుద్రజంతు వైన క్షోణీతలంబున
స్వీయధర్మ మెంచి జీవనంబు
సలుపుచుండ మనుజజన్మ మెత్తియు నేను
బ్రదుకునైన నాస వదల నగునె?

సీ. అఖిలశాస్త్రంబుల నభ్యసింపఁగఁజాలు నసమాన మైనమానసముతోడ
సృష్టిమహిమల గని తృప్తినొందఁగఁజాలు కమనీయనేత్రయుగంబుతోడ
సర్వోత్తము లగుచరితముల్ వినుటకు నలరారుకర్ణద్వయంబుతోడ
పరమపావనములౌవాక్కుల స్మరియింప నగునట్టిజిహ్వేంద్రియంబుతోడ

తనరుచుండెడునుత్కృష్టతనువునందు
నాత్మరో! నిన్ను గూర్చుట యరసిచూడ
నెన్నిఘనకార్యముల నీవు పృథివిపైని
జేయఁ బరమేశ్వరుండు సృజించెనో కో!

మఱియుఁ బరమసంస్తవనీయం బగుమానుషజన్మం బెత్తి జన్మంబు వ్యర్థం బని నేనే తలంతునేని సృష్టిలోనితక్కుంగలజంతువు లెట్లు భావింపనగు? కావున నాకష్టంబు లెల్ల మఱచి నాజన్మంబు సార్థకం బగునట్లు చరించుచు నుత్సాహంబు గాంతు. నాపల నుపడినంతవఱ కీలోకంబున కుపకారిణి నగుదు. సామాన్య స్త్రీలపోల్కి కుటుంబభారంబు కాని గేహనిర్బంధనంబులు గాని దేహవాంఛలు గాని నాకు లేమి నాయందు గలసహజ శక్తుల నెల్ల వినియోగించి వారికంటె నెక్కుడుప్రయోజనకారిణి, కాఁగల్గుదు. కావున నామనంబున నేఁ డుదయించిన జ్ఞానవజ్జ్యోతిని ప్రజ్వలింపఁజేయుచు,

గీ. నెమ్మనమ్మున స్వార్థకత్వమ్ము విడచి
కడువిశుద్ధతో లోకసంగ్రహముపొంటె
బాటుపడి సర్వ మీశ్వరార్పణ మొనర్చి
జీవితము సార్థకంబుగఁ జేయుదాన.

మఱియు నేను చేయఁదగుకార్యంబులు నామనంబున నిప్పుడె యొక్కటొక్కటిగఁ దట్టుచున్నవి. ఆహా! వాని నెరవేర్చుమార్గంబులుంగూడ వేనవేలు కన్పట్టుచున్నవి.

# అనాథాభ్యుదయము.

సీ. భాషల నసమానప్రజ్ఞ సంపాదించి చెలుతవారికి విద్య గఱపుదాన
వైద్యశాస్త్రమునందు ప్రావీణ్యమును గాంచి సేవ వ్యాధితులకు జేయుదాన
సకలకళలయందు సంపూర్ణత వహించి నెలతల కవియెల్ల నేర్పుదాన
సర్వమతంబులసత్యంబు గ్రహియించి పామరులకు బోధపఱచుదాన

స్వానుభవమున నేర్చెడియంశములను
జగమునకు సత్వరంబుగఁ జాటుదాన
స్వీయదేశాభివృద్ధికై చేయఁగలుగు
కార్యములఁ బూనికమై చేయఁ గడఁగుదాన

నేను నాయావచ్ఛక్తిని వినియోగించి కార్యముల సానుకూల్యములుగ నొనర్చుటయే కాక, తోడిచేడియల కందఱకు నాయభినవోద్దేశంబుల నెఱింగించి వారలంగూడఁ బ్రోత్సాహపఱతు. కట్టా! నావలెనె తమజన్మములు నిరర్థకంబు లనుకొనువారును, విగతోత్సాహ లైనవారును నెందఱుస్త్రీ లుండియుందురో కదా! మఱెందఱింద్రియ వాంఛలకు లోనై యవినీతిమార్గంబుల సంచరింపుచు దమకును దమబంధుగులకె కాక స్త్రీసంతతికిని దేశమునకుఁగూడ తీరనితలవంపుల నాపాదింపుచుండిరో కదా! కావున వారల కందఱకేను బోధించి వారిని నాతోఁ గార్యభారము వహించునట్లు చేయుదు. మఱియు సంఘములను సమాజములను సమితులను గార్యాలయములను నిర్మించి దేశమందలి దైన్యంబు బాపెద. హా! మాతృదేశమా! నీ కెట్టిగతి పట్టినది?

సీ. ఆత్రేయి భారతి మైత్రేయి గార్గి లోపాముద్ర మొదలైనప్రాజ్ఞలకును
ద్రౌపది సావిత్రి దమయంతి యనసూయ జానకి మున్నగుసాధ్వులకును
శీల కర్ణాటి విజ్జిక సీత మొల్ల వెంగమ మొదలగుకావ్యకారిణులకు
సత్యభామాదేవి సంయుక్త దుర్గావతీదేవి మున్నగుధీరలకును

జన్మభూమి వంచు సత్కీర్తి వడసిన
భరతమాత! నీకు ధరణి నేఁడు
జ్ఞానహీనలకును మానహీనలకును
నిలయ మన్నపేరు కలిగెఁ గాదె!

అందునకుఁ గారికులు స్త్రీల మగుమేమే కదా! కావునఁ దల్లీ! నీ కాయపకీర్తి బాప స్త్రీజాతిని మేలుకొలిపెద. నీసేవకై నాశక్తి నంతయు వినియోగించెద. మఱియు నో దేశాభిమానులారా! స్త్రీయౌన్నత్యాభిమానులారా!

గీ. స్వార్థఫలపరిత్యాగినుల్, సత్యవతులు,
దేశసేవానురక్తలు, ధీరమతులు
నైనసాధ్వీమణులు వీరు బూనుకార్య
ములకు దోడయి సత్కీర్తి బొందఁగలరు

నెంచియు, మ మ్మన్యథా తలంచు నోసోదరసోదరీమణులారా!

సీ. శిరమున సోగలై చెలువారుకురులకు, నలికంబు నెలయించు తిలకమునకు
మేను సింగారింప మేలివస్త్రములకు, గన్నుల నీటగుకాటుకకును
తనువునఁ గై సేయు గొనబుభూషలకును, భుజియింప రుచిఁగొల్పుభోజ్యములకు
హాయిగా నివసింప ననువైనసెజ్జకు, భోగ్యయోగ్యము లగుభాగ్యములకు
నేరి నర్హులుగా రని యెంచుచుందురో
వారినే సర్వవిద్యావిశారదలుగ
గరిమ దేశాభివృద్ధిసంస్కారిణులుగ
నంచితచరిత్రలుగ నింక యెంచుకొనుఁడు

ఆ! ఏమీ! నే నేకార్యంబుల నొనర్పకుండఁగనే యిట్లు శపథంబులఁ బలుకుచుంటిని? కా కేమి? సంకల్పించినపిదపఁ జేయనేరనికార్య ముండునె? ఘనకార్యనిర్వహణ మన్నను, లోకోపకార మన్నను నాకింతయుత్సాహము వొడముచుండ, తత్సాఫల్యమైనచో నెంతధన్యురాల నగుదునో కదా! ఓపరమేశ్వరా! గగనమండలమును సుధాకరునిచేఁ బ్రకాశింపఁజేయు ప్రభాకరరాహిత్యముగ నొనర్చునట్లు, నీవు కతిపయస్త్రీలను దేశసేవాధురంధరత్వమునఁ గీర్తినొందఁ బతివిరహితలఁగ నొనర్చెదవుగాబోలు. కావున,

సీ. పదునాల్గుభువనముల్ భరియింపఁగాఁజాలు పరమేశ! నీవె నాపతి యటంచు
వివిధవిచిత్రసంభృత మగు నీదు బ్రహ్మాండంబె నానిలయ మ్మటంచు
భవదంశమందు సంభవము జెందినయట్టి ప్రజ యెల్ల నాకుటుంబమ్మె యటంచు
సత్యమార్గంబు సూచన సేయునట్టి నీయమలవాక్యములె నా కాజ్ఞ లంచు
మదినిఁ దలపోసి స్వీయధర్మంబు నెఱపఁ
బయన మగుచుంటి నీపయి భార ముంచి
భక్తమందార! ఆశ్రితపారిజాత!
తోడు గావయ్య ననుఁ గృపఁ జూడు మయ్య!

(నిష్క్రమించును)



# ద్వితీయరంగము.



[పురవీథిని సంచరించుచు వితరతువు ప్రవేశించును.]

మ. ఘనకార్యంబులఁ బూనికతోడ సలుపంగా నెంచుటే కష్ట, మెం
చినవానిక్ సమకూర్చుమార్గముల నీక్షింపంగఁ గష్టంబు, రెం
డును జేకూఱిన దానికిం బరులు తోడుం జూపఁ గష్టంబు; కా
వున నమ్మ్రుడును కార్యసాధకుల కేపార్ద్ధుక్ గడుక్ ముఖ్యముల్

వానిలో నెద్ది లేకున్నను ఫలసిద్ధిఁ బడయుట దుస్తరంబు. సామనంబునఁ బోడమినవద్యోద్దేశములకు నామిత్రు లెల్లరు సాహాయ్య మొనర్తు రనియు, వా రందఱు న న్ననుసరింతు రనియుఁ బుట్టెడాసతో నుంటిని. కాని తొల్లి ప్రగల్భంబులు పచించిన వా రెల్ల రొక్కరొక్కరె యిప్పుడు వెనుదీయుచున్నవారలు.

సీ. "పరులపాలనమున బ్రతికెడునబలకుఁ జిక్కునే యట్టిసుస్థిరయశంబు?
చంచలమతితోడ జరియించుజపరాలి కబ్బునే యట్టిమహోజ్జ్వలంబు?
మౌఢ్యాంధకారనిమగ్నురా లగుముగ్ధ కందునే యట్టివిద్యాధనంబు?
గృహకృత్యములు సేయ సృజియింపఁబడుస్త్రీకిఁ గల్గునే యలకళాకౌశలంబు?"
అనుచు సఖు లొక్కరొక్కరె యరసి నన్ను నేను ముదమున వాక్రుచ్చువానికెల్ల
నెదురు వల్కిరే కాని నామదికి ధైర్య మించుకంతయుఁ గొల్పంగ నెంచ రకట
నాతోఁ గలసిమెలసి సాయనం బెఱిఁగినతోడిచేడియ లె యి ట్లనుచుండఁ బెఱ

తెఱఁగుల నెంచ నేల? నాయుద్దేశంబుల్ సంపూర్ణముగ గ్రహింపకయే; దారిని నేఁ బోవుచుండ, నన్ను జూచినయమ్మలక్కలు;

క. "ఇది విద్యల నేర్చెను నఁట! యిది నీతులఁ గఱపు నంట! యింతిరో! వింటే!
యిది సభలఁ బల్కు నఁట! యిది యీ దేశము నుద్ధరించు నఁట గనుఁగొంటే!"

అని గుజగుజలు వోవుచు నన్ను జూచి దిసంతులు గొట్టసాగిరి. మఱియు గొందఱు;

క. "ఇత్తరుణి సేయుకార్యము లెత్తెఱఁగున మాతృదేశవృద్ధి నొనర్చున్?
తిత్తిరిపోతము దనకా ళ్లెత్తినమాత్రాన గగన మెందు నిలుచునే?"

అనుచు నన్నెక్కసక్కెము లాడ దొడంగిరి. అక్కటా! ఇట్టిసంఘజలధిలోఁ బడి దరిఁ జేర నీదులాడువారి కెంతయుఁ గష్టము గదా! అట్టివారికి ధృతి యనునావయే యాధారము. దైవ మనుగాలియె ప్రాపు. అయినను నే నిప్పు డొనర్పఁబోవునది సంఘదూష్యంబు కాదు. నీతిబాహ్యంబును గాదు. మతనిషిద్ధంబు కాదు. లోకవిరుద్ధంబును గాదు. తద్విషయంబున నీస్త్రీ లింతభీతి నొంద నేల? ఒకవేళ దీని నొనగూర్పు పద్ధతు లవలంబనీయములు కా వని తలంచి రేమో? అందునకు నేఁ గూర్చినపద్ధతికూడ పరిష్కృతము సుకరంబే. తీర్థయాత్రాపరులవలెఁ గొందఱుస్త్రీలు బయలువెడలి యాయాదేశంబుల నున్నవిశేషంబుల నారయుచు నక్కడక్కడ గొన్నిదివసంబులు వసించుచు నేయేవిద్యలయం దవ్వారి కెయ్యవి యుత్సాహము గొలుపునో వారు వాని నేర్చికొని తిరిగి వచ్చి యావిద్యల సులభసాధనంబుల నెల్లడిచేయుచుండుటయె నాయాశయము. దీనిఁగూర్చి యింతదనుక నాచెలులలోఁ జాలమంది నడిగితిఁగాని వారిలో నొక్కరును,

క. ఇదె నీతో నే నరుదెం। చెద, నీమార్గంబుఁ బూనఁ జెల్లు నటంచున్
ముదమున సంసిద్ధం బగు। ముదిత యొకర్తుకయు నాకుఁ బొడసూపదుగా!

అయిన నీస్త్రీల నాడ నేల? వారి నజ్ఞానవతులుగ నొనర్చినపురుషుల ననవలయు.

సీ. విద్యాధురీణ యా వెలఁది గృహంబునఁ గరము నొప్పారుఁ జుక్కానికరణి
విద్యాధురీణ యా వెలఁది నాథునియందుఁ బొలుపొందు దక్షిణభుజముకరణి
విద్యాధురీణ యా వెలఁది యాత్మజులకుఁ బచరించు భవ్యకల్పకముకరణి
విద్యాధురీణ యా వెలఁది దేశంబున దీపించు మాణిక్యదీప్తికరణి
నంమఁ బూరుషుఁ డాత్మలో నరయలేక। పడతి నజ్ఞానవారిధిఁ బడఁగఁద్రోచి
నిజగృహంబును దేశంబు నిఖిలధరణి। సంధకారబంధురంబుగ నందఁజేయు

కావున నిట్టిపురుషులయనుమతిం గొని నాయుద్యమంబునకు స్త్రీ లెట్లు తోడు పడఁగలరు? (అని యొకగృహమును సమీపించి) అయినను నిన్న నీగుణవతి నామార్గము ననుసరించెదఁ నని వచించినది. కావున నాపె నరసెదఁగాక! (అని తలుపుఁ దట్టుచు) చెలీ! గుణవతీ! గుణవతీ! (అని పిలిచి) ఏమీ! సిద్ధముగ నుంటివా? మీవార లంగీకరించిరా? సంతోషము! పరమసంతోషము! నేఁడు గదా సుదినము!

(అనుచు గుణవతి తలుపుఁ దీయ లోనికి నిష్క్రమించును.)

# తృతీయరంగము



[వేఱొకపురమున నొకసత్రమందు వసంతుఁడు ప్రవేశించును.]

మ. కడుఘోరం బగునాత్మహత్య నపుడే కావించి జీవంబుఁ గో
ల్పడఁగన్ బాల్పడియుంటి నేని యిటు లీనైపుణ్యముల్ గాంతునే?
పడయన్నేర్తునె సత్పుస్తకలస త్ప్రజ్ఞానవైదుష్యముల్?
నడపంజాలుదునే స్వధర్మవిధులన్ నాకోర్కె లీడేరఁగన్?

ఆహా!

సీ. దేశదేశంబులఁ దిరిగి వచ్చితిఁ గాని, తిరిగినకొలఁదిని తిరుగుటకును
నతివిచిత్రంబుల నరసి చూచితిఁ గాని, యరసి చూచుకొలంది నరయుటకును
సద్గ్రంథరాజముల్ చదువఁగల్గితిఁ గాని, చదువఁగల్గుకొలందిఁ జదువుటకును
నిఖిలపరిశ్రమల్ నేర్వఁజాలితిఁ గాని, నేర్వఁజాలుకొలంది నేర్చుటకును
నాస లెదలోనఁ గ్రమముగా నధిక మగుటె। కాని సంతృప్తి నిసుమంత గాంచ నైతి
సదమలజ్ఞానఫలంబులఁ జవులుగొన్న। మానసంబులు సంతుష్టిఁ గానఁ గలవె?

అయినను, జ్ఞాన మెంత సముపార్జించినను,

క. తనజ్ఞానము లోకమునకుఁ। బనిపడి బోధింపకున్న ఫలముల గలదే?
యనుభవమున వెచ్చింపని। పినుఁగు గడుం గూడబెట్టుపిత్తం బగుయన్

నేను మొదట బయలుదేఱినప్పుడు నావెంట గుణవతి యొక్కతెయె వచ్చినది. ఇప్పుడు క్రమక్రమంబుగ నాతో వచ్చినవారిసంఖ్య యెంతయు వృద్ధి యయ్యె. వార లెల్లరుఁ దాము నేర్చినవిద్యలఁ బరిపూర్ణులై సిద్ధమనోరథు లైరి. ఒక్కపూఁబోఁడి విద్వాంసురాలై యుపాధ్యాయినిపదవి కర్హురాలై యొప్పుచున్నది. వేఱొక్కలతాంగి యాయుర్వేదం బెల్ల నేర్చి భిషఙ్మణి కా నలరారుచున్నది. మఱొక్కవనితారత్నము గానశిల్పచిత్రలేఖనాదికర్మంబులఁ బ్రజ్ఞానిధియై వానిని నేర్ప సంసిద్ధురాలై యున్నది. ఇంకొకనారీమణి గృహనిర్వాహకత్వము శిశుసంరక్షణము మున్నగువానియందు బ్రవీణయై

తోడివారల కాదర్శము కానున్నది. ఒండులలనాలలామము మహాపాండిత్యముం గాంచి తనయసమానపరిజ్ఞానవిశేషమును లోకమునకుం బ్రదర్శింప నున్నది. నేనును సకలభాషల సమగ్రముగ నభ్యసించి యఖిలవిద్యాపారంగత నై దేశసంచారము గావించుచు నా చెలులు నేయుకార్యముల నతినిపుణతోం బరిశీలించుచు నచ్చటచ్చట స్త్రీసమాజముల స్త్రీవిద్యాలయముల బఠనమందిరముల వితంతుశరణాలయముల నెలకొల్పుచు స్త్రీజనోద్ధారణమునకై నాయోపికకొలంది పాటుపడ సంసిద్ధురాల నై యున్నదానను.

ఆహా! కార్యసాధకుల కెప్పుడు దైవము తోడ్పడుచునే యుండునుగదా! కావు ననె మాయుద్యమముల నెఱింగి మాకుం బ్రోత్సాహము గల్గింపం బురుషు లనేకవిధంబుల వివిధోపకారంబులం జేయుచుండిరి.

సీ. వైద్యశాల నొకండు వాత్సల్యమున నిల్పె ఘనుండొక్కరుండు రోగార్తలకును
విద్యాలయం బొండు నెలయింపం జేసెను ప్రఖ్యాతుం డొక్కండు బాలికలకు
కర్మభవన మొండు కట్టించి యిచ్చెను మాననీయుం డొకండు మానినులకు
శరణాలయం బొండు కరుణతో నెలకొల్పె ధన్యాత్ముం డొకండు వితంతువులకు
మఱియుబురమందిరంబొండువఱలజేసె నెలమి మహనీయుం డొక్కండు నెలతలకును
ఘనులు సంఘములను బరీక్షలను బఠన మందిరంబుల నిలిపిరి మహిళలకును

వారందఱును దమతమకార్యంబుల నిర్వహింపం దక్షురాండ్రగుస్త్రీలం బంపు మని నాకు జాబులు వ్రాయుచున్నవారు. మాయభిప్రాయము నదియె కావున నీదిన మున మే మెల్లఱము నొకసభం గూడి మా కార్యభాగముల నిరూపించుకొని వారివారికి నిర్ణయింపంబడినప్రదేశములకుం బోవ నిశ్చయించుకొందుముగాక! తమతమధర్మముల వహింప నుత్సాహముతో నాచెలు లెల్లరు నీసరికి సభాస్థలము నలంకరించెద రని యెంచెద. కావున నే నింక తడయరాదు.

ఉ.. ఏ మెడబాసి యెంటి జరియించెద మింక నటంచు నొక్కడన్
మామకమానసాబ్జమున మాననిచింత జనించుచుండెడిన్
మేము గ్రహించువిద్యలను మేదినియం దిడం జోటనుంటచే
గామనమందె యొక్కెడ ఘనంబగుసంతస మగ్గలించెడిన్.

# అనాథాభ్యుదయము

## చతుర్థరంగము

[ఒక భవనము—వితంతువు ప్రవేశించుచు]

క: ఈనాఁటికి వినఁ గల్గితి
వీనులకుఁ విందు గాఁగ వెలఁదులు హిందూ
స్థానంబున ఘనకార్యము
లూని కృతోద్గతను గాంచ నుండి రటంచున్.

ఆహా! నా కుత్సాహంబుఁ గొల్పుచు మత్సోదరీమణులు వివిధస్థలంబులనుండి నా కంపినయీలేఖలం జూచుకొలంది నానందము డెందంబునఁ గ్రిందుకొనుచున్నది.

(అని యొకయుత్తరమును విప్పి)

అహో! గుణవతీ! బాలికోన్నతపాఠశాలాప్రథమోపాధ్యాయినీ! ఏ మని వ్రాసితివి?

"నెచ్చెలీ! ఈపాఠశాల బాలేందురేఖలీల దినదినాభివృద్ధిం దనరారుచున్నది. పురుషులు నిశ్శంకతోఁ దమబాలికలను బడికిఁ బంపుచుండిరి. గరిత లెట్టియరమరలును లేక విద్యలఁ గఱచుచుండిరి. అచిరకాలములో నియ్యది నిరుపమోన్నత్యముం గాంచి సురుచిరకీర్తితో విలసిల్లును."

కా కేమి? గుణవతీ!

చ. అలఘువివేకముం గని మహోన్నతశీలవిశోభితాఢ్య లై
వెలఁదులె పాఠశాలలను విద్యల నేర్పుచు నుండఁ, బూరుషుల్
వెలఁదుల నంపఁగా నెటుల వెన్కకుఁ దీసెదువార? లింక న
వ్వెలదులు మాత్రి మేగతిని వెన్కకుఁ దీసెద రేగు దెంచఁగన్?

(మఱియొకజాబుం గొని)

కళావతీ! కళాశాలాపరిబోధినీ! ఏ మని యంపితివి?

"సహోదరీ! ఈభవనంబునకుఁ బెక్కుమందియువతు లనుదినంబును దమకు వలనగు సమయంబుల నరుదెంచుచుఁ బనుల నేర్చుకొనుచున్నవారలు. అనేకులు తమకుమారీ రత్నంబుల నిందుఁ జేర్చుచున్నవారు. దీనివిషయమై సవిస్తరముగా మఱియొకజాబునం దంపెద."

చెలీ! నిజము.

ఆ. వె. తీఱిక యగువేళ నూఱక కొఱగాని
నుడువులఁ బలుకుచు గడపుకంటె
కళల నేర్చుటొండె గ్రంథపఠన మొండె
కలిగి యుంట సతికిఁ గరము మేలు.

(మఱియొకజాబుం గొని)

ఆహా! అశ్వినీ! వైద్యశాలాపరిధానభిషజ్మణీ! ఏ మని పల్కుచుంటివి?

"సోదరీమణీ! ఈదృశోద్యమంబు పరిపరిథమం బైనను సత్యాశ్చర్యంబుగ యశస్సుఁ గాంచుచున్నది.

సీ. ఎవ్వేళ వలసిన నవ్వేళ విసువక రోగులయిండ్లకు నేగుకతన
నెద్దాని నడిగిన నద్దానికిని మాతృభాషనే వారితోఁ బలుకుకతన
నేరీతివ్యాధుల కారీతి ననుకూలము లగుమందుల నీయఁ గలుగుకతన
నెవ్వారు వచ్చిన నవ్వారలను బ్రీతి గలసి మెలసి యొప్పు మెలఁగుకతన
గీ. మే మొనర్చెడివైద్యంబె మే లటంచు
మే మొసంగెడుమందులె మెచ్చుకొనుచు
స్త్రీలు బాలురు నీవైద్యశాలయందె
యౌషధంబులఁ గొనుచుందు రనవరతము.

మఱియు నోసఖీమణీ! సంగీతము, చిత్రవస్తుపరిదర్శనము మున్నగువానిచే రోగార్తుల కార్తిని నివర్తింపఁ జేయుచున్నారము.

అప్పు డప్పుడు గృహంబుల కరిగి స్త్రీలకుఁ బారిశుద్ధ్యము, శిశుపోషణము, శుచి, మున్నగువానిం గూర్చి బోధించు చున్నారము. కొలఁదికాలములో దీని కుపశాఖల నెలకొలిపి యెక్కుడుపనిఁ జేయ నున్నారము.''

అశ్వినీ! నీచర్య నుతింప నాతరంబు కాదు. మన మనుకొనినదానికంటె నధికంబుగ బని చేయుచున్నదానవు.

(అని మఱియొకజాబుర దీసి)

ఓహో! గంభీరవాణీ! వాక్సుధానిధీ! ఏ మని వాకుచ్చుచుంటివి?

"సహోదరీరత్నమా!

ఉ. పల్లెలు గ్రామముల్ మఱియుఁ బట్టణముల్ దగ సంచరించుచుం
 డల్లుల కేను బోధన సతంబును సల్పుచు నుంటఁ జేసి వా
 రుల్లము రంజిలంగ మనయుద్యమముల్ గ్రహియించి "యమ్మ! మే
 మెల్లర మింకఁ దోడ్పడుదు మిందుల'' కంచు వచించి రెంతయున్.

మన మొనర్చుకృషి యంతయు మనము ముందు స్థాపింపఁ బోవుసంఘమునకుఁ బునాది గాఁ నొప్పఁ గలదు.''

సఖీ! నేనును నీజాబునకే యెదురు చూచుచుంటిని. త్వరలో నిన్నుఁ గలసి మాటలాడెద. మనము స్థాపింపఁ బోవుసంఘమును గూర్చి నేఁడు సభఁ గావించి తీర్మా నింప నుంటిని.

ఆహా! నేఁటికిఁ గదా మాకోర్కె లీడేర నున్నవి!

ఆహా! తమజన్మంబులు నిరర్థకంబు లని మనంబులఁ గుందుచు దుఃఖాంబుధిని మునింగినయనదలజన్మంబులు మాతృదేశోపకారకరంబు లయ్యె. కొఱగానితలఁపులకు నెలవు లగుమూర్ఖచిత్తలచిత్తంబు లుత్తమోద్దేశంబుల కాస్థానంబు లయ్యె. వంతల నంది కడలేనిచింతలఁ గాసిలి యుండుకాంతలకు మఱింతవంతఁ గొల్పునవివేకవతులు పతుల కనువగుయోజనలం గూర్చుచు ధైర్యం బొనఁగూర్పఁ దగినవార లై చిఱుతపాయం బెల్ల సోమరితనంబున వ్యర్థపుచ్చుబాలికలమానసంబులు జ్ఞానవికసితము లయ్యె. మాఢ్యం బున మఱునింగి యుండునంగనలు, దేశోద్ధారకు లగుపురుషులకుఁ దోడ్పడఁ దగువీరాంగన లైరి. వేయేల? వనితలు తమస్వీయధర్మంబుల నెఱింగి దేశమునకు వాసి తే నర్హ లైరి.

ఆహా! దయాసింధూ! జగద్బంధూ! నీదయచే,

—ఉ తె[illegible] ము—

సత్తము విద్య నేర్చి సకలసద్గుణములఁ జెలంగుచున్
బతుకుమన్ననలను బీరితిఁ బడసి, కాంచి భవ్యసం
తతిని భారతఖండమునకు ధవళయశముఁ దెచ్చి సం
తతము సర్వదేశవినుతిఁ దనరుచుండ్రు గావుతన్

(నిష్క్రమింతురు.)



స్త్రీలయెడ మనము గావించు

# పంచ మహాపాతకములు.

"క. కులకాంతతోడ నెప్పుడు
గలహింపకు వట్టితప్పు ఘటియింపకుమీ
కలకంఠికంట కన్నీ
రొలికిన సిరి యింట నుండ నొల్లదు సుమతీ."

పూర్వము మనహిందూసంఘము లోడిసంఘములకంటె నత్యున్నతపదవి ననుభవించుచు సర్వసౌభాగ్యములతోఁ దులతూగుచుండెడిది. అట్టియుత్తమసంఘ మిప్పుడు కాలవశమున దురాచారముల కాకరమై యగణితమగు పాపజాలముల కాలవాలమై యున్నది. అజ్ఞానాంధకారముచే మనజ్ఞానతేజము కడపటికి నడుగంటఁ బాపపంకమున మునిఁగినవారమై, తుదకు మనకు ప్రియతములును ప్రాణపదములు నగువారియెడ నుచితము చెప్పరాని పాపము లొనరించు నంతటిదుస్థితికిఁ బాల్పడినారము. సోదరులార! నే నిట్లు చెప్పుట యతిశయోక్తి యందురేమో? మనశరీరములకు కారణభూతలగు మాతలయెడలను మనయర్థాంగులగు భార్యలయెడలను మనతనూజాతలగు పుత్రి[illegible] మనము ఘోరమగు నపచారములఁ జేయుచుండుటలేదా? మన మొనరించు న[illegible]రపరంపరలకు బలియయి మనస్త్రీ లతిహీనదశకులోనయి యాక్రిందివర్ణనమున కను[illegible]పాత్రము దీసిపోవుదురా?

"House hold stuff

Live chattels, mincers of each other's fame,
Full of weak poison, turnspits for the clown,
The drunkard's foot ball, laughing stocks of time,
Whose heads are in their hands, and in their heels,
But fit to darn, to knit, to wash, to cook,
To tramp, to burnish, and to scour,
For ever slaves at home, and fools abroad'.

సీ. తేనెబూసినకత్తి, తోనయుండెడి మిత్తి, దోషజాలంబుల తోలుతిత్తి
మగవా[illegible] పనిముట్టు, జగడాల తలకట్టు, త్రాగుబోతులు కాలఁ దన్నుచెండు,
మగలపాలిటి బూచి, పగలఁగొల్పు పిశాచి, మంగళముల మారి, భంగకారి,
తుచ్ఛముల [illegible], ముచ్చటల [illegible], [illegible]

గీ. నారి, పొంచిపనుల నారితేరినదియు,
మూలఁ గూలుచు స్రోలుచు మ్రగ్గునదియు,
పొరుగువారలఁ జేరుచు పోరునదియు,
గడపలోపల దాసి, రాకాసి యనల.

మనము నిజముగ స్త్రీలను బానిసలవలెఁ జూచుచుండుట లేదని చెప్పవత్తురేమో? అట్లయిన మనము వారికి గావించుచున్న అసురవివాహముల కేమి చెప్పెదరు? అయ్యో! ఆడుదానిజన్మ మెంతనిరర్థకమగుగతికిఁ గొనితెచ్చితిమి? ధనవంతులు కట్నములిచ్చి ధనము గోలుపోవలసివచ్చునని పుత్రికోదయము శుభాస్పదముగ తలంపరు పుత్రికోదయమున కేడ్తురు మాచు నిఱుపేదలు కూతును తెగనమ్మి నిజమాంసవిక్రయమున కొడిగట్టెదరు. ఎటు చూచినను మనము స్త్రీజాతియెడ న్యాయముగ వర్తింపుచుంటిమేమొ పరికింపుఁడు. పుట్టినది మొదలు గిట్టువఱకును వారిని మన మెట్లు కడగండ్లఁ బెట్టుచుంటిమో చూడుఁడు.

## 1. శైశవము.

అయ్యో! మనశిశువునకు కొన్నినెలలైనను తిన్నఁగ వచ్చినవో లేవో, అప్పుడే మనము వారిని పసులవలెఁ బట్టి హింసింపఁ దొడఁగితిమి. కటకటా! లేతతామరరేకులఁ బోలు వారిచెవులయందును నాసికయందును శూలములవంటి సూదులఁ గ్రుచ్చి కుట్టుఁ గుట్టించినపుడా నెత్తురుకందు లగు శిశువు లెంతయలమట జెందెదరో కదా! అప్పుడా నోరులేని పసికూనలు దుస్సహమగు నావేదనకుఁ దాళఁజాలక తమ చిఱురొమ్ముల నెగ నైచుచు, నుక్కిరిబిక్కిరిగ వగర్చుచు, కాలుసేతుల విలవిలఁ దన్నికొనుచు గన్నుల జొటజొట నీరుగార వెక్కివెక్కి యేడ్చుచు, నొందెడివంత యింతయంత యని చెప్పవలవి యగునే? సహజకోమలములగు వారియంగకములఁ గఱుకుసూచికలఁ జొనిపి చుఱుకుచుఱుక్కున నొక్కొక్కపోటు పొడిచినప్పుడెల్లను, మిన్నుమన్నన నెట్టిదో యెఱుఁగని వారిచిన్నికన్నులనుండి యొక్కొక్క కన్నీటిబొట్టువ పొరలిపొరలి వెడలుచుండ చూచువారియుల్లములు జల్లుమనకుండునే? ముప్పందు మాటలు కొంజాలు నా బాలలప్పుడొందెడి బాధ యెటు లుండునో తెలిసికొనుటకు మీలో నెవ్వరైన నమ్మహాభాగ్యము నొకసారి యనుభవింప నిచ్ఛగించెద. కాలిలో ముల్లు గ్రుచ్చుకొనినంత మాత్రాన నాబాధ సహింపనేరమన, తిన్నఁగఁ గన్నులైనఁ దెఱవని చిన్నిపాపల యవయవములలో పదులకొలఁది తూంట్లు పొడువఁబడుచుండ, నమ్మహోత్సవమును కన్నులపండువఁగఁ దిలకించుచున్నారము.

ఇట్లు మనము కిరాతులవలె వారిని హింసించుట యేటికి? కొఱగాని నగలవ గాక యింక నేమనవలెను? గోరుచుట్టుపై రోకటిపోటు చందమున, వారిశరీరముల రంధ్రములు పొడుచుటయె గాక, అందు లోహపుముద్దల నెక్కించి విలాసార్థము వ్రేలఁగట్టుదుము. ఈయలంకారములు శిశువులకుఁ గలిగించెడి యలంకారమాతలిదండ్రులకె తెలియవలయును. కొనియిచ్చిన నగలో, నగలో సొమ్ములో వస్తువులో, భూషణములో దూషణములో నాకుఁ దెలియకున్నది. ఆహా! మన మెంతయధికులమని గర్వించుచున్నారము? సర్వజ్ఞుఁడగు నీశ్వరునకె పంగనామములు పెట్ట సాహసించుచున్నారము. ఒకవేళ నీనగలఁ దగిలించుటచే వారిశరీరముల కొకవిధమైన శోభ గలిగించునెడ, సర్వావయవముల నిర్మించిన యాసృష్టికర్త కాపాటి చిన్నకన్నములఁ గలిగించు తెలివి తోఁచలేదు కాఁబోలు. లేక యీవిధముగఁ గల్పించిన నవరంధ్రములకె యాతఁ డలసట నొంది తక్కినవి పూర్తిగావించుటకు మనకు దిగవిడిచి యుండును. అపును. సృష్టికిఁ బ్రతిసృష్టి సేయఁ దొడఁగిన బుద్ధికుశలుల మగు మనకు జనించిన యీయాలోచన రిత్తయై యుండఁ జనదు. ఈనగల వలని యందము మాట యటుండ నిచ్చి, వీనివలనఁ బ్రయోజనము లేమేని యుండునేమో యింక నాలోచింతము. ప్రయోజనములలో నొకటియు నామందబుద్ధికి గోచరించుచుండుట లేదు కాని, అనర్థము లనంతములుగఁ గన్పట్టుచున్నవి. గిల్లిన పాలుచిందెడి వారిచెవులకును ముక్కులకును! ఆభరణములనెడి యాభరముల వ్రేలఁగట్టినను, హారము లనెడి భారముల వారిమెడలపై దిగవేసినను, కడియము లనెడి సంకెలలను మృదువులగు కాలుసేతుల బిగించినను, యవయవములు నవకముసెడి కొంకిరి బింకిరి వోవును. వేయేల! సొమ్మున కాసించి ముచ్చులు శిశువులఁ దెగఁ జూతురు. నగలవలనఁ గలుగు సిలుగు లింకను చెప్పఁ బూనినచో నిట్టిపత్త్రములవంటి వింక పది యగును. చూచితిరా? ఆభరణములవలని ప్రయోజనపరంపరలు. ఇట్టినీచకృత్యముల నొనరించుట కింకను మనము సిగ్గు వహింపకున్నారము.

ఛీ! ఇదియా మనమానుషత్వము? ఇదియా మననాగరికత? ఇదియా మనమనుగడకు సార్థకము? ఇదియేనా మనము విద్య నేర్చినదాని సత్ఫలము? ఇది యంతయు నాచారపిశాచము యొక్క విచేష్టితము. ఆముదుసలిరక్కసి శాపోదకకలశము గరమున ధరియించి మంత్రింపునీళులఁ జల్లి, భరతఖండ మంతయు నొక్కుమ్మడి భస్మీకృత మగునటుల శపియించి, తనసమ్మోహనాస్త్రముచే మనయుక్తాయుక్తపరిజ్ఞానమును పోఁబెట్టి మనబిడ్డలకు మనమె యకార్యకరణములఁ దలపెట్టు మహాశక్తి ప్రయోగించుచున్నది.

మనశిశు విప్పుడు కొంచె మెదిగి పుడమిపైఁ దప్పటడుగు లిడుచు నడయాడు యీడునకు వచ్చినది. ఈయీడున నెగధా పసిబిడ్డలు తమవిద్దెముల చేతను ముద్దులుగు

లకు ముద్దులచేతను మురిపెములచేతను మందహాసములచేతను తలిదండ్రుల నానందవారిధి నోలలాడించెదరు? కాని యిప్పుడయినను మనహింస మనము మానితిమా? మనబిడ్డ లాడుకొను టీ కొంతజాలికగనుగ నుండునో మనము చూచుచుండుట లేదా? తరువుల చివురుజొంపములు కన్నులకు బండువుసేయ, పులుగుల కిలకిలారావములు చెవులకు విందు గొలుప, ఈశ్వరుని కృతమగు పచ్చనితివాచియో యనునట్లు వెలయు బచ్చికబయలుల దాని నెన్నఁడైన విచ్చలవిడి విహరింపఁ బుచ్చితిమా? కుక్క, పిల్లి తక్క తక్కినమృగములం దొకదానినైన నది తిలకించియుండునా! పెంపుడుచిలుక యూరపిచ్చుక తక్క తక్కినపక్షుల నామములైన నది పేర్కొనఁ జాలునా? తళుకు తళుకుమని యాకసమున మెరయు చుక్కల నెవ రలంకరించిరో, చూచినమాత్రన కన్నులకు మిఱుమిట్లు గొలుపుచు దేదీప్యమానముగఁ దేజరిలు సూర్యుని కాప్రకాశ మెవ్వరనుగ్రహించిరో, తనపండువెన్నెలచే నెల్లజీవులకు హాయి గొలిపి మైమఱుపుఁ జేసెడి జాబిల్లి కాచల్లఁదన మెవ్వరు ప్రసాదించిరో, ఎటు జూచినను కుప్పలుతిప్పలుగ వెలయు తక్కిన సృష్టివైచిత్ర్యములకెల్ల సంధాయకుఁ డెవరో, మన మెన్నఁడైన దానికి నేర్పియుంటిమా? అది నిరంతరము చూచుచుండు వస్తువు లెయ్యవి? దాని దృష్టికిఁ జూపుమేరదూర మెయ్యది? పంజరములోని పిట్టవలె తనచిన్నగుడిసెలోని నాలుగుగోడల నడుమను అది యెప్పుడు బంధింపఁబడి యుండదా? ఆట యన నెట్టిదో యెఱుఁగక ఆడుకొనుట కీడుజోడు చెలిమికత్తెలు లేక, యుల్లాసముగను నోచుకొననిదై, అది యెల్లపుడు తనయిరుకుగదిలో చిందులుద్రొక్కుచు, నుండదా? పూవులకుఁ దావియుంబోలె, బిడ్డల కాటసహజము కదా! చిఱుతవారికి నవ్వుచు గేరుచు గంతులు వైచుటకన్న వినోదమేమి కలదు? చూడుఁడు. తనకరములచే పద్మినీకాంతను గిలిగింతలుపెట్టి పకపక నగించుచు బాలమార్తాండుఁ డెట్లు క్రీడించుచున్నాఁడో? పిల్లవాయువు లను చెలికత్తియ లూచుచుండ, పువ్వులగుత్తియ లను నుయ్యాలలపై నవలీల వాలి జుమ్మని రొదలుసేయుచు దుమ్మెద లెట్లు చెలరేగుచున్నవో? మనపూర్వకవులు తమప్రబంధములయందు బాలికల ఖేలనముల నెట్లు వర్ణించియుండిరో యరసితిరా?

సీ. పేర్వేర బొమ్మల పెండ్లిండ్లు సేయుచు నబలలతోడ వియ్యంబు లందు;
గుజ్జనగూళ్ళను గొమరొప్ప వండించి చెలులకు బెట్టించు జెలువు మెఱసి,
రమణీయమందిరారామదేశంబుల బువ్వదీగెలకును బ్రోదివెట్టు;
నవమలమణిమయ సౌధభాగంబుల లీలతో భర్మడోలికల నూగు;
గీ. బాలికలతోడఁ జెలరేగి బంతులాఁడు, శారికాకీరపంక్తికిఁ జదువు సెప్పు,
బర్హిసంఘములకు మురిపములు గఱపు, మదమరాళములకుఁ జూపు మందగతులు.

స్త్రీలయెడ మనము గావించు

# పంచమహాపాతకములు.

## 2. విద్య.

స్త్రీబాల్య మహాప్రబంధముయొక్క ప్రథమాశ్వాస మింతటితో ముగిసినది. మన శిశు విప్పు డాడుకొను యీడు గడచి విద్య నభ్యసించు వయసునకు వచ్చినది. కాని చదువు చెప్పించుటకై యామెను మనము బడికి బంపించుచుంటిమా? ఇప్పుడు మనదేశము నందలి బాలికాపాఠశాలల సంఖ్య యెంత? ఎక్కడనో పెద్దపట్టణములయందు తక్క తక్కిన గ్రామములయందు బాలికాపాఠశాల లేల లేకపోవలయును? ఆపాఠశాలలయందు నైతము బాలికలకు జీతములు లేకయె చదువు చెప్పఁబడును గావున బంపఁబడుచున్నారు. ప్రతిబాలికయు మాసమున కొకయణా జీతము చెల్లించినఁ గాని పాఠశాలలకు రానిచ్చుట లేదని పాఠశాలాధికారు లొకశాసనము చేయనిండు. మఱునాఁ డొకబాలికయైన బడికి వచ్చునేమొ చూతము. కాని ప్రతిబాలుఁడును ఇప్పుడు చెల్లించుచున్న రూపాయ ములకొలఁది నున్న జీతమును రెట్టింపు చేయనిండు, మఱునాఁడు బాలురపాఠశాలల యందైన తగ్గునేమొ? ఈవిభేద మేల కలుగవలయును? మనబాలికలకు పాఠశాలలలో జీతములు గైకొనకయె విద్య నేర్పుటయు కాక, వారికి పుస్తకములు పలకలు కలములు కాకితములు కూడ నేల యుచితముగ నీయవలయును? బాలికల విద్యాభ్యసనమునకై యొకపైసయైన మన మేల వెచ్చింపకూడదు? మన బాలికల కాళ్లు లేవా? కన్నులు చెవులు లేవా? కరచరణాద్యవయవములు లేవా? ఇంద్రియములు బుద్ధి జ్ఞానములు లేవా? మనబిత్తరులు శృంగార మను రజమున కరుణ యను సుధారసమును మేళవించి కరచి పోసిన మెఱుపు తీవెలు కారా? మన నారీమణులు,

> "కార్యేషు దాసీ, కరణేషు మంత్రీ। రూపేచ లక్ష్మీః, క్షమయా ధరిత్రీ।
> స్నేహేచ మాతా, శయనేషు రంభా। షట్కర్మయుక్తా కులధర్మపత్నీ"

అని మనపూర్వకవులచే వర్ణింపఁబడి యుండ లేదా? మనకిప్పుడు సావిత్రీ సీతలు లేరా? గార్గి మైత్రేయులు కఱవయిరా? దమయంతీ చంద్రమతులు గగనకుసుమము లైరా? విమలా సంయుక్తలు గ్రంథములలోని వారె యైరా? మానవసముదాయములో నర్ధభాగ మిట్టి దీనదశయం దడంగి యుండ, మనసంఘ మెన్నటికైన నున్నతి గాంచునా? ఇందు గూర్చి యొక యాంగ్లేయకవి యెట్లు వచించెనో వింటిరా?

## మానవసేవ.

"The Woman's cause is Man's, They rise or sink
Together Dwar'fd or God-like, boud or free"

"ద్వి. వనిత సేమమె మగవాని సేమంబు,
వనజాక్షి యభివృద్ధి వానికి వృద్ధి;
పడతి యౌన్నత్యంబు బడయక యున్న,
పురుషుఁ డేగతిఁ బెంపు పొందఁగ నేర్చు?
ఘనకార్యము లొనర్పఁ జ్ఞానంబుఁ గూర్ప,
స్వచ్ఛందవృత్తి జీవనమును సల్ప
పరిపూర్ణమైనట్టి స్వాతంత్ర్య మామె
పురుషుని చందానఁ బొందంగ వలయు"

స్త్రీలు విద్య నేర్వక పురుషులు మాత్రము సమగ్రముగ నభ్యసించిన, లోకమున కేమేని ప్రయోజన ముండునా?

"చ. పురుషుఁడు విద్యయందు పరిపూర్ణత నొంది, చెలంది విద్య నే
మెఱుఁగక యున్నఁ, గాపురము నే మనవచ్చును? బండికాడికిన్
దుర్గము నొక్కవైపునను దున్నను వేఱొకవైపు గట్టినన్
బరుగిడ నేర్చునే సరిగ? బండిని బ్రద్దలుగాఁగ నీడ్చెడున్."

అనునది సత్యము కాదా? అట్లయ్యును నీబాలిక యభివృద్ధికై యణుమాత్రము శ్రద్ధ గొనవ దేల? నీరక్తస్పర్శ గలిసినవారి యెడలనె నీవు త్యాగము నూననియెడ, నిఁక నేమి చెప్పవలయును? అదిని పరిత్యాగమె లేనివాఁడు జగదుత్పత్తికి నిమిత్తముండునా? నీకు ఉపనిషత్తులయందును భగవద్గీతలయందును పరిపూర్ణవిశ్వాసము గలవేని, యవి పరిత్యాగమును గూర్చి వేనోళ్ల నుద్ఘోషించుచుండవా? "భగవత్కార్యములకు తమశరీరముల కైంకర్యము చేయనివారు భగవత్కృపకు పాత్రులు కారు" ఇది సర్వమతసమాదరణీయము కదా! జీవకోటి యంతయు భగవంతుని యపరిమితపరిత్యాగము వలన జనించిన దని నమ్మువారును, నిఖిలచరాచరవస్తుజాలములందును ఈశ్వరుని దివ్యమహిమలఁ గనుఁగొనుచు తమజీవితముల మహాయజ్ఞములుగ నొనర్చినవారును అగు ఆర్యుల సంతతివార మని గర్వించు మనము, మన కోమలితల విద్యకై యొకయణా వెచ్చింప వెనుదీయుచున్నాము. ఇదియే గదా మన స్వార్థపరిత్యాగము! ఇదియే కదా మన సంఘసంస్కారధురీణత! ఇదియే కదా మన నవీననాగరికత!

---

స్త్రీలయెడ మనము గావించు

# పంచ మహా పాతకములు.

## 3. వివాహము.

దీనితో నంతయు నైనదా? మనపాతకము లింతతో నాగినవా? ఆగిన బాగుగనే యుండును. మన పాతకములలో నెల్ల ఘోరపాతక మొకటి మన కథానాయిక యింకను విద్య నేర్చుకొను వయసు గడవక మున్నె—యింకను ఆడుకొను యీడునైన దాటక మున్నె, దానిని భర్తకుఁ గట్టిపెట్టి నాయికగఁ జేయుచున్నది. కొన్ని యెడలఁ దిన్నఁగ రెండేండ్లైన నిండకుండఁగనె మన పసిబాల వధు వగుటయు, విధ వగుటయుఁ గూడ యందందు జూచుచునె యున్నారము. మనదేశ మంతయుఁ గూడ నిట్టిదుర్దశ కింకను బాల్పడలే దని మనము కొంత సంతసింపవలసియె యున్నది. కాని మన బాలికలకు మిక్కిలి చిన్నతనముననె పెండ్లి చేయుచుంటి మనుట మాత్రము మన మొప్పుకొనవలసి యున్నది. అతిబాల్యవివాహమునకు బలి యయి శరీరపటిమను గోలుపోయి, తీరని రోగములకు లోనయి, తమ మనుగడ తమకే యేవగింపు గాఁగ, బ్రతికియున్నంతకాల మెల్లరిచేతను రోతలం బడు చెల్లెండ్ర మన మెందరిని నిత్యము జూచుచుండుటలేదు?

చూచితిరా, మనస్త్రీల ప్రస్తుతస్థితి? అజ్ఞానాంధకారము కన్నుల నావరింప తమ దురవస్థ తామె గుర్తెఱుఁగఁ జాలనివారై, తమ్మెవరైన నుద్ధరింప నెంచినచో, వారికి తమ్ముఁ గట్టఁ ద్రాళ్ళు తామె తెచ్చి యిచ్చుకొను నంతటి హీనదశయందు వారు మునిఁగియున్నారు. దక్షిణఅమెరికాలో నుత్తరదక్షిణదేశములకు యుద్ధము సాఁగినపుడు, కొందరు మహనీయులు బానిసలను విక్రయించు క్రూరాచారమును మాన్పింపఁ దలంప, బానిసలు తమదుస్థితిఁ దొలఁగింప శ్రమపడ నక్కఱలే దనియు, తమ ప్రస్తుతావస్థయె తమకు సౌఖ్యావహముగ నున్నదనియు, మొఱలిడ లేదా? వారి కప్పుడు బానిసతనము బానిసతనము వలెఁ దోచనంత దౌర్భాగ్యము వారిని గప్పియున్నది. అట్టులె, మన స్త్రీలును దురాచారపిశాచముచే నావేశము నొందినవారై, తమ సౌఖ్యవార్ధికి తామె యడ్డకట్టలై నిలచి యుండు నంతటి దురవస్థకుఁ బాల్పడినవారలు. మన స్త్రీ లిట్లు దురాచారకూపమునఁ బడి మునిఁగిపోవుచుండ, మనము వారిని పైకి లేవనెత్తుట యటుండ, వారితోఁ గలసి మనమును అధోగతి పాలగుచున్నారము. శరీరశాస్త్ర మన్న నేమియో యెఱుంగక, యెఱింగియు దానినిబంధనల నతిక్రమించుట పాప మని తెలిసికొననేరక, మీదుమిక్కిలి యాపాపము మనలను మనసంఘమును బట్టి పీల్చి పిప్పిచేయుచున్నను, దానికి దాసులమై దోసిలి యొగ్గుచున్నారము.

# మానవసేవ.

ఓదురాచారపిశాచమా! నీప్రభావము నేమనవచ్చును? జనులు నిన్నొకప్పుడు ఆశ్రయించిన వెనుక, వారి నింకెన్నఁటికిని నీవలలో వైచికొని కీలుబొమ్మల వలె నీయిచ్ఛ వచ్చినట్లెల్ల వారి నాడించి క్రీడించుచుందువు గదా! అప్పుడు నీవన్నిఁటికిని అభేద్యమగు వజ్రకవచము దొడిగికొని కూరుచుందువు. అప్పుడు నీయెదుట శ్రుతి శ్రుతికటువుగ నుండును. స్మృతి స్మృతి దప్పియుండును. పురాణము పురాణ మగును. ఇతిహాసము పరిహాస మగును. జ్ఞానము శూన్య మగును. యుక్తి శక్తిలేని దగును. ప్రకృతి వికృతి నొందును. స్వభావము అభావ మగును. అతిబాల్యవివాహము అనార్య మనియు, అనాచార మనియు, అనారోగ్య మనియు, అనర్థదాయక మనియు అపవిత్ర మనియు, అస్వభావ మనియు, వేదములు వారించుచున్నవి; స్మృతులు ఘోషించుచున్నవి; ప్రకృతిశాస్త్రములు చాటుచున్నవి; వైద్యశాస్త్రములు మొఱపెట్టుచున్నవి; లోకజ్ఞానము ప్రకటించుచున్నది. కాని యవి యన్నియు మన కరణ్యరోదనములైనవి; చెవిటివాని ముందర శంఖారావము లైనవి. బాలికలకు చిన్నతనముననె పరిణయ మగుటచే వారు తోడిచేడియలఁ జూచి వారివలె తామును తమ భర్తలతోఁ గలసి యెన్నఁడు సుఖింతుమా యని యువ్విళ్ళూరుచుందు రనియు, నందుచే వారికి తలఁపులు చెలరేగి వలపులు తలకెక్కి, తరుణవయసు రాకమున్నె రజస్వల లగుట సంభవించుచున్న దనియు, పుష్పవతులైనంతమాత్రమున నవయవవికాసము సంపూర్ణముగ కలుగకుండు ననియు, నట్టిసమయమున వారికి నిషేకము గావించినచో శరీరపటుత్వము సడలి పలురోగముల పాలగుదు రనియు, నట్టియెడ వారికి చూలు నిలుచుటయె దుర్లభ మనియు, నొకవేళ నిలిచినను తల్లికో శిశువునకో లేక యిరువురకునో ప్రాణాపాయము సంభవించు ననియు, ఒకవేళ గండము గడచి శిశువులు బ్రతికినను ఎల్లకాలము దుర్బలశరీరులై కృశించుచుందు రనియు, వైద్యశాస్త్రజ్ఞులు ఘంటాపథముగఁ జెప్పుచున్నను, మనము వారిమాటలను బెడచెవి నిడుచు తృణప్రాయముగఁ జూచుచున్నారము. వైద్యుల సాయము వ్యాయామస్థానములందును దేహారోగ్యవిషయములందును మన కక్కఱకువచ్చునే కాని, మనకొమరితల వివాహకాలనిర్ణయము చేయుటలో వారిజోలి మన కేల? అయినను పూర్వకాలమునుండి వంశపరంపరఁగ వచ్చుచున్న అతిబాల్యవివాహసదాచారము మన మిప్పు డేల విడువవలయును? కావున అతి బాల్యవివాహ మవశ్యాచరణీయము. ఈ మహాయజ్ఞమున దీక్షవహించి మన పసిబాలల పశువులుగ నఱిచేసి పుణ్యముల నార్జింతము. కాని ధర్మరక్షణపరాయణుఁ డగు భగవంతుఁడే యొకఁడున్నయెడల, మనము చేసిన పాపములను మన మొప్పుకొన్నను లేకున్నను మనల శిక్షింపక మానఁడు. కాని యిప్పుడైనను మన పాపములు మనలఁ గట్టికుడుపక విడుచుచుండుట లేదు. ఆపాపఫలకములు నీతిజ్ఞానములను కూకటివ్రేళ్ళను మొదలంటఁ గొరికివైచుచు హిందూసంఘమను మహావృక్షమును నాశనము చేయుచునే యున్నవి.

స్త్రీలయెడ మనము గావించు

## పంచమహాపాతకములు.

---

## 4. సంసారము.

"చ. తనుఁ గని పెంచినట్టి తలిదండ్రుల సోదరపాళి వీడి వా
ధ్యున కొనలేదటంచుఁ దమతో సుఖదుఃఖము లొందు కాంతలన్
జనవునఁ జేరఁదీసి ఘనసౌఖ్యము లీయక వేచుచు న్నవా
వనటలఁ ద్రోయువారె కద భార్యలపాలిఁటి మృత్యుదేవతల్."

ఇప్పుడు మన స్త్రీహత్యామహాప్రబంధములోని చతుర్థాశ్వాసమునకు వచ్చి నారము. దీనితో మన కథానాయిక యొకయింటి యిల్లాలైనది. శైశవమున స్వేచ్ఛఁగ నాడుకొననీయక కాలుసేతుల బంధించి, బాల్యమున విద్య నొసఁగక కన్నులకు గంత గప్పి, యుక్తవయసు రాకమున్న వివాహ మను గుదిగట్టను మెడకుఁ గట్టిపెట్టి, యిప్పు డామెను సంసార మను మహాసాగరమునఁ బడఁద్రోసి, అత్త యను మొసలిబారికి నప్పగించినారము. ఇఁక యామె పడు పాట్లు దైవమునకె యెఱుక. గండకత్తెగ యగు అత్త నొక్కడులం బడి యామె కడలేని కడగండ్లఁ గుములుచుండ, మన మెన్నడేని యాయిడుమల నుడుప నొడికట్టియుంటిమా? అత్తల కత్తెసరువెట్టు గయ్యాళిగంప లగు కోడండ్రు ఎచ్చటనైన నొక రిరువు రుండిన నుందురు గాక! కాని అత్తల యడుగు లకు మడుగులిడుచు వారికనుసన్నలఁ బనివినుచు వారిపెట్టువాతలకు దోసిలియొగ్గుచు నూడిగములఁజేయు కోడండ్రె యెక్కడ జూచినను లెక్కకు మిక్కిలిగ నున్నవారు. వారి నీకత్తికోతలనుండి తప్పించుట మనచేతిలోనె యున్నది. మన మించుక కనుగలిగి చల్లనిపలుకులతో మందలించుచు మెలకువతో జోక్యము గలుగఁజేసికొంటిమేని యీపో రును మాపఁగలిగియుందుము. కాని మనహృదయములు మొండికత్తి బండ తేరినందున మనయింటిలోనిపోరు మనకు గాదనుకొని దాని నెడలించుటకై మనవ్రేలైన నెత్తకున్నారము.

ఇదియే కదా మనము మనసతుల నాదరించు తీరు! కని పెంచి పెద్దవారినిఁ జేసి యరచేతిమానికములుగఁ జూచు దలిదండ్రులను అత్యంతప్రేమతో గారవించు సోదరీసోదరులను సఖీజనమును విడనాడి, యెన్నఁడును ముక్కుమొగ మెఱుఁగని

భర్తలు తమ్మేవో యుద్ధరింతు రని నమ్మి, వారిని దమ దైవతములుగ భావించి, వారితోడిదె తమలోక మని యెంచి, వారిసుఖదుఃఖములు తమవిగనె తలపోసి, తమ ప్రాణమాన మానసముల వారికె యర్పించి, సేవింపవచ్చిన యర్ధాంగుల మన మిట్లు చులకనజేయుట చెల్లునా? స్త్రీ లెట్లు గౌరవింపఁబడవలయునో మను విట్లు వ్రాసియున్నాఁడు.

పితృభిర్ భ్రాతృభిశ్చైతాః పతిభి ర్దేవరై స్తథా
పూజ్యా భూషయితవ్యాశ్చ బహుకల్యాణ మీప్సుభిః
యత్ర నార్యస్తు పూజ్యంతే రమంతే తత్ర దేవతాః
యత్రైతాస్తు నపూజ్యంతే సర్వాస్తత్రా ఫలాఃక్రియాః

శోచంతి జామయో యత్ర వినశ్యత్యాశు తత్కులం
నశోచంతి యత్రైతా వర్ధతే తద్ధి సర్వదా
జామయోయాని గేహాని శపంత్యప్రతిపూజితాః
తానికృత్యాహతానీవా వినశ్యంతిసమంతతః. మనుస్మృతి.

శుభముఁగోరు తండ్రులును సోదరులును భర్తలును మఱఁదులును స్త్రీలను గౌరవించి పూజింపవలెను.

ఎక్కడ స్త్రీలు గౌరవింపఁబడుదురో, అక్కడ దేవతలు సంతోషింతురు. ఎక్కడ గౌరవింపఁబడరో, అక్కడ సర్వకర్మములు నిష్ఫలము లగును.

స్త్రీలు ఎచ్చట దుఃఖింతురో, ఆసంసారము నశించును. ఎచ్చట సంతోషింతురో ఆవంశము సదా వృద్ధిఁజెందును.

స్త్రీలకు గౌరవము జూపమిచే వారు శపించినయెడల, నాసంసారములు మంత్రహతము లయినట్లు నిర్మూలము అగును.

మనము మనస్త్రీల నిట్లు గౌరవించుచుంటిమా? మనము ప్రతిదినము పగటియందు మనభార్యలతో నెన్నిగడియలు గడపుదుము? మనకుక్కకును గుఱ్ఱమునకును గడపు కాలమునైనను ఆమెయెడ మనము వినియోగింతుమా? కందుకక్రీడలయందును కేళీవిలాసములయందును మనము వినోదించు వేళలో సగబాలైన నామెతోఁ జెల్లింతుమా? మన మవలీలగఁ బ్రొద్దులు బుచ్చవలయు నన్న నెన్నియొ వేడుకలఁ గల్పించుకొందుము. ఆమె కేమైన ముచ్చటలఁ గొలుపుదుమా? మనయాత్మల నభివృద్ధిపరచుకొనవలయు నన్న ననేకసద్గ్రంథములఁ బఠింతుము. ఆమె యేమి చదువఁగలదు? విలాతిసీమంతిని యగు ఆనిబిసంతి మనమతగ్రంథములనెల్లఁ ద్రిచ్చి త్రిచ్చి యందలి యామృతసారమును

తనివోవ రెండుచేతులతో జుఱ్ఱవచ్చును గాని మనస్త్రీలు తద్రసము నించుక చవిచూచుట కేని యనర్హ లఁట! సోదరులారా! మీధర్మపత్నులయెడ మీరు నెఱపవలసిన ధర్మముల నెఱపుచునెయుంటి మని మురియుచున్నారేమొ? అట్లెంతమాత్రము మీ రాచరించుట లేదు. ఎంతకాలము వారు నీతిమతసాంఘికవిషయములయందు మనతో సమమగు నభివృద్ధిగాంచుటకుఁ దగిన యవకాశములను గల్పింపక, వారిని గృహకల్లోలముల యందు ముంచియుంచుదుమో, యంతకాలమును వారియెడ మనవిధాయకకృత్యముల నెఱవేర్చుచుండుట లేదనియె చెప్పవలయును.

ఇంతతో నూరకుంటిమా? మనము చేసిన పాపములె పండి ఫలించినవో యనునట్లుగ, మనకథానాయిక యిప్పుడు గర్భముఁ దాల్చినది. శారీరశాస్త్రమును సరకుచేయక సంగమనియమములఁ బాటింపక తుచ్ఛసుఖములకు లోనై చట్టముప్రకారము శిక్షార్హమగు నేరములుగఁ బరిగణింపఁదగిన నీచకృత్యముల నాచరించుటకు సిగ్గు వహింపకున్నారము. కాని శిక్షాస్మృతి చెప్పని శారీరసాంఘికనిబంధనల యతిక్రమణము నేరముగ నెన్నఁబడకుండినను, దానిశిక్షల నది స్వయముగనె విధించుచున్నది. అట్లామె గర్భవతియై మనపాపములకు ప్రతిఫలముగ దుర్భరప్రసవవేదనల గాసిలుచుండ, మన మిప్పుడైనను జాలినొంది యాబాధ నివారించుటకై తగినవైద్యుల నియమింపక వారిని మంత్రసాను లను తంత్రఁపుబోనుల పాలుసేయుదుము. నిరక్షరకుక్షులగు నీమంత్రసానులు శిశువులపాలిటి మారణమంత్రములై శరీరతత్త్వమును గుర్తెఱుంగక తమ మిడిమిడిజ్ఞానమును బ్రయోగించి మేలుసేయుటకు బదులుగ పలుమాఱు ప్రమాదములకు లోనై తీరని వ్యాధుల నాపాదించుచున్నారు. ఇన్నిగండములు గడచి పిండము బయటపడినపిదప నాశిశువు ఆడుదియె యైనచో నింక తల్లిపాట్లు చెప్పవలసినదె లేదు. తమభార్యలు సారెసారెకు తమజాతిశిశువులనె గనుచుందు రను నపరాధము నారోపించి వారిని త్రోసిరాజని పునఃపరిణయము లాడు పురుషపుంగవులు కూడ నందందు గలరఁట. ఇట్లు హింసకు నన్యాయమును అన్యాయమునకు మానహానియుఁ దోడుపరచి స్త్రీజాతియెడ ఘోరదురాపచారముల నొనరించుచు వారి నధోగతిపాలు చేయుచున్నారము.

మనయర్ధాంగు లగు నంగనల నిట్టు లధోగతి పాలుపరచి మనము ఉత్తమగతిఁ గాంచఁగలుదుమా? చేదతోఁ గలసి త్రాడును నూతిఁ బడును గదా! వారి నజ్ఞానవతులుగఁ జేసి మనము జ్ఞానవంతులము గా నేర్తుమా? ఒకగదిలో నొకభాగము నంధకారముగఁ జేసి మఱొకభాగము ప్రకాశవంతముగఁ జేయ నెవరికి శక్యము? శరీరమున నొకయవయవమునకు బాధ గలిగిన తక్కినయవయవములు గూడ బాధ నొందునట్లు సు,

ఒకబండిచక్రము వక్రమైన రెండవచక్రము కూడ వక్రతనొందునట్లును, ఒక కావడికుండ భిన్నమైన రెండవకుండకూడ భిన్నము నొందునట్లును స్త్రీలు దుర్గతి నొందిన పురుషులును దుర్గతినొందక తప్పదు. వారు మన యర్ధాంగలక్ష్ము లనియు సహధర్మచారిణు లనియుఁ దలఁచి మనతో సమముగ విద్యావివేకస్వాతంత్ర్యముల నొసంగి గౌరవించితిమేని, వారప్పుడు,

"గీ అఖిలదుఃఖరోగార్తున • కౌషధంబు
సురుచిరంబుగ భార్యయె • చూవె యెందు
నొనర భార్యాసమేతుఁడై • యున్నవాని
కెట్టియాపదలయ్యును • నెఱుకపడవు."

అను భారతవచనమును సార్థకపరచి మనసంసారము స్వర్గతుల్యముగ నొనరింతురు. అట్లుగాక వారి నజ్ఞానాంధకారమునఁ బడవైచి దుఃఖముల పాలుసేయుదుమ యేని,

"మ నరకద్వారము, సాహసాకరము, పుణ్యస్వర్గవిఘ్నంబు, దు
స్తరమాయాశతపేటి, దంభనిధి, దోషస్థాన, మప్రత్యయో
త్కరసుక్షేత్రము, కాలకూట, మమృతాకారంబు, స్త్రీయంత్రమున్
ధర నెవ్వాఁడు సృజించెఁ బూరుషగళోద్బంధక్రియాపాశమున్."

అను భర్తృహరిసుభాషితము నన్వర్థము చేసి మనసంసారము నరకతుల్యముగఁ గావింతురు. కావున,

సంతుష్టో భార్యయా భర్తా, భర్తా భార్యా తథైవచ
యస్మిన్నేవ కులే నిత్యం, కళ్యాణం తత్రవై ధ్రువమ్.

ఏగృహమునందు భార్యవలన భర్తయు భర్తవలన భార్యయు సుఖపడుదురో ఆగృహమునందు నిత్యకల్యాణము అగును.

అను మనుస్మృతివాక్యము ననుసరించి మనగృహముల సౌఖ్యవంతముగను మంగళప్రదముగను నొనరించుకొని నిత్యానందమున నోలలాడుదము.

# స్త్రీలయెడ మనము గావించు

# పంచమహాపాతకములు

## 5. వైధవ్యము.

ఇప్పుడు మన స్త్రీహత్యామహాప్రబంధమునందలి మహాపాతకములలో నత్యంతసంతాపకర మగు పంచమపాతకమునకు వచ్చితిమి. శైశవమున స్వేచ్ఛగ నాడుకొననీయక చెఱసాలయందు బంధించి నగలను సంకెలలఁ దగిల్చి, బాల్యమున విద్య యొసంగక చీఁకటికొట్టునఁ బడవైచి, వివాహ మను జన్మఖయిదు వేసి పుస్తియను బిళ్ళను మెడకుఁ గట్టి, సంసారమను ప్రవాసవాసమును గల్పించి యంతతోఁ దనివి నొందక యిప్పుడు మనకథానాయికకు వైధవ్య మను ఘోరకాంతారవాసమును విధించుచున్నారము.

ఇంతతో మనశిక్ష లాగినదా! ఓపురుషరాక్షసులారా! వీనియన్నిఁటి కంటెను క్రూరతర మైన శిక్షను మీరు స్త్రీలకు విధించియుండలేదా? అమానుషమును నతిదారుణమును నత్యంతఘోరమును నైన యాక్రూరకృత్యమును దొరతనము వారు బలవంతముగ నిర్బంధించి యణఁచివేసిరి కాని లేకున్న స్త్రీల నందఱ నీసరికి భీకరాగ్నికీలలఁ బొల్పఱచి పుణ్యముఁ గట్టుకొనియుండరా? ఇప్పు డైన వారిని మీరు జీవములతో విడిచిపుచ్చినను నిరంతరసంతాపదావాగ్నిజ్వాలల వారిని ప్రేల్చుచుండలేదా?

ఇప్పుడు మనకథానాయిక మన మీవఱకు బఱచిన సౌఖ్యపరంపరలకు మొగము మొత్తెఁగాఁబోలు, ప్రపంచసుఖములఁ బరిత్యజించి విరాగినియై తల గొరిగించుకొని మొగముపై ముసుఁగు వైచికొని భూషణముల దీసివైచి నారచీరల ధరించుచు నొంటిపూట బోనము గుడుచుచు నేలపజ్జఁ బవ్వళించుచు వ్రతోపవాసములఁ బ్రొద్దులు పుచ్చుచున్నది.

ఓపురుషనామధారులారా! ఇప్పుడైనను మీ రామెపై జాలి నొందుచుంటిరా? ఇంక నైన నామెస్థితి మీకు దయనీయముగఁ దోఁచుటలేదా? ఏ మని యెదరు! "అనిత్యములు క్షణభంగురములు నగు ప్రాపంచికబంధములఁ దగులుపడి తుచ్ఛములైన విషయసుఖములఁ దేలియాడుచుఁ దుదకధోగతి పాలగుట కంటె నిర్మలవైరాగ్యము నవలంబించి నిత్యమును నిష్కళంకమును నగు మోక్షసామ్రాజ్యమును బడయుటయె మానవజీవితమునకుఁ బరమార్థము కావున, మోక్ష

సాధనమగు వైరాగ్యమునె య్యామెకుఁ బ్రసాదించితి'' మని వచించుచుంటిరా? అవును. మీరు వచించినది యథార్థమె. నిక్కముగ నాశ్రమము లన్నిఁటిలో సన్న్యాసాశ్రమ ముత్తమమైనదె. కాని, ప్రపంచ మన నేమియో యెఱుఁగక తిన్నఁగఁ గన్నులైనఁ దెఱవక వివాహ మన నేమియో భర్త యన నేమియో యెఱుఁగనికాలమున మీచే బలవంతముగ నేముక్కుపచ్చ లారని పసిబాలునకో, లేక కాటికిఁ గాళ్ళు చాఁచుకొనియున్న యే మూఁడుకాళ్ళ ముదుసలికో కట్టఁబడి, విధివశంబున భర్త గతింప, నిర్బంధవైధవ్యమహార్ణవమునఁ దలమున్కలు వేయుచున్న పసిబాలకు వైరాగ్య మన నేమి తెలియును? పరమాత్మతత్త్వము నెట్లు గుర్తింపఁగలుగును? సంసారసుఖసాగరమునఁ గుత్తుకబంటిగఁ దొప్పదోఁగి, సమస్తైశ్వర్యములఁ దేలియాఁడి, మనుమల మునిమనుమల నెత్తి, గడ్డములు మీసములు శిరోజములు నెఱసి యేకులబుట్టవలె మొగ మొప్పార, శరీరము కృశించి వాడి వత్తయి యూసరవెల్లిచందమున బీఱవరాలు దేఱ ,,ఊరు పొమ్మన కాడు రమ్మనుచుండ'' దుఁడకు చావఁదీరిక లేనిసమయమున నైనఁ, దమభార్యలు గతింపఁ, బునఃపరిణయములు పునఃపునఃపరిణయముల నాచరించుచేనియు వెనుదీయక తగుదు మని సిద్ధపడెదరు పురుషపుంగవులు. సన్న్యాసాశ్రమమును స్వీకరించి తమజన్మములఁ బావనముఁ జేసికొన నొల్లరు, కాని ప్రపంచసౌఖ్యముల నించుకేనియుఁ జవిచూచి యెఱుఁగక యొకచెక్కు గిల్లిన పాలును నొకచెక్కు గీటిన నీరును గారెడిబాలవితంతువులు సన్న్యాసాశ్రమస్వీకారమునఁ దమ మనుగడల సార్థకపఱుపవలయునఁట! ఆహా! ఏమి, మీధర్మసూక్ష్మములు! ఏమి మీపరమవేదాంతరహస్యములు!! సన్న్యాసిను లనఁ గన్నులు తెఱవనియాఁడేండ్ల పసిబాలలును, గృహస్థు లనఁ గన్నులు మూఁతలుపడిన యఱువదేండ్ల ముసలిపెండ్లికొమరులునా? పాప మింతవఱకు మనపూర్వులీయనాథలకు సగముకడుపు కాల్చి నను నొక్కపూఁట యైన నిన్న మెతుకులు కుడువబెట్టి, యేముతుకగుడ్డ నొకట్టనిచ్చి, యే కటికనేల నైనఁ బండుకొననిచ్చి, యింట నొకమూలఁ దలఁ దాఁచుకొననిచ్చుచున్నారు.

,,సీ. ఓర్పుమై నుప్పిండి యుపవాస ముండనీ, మగనాలి సరిపోల్పఁ దగదు విధవ
సద్భక్తి దేవతార్చనము సల్పంగనీ, మగనాలి సరిపోల్పఁ దగదు విధవ
తిరిగి నానాపుణ్యతీర్థంబు లాడనీ, మగనాలి సరిపోల్పఁ దగదు విధవ

గీ. నిద్ర మేల్కాంచి రేపాడి నియమపరత। నపతిముఖానువీక్షింప కటకమున్న
తగదు వీక్షింప నవునకు దల్లి వది సె। న త్తగారిని దప్పించి యన్యవిధవ

ఉ. జీవముతోడి బాసి యశుచిత్వముఁ బొందిన మేను కుంభలో
యావభృ)తాభిషేకము సహస్రఘటంబుల నాచరించినన్
బావన మౌనె? యట్లు పతిఁ బాసి వితంతుత నొందినట్టి రం
డీవదనాయతాక్షి యశుచిత్వము వాయదు వేతెఱంగులన్

గీ. ప్రియము గలిగిన నంగీకరింపవలదు। ముండ సేవన రేపాడి మోము జూచి
బెనిమాలిన పరమనిర్భాగ్యురాలు। విధవ, దానియాశీస్సును విషసమంబు'
అని కాశీఖండమున వర్ణింపఁబడియున్నది. ఈశిక్షలే దుర్భరముగఁ దలఁచుచుండ, నిఁక మీరు వారికి సన్యాస మిప్పించి యిదివరకు బెట్టుచున్న పట్టెడుమెతుకులు నెగబెట్టి దేశముల వెంట బిక్షలి నారగింపుఁడనియు, పంచనుండి పారఁదోలి యేనెట్టునీడనో యాశ్రయింపుఁడనియు శాసింపనున్నారు. ఓ యపూర్వనాగరికాగ్రగణ్యులారా! ఇంతట నైన మీకు తృప్తి కలుగునా? లేక యింకేమైన నుంతవశిక్షలఁ గల్పింతురా?

ఆయనను మి మ్మనవలసిన పని యేమున్నది? మి మ్మాశ్రయించిన దురాచార పిశాచము నవనలయు సమస్తశాస్త్రిముల నభ్యసించి గొప్పగొప్పపరీక్షలం దేతీ యున్నతపదవు లంది ప్రాపంచికజ్ఞానసంపదచేఁ దులతూఁగు చుంటి మని గర్వించు మహామహులను సయితము నావహించి వెఱ్ఱిశివము లాడించు చున్న ప్రజ్ఞావంతురా లగు నోదురాచారపిశాచమా! ఎన్నివేల వితంతువుల నీపొట్టఁబెట్టుకొన్నను, ఎన్ని లక్షల గర్భస్రావముల చేఁ దప్పితీర్చుకొన్నను, మఱి యెన్నికోట్ల నెత్తురుకంద లగు శిశువులను దిగమ్రింగినను, నీయాఁకలి చల్లారినదికాదుగదా! ఛీ! ఛీ! చండాలీ!. నీవే రూపమూని నాయెదుర నిలువఁబడినచో దొరతనమువారి శిక్షాస్మృతికి లోఁ బడినను నోకత్రేటున నిన్ను దెగనరికి మాతృదేశమును గాపాడుకొనియుందును.

ఓసోదరులారా! మీ రించుకసేపు మి మ్మాశ్రయించిన పూర్వాచారము నానల నుంచి యీశ్వరప్రతిపాదిత మగు మీమనస్సాక్షితో చిరకాలసముపార్జిత మైన జ్ఞానజ్యోతిసహాయమున నిశ్చలమనస్కులరై యోజించి, మీసంఘము నందలి వితంతువులయెడ మీరు న్యాయముగ వర్తించుచుంటిరేమొ వచింపుఁడు. వారికి మీరు వివాహములు చేయకున్న మానెఁ గాని, వారు సంఘమునకు భారముగా నుండునట్లైనఁ జేయుఁడు.

స్త్రీజన్మమునకు వివాహ మొక్కటియే ముఖ్యాదర్శము కాదు. స్త్రీలు వివాహములు చేసికొనకున్నను, నీతికి నియమమునకు గట్టుబడి యుండఁగలరు. వారియెడఁ గల దురభిమానముచేఁ బురుషులు, „స్త్రీణాం..............కామం చాష్టగుణం భవేత్''........„కామ మెప్పటికి రమణునికంటె నెన్మిదిగుణం బులు కాదె లతాంగి కారయఙ్గ'' 'అను శాస్త్రప్రమాణములఁ జూపినఁ జూపుదురు గాక! కాని పురుషులవలె స్త్రీ లంతగ విషయసుఖములఁ దగులువడియుండ రనుటమాత్రము నిక్కువము. కామాంధకారమునఁ గన్నులు గానక యిచ్చవచ్చి నప్పుడెల్లఁ బ్రమత్తుచ్ఛృంగారికలఁ దీర్చికొన సమయనియమముల నైనఁ బాటింపక భార్యల బలవంతపరచువారు పురుషపశువులే. స్త్రీలు రజస్వలలై యంటరాని సమయమున నున్నను, నిండుగర్భవతులై దరిఁ జేరరాని సమయమున నున్నను, సిగ్గులఁ దిగఁగోసి వారి నపవిత్రపఱుప నుంకించెడివారు పురుషకిరాతులే. ఈవిషయముల స్త్రీలను వారిదారిని వారిని బోనిచ్చినయెడ, వారు పవిత్రమైన ప్రకృతిధర్మములఁ బాటించి తమసహజధనమగు మానముచేఁ గట్టువడియుందురు. కావున స్త్రీలు వివాహమాడుటకును బిడ్డలఁ గనుటకును విధవ లగుటకునే నిర్దేశింపఁబడి రని యెంచకుఁడు. వారు పురుషుల నుద్ధరింప నవతరించిన కులదేవత లని భావింపుఁడు. వారి నజ్ఞానాంధకారమునఁ బడియుంచక జ్ఞాననేత్రమును వికసింపఁజేసి వారివలన సంఘమునకును సంసారమునకును వారికిని ప్రయోజనములు గలుగునట్లు చేయుఁడు. అప్పుడు వారు మనకు సహకారులై సహధర్మచారిణులై యర్ధాంగులై తోడునీడలై చేదోడువాదోడులై కొంగుబంగారములై విలసిల్లఁగలరు. అప్పుడు మనము పంచమహాపాతకములనుండి విముక్తులమై యీశ్వరకృపకుఁ బాత్రుల మగుదుము. సర్వేశ్వరుఁడు తనకృపామృతరసముచే మనపాపపంకములఁ గడిగివైచి మనయర్ధాంగు లగుస్త్రీలయెడఁ గనికరము గలిగి వర్తించునట్లు మనల ననుగ్రహించుఁ గాత!

---

# భక్తమాల



## కబీరు.

ఆ సన్మార్గమునందు సంచరించుచు నజ్ఞానాంధకారమునఁ బడి పొరలుచున్న జనసామాన్యము నుద్ధరించుటకై తమజీవితములను ధారవోయు నుత్తరహిందూస్థానమున నుద్భవించిన పరమభాగవతోత్తములయిన మతసంస్కర్తలలో కబీరుదాసుని మించినవారు వేఱొకరు లేరని నిస్సందేహముగాఁ జెప్పవచ్చును. కబీరుకాలమునాఁటి హిందూదేశస్థితినిబట్టి చూడఁగా, పరస్పరవైషమ్యములతో వేఁగుచున్న హిందూమహమ్మదీయులకు మతమూలమున నైకమత్యమును గూర్చుటకై ధీరవృత్తితోఁ బ్రయత్నింపఁగల మహనీయుఁ డొకఁడు పుట్టుట యావశ్యకమైయుండెననియు, మనుష్యకోటియొక్క యభివృద్ధికయి నిరంతరము పరిపాలించుచుండిన యీశ్వరకారుణ్యము విశేషముగా నవతరింపవలసిన యవసరమప్పుడు వచ్చియుండెననియు, స్పష్టముగా దెలియఁగలదు. పఠానుపరిపాలకులు చండశాసనులై మతసహన మన్నమాటలేక విమతస్థుల నెందఱిని జంపించిన నంతకీర్తి సంపాదించుచుంటిమని గర్వించుచుండిరి. పరిపాలనముకట్టుదిట్టముగా లేకయుండుటచేతను బలవంతుఁడే సర్వాధికారము కలవాఁడైయుండుటచేతను, అందుచే ఢిల్లీపాలకులలో నెప్పటికప్పుడు మార్పులు కలుగుచుండుటచేతను, పట్టణములందును పల్లెలందును గల తురకప్రజలు తామే యధికారులుగా చరించుచు తోడి హిందువులను ద్వేషించుచు పలుతెఱంగుల హింసించుచుండుటయు, హిందువులు తమ్ము విగ్రహారాధనమును మానవలయునని తురకలు కఠినపద్ధతులను బూని గావించినకొలఁదిని పట్టుదలవహించి మ్లేచ్ఛులపై విద్వేషమును బెంచుకొని మఱింతయెక్కువగా తమపద్ధతుల కంటియుండుటయు, సంభవించుచుండెను. ఇట్లు దేశము పరస్పర కలహములతో నిండియుండఁగా నీదేశమును స్వాధీనముచేసికొనుటకు సమయమెప్పుడు దొరకునాయని యా [illegible] హిందూ [illegible] రాయినాయకులు తొంగితొంగి చూచుచుండిరి. ఆట్టికష్టకాలమున కబీరు జన్మించి దేశమునందలి విగ్రహారాధకుల మనస్సులను ఏకేశ్వరునివైపునకు మరల్చి హిందూమహమ్మదీయుల నైకమత్యమును నెలకొలుపవలయునని ప్రయత్నించెను.

కబీరు జీవచరిత్రమును గుఱించి పలువురు పలువిధములుగాఁ జెప్పుచుండుటచేత అందేది సత్యమో మనము సరిగా నిర్ధారణచేయఁజాలకున్నాము. పంజాబుదేశమునందు సిక్కుమతమును స్థాపించిన గురునానక మహాత్ముఁడు తనయేకేశ్వరోపాసకధర్మములను కబీరుదాసుని గలసికొని సంభాషించిన తరువాతనే బాగుగ పాదుకొలుపుకొనియున్నందున, ఆసిక్కుమతవేదమయిన యాదిగ్రంథమునందు కబీరుదాసుని చరిత్రమును ఆతని బోధనలును విపులముగాఁ జెప్పఁబడియున్నవి కాని మనము కబీరును గూర్చిన సంగతు లనేకములు మనము తెలిసికొనఁగలుగుచున్నాము. కబీరునే యొక మతకర్తనుగా నెంచి యాతని మత మవలంబించుచు కబీరుపంథులను పేరఁ బిలువఁబడుచున్నవారు మనదేశమునందు దాదాపు తొమ్మిదిలక్షలమంది యున్నారు. వారు తమమతకర్తను గూర్చి చెప్పెడి కథలును అనంతములుగానున్నవి. ఈయన్నిటినిబట్టియు కబీరు మహాభక్తాగ్రేసరుఁడయినట్లును గొప్ప మతసంస్కర్త యైనట్లును గ్రహింపవచ్చునుగాని యాతనిగుఱించి సరియైన చరిత్ర వ్రాయుటమాత్రము సాధ్యముకాదు.

కబీరు జన్మమునుగూర్చియు, అతని తల్లిదండ్రులనుగూర్చియు, కథ లనేకములు వాడుకలో నున్నవి. బాల్యమునందు కబీరు ఒక తురకసాలెవానియింట పెరిఁగినట్లుగా కబీరుపంథులు చెప్పుచున్నారు. సిక్కుమతగ్రంథమైన యాదిగ్రంథమందు కబీరు తురకసాలెవాఁడని నానక మహాత్ముఁడు బాబరుచక్రవర్తితోఁ జెప్పినట్లుగా వ్రాయఁబడియున్నది. కబీరుపాటలలోనె యొకదానిలో కబీరు తాను కొలఁదికాలములోనే నేతపని విడిచిపెట్టి కేవల హరినామస్మరణమునందే కాలము గడపఁబోవుచున్నానని చెప్పఁబడియున్నది. మఱియొకకీర్తనలో తాను పూర్వజన్మమందు బ్రాహ్మణుఁడైయుండి రామభజన చేయ మానుటచేత నీజన్మమందు తురకసాలెవాఁడుగా పుట్టినట్టు కబీరు చెప్పికొనియున్నాఁడు. అయినను, అతని తల్లి బ్రాహ్మణవితంతువై యుండినట్లును, ఆమె తనతండ్రితోఁగలసి తీర్థయాత్రలుసేయుచు నొకసన్యాసి నిలిచియుండిన దేవళమునకుఁబోఁగా నతఁడామెభక్తికి మెచ్చి 'నీవు పుత్త్రసంతానవతివగుఁగాక' అని దీవించినట్లును, అంతటి మహానుభావుని దీవన యూరకే పోదు గనుక, యామె కొలఁది దినములకే గర్భవతియై లోకనింద కోడి ప్రసవమైనవెనుక తనకుఁ గలిగిన బిడ్డను బైట పాఱవేయగా నొక తురకసాలెవాని భార్యకు దొరకి యామె యపుత్త్రవతి యగుటచేత సంతోషముతోఁ దీసికొనిపోయి యాశిశువునకు కబీరను నామమునిడి ప్రేమతో పెంచినట్లును ఒకకథ చెప్పుచున్నారు. ఈకథకంటె ఈక్రిందికథ యింకెంత విచిత్రకల్పనలతో నిండియున్నది. "సత్యలోకమునుండి దిగి యీలోకమున కబీరు అవతరించెను. కబీరు అవతరించిన తావున తామరపువ్వు వికసించుచుండెను. భ్రమరములు ఝంకారములు చేసిచే

సి విసుఁగుజెందియుండెను. రాయంచలును భరద్వాజములును మఱి యితరపక్షులును ఆకసమున తమబారినితో మెరగిపోవుచు ఆతటాకముచుట్టును ప్రదక్షిణముచేసి మఱిపోవుచుండెను. అకమలాకరము మధ్యమున కమలగర్భమున కబీరు అవతరించినవేళ సుమములును మెఱుములును బ్రహ్మాండమున నిండియుండెను. ‘నిరూ’ యను సాలెవానిని పెండ్లియాడి యతనితోఁగలసి యత్తవారింటికిఁ బోవుచుండఁగా ‘నిమా’ యనునామెకు దారిలో దాహమయ్యెను. ఆమె యాతటాకమును సమీపించి యచ్చటనున్న యాశిశువును జూచి మిక్కిలి ప్రీతిఁజెందినదయ్యెను. ఆశిశువునుజూచి యామె “ఎవ్వతియో బాలవితంతువుయొక్క యవమానమునకిది ప్రత్యక్ష దర్శనము కాఁబోలును!” అని హృదయములో తలపోసెను. ఆబిడ్డను తనయింటికిఁ దీసికొనిపోదమని ‘నిరూ’ సూచించెను గాని, యట్లుచేసినపక్షమున తనిపోని లోకాపవాదము పొలపుమన్న భయముతో నిమా ముందుగా కొంచెము వెనుకదీసెను. “కమలములవంటి నేత్రములుగలిగి అత్యంత సౌందర్యముతో నలరారుచున్న యీపిన్నవానిని గన్న తల్లి యెవ్వతె?” యని యమ్మలక్క లడుగకుందురాయని వారిర్వురును గొంతసేపు తమలోఁ దామ ఏమిసేయుటకును బాలుపోక శంకించిరిగాని తుదకు అభయములనన్నింటిని మూలద్రోసి యాశిశువుపైని కనికరము వహించిరి. వారిద్దఱును గృహము చేరినతోడనే స్త్రీలు మంగళగీతములుపాడి వారిని గృహప్రవేశము చేయించిరిగాని యాస్త్రీలు ఆశిశువు కంటఁబడిన తక్షణమే యేవేవో చెడ్డతలంపులు గలిగిఁ “ఈపిల్లవాఁడు దీనికి ఏలాగున కలిగినాడమ్మా!” యని తమలో తాము వితర్కించుకొనసాఁగిరి అది విని నిమా తాను అపిల్లవానిని కనకుండగనే సంపాదించితినని సమాధానము చెప్పఁగా, అప్పటినుండియు వారింక ప్రశ్నలిడుగ మానివైచిరి.”

ఈవిధముగా కబీరు జన్మవృత్తాంతము లనేకము లనేకవిధములుగా నున్నందున నందేదియు యథార్థమని మనము వక్కాణింపఁజాలము. అయినను కబీరు బాల్యమునందు మహమ్మదీయులయింట పెరిఁగినట్లుగా నన్నికథలును ఏకకంఠ్యముగా నుడువుచున్నందున మనము దానిని నిశ్చయముగా నమ్మవచ్చును. కబీరు బాల్యమున మహమ్మదీయుడైన సాలెవానియింట పెరుఁగుచున్నప్పుడే భక్తి యంకురించినట్లుగా చిహ్నములను గనబఱచుచుండెనని చెప్పుదురు. అతఁడు తనతోడివారైన హిందూబాలకులతోను మహమ్మదీయ బాలురతోను ఆటలాడుకొనునప్పుడు సైతము రామభక్తిని గనఁబఱిచి యాయుభయులకును కూడ కోపము కలిగించుచుండెనఁట! ఆటలయందును కబీరు రామ! రామ యనియు హరి! హరి! యనియు, కేకలు వేయుచుండఁగా జూచి వీఁడు పట్టి కాఫరు (నాస్తికుఁడు) అని తురకబాలకులు ఆతనిని నిందించుచుండిరనియు, దానికి క

కబీరు "ఎవఁడు చెడ్డపనిచేసిన, వాఁడే కాఫరు (నాస్తికుఁడు)" అని మాటలుపలుకుచుండెననియు, ఈవిధముగానే యొకసారి నుదుట బొట్టుపెట్టుకొని మెడలో జందెమువేసికొనఁగా తమయధికారమును ధిక్కరించుచున్నాఁడని బ్రాహ్మణబాలకులచే మహాగ్రహముతో నిందింపఁబడి యీక్రిందిచందమున వారికి సమాధాన మిచ్చెననియుఁ జెప్పుచున్నారు.:—

"ఇదిగో! వినుఁడు నామతము! నాజిహ్వయే విష్ణువు, నానేత్రములే నారాయణుఁడు, గోవిందుఁడు నాడెందమునం దధివసించియున్నాఁడు. మీరు మృతులయిన వెనుక మీరు కావించియుండిన కర్మములనుగురించి యేమి సమాధానము చెప్పఁగలరు? నేను సాలెవాఁడను. కనుక నేను జందెము వేసికొందును. మీరు యజ్ఞోపవీతమును ధరింతురు; గాయత్రి పఠింతురు! దినదినమును గీతాపారాయణము చేయుదురు. కాని నాహృదయమునందే గోవిందుఁడు వసియించియున్నాఁడు. నేను పశువును, మీరు పసులకాపరులు. పాపములోఁ బడకుండ మమ్ము గాపాడవలసిన విధి మీది! మీరు బ్రాహ్మణులు, నేను కాశికానగరపు సాలెవాఁడను. నాబుద్ధి వినుఁడు! నేను హరిని ధ్యానించుచుండఁగా, మీరు ఎవ్వఁడో యొక యైహికవిభునిగూర్చి ప్రతిదినమును వెదకాడుచుండెదరు!"

ఇట్లు కబీరు తన్ను నిందించువారికిఁ దగినట్లుగా సమాధానములు జెప్పుచు తన జ్ఞానాతిశయమును ప్రకటించుచువచ్చినను, తోడివారు మఱియేవిధమైనను మాఱుపలుకఁజాలక గురువులేనివాని మాట పాటింపరాదని యతనివాక్యములను త్రోసివేయఁ జొచ్చిరి. అప్పుడు కబీరు తనకు గురువులేఁడన్న లోపమునుగూడఁ దీసివేసికొని తరువాత ప్రజల కందఱకును తనమతమును బోధింపవలయునని నిశ్చయించెను. ఆకాలములో నుత్తరహిందూస్థానమున రామానందుఁడను భక్తవర్యుం డొక్కఁడు విఖ్యాతియశుఁడైయుండెను. కబీరు అతనిశిష్యుఁడుగఁ గావలయునని యెంచెను. కాని తురకవాడైన తన్ను రామానందుఁడు తనశిష్యవర్గములోఁ జేర్చుకొని యుపదేశ మొసఁగుట యసాధ్యమని కబీరు గ్రహించినవాఁడై యందులకొక యుపాయమును పన్నెను. రామానందమతస్థులకు రామమంత్రమే ప్రధానమైనదని యతఁడు గ్రహించి, యొక్కనాఁడు సాధారణముగా రామానందుఁడు తెల్లవాఱుజామున గంగాస్నానము నేఘట్టమునొద్ద చేయునో ఆఘట్టమునొద్దసోపానములమీఁద దారికడ్డముగా పడియుండెను. చీకటిలో మెల్లగా నడుగులుపెట్టుకొనుచు వచ్చుచుండిన రామానందునిపాదము క్రిందఁ బడియున్న కబీరుమీఁద పడఁగా రామానందుఁ డులికిపడి "అయ్యో నిష్కారణముగ నేజంతువుమీఁదనో పాదములువైచి బాధించితి" నని తలఁచి "రామ! రామా!" యని పలికెను. కబీరు రామానందుని వెంటఁబడి యప్పుడే గురూపదేశమైనది కాఁబట్టి తన్ను శిష్యునిగా గణియింపవలసినదని వేడుకొనెను. అతనిభక్తికి మెచ్చి రామానందుఁడు వెంటనే యతనిని తనఛాత్రునిగా నంగీకరించెను.

అంతటినుండియు కబీరు మతబోధన చేయుటయందును ఇతరులతో వాదించుటయందు-ను, తాను రామానందుని శిష్యుఁడనని చెప్పుకొనఁగను. ఇతఁడు రామానందుని శిష్యుఁడైనాఁడని విన్నంతనే తమబాలుఁడు పోయి పరమత మవలంబించి చెడిపోయినాఁ-డని మహమ్మదీయులును, మతాంతరునికి రామానందుఁ డెట్లు మంత్రోపదేశము చేసినాఁడ-ని హిందువులును, ఒక్కపెట్టున నిన్నాశపాటు జెందిరి. అప్పు డుభయమతస్థులును గూడి రామానందునికడ కరిగి విమతమునం దొక తురక 'చిన్నవానిని జేసుకొంటి రేమి?' యని యడిగిరి. ఆసంగతి తన కేమియుఁ దెలియనట్టు రామానందుఁడు పలికి, యా చిన్నవా-నిని తనకడకుఁ గొనరమ్మని కోరెను. కబీరు రామానందుని సన్నిధి కరిగిన తోడనే రామా-నందుఁడు దద్దముగా నొకతెర వేయించి తాను లోనఁ గూర్చుండి "ఎవ్వఁడవు నిన్ను నేను శిష్యునిగాఁ జేసికొంటిని" అని తెరలోనున్న కబీరు నడిగెను. "మహాత్మా! ఈలోకము-లో గురువులు తమ శిష్యులకుఁ జెవిలో నుపదేశించు మంత్రము లనేకములు. నాశిరమును గొట్టి మీరే యొకనాఁడు రామమంత్రమును దెలియఁ జేసితిరి." అని చెప్పినతోడనే రామానందుఁడు తనకు జరిగిన సంగతియంతయు జ్ఞప్తికిఁ దెచ్చుకొని, యడ్డముగా వేయిం-చిన తెరను త్రోసివేసి వెలుపలికి వచ్చి కబీరుని కౌఁగిలించుకొని నిస్సందేహముగా నీవు నా శిష్యుఁడవైతివి అని వక్కాణింపఁగా నచ్చటికి వచ్చినవారందఱును భంగపాటుతో నిం-డ్లకుఁ జనిరి. కబీరును తనయింటికేఁగి నేత నేసికొనుచుఁ దనయింటికి వచ్చిన యతిథు-లు, సజ్జనసంగతులు భక్తితాత్పర్యములతో నాదరించుచుండెను. ఎవ్వరైన సాధువు లరుదెంచు-నప్పుడు వారికి అదివఱకు వాడియుండిన కుండలలోఁ గాక క్రొత్తకుండలలో నన్నము వండించి పెట్టుచు, ఆసాధువులకు హిందువుల పద్ధతులతో నేలను శుభ్రపఱచి యుంచి యాసనములు వేయుచు, వారు భిక్ష సేయుంతవఱకు తాను భక్తితో నెదుట నిలువఁబడుచు నుండుటఁ జూచి యతని తల్లియైన నీమా మిక్కిలి యసహ్యతను బూని యతని చేష్ట-లన్నియు కులాచారవిరుద్ధములుగా నుండెనని నిందించుచుండెను.

కబీరు బాల్యమునుండియు నిట్లు సాధుసాంగత్యము చేసి, భక్తిజ్ఞానములు సంపా-దించెను. కబీరుయొక్క యుపదేశవాక్యము లనేకము లితనికి హిందూమతసాంప్రదాయ-ములు బాగుగఁ దెలిసియున్నట్లు ప్రబలసాక్ష్య మిచ్చుచున్నవి. ఈపరిజ్ఞానము చాలవ-ఱకతఁడు పండితులతో వాదములు సలిపి సంపాదించినదే. కబీరునకు గ్రంథపరిజ్ఞాన మం-తగా లేదని చెప్పవచ్చును. అయినను పరులతో మతవిషయకమైన చర్చలు జరపియుండుట-చేతను సూక్ష్మబుద్ధియు నపారభక్తియు విశేషచింతనయుఁ గలవాఁడగుటచేతను, అతని పరిజ్ఞాన మసమానమయ్యెను.

కబీరుదాసుని భక్తి కేవల మాత్మార్థ ధ్యానకీర్తనములందే గాక యీశ్వరప్రీతికరము లైన కార్యములు చేయుటయందును వెల్లడియగుచుండెను. అతఁడు తాను వస్త్రములు నేసి-

విక్రయింపఁగా వచ్చిన యల్పధనములోఁ గొంత తనతల్లి కిచ్చి, తక్కినది సాధుల నాదరించుటయందును దీనులఁ బోషించుటయందును వినియోగపఱుచుచుండెను. ఇతరు లెవ్వరు వనటఁ దూలుచున్నవా రని విన్నను వారికిఁ దోడ్పడి వారియార్తి హరింపఁజేయుటకై యీకాల మాకాల మను నియమములేక యాతఁ డింటినుండి యాకస్మికముగా మాయమై పోవుచుండును.

కబీరు యావజ్జీవమును బ్రహ్మచర్యమునే నడపెనా? లేక వివాహితుఁడయి సంసారముచేసి బిడ్డలఁ గని కుటుంబికుఁ డయ్యెనా? యను విషయము పలువురు పలువిధముల నభిప్రాయపడుచున్నారు. అతఁడు లోయి యను కాంతను వివాహమాడి కమాల్ అను తనయుని, కమాలి యను తనయను, గాంచెనని యనేకులు తలంచుచున్నారు. ఈతలంపునకుఁ గారణ మెట్టిదో, చాలకాలముక్రిందట బొంబాయినగరములోఁ బ్రచురింపబడిన కబీర్ కసౌతి యను హిందీగ్రంథమునందలి యీ క్రింది సంగతులను జదివినపక్షమున తేటతెల్లమగునని యొకానొకరు వ్రాయుచున్నారు:—

కబీరుదాసునకు ముప్పదివర్షముల ప్రాయము వచ్చెను. అతఁ డొకానొకదినమున గంగానదీతీరమున నడచి పోవుచు, తుదకొక్క వనఖండిస్థ వైరాగి వసియించు కుటీరమును సమీపించి యచ్చటికిఁ బోయి కూరుచుండెను. కొంతవడికి అతాపునకే యిర్వదియేండ్ల ప్రాయమున నున్న కన్నియ యొకర్తు వచ్చి, క్రొత్తగా వచ్చి విశ్రమించియున్న యాపురుషునిం జూచి "అయ్యా! మీ రెవ్వరు?" అని ప్రశ్నచేయఁగా, "నేను కబీరును' అని యతఁడు సమాధాన మిచ్చుటయు, నంతటితో నూరకుండక యాయువిద "మీమార్గమెయ్యది? మీశాఖ యేది?" యని మరల ప్రశ్నచేసెను. ఈ రెండు ప్రశ్నలకునుగూడ "నేను కబీరును" అనియే పైరీతిని ప్రత్యుత్తర మీయఁగా, నింతవఱకు సాధు లెందఱో యిచ్చటికి నరుదెంచిరి గాని వారిలో నిట్లు తమపేరును వర్ణమును శాఖనుగూర్చి చెప్పినవారొక్కరును లేరని యామె వచియించెను. "నేను చెప్పినదానిలో నసత్య మెద్దియు లేదు' అని కబీరు వక్కాణించెను. ఇట్లు చెప్పుటలో కబీరుయొక్క యుద్దేశము స్పష్టముగాఁ దెలియుచునే యున్నది. "కబీరు" అనఁగా మహాదేవుఁడైన పరమాత్ముఁ డని యర్థము. తనకేమియు వర్ణభేదము లేదనియు, మనుష్యులందఱును దేవుని సేవకులే యనియు సూచించి యీవిధముగా హిందూమహమ్మదీయుల నేకము చేయుటయే కబీరు తనసందేశముగాఁ జేసికొన్నట్లుగా నిట్టికథ లనేకములు స్పష్టపఱుచుచున్నవి. ఇంతలో నచ్చటికి మఱికొందఱు సాధు లేగుదెంచిరి. తోడనే యాకన్యక పర్ణకుటీరములోనికింజని కుండతో పాలు తీసుకొనివచ్చి యైదుభాగములుగాఁ జేసి యందైదు భాగములు

క్రొత్తగా వచ్చిన వైరాగులకును ఒకపాలు కబీరునకు నిచ్చి, తననిమిత్త మొకపాలుంచుకొనియెను. తనకిచ్చినభాగమును కబీరు త్రాగివేయక క్రిందఁబెట్టి యుంచెను. తక్కిన వైరాగులు తమతమపాలను త్రాగివైచిరి. కబీరు త్రాగకుండుటకు వారు కారణ మరయసాగిరి. గంగానది యావలియొడ్డునుండి యొకసాధువు వచ్చుచున్నాఁ డనియు, తనపాలు అతనికొఱకుంచితి ననియు కబీరు చెప్పఁగా 'స్వామీ! ఆసాధువు వచ్చినయెడల నాయొద్ద వలయునన్ని యున్నవి. మీపాలు మీరు గ్రహింపుఁడు' అని యాబాలిక వేఁడుకొనియెను. "హరినామమే నా కాహారము' అని కబీరు పలికెను. ఇంతలో నవ్వలియొడ్డునుండి యొక సాధు వచ్చుటకై విచ్చేయఁగా, కబీరు తనవంతుపాల నాతని కిచ్చివేసెను. అట్టి నిర్జనప్రదేశమున నొంటరిగా నుండుటకు హేతువేమనియు, తల్లిదండ్రు లెవ్వర లనియు, నంత నాబాలికను సాధువు లడుగ సాగిరి. అందుల కామె తనతల్లిదండ్రులు జీవించి యుండ లేదనియు, తనొక్క సాధువు పెంచి పెద్దఁ జేసెననియు, అంతకు ముందు కొంత కాలముననే యాతఁడును లోకాంతరగతుఁడైనందున తానొక్కతియే యుండుట తటస్థించినదనియుఁ దెలియఁ జెప్పెను. అంతటితో వారు తృప్తి నొందక తక్కిన యుదంత మంతయు వినఁ గుతూహలము కలవారై 'అమ్మా! ఆసాధుపురుషుఁ డెవ్వఁడు? అతఁడు నిన్నుఁ బెంచు టెట్లు కలిగె.' నని మఱల నడుగుటయు, నామె యిట్లని యుత్తర మొసంగెను. "ఆసాధుపురుషుఁ డొకవనమునుండి వైరాగి. అతఁ డొక్క యావుపాలు మాత్రమే త్రాగి జీవించు వాఁడు. నాపూర్వ చరిత్రమును గూర్చి యితరు లాతని నడుగు నప్పు డిట్లు చెప్పుచుండెను. 'నేనొక్కనాఁడు గంగాతరంగిణిలో స్నానము చేయుచుండఁగా నొకతట్ట కొట్టుకొనివచ్చి నాకుఁ దగిలెను. అది పైకిఁ దీసి చూచినతోడనే యాఁడుశిశువు కనఁబడెను. అప్పు డాశిశువును కుటీరమునకుఁ గొనివచ్చి యావుపాలతో ముంచినవత్తితోఁ బెంచితిని. మొదట నాకు తట్టలో దొరకినప్పు డీబిడ్డ దుప్పటిలోఁ గప్పి యుంపఁబడియుండుటచేత 'లోయి' (దుప్పటి)యను పేరు పెట్టితిని. ఈవిధముగా నన్నుఁ గూర్చి యాస్వామి సాధులతోఁ జెప్పుచుండఁగా నేను వినియుంటిని.'

కబీరు యొక్క సాధుస్వభావమును గురులక్షణమును గాంచి లోయి యాతని నుద్దేశించి "స్వామీ! నాకు చిత్తశాంతిని ప్రసాదింపఁగల సదుపదేశము చేయుఁ,, డని పలికెను. ఆబాలిక భక్తివిశ్వాసములు దీపింప, చిత్తశుద్ధి యొసంగ, నిట్లు వేఁడికొన్నందులకు కబీరు సంతోషతరంగితస్వాంతుఁడై "నిత్యమును సత్యనామమును స్మరియింపుము, సాధుసేవ గావించుకొనుచుఁ గాలము గడపుము,, అని యుపదేశించుటయు, లోయి యా వాక్యములఁ దలఁ దాల్చి, యైహికవిషయచింతనమును దెగనాడి, వారణాసికిఁ బోయి, సాధుసేవ నొనరించుచుఁ బ్రొద్దులు పుచ్చ సాఁగెను. ఇట్లు కబీరు తనలో

నీకాంతను కాశికిఁ గొనివచ్చుట చూచి యతఁడామెను చేపట్టినట్టుగా భ్రమపడి నిమాయాతనిం గని యిట్లనియె, "బిడ్డా! లోయితోఁ గాపురము చేయక వేఱుగా నుంటివి కదా? ఇంక నీ వామెను పెండ్లియాడిన ప్రయోజనమేమి?" ఇట్లే పలువురు కబీరు వివాహితుఁ డైనట్లు భావించి లేని పోని కథ లల్లఁ జొచ్చిరి.

లోయియును కబీరును భార్యాభర్తృసంబంధము కలవారని లోకము భ్రమపడుటకు మఱియొక కారణము కూడ తోడయ్యెను. ఒకనాఁడు కబీరు వేఱొక భక్తునితోఁ గలసి గంగానదీతీరమున నడచుచుండఁగా, నదిలోఁ గొట్టుకొని పోవుచుండిన యొకశిశువు కానవచ్చెనఁట! ఆసహచరుని కోరికపై కబీరు ప్రవాహములోఁ బడి కొట్టుకొని పోవు శిశువును పైకిఁ దీసి, యాశిశువు చెవిలో భగవన్నామము స్మరియించి బ్రతికించి, తోడ గొనివచ్చి లోయి కిచ్చి పెంపవలసిన దని చెప్పఁగా నామె మక్కువతో నాశిశువును పెంచి పెద్దవానిం జేసె నఁట! ఆశిశువు సౌందర్యాతిశయముఁ జూచి నప్పుడే కబీరు ఆబిడ్డనికిఁ "కమాల్" (పరిపూర్ణార్థకపదము) అను పేరుపెట్టెనఁట! ఇది చూచి కొందఱు కబీరు మృతు లయిన వారిని బ్రతికింపఁగల మహాత్ముఁ డని నమ్మసాగిరి. మఱి కొందఱు ఆబిడ్డఁడు కబీరునకు లోయి వలనఁ గలిగినవాఁడే యని యూహించిరి.

ఇట్లుండ మఱియొక్కనాఁడు కబీరు ఒకరి గృహములో నుండఁగా వారి యాఁడుశిశు వొక్కతె మరణింపఁ దటస్థించెనఁట! మరణించిన బిడ్డను గని తల్లిదండ్రు లాక్రందనము సేయుచుండఁ గాంచి కబీరు తన కామృతశిశువు నీయవలసిన దని యడుగుటయు, అంతకు మున్ను తన దివ్యమంత్రప్రభావముచేత కమాలును బ్రదికించిన మహానుభావుఁ డని విని యున్నది కావున శిశువుతల్లి యందుల కంగీకరించె నఁట! అనంతరము కబీరు దివ్యశబ్దపునశ్చరణము చేసి యా శిశువును పునరుజ్జీవింపఁ జేసి, కమాలి యను నామ మొసంగి యీయాఁడుపిల్లను గూడఁ బెంపవలసిన దని లోయి కిచ్చివేసెనఁట. ఇట్లు కబీరుచే బ్రతికింపఁ బడిన పిల్ల లిద్దఱును వయసు వచ్చిన తరువాత కబీరును తాము, "స్వామీ! స్వామీ!" యనిపిలుచుచు నాతని గృహమునందే యుండి వస్త్రములు నేయుటలో నాతనికిఁ దోడుపడుచుండి నట్లు తెలియవచ్చుచున్నది. అందుచే వీరిద్దఱును కబీరుదాసునకుఁ గలిగిన బిడ్డలే యని లోకులు తలంప సాగిరి.

కమాలి యొక్క తరువాతి చరిత్ర! సంగ్రహముగా నిట తెలుపవలసియున్నది. ఆమె యౌవనవతియై యిరువదియేండ్ల ప్రాయము వచ్చియున్నప్పుడు ఒక్కనాఁడు కబీరుదాసు గృహము చెంత నున్న నూతిలో నీళ్లు తోడుకొనుచుండగా, మార్గాయాసముచే గడు డస్సి పిపాసాపీడితుఁ డైన యొక బ్రాహ్మణపండితుఁ డాదారిని బోవుచు, నీరువట్టు

దీర్చుకోవలయునని యాకాంతచెంతకేతెంచి యిన్ని నీళ్లుచేది పోయు మని యడిగెను. ఆపండితుఁడు కమాలి కృపాయత్తచిత్తముతోఁ దోడి యిచ్చిన చల్లని జలముల మనసారఁ ద్రావి, యనంతరము "కాంతా! నీ వెవ్వరి కుమార్తెవో గాని ధన్యురాలవు సుమీ!" యని యామె యుదంతమును గొంత తెలియఁగోరెను. కాని, యామె తురక సాలెవాని తనయ యని తెలిపినతోడనే గుండెలో రాయిపడి "నాకొంప దీసి నాకులముఁ జెఱచి నన్ను వర్ణభ్రష్టుని జేసితివి కదే!" యని యెంతయు వాపోవఁ దొడంగెను. ఆ పురుషుఁ డిట్లు క్రోధావేశపరవశుఁడై దురంతచింతాక్రాంతుఁ డగుటకుఁ గారణ మేమి కానోపునో యూహింప నేరక, కమాలి యాతనిని వచ్చి కబీరుతో సంభాషించి పొమ్మని కోరుటయు నీమాటలువిని కబీరు ఈక్రింది చందమున సమాధానమిచ్చెను:—

"ఓ బ్రాహ్మణా! జలపానము సేయుటకు ముందీయంశములను గుఱించి విచారించునది. మైలపడుట యన నేమి? చేఁపలు, తాబేళ్లు రక్తము, ఉప్పు, చెత్త, చెదారము, మృతకళేబరములు,—ఇవన్నియు నీటఁ దడసియుండును. కాలవశమున లక్షోపలక్షజనులు మృతులగుచున్నారు. నీవు ముందునకు పెట్టి నట్టి యడుగడుగునకును ఎన్నఁడో మృతుఁ డయిన యెవ్వాని దేహము మీఁద నుండియో త్రొక్కికొనియే పోవుచున్నావు. అట్టి మట్టితోఁ జేయఁబడిన పాత్రములతోనే కదా నీవు నిత్యమును నీరు త్రాగుచున్నది? మైల కలుగు నన్న భీతితో భోజనవేళ కట్టువస్త్రములఁ దీసివైచి సాలెవానిచే నేయఁబడిన దోవతుల మేనెల్లఁ గప్పుకొనుచున్నావే కాని, మలినపదార్థముల మీఁదినుండి యెగిరివచ్చి యీఁగలు నీవు భుజింపఁబోవు నాహారము మీఁద వ్రాలుచుండుటను గనఁజాలకున్నావు. దీనిని నీ వెట్లు లడ్డపెట్టగలవు చెపుమా? అట్టి వట్టి భ్రమలను మదినుండి పోఁదోలి వేదములఁబఠించి, రాముని శరణు జొచ్చుమా!" ఈవాక్యములను విన్న యాబ్రాహ్మణుఁడు తనలో నా తురకసాలెవాఁడు నిశ్చయముగా మహాత్ముఁడై యుండవలయు నని తలంచి, యింకను తనకు జ్ఞానబోధన చేయు మని భక్తిపూర్వకముగా వేఁడుకొనియెను. కబీరు అందులకు సమ్మతించి యీశ్వరగుణగణములను గూర్చియు, ఏకేశ్వరారాధనావశ్యకతను గూర్చియు, తనయభిప్రాయములఁ దెలుపుచు నుపదేశించెను. ఆయుపదేశము చేసినతోడనే యందలి సత్యమును దెలిసి యాబ్రాహ్మణ పండితుఁడు కబీరుమహాశయుఁ డుపదేశించిన సద్ధర్మముల నన్నిటిని స్వీకరించెను. స్వీకరించిన సద్ధర్మము స్వాచరణమునందు సువ్యక్త మయినప్పుడే శోభఁజెందు యుపయుక్త మగునుకదా! ఆబ్రాహ్మణుని యంగీకారమును బడసి, కబీరు తనపెంపుడు కూఁతురైన కమాలి నిచ్చి యాతనికి వివాహము చేసెను. ఈవిధముగా కబీరు సత్యబోధనను విజయము గాంచుచు, బహుదేవతారాధనపరులై విగ్రహపూజానిరతులై

జాతివిద్వేషపూరితులై యుండినవారిని, ఏకదైవతోపాసకులుగాను సమదర్శనులుగాను క్రమముగా మార్పు గలుగుచుండెను.

సామాన్యుఁడును, గ్రంథపరిజ్ఞాన మంతగా లేని వాఁడును, అయిన యాతని బోధనలు ఇట్టి మహత్తరశక్తి కల వగుట కేమి రహస్యమున్నది? వేదవిదు లయిన పండితోత్తములు, శాస్త్రపరిచితి గల విజ్ఞులు, కబీరుతో వాదింపజాల కుండిరి. ఆతని సత్యబోధనప్రభావము నెదుట నన్యుల ప్రజ్ఞలు తమతమ తలలు వాంచుచుండెడివి. దీనికిఁ గారణ మేమి? సకల సత్యములకును మూలమైనవాఁడును, అలఘుదుర్జ్ఞానతిమిరములకు నెల్ల నమోఘప్రభాకరుఁడును అయినవిశ్వేశుని కబీరు తన హృదయమునఁ గనఁ జాలెను. అట్టి సర్వశక్తిమయుని ప్రాపు నమ్మినప్పుడు అట్టివానికి మఱికొఱంత యుండును? భక్తిప్రభావముచే తనకట్టి యానందము, అట్టి మహత్తరశక్తి, కలిగినవని గ్రహించినవాఁ డగుట చేతనే, తోడి మానవుల నీశ్వరసాక్షాత్కారము నుండి మఱుఁగుపఱుచుచుండిన బహుదేవతారాధనము వ్యర్థకర్మాచరణపరత్వము, ద్వేషము, మాలిన్యము, మున్నగు వాని నన్నింటిని తీవ్రతరముగ ఖండించుచు దేశదేశములు గ్రామగ్రామములు తిరిగి జనసామాన్యము ఏకదైవతోపాసనావశ్యకతను గ్రహించి, యసన్మార్గమును వీడు నట్లు చేయవలయు నని యతఁడు బోధించుచుండెను. కబీరు బోధనపద్ధతి మిక్కిలి యద్భుతమైనది. అతఁడు విగ్రహార్చనమును ఖండించు నట్టియు, వ్యర్థకర్మమున నసహ్యతను వ్యక్తముచేయు నట్టియు, బ్రహ్మజ్ఞానమును బోధించునట్టియు, నీతివర్తనమును గఱపు నట్టియు, స్వకీయములయిన భగవత్కీర్తనలను పాడుకొనుచు, వీథుల వెంబడి నూరూరు తిరిగి పోవుచుండును. జనులు గుంపులుగా వచ్చి యాతని హితబోధ యాలించుచుందురు. జనులు సాధారణముగా నజ్ఞానవిమోహితులై ఐహికజీవనమే శాశ్వతమనియు, ఐహికసౌఖ్యములను పొంద ప్రయత్నించుటే మనుగడ యొక్క సార్థకత యనియు, నమ్మి నిత్యానిత్యవిచారము లేక వర్తించుచుందురు. అట్టి వా రందఱును నిత్యసౌఖ్యప్రద మైన భగవత్సేవను చేయ మఱవవల దని యాతఁ డుపదేశించెను. చాలమంది యీశ్వరతత్త్వమును గ్రహింప నేరక బహుదేవతలను నమ్మి ఱాలను అప్పలను గొలిచి వెట్టిసంతుష్టి నందుచు, నీశ్వరారాధనము వలనఁ బొందవలసిన యానందమును బలమును బొంద నేరక దుర్గతుల పాలగుచున్నారు. అట్టి పామరజనాళి కెల్ల దేవుఁ డొక్కఁడే సమస్తజనసంసేవ్యుఁడం డనియు, భగవద్భక్తికి పరమశత్రువు లయిన స్వార్థపరత్వము, దురహంకారము, ధనకాంక్ష, విషయలోలత, మున్నగువానిని పరిత్యజింప వలయు ననియు, ఒక్క పరమాత్ముని గొల్వఁగాఁ గలుగు నానందముతో నీలోకములో సంపన్నత్వాదులచేఁ గలుగు తాత్కాలిక సౌఖ్యము లెవ్వియును

తుల్యము కానేరవనియు, నాతఁడు తెలిపెను. ఒక్కఁడే భగవంతుఁడను పరిజ్ఞానమును విడనాడి తమలో తాము మతభేదములను వర్ణభేదములను కల్పించుకొనుచుఁ జెడువారి దుస్థితిని జూచి యాతఁడు నిజముగా శోకించుచుండును. మతభేదముల వలనను, జాతివిద్వేషముల వలనను, కలిగెన మహాయుద్ధముల వలనను, కలుగుచున్న బ్రజల విరోధముల వలనను, మానవసంఘ మేరీతి దుర్గతులఁబడుచుండెనో యాతఁడు బాగుగ గ్రహించినవాఁడగుటచే సంఘాభివృద్ధి కవి వేరుపురుగు లని పలుమా ఱుద్ఘోషింప సాగెను. ఈశ్వరుని సమీపించునట్టి యధికారమునకు వారు వీ రను నంతరము లేక యెల్లవారును సములే యనియు, వివేకమును విడనాడి ప్రతిపూర్వాచారమునకును దాసులై యుండుటయు మతసిద్ధాంతములను గూర్చి కేవలవాదాపేక్షతోఁ దగవు లాడుచుండుటయు, నెవ్వారికిం దగ దనియు, భక్తివిశ్వాసముల చేతనే గాని కేవలకర్మాచరణముచే ముక్తి చేకూరనేర దనియు, సంపూర్ణభగవద్భక్తి సమస్తభయములను భంజింపఁజాలు ననియు, నాతఁ డుపదేశించిన యుపదేశములు మిక్కిలి యుత్తమములై యున్నవి.

కబీరు జనుల కుపదేశించు పద్ధతిని బాగుగఁ దెలుపుటకై యొకటి రెండు కథలను దెలిపెదను. హిందువులు కొన్ని నదులను పవిత్రముగా నెంచి యచ్చటికిఁ దీర్థయాత్రలు సేయుచు, నందు స్నాన మాచరించినందుననే తమ కావించిన సమస్తదోషములను హరించు నని విశ్వసింతురు. అట్టి వారి కడకుఁ బోయి కబీరు సత్యజ్ఞానమును గీతములతోఁ దెలుపుచుండెను. ఒకనాఁడు బ్రాహ్మణులు కొందఱు చేరి గంగాజలము పాపులను పవిత్రులను గాఁ జేయ సమర్థము కల దని యుగ్గడించుచుండిరి. ఆమాటలు విని కబీరు తోడనె తన కమండలువు నిండ గంగాజలమును దీసికొని వచ్చి వారి నా నీరు త్రాగవలసినదని యడిగెను. అధమజాతివాని చేతి నీరు త్రాగుట యన్న తోడనే మిక్కిలి యేవపడి వారంగల కంగీకరింపరైరి. అంత కబీరు వారినవలోకించి "అయ్యా! గంగానదీజలము నా పాత్రమునే పరిశుద్ధము చేయఁజాల నప్పుడు అది నాపాపముల నెల్ల హరించి వేయఁగల దని యెట్లు నమ్ముదును?" అని బుద్ధివచ్చునట్లు పలికెనట. ఈ సందర్భమున నాతని యుపదేశములు కొన్ని యుదాహరింపవలసి యున్నది.

"కబీరు చెప్పుచున్నాఁడు.—నా కేమియుఁ దెలియకున్నది? తీర్థమెక్కడ? హరిదాసుఁ డెక్కడ?"

"జలము సమీపముననే యున్నది. కాని యందులోనే నడచిపోవుచు పశువులు దానిని త్రాగకున్నవి. తఱుచు హరినామస్మరణము సేయుచున్న పక్షమున జలము పొంగి రాఁగలదు. ఆజలమే పరిశుద్ధమైనది. ఇది కబీరు వాక్యము."

"వాని హృదయములో కల్మష మున్నది. తీర్థము నొద్ద స్నాన మాచరించినను వాఁడు మోక్షమును పొందఁడు. జనులకు నమ్మక మున్నంతే మాత్రము చేత నేమియు జరుగదు. రాముఁడు తెలివి తక్కువ వాఁడు కాఁడు."

ఆకాలములో విగ్రహారాధనము ప్రబలమై జనులను సన్యస్తవివేకులనుగఁ జేసిన దనియు, అట్టి నీచస్థితిలో నున్న వారి నుద్ధరింపవలయు నని కబీరు గట్టిగా సమకట్టె ననియు నింతకు ముందే సూచింపఁబడినది.

ధర్మదాసను వైశ్యుఁ డొకఁ డుండెను. అతఁడు మిగుల భాగ్యవంతుఁడై నిత్య మును సాలిగ్రామపూజ గావించుచు, భాగవతులను వైరాగులను సత్కరించుచు, భగవద్గీతాపారాయణ మొనర్చుచు శ్రీకృష్ణుని గొనియాడుచు, ఆత్మశాంతికొఱకై పుణ్యక్షేత్ర ముల నెల్ల మెట్టుచుండెను. అతని కొక్కనాఁడు కాశికానగరమునందు కబీరుదాసు దర్శనము ప్రాపించెను. ధర్మదాసుని యుదంతము విన్నతోడనే కబీరు విగ్రహార్చనమును విడనాడి మనస్సు నేకేశ్వరుని వైపునకు మరల్పనంతకాల మాతనికి నిక్కమైన శాంతి చేకూర నేర దని బోధించెను. తర్వాతఁ గొంతకాలమునకు ధర్మదాసు బృందావనమునందు కబీరు కంటఁబడఁగా, నాతఁ డింకను విగ్రహపూజను బరిత్యజింపలే దని విన్నతోడనే, ఖండితముగా నతనితో నదికూడ దని వక్కాణించి యాతఁడు పూజించు సాలిగ్రామ మును గైకొని కబీరు దానిని గంగలోఁ బారవైచెను. మఱికొంతకాలమునకు మఱల వారిరువురును గలసికొన్నప్పుడు సైతము అతఁ డింకను ఱాలఁ గొలుచుట మానలే దని తెలిసికొని కబీరు ఇట్లనియె;—"ఓయీ! ధర్మదాసా! నీవు నీవ్యాపారమునం దుపయోగించు తూనికఱాళ్లు వేనితోఁ జేయఁబడినవో వానితోనే చేయఁబడిన విగ్రహములను నీ వెట్లు దైవతములని పూజింప నేర్తువో యాశ్చర్యకరముగా నున్నది." ఈవాక్యములు ధర్మదాసుని మనమ్మున జక్కఁగా నాటెను. అప్పటినుండి ధర్మదాసు ధర్మపత్నీ సమేతముగా కబీరుమార్గము నవలంబించి మించెను. మతమహావృక్షమునకు వేరుపురుగనందగిన విగ్రహారాధనమును రూపుమాపి యెట్లయినను ప్రజల జ్ఞాననేత్రము విప్పవలయు నని కబీరు మిక్కిలి యభిలషించుచు, అందుకొఱకై నిరంతరము విచారించు స్వభావముకలవాడయినట్లు ఇట్టి కథలే గాక యాతనిచే నుపదేశింపఁబడిన ధర్మములును స్పష్టముగాఁ దెలుపుచున్నవి. "ఓసాధులారా! లోకము పిచ్చిమార్గమునఁ బడిపోయినది. నేను సత్య మును చెప్పితి నేని లోకులునన్నుచంపుటకై నామీఁద పడవత్తురు. వారు కేవలాసత్యమునె విశ్వసింతురు. క్రమము దప్పక నిత్యమును ప్రాతఃకాలమున స్నానములుచేయు భక్తిప్రపత్తిసంపన్నులను నే నొదఱినో చూచియున్నాను! కాని వారు భగవంతుని వర్జించి

తాలను భజింతురు. వారికి నిజముగా వివేకములేదు. వారు రాగిబొమ్మలను రాళ్ళను పూజింప [illegible]. తాము తీర్థయాత్రలు చేయుచుంటి మని సంతుష్టిమై గర్వించు చున్నారు. [illegible] ధరించి, నామములు టోపీలు చక్రాంకితములు పూని [illegible] కీర్తించుచు కొలము గడపు చున్నారు; వారు భగవంతుని [illegible] తాలను పూజించినందువలన నొక్కనికి ఈశ్వరసాక్షాత్కార మయ్యెడు పక్షమున, నేను మహాపర్వతము నొకదానిని పూజించెదను. ఈతాతి విగ్రహములకంటె ఇంకను మనుష్యులు బియ్యము విసురుకొను తిరుగలిరాళ్లు నయము. తమ పాదముల క్రింద నైతము పడి కన్నులనీరు గారునట్లుగా నే నెంత ప్రార్థించినను హిందువులు విగ్రహారాధనమును విడువకున్నారు; మహమ్మదీయులు తలబిరుసుదనముచేత తమమూర్ఖతను చూపు చున్నారు.'' ఇట్టి యుపదేశవాక్యములు కబీరు చెప్పినవి యనేకములు కలవు.

ఈవిధముగా కబీరు ధీరచిత్తుఁడై హిందూమతలోపములను మహమ్మదీయుల దుర్వర్తనములను బహిరంగముగా ఖండించుచుండుటచేత ఆయుభయులందును గూడ నతనికి శత్రువులనేకులు బయలుదేరిరి. తురకలలో గొందఱు ప్రముఖులు బయల్వెడలి కబీరు భగవంతుని కున్న లక్షణములు తానే కలిగి యున్నట్లుగా చాటుచున్నాఁడనియు అందుచేత మహమ్మదీయ మతధర్మము ననుసరించి యాఁతఁడు తప్పక వధ్యుఁ డనియు అప్పుడు చక్రవర్తిగా నున్న సికందరులోడీ కడకుఁ బోయి మొఱ్ఱపెట్టుకొనిరి. అప్పుడు కబీరును పట్టి బంధించి తనయెదుటికిఁ గొనిరావలసిన దని చక్రవర్తి యుత్తరు వీయగా భటులు పోయి కబీరును గలసికొని సంగతి తెలిపి సాయంకాలమునకు గాని యాతని నొప్పించి చక్రవర్తి సన్నిధికి దీసికొని రాజాలరైరి. ఉదయముననే రావలసినదని యుత్తరు వీయఁగా సాయంకాలము వఱకును తడసిరాకుండుటకు హేతు వేమని చక్రవర్తి కబీరు నడిగెను. ఇంతలో కబీరు చక్రవర్తికి మొక్కకుండుటనుజూచి యచ్చటి యాచార్యుఁ డొక్కఁడు 'ఓరీ కాఫరా ! (నాస్తికుఁడా) చక్రవర్తికి నీ వేల మ్రొక్కకున్నావు ?' అని యడుగ, 'అన్యులబాధల నెవ్వాఁడు గ్రహించునో వాఁడే పీరు ; అట్లు చేయఁజాలని వారే కాఫరులు' అని సమాధానమిచ్చి, చక్రవర్తిని జూచి, తాను వచ్చుచుండఁగా నొకవిచిత్రము కనఁబడి తనదృష్టి నరికట్టినందున తానంతవఱకు నాలస్యము చేయవలసి వచ్చె నని యుత్తర మిచ్చెను. చక్రవర్తియాజ్ఞల నైతె ముల్లంఘింపఁ దగినంతటిది యేమి కనఁబడిన దని మరల చక్రవర్తి యడుగ, సూదిబెజ్జముకంటె సన్నముగా నున్న యొక వీథిలో నుండి గుంపుగుంపులుగా నొంటెలు పోవుచుండఁగాఁ జూచితి నని కబీరు

చెప్పెను. అది కేవల మసత్య మని చక్రవర్తి యనెను. అంత కబీరు 'ప్రభువరా! ఆకసమునకును భూమికిని మధ్యమం దెంతదూర మున్నదో కొంచె మాలోచింపుము. సూర్యచంద్రులమధ్యమం దున్న స్థలములో నసంఖ్యము లయిన యేనుంగులును లొట్టియలును ఉండవచ్చును ; అవన్నియుం గూడ సూదిబెజ్జముకంటె సన్నముగా నున్న కంటిపాపగుండం జూడవచ్చును గదా!' యని ప్రత్యుత్తర మీయంగా, దీనితో సంతుష్టిపొంది చక్రవర్తి యాతనిజ్ఞానము గ్రహించి, కబీరును విడిచిపెట్టెను. చక్రవర్తి యిట్లు ఆతనిని విడిచిపెట్టినందులకుం దమలో దాము గొణుగుకొని సాగిరి. తరువాత, బ్రాహ్మణులును కబీరు అనుమానాస్పదమైన వర్తనముగల స్త్రీతో వర్తించుచున్నాం డనియు, రామదాసను మాదిగవానిని భక్తుని జేసి యాతనితోం గలసి తిరుగుచున్నాం డనియు నిందింప జొచ్చిరి. కబీరు తనమతధర్మములను చక్రవర్తికిం దెలిపినట్లును, చక్రవర్తి ప్రజలపక్షము నే వహించి కడకు కబీరును చంపివేయవలసిన దని యుత్తరు విచ్చినట్లును, కబీరు తనమహిమ చేత పలుమారు మృతిని దప్పించుకొని చెక్కుచెదరక పైకి వచ్చినట్లును, అంత చక్రవర్తి యాతనిమహత్త్వమును గ్రహించి తానుచేసిన యకార్యములకై తన కేమి శిక్ష విధించెదవని యడుగంగా కబీరు సజ్జనుం డెప్పుడును తనపాదముల క్రింద ముండ్లను జల్లువారి పదములక్రింద పూలు చల్లవలయు నన్న సద్ధర్మమును దెలిపినట్లును, ఒకకథ చెప్పుదురు, కాని యది యెంతవఱకు విశ్వసింపందగినదో మనము చెప్పంజాలము.

కబీరు మృతిం జెందులోపలం జేసిన మహత్తరకార్యము లెన్నో చెప్పబడుచున్నవి. కాని యవి సత్యము లయినను కాకపోయినను అతని సత్స్వభావమును భక్తివైరాగ్యములను ఆయన్నింటివలనను సువ్యక్త మగుచున్న దన్న యంశ మొక్కటి మనకుం జాలును. అవసానదశ ప్రాపించునాటికి కబీరు మిక్కిలి వార్ధక్యములో నుండెను. అతండు కాశిలో నివసించుట మాని కడదినములను మాఘూరుపట్టణమునందుం గడపెను. తొల్లింటివలె కర్ణరసాయనముగ మధురగానముతో భగవత్కీర్తనములు పాడుచు చితారుపై వాయించుటకు వీలులేకుండునట్లుగా చేతులు పడిపోయెను. కాశీనగరమునందు తన్నుం జూడవచ్చి తనతో భగవద్ధ్యానము సేయు భక్తులును మిత్రులును నేండు తమమోము చూపకుండిరి. ఇట్లు తా నొంటరిగా కాలము గడపుచున్నను కబీరు తన కేకాంతవాసము కలిగిన దని యెన్నండును దుఃఖింప లేదు. తనప్రాణనాథుం డైన పరమేశ్వరుండే తన చెంత నుండంగా మఱెవ్వరు లేకున్న నేమి యని యతండు నిశ్చింతతో పరమసంతుష్టితో నుండెను.

ఈచందమున మాఘూర్ పురమునందు కబీరు నిశ్చింతతోఁ దనయంత్యదినములను గడుపుచున్నను, ఆతని శిష్యవర్గము మాత్ర మతఁ డచ్చట నుండుట సమ్మతింపలేదు. దీని కొకకారణము కలదు. కాశిం జచ్చినవా రందఱును అనాయాసముగా కైవల్య మందుదు రనియు, మాఘూరులో మరణించినవా రందఱును మఱల నీలోకమునందే గార్దభజన్మము నెత్తవలసినవా రగుదు రనియు, అందుచేత పుణ్యక్షేత్రమైన కాశియందే మరణించువఱకును నిలిచియుండుట మంచి దనియు కబీరునకు వారు హితబోధ చేసిరి. ఈవాక్యములను విన్నతోడనే వారివిశ్వాసరాహిత్యమునకు కబీరు నిందించి శివనివాసమైన కాశీనగరమందుఁ గాక వేఱొక చోట తనభక్తుఁ డొక్కఁడు ప్రాణములు విడువ నిచ్ఛగించుచుండఁగా వానికి విముక్తి నియ్య జాలనంత యత్యల్పముగా నున్నదా యేమి శ్రీరామమహిమ? యని వక్కాణించెను.

గీ॥ క్షితిని మాఘూ రదేమి? కాశిక యదేమి?
చావలేదు మాఘూరునఁ జచ్చునతఁడు
తనర రాముండు వానిచిత్తమున నిలువ;
నిట్టు లెంచక పెఱచోట నెవఁడు జచ్చు
వాఁడు రాముని నపకీర్తి పాలు సేయు.

అని కబీరుదాసుఁడు ఆట్టి యవసరమందే యొక్క కీర్తనము చేసెను. దీనింబట్టి భగవంతుఁడు సర్వవ్యాపియై సమదర్శియై యున్నాఁడన్న విశ్వాసము స్వానుభవసిద్ధమై కబీరుని హృదయమునం దెంతదిటవుగా నెలకొనియున్నదో స్పష్టమగుటయేగాక, దుర్భరమైన వార్ధకబాధ యతిశయించి, లోకములోని యేవిషయములును చిత్తశాంతిని కలిగింపనేరక, యెట్టి మిత్రబాంధవులును అంతరంగమున నూఱట కలిగింపఁజాలక, యున్న యవసరమున నాతని కంతటి మహత్తరశాంతి నిలిచియుండుటకు రహస్య మేదిగా నుండెనో కూడ వెల్లడి యగుచున్నది.

కబీరుమృతినిగూర్చి యాశ్చర్యజనకములైన కథ లనేకములు చెప్పుచున్నారు. అతఁడు సిద్ధిపొందిన తోడనే మహమ్మదీయులు చేరి యతఁడు తమమతస్థుఁ డగుటచేఁ దమమతాచారము చొప్పున ఖననము చేసి గోరీకట్టవలయు ననియు, హిందువులు వచ్చి యాతఁడు తమమతస్థుఁడే యగుటచే దహ

నమే చేయవలయు ననియు, తమలో తాము పోరాడుచు శవముకొఱకై మిక్కిలి పెనఁగులాడఁదొడఁగిరి. ఇట్లీయుభయుల వైరములును దురంతములై మిన్నుముట్టుచుండఁగా కబీరే వారి కప్పుడు ప్రత్యక్షమై వారిని వారించి తన మృతశరీరముపైఁ గప్పఁబడియుండిన వస్త్రమును తొలఁగింపుఁడని యాజ్ఞాపించుటయు, వా రట్లు చేసిచూడఁగా, లోనుండిన శవ మద్భుతముగా మాయమై పోయి, కొన్నిపుష్పములు మాత్ర మాతావున నుండెనఁట! ఈపువ్వులను గొన్నిటిని హిందువులు తీసికొనిపోయి కాశీనగరమందు గంగానదియొడ్డున యథావిధిగ దహనముచేసిరఁట! తక్కినవానిని మహమ్మదీయులు గైకొని మాఘూరునందే ఖననముచేసి గోరీ నిలిపిరఁట!

ఈకథ విశ్వాసపాత్రమైనదైనను కాకపోయినను, ఒక్కకబీరునుగుఱించియే కాక మహాత్ములైనవారందఱి చరిత్రములను సంబంధించియు కొన్ని గొప్ప సత్యములను దెలుపుచున్న దనుటకు సందియము లేదు. ఈలోకములో నేమహాత్ముఁడు కాని సాధారణముగాఁ దనకాలమునందే లోకముచే గౌరవింపఁబడఁడు. ఒకమహాత్ముఁడు జనసామాన్యముయొక్క దుస్థితిని గ్రహించి వారి నుద్ధరించుటకై యున్నతసందేశమును గొనివచ్చినప్పుడు వారు దానిని తెలియఁజాలక వ్యాధిగ్రస్తుఁడగువాఁడు మిత్రవైద్యుఁ డీఁబోయిన మందును ద్రోచిపుచ్చునట్లుగా, మొట్టమొదట నాయుపదేశములను వెగటుగాఁ జూచి కొంతకాలమైన వెనుక వానియావశ్యకతను గ్రహింపఁగలుచుండుట లోకసామాన్యమైయున్నది. ఇందు మఱియొక గొప్పవిశేషము మున్నది. మహాత్ముఁ డెప్పుడును ఒక్కజాతివారును గాక, ఒక్కమతమువారు గాక లోకమే కుటుంబముగను సకలలోకైకనాయకుఁడైన భగవంతు నొక్కనినే నమ్మి యచంచల విశ్వాసముతో భజియించువారందఱును నొక్కమాటలోనివారుగను విశ్వసించి వర్తించుచుందురు. అట్టివారిని జూచి యల్పబుద్ధులు వీ రీమతమువా రనియు, వా రామతమువా రనియు, తమలో తాము కయ్యములాడుకొందురే కాని యామహాత్ము లవలంబించిన మతస్వభావమునుబట్టియే వారు సర్వసము లనియు, సత్య మేమతమం దున్నను వారి కాదరణీయమే యనియు, ఒక్కఁడైన భగవంతుని నమ్మనివారికి బహుమతములు కాని నమ్మినవారికనేకములు లేవనియు అట్టి మహాత్ములను ప్రత్యేకమతసంఘములకు బంధింపఁజూచుట తమయజ్ఞతయే కాని వేఱొక్కటి కా దనియు, తెలిసికొనఁజాలకున్నారు. కబీరుదాసుని మరణా

నంతరము కబీరు మావాఁడు మావాఁడని హిందూమహమ్మదీయులు పోరాడుట చూడఁగా, కబీరుమతము సర్వసాధారణమత మైనట్టులు తోడనె గ్రహింపవచ్చును. అతఁడు చేసిన యుపదేశము లన్నియు నీ యంశముచే నిర్ధారణ చేయును. అతఁడు నమ్మిన రాముఁడు లోకాభిరాముఁడైన పరమాత్మఁడే కాని వేఱొకఁడు కాఁడనియు, రామనామమును లోకసామాన్యమును జేసి, సకలమతములను సమ్మేళనము కావించి, మతవైషమ్యముల నడుగంటఁ జేయుటయే అతని యుద్దేశమైనట్లును అతని బోధన లన్నియు ప్రబలసాక్ష్యము నిచ్చుచున్నవి. అతని కీయద్భుతపరిజ్ఞాన మంతయు కేవలభక్తిప్రభావముచేత నే కలిగినది. అదియే మధ్యయుగమునందు మహాంధకారములోఁ బడియున్న యార్యావర్తమును తేజోవంతముగఁ జేసిన మహాపురుషాగ్రేసరులలో నాతని నొక్కనిగాఁ జేసినది. అట్టి జాతీయోద్ధారకుని మహోపదేశములను విస్మరించి నవభారతీయుఁ డెవ్వాఁడును ప్రోన్నతి నందఁజాలఁ డని నిశ్శంకముగా వచియింపవచ్చును. మన దురదృష్టవశముచేత, ఆమహనీయుని సత్యచారిత్రము మఱుఁగుపడియున్నను, మన యభ్యుదయమునకు ముఖ్యముగాఁ గావలసిన యాభక్తాగ్రేసరుని సదుపదేశములు ఏదోయొకవిధమున, గ్రంథస్థములై నిలిచియున్నందులకు మన మానందింపవలసియున్నది. అతనిచరిత్రనుగూర్చి తెలియని సంగతులను పెంచివ్రాయుటకంటె నమ్మహనీయుఁడు చేసిన యుపదేశములను గొన్నింటిని, అమ్మహాశయుఁడు తెలిపిన మతాభిప్రాయము లన్నియు సత్యములని సాక్ష్యమిచ్చునట్టి యాతని సుభాషితములను గొన్నింటిని, ఇందుఁ గ్రిందఁ బొందుపఱుచుచున్నాను.

# ఉపదేశములు.

1. ఈలోకములో మనుష్యుఁడు జన్మాదినుండియు కేవలము పాపవర్తనుఁడై యున్నాఁడు. వానిదేహము "వాది, నాది" యని గ్రహింప సిద్ధమగువారు ఎంతెందఱో యున్నారు. "వీఁడు మాబిడ్డడు, మాలాభము కొఱకై వీనిని మేము పెంచి పెద్దవానిని చేసినాము" అని తల్లిదండ్రులు చెప్పుదురు ఇఁక భార్య యన్ననో "ఇతఁడు నాపెనిమిటి" యని బెబ్బులివలె వానిని పట్టుకొనఁజూచును మఱి పిల్లలందఱును వానిమీఁద చూపునిలిపి మృత్యుదేవతవలె నోళ్లు తెఱచుకొని రక్షణకై ప్రతీక్షించుచుందురు. రాబందులు కాకులు చేరి వీఁ డెపుడు చచ్చునా యని కనిపెట్టుకొనియుండును. పందులు కుక్కలు శ్మశానవాటికకు తాము వెంబడించుటకై వీని శవమును ఎప్పుడు తీసికొనిపోవుదురా యని రాజమార్గముమీఁద వేచియుండును "వీనిని పూర్తిగా భస్మము చేయునఱకు నేను విడిచిపెట్టువాఁడను గాను." అని అగ్నిహోత్ర మనుచుండును. భూమి "వీనిని నాపాలు చేసికొందును" అని చెప్పుచుండును. వాయువు వానిని తీసికొనిపోవలె నని యాలోచించుచుండును. ఓజడమతులార! ఈ దేహమును మీదేహముగా చూచుకొనుచున్నారు. ఎప్పటికప్పుడు మీగొంతుక పిసుకవలె నని వేనవేల శత్రువులు కనిపెట్టుకొని కూర్చుండుట మీకు తోఁచుట లేదా! ఐహికమోహము కన్నుగప్పుటచే నట్టిదేహమును మీది యని భావించుకొనుచున్నారు. అంతమంది చేరి మీదేహమున పాలుగొనవలె నని చూచుచుండుటచేత యావజ్జీవమును మీ కేదోయొక కష్టమే గాని సుఖ మనుమాట లేక యున్నది. ఓవెఱ్ఱులార! మీరు మేల్కొని యీ సంగతి తెలియనొల్లరు గాని యిది నాది యిది నాది యని మాత్రము విరామము లేక చెప్పుచుందురు.

2. రామనామ మను ధనమును పోగు చేయుఁడు. ఆధన మెన్నడును నశించునది గాదు. అగ్ని దానిని దహింపలేదు. మారుతము దానిని కొట్టికొనిపోఁజాలదు. దొంగలు దానిని సమీపింపలేరు.

3. బంగారముతో కొనఁదలఁచినయెడల రాముఁడు దొరకఁడు. హృదయమూల్యమున కతఁడు చిక్కును.

4. భక్తిలేని జీవనము వ్యర్థము. భక్తసమాజమునఁ జేరి భగవంతుని పూజింపనిపక్షమున ఎవ్వానికిని సౌఖ్యము నిలువఁజాలదు.

5 కాలసర్పము హృదయములో నున్నది. అందఱియాత్మలయందును నది విషానలమును గ్రక్కినది. సంపూర్తిగా ఎవ్వరు నిక్కమైన యీశ్వరుని పూజింతురో వారు కొందఱే విముక్తి నందఁగలుగుదురు.

6. ఓ మత్స్యమా! చిన్న బావియందు పల్లెవాఁడు అవలీలగా వలను పన్నుచున్నాఁడు. అట్టి బావినుండి తప్పించుకొనుట నీకు సాధ్యము కాదు. సలిల మహార్ణవము నాటి దృష్టికిఁ దెచ్చికొని దాని నాశ్రయింపుము.

7. దురహంకారమునందు దుస్థితి యున్నది. పాపమునందు బాధ యున్నది. కారుణ్యమునందు నిలుకడ యున్నది. అపరాధక్షమయందు దేవుఁ డున్నాఁడు.

8. నాది నీది ఒకటే రక్తము. ఒక్కప్రాణమే మన యిద్దఱియందు చలించుచున్నది. ఒకతల్లి గర్భమునుండియే యీసృష్టి యుద్భవించుచున్నది. మనలో మన కెడము కలిగించుచున్నది యిది యేటి జ్ఞానము?

9 ఒక్క దేశమునుండియే అందఱును వచ్చినారు. ఒక్క ఘట్టముకడనే యందఱును దిగినారు. కాని యీ వైహిక దుర్విషయము లన్నియు చేరి మనలను అసంఖ్యాకములైన శాఖలగునట్లుగా విడఁదీసినవి.

10. బ్రహ్మ యెక్కడ? ఆతని నెవఁడు పుట్టించినాఁడో వాఁ డెక్కడ? వేద మెక్కడ? అది యెవనివలన వచ్చినదో వాఁ డెక్కడ?

11. నీ వేది చూచుచున్నావో యది నశించిపోవుచున్నది. నీ వెవ్వని చూచుటలేదో వానినిగూర్చి నిరంతరము చింతనచేయుచుండుము.

12. చక్కగా వేసిన బొమ్మ గొప్పవిలువ కలదే సందేహము లేదు. బొమ్మను విడిచిపెట్టి చిత్రకారుని స్మరియింపుము.

13. ఓ మందబుద్ధి! స్నానముచేయుటకు పుణ్యక్షేత్రము లనేకము లున్నవి. అర్చించుటకు విగ్రహములా వేనవే లున్నవి. కబీరు చెప్పిన దేమనఁగా "ఈలాగు మోక్ష మెన్నటికిని ప్రాప్తింపదు. మోక్ష మన్న హరిసేవయందే యున్నది.

14. నీవు పడునట్టి చిక్కులన్నిటియందును నిన్నెవ్వఁడు భరియింపఁగలఁడో అట్టి నిక్కమైన ప్రభువు నొక్కనినే యనుసరింపుము. ఆప్రభువు దశరథుని యింట జన్మ మెత్తలేదు; లంకాపతిని హింసింపనులేదు. యశోద యాతనిని తన యొడి నిడికొని లాలింపలేదు; అతఁడు దేవకీగర్భమున ప్రవేశింపను లేదు; అతఁ డీలోక

మును విధ్వంసము చేయలేదు; బలిని మోసపుచ్చుటకై యతఁడు పాతాళమునకు దిగలేదు. అతఁడు వరాహరూపమును ధరింపలేదు; క్షత్రియులను పరిమార్పను లేదు. ఆతఁడు తన వ్రేలికొనమీఁద గోవర్ధనపర్వతము నెత్తలేదు; అటవీవాటికల యందు గోపికలతోఁ గూడియుండను లేదు. అతఁడు సాలగ్రామము కాఁడు. మఱి యేతాయియు కాఁడు. అతఁడు మత్స్యము కాఁడు. కూర్మము కాఁడు. జలచరములైనవి యివెవ్వియును గాఁడు. అతఁడు ద్వారావతియందు నిర్యాణము చెందలేదు. జగన్నాథమునం దాతని శవము ఖననము చేయఁబడను లేదు. కబీరు లోకమునకు ప్రకటించునది యేమనఁగా:--

"ఈలాటి బోధనల నెవ్వఁడును అనుసరింపవలదు. ఎవ్వానిని స్థూలమును భౌతికమును నైన యుపాదానము కలవానినిఁగా భావించుచున్నారో, వాఁడు బహుసూక్ష్మధర్మములు కలవాఁడు."

15. కాశిలో కాపురముచేయుచుండిన శివునితోఁ గూడ బ్రహ్మ అప్పుడే చచ్చిపోయినాఁడు. మధురానగరమునందు గొల్లవాఁడైన శ్రీకృష్ణుఁడు ప్రాణములు విడిచినాఁడు. దశావతారము లన్నియు నిదపలుకే గతించినవి. మత్స్యేంద్రనాథుఁడు, గోరకనాథుఁడు, దత్తాత్రేయుఁడు, వ్యాసుఁడు ఈ యందఱిప్రాణములును పోయి చాలకాల మైనది. కబీరు ఉద్ఘోషించునది యేమనఁగా:—

"ఈ మనుష్యు లందఱును గూడ మృత్యువు వలలోఁ బడిపోయినారు."

16. అన్ని సంగతులును మనస్సునకుఁ దెలియును; తెలిసియుండియు పాపము లొనర్చుచున్నది. చేతిలో దీప ముండియును నూతిలోఁ బడినప్పుడు, ఇంక నాదీప ముండిన ప్రయోజన మేమి?

17. మాతృగర్భమునం దుండినప్పుడు జాతియు లేదు, వర్ణము లేదు; బ్రహ్మ బీజమునుండి సృష్టి యంతయుఁ గలిగినది. ఓపండితుఁడా! బ్రాహ్మణు లెప్పుడు సృష్టింపఁబడినారో చెప్పు! "నేను బ్రాహ్మణుఁడను" అని చెప్పుకొన్నందువలన నీమతము నీజీవము నశించుచున్నవి సుమా! నీవు బ్రాహ్మణస్త్రీవలనఁ గలిగిన బ్రాహ్మణుఁడవే యైన పక్షమున నీవు వేఱుమార్గమున నేల పుట్టవైతివి?

ఎవ్వరివాఁడవు నీవు? బాపనివాఁడవా? నే వరివాఁడనెను? శూద్రపువాఁడనా? నే నెవరిరక్తమువలన పుట్టితిని? నీ వెవరిక్షీరములవలన జనించితివి? కబీరు సూక్తి యేమనఁగా: బ్రహ్మమునుగూర్చి యెవ్వాఁడు చింతనసేయునో వాఁడే నాచేత బ్రాహ్మణుఁ డని పిలువఁబడుచున్నాఁడు. వర్ణమునుండి వర్ణము బయలు

దేరుచున్నది. అయినను విచారించి చూడఁగా నన్నియు నొక్కటే. ప్రాణమున కేమివర్ణ మున్నది? దీనినిగూర్చి చక్కఁగ యోజింపుము.

19. ఓ బ్రాహ్మణులార! అన్యులను అంటినంతమాత్రాన మీరు మైలపడితి మని తలంచుచున్నారు. మిమ్ముల నొక్క ప్రశ్న మడుగనిండు! మీకంటె నీచుఁ డెవ్వఁ డున్నాడు? దురహంకారముచేత మీరు విఱ్ఱవీఁగుచున్నారు. గర్వాతిశయము ఎన్నడును ఏప్రయోజనమును గలిగింపఁజాలదు. గర్వభూయిష్ఠు లగువారిని అడంచువాఁ డని పేరుగన్న యాతఁడు మీపొగరు చూచి యెట్లు సహింప నేర్చును?

20. ఎవ్వనివాక్కునకు అర్థమేదియు లేదో, వానిహృదయములో సత్యము లేదు. అట్టివానితో పొందు సేయకు. వాఁడు నిన్ను బహిరంగముగా మార్గములో పట్టుపెట్టును సుమా!

21. నాదైన దేదియు నాలో లేదు; ఉన్నదంతయు నీదే. నీదైనదంతయు నీయధీనము చేసిన తరువాత, ఇంక నాది మిగులున దేమున్నది?

22. సప్తసముద్రముల నన్నిఁటిని నేను సిరాగాఁ జేసినను వృక్షసంతతు లన్నిఁటిని కలములుగా జేసినను భూతలమునంతను కాగితముగాఁ జేసినను హరిప్రభావమును వర్ణించి వ్రాయుట యసాధ్యమగును.

23. దైవభీతి యుదయించిన తోనే యితర భీతి యస్తమించును. ఆభీతి యంతయు దైవభీతిలో మగ్నమై పోవును. దైవభీతి క్షీణింపఁజొచ్చెనా, పాపుల భయము మనుష్యు నాశ్రయించును. మనుష్యునకు దైవభీతి నశించి నప్పుడు హృదయములో భయ ముద్భవించును; అదే వానికి మరణము.

24 లోకమంతయు దేనిపేరు విన్న భయావేశపరవశమగునో, యట్టి మృత్యువు నామనస్సునకు ఆనందము; మృత్యువువలననే పరిపూర్ణానందమంతయు లభ్యమగుచున్నది.

25. నే నేదినమున మరణించితినో, యాదినమున మహదానంద ముప్పొంగివచ్చినది. ప్రభువు నాకు దర్శనమిచ్చెను. గోవిందుఁడు తన నెచ్చెలిని మన్నించుట సహజమే కదా!

26. గ్రంథపఠనమువలనే మేలాదవునని నే నెఱుంగుదును; కాని గ్రంథపఠనము కంటె ధ్యానము శ్రేష్ఠతరమైనది. లోకులు నన్నెంత నిందించినను సరే రాముని యాశ్రయమును నే నెన్నఁడును విడుచువాఁడను కాను.

27. ఈ లోకముయొక్క స్థితినిఁ జూచి నేను కన్నీరు విడిచితిని. ప్రతి యెవ్వఁడును నాతోఁ గలసి దుఃఖించినవాఁడు లేఁడు. భగవన్నామ మెవ్వఁడు గ్రహించునో, వాఁడే నాతోఁ గలసి యశ్రుకణములు రాల్ప సమర్థుఁడు.

28. అందఱును దేవునిగూర్చి ముచ్చటించువారె; కాని, నామనస్సులో నొకశంక పొడముచున్నది. వారు తమకుఁ దెలియని దేవుని ప్రార్థించుటకె ట్లు గడంగుదురో తెలియకున్నది.

29. పండితులు వేదములు చదివి తప్పుదారిలోఁ బడియున్నారు. వారికి ప్రపంచజ్ఞాన మావంతయు లేదు. ఎంతయు నియమముతో క్రమము తప్పక, ఉదయమునను సాయంకాలమునను ఆయాకర్మములను ఆచారములను వారు నడపుచుందురు. నాలుగు యుగములందును వారు గాయత్రిని పఠింపఁజేసినారు. ఆ లాగుచేయుటవలన పాపమునుండి యెవనికి ముక్తికలిగినదో వారిని చెప్పమనుఁడు. ఇతరులను ముట్టుకొన్నందువలన తాము మైలపడితి మని వారు భావించుచున్నారు; తమ కంటె నీచు లెవ్వరున్నారో వారిని చెప్పమనుఁడు.

30. తరువునకొఱకే ఫలములఁ బూనుటలేదు. ప్రవాహము తన నిమిత్తమే జలముల గ్రహించుటలేదు. ఇతరులకొఱకే సాధుజనుఁడు దేహధారి యగుచున్నాఁడు.

# కబీరు.

## కబీరు సాక్ష్యములు.

చ॥ ఇరులు తొలంగ భానుఁ డుదయించిన, మానవదుష్టచింతనల్
విరియు మహాత్ము సద్గురు వివేకము వ్యాపనమైనతోనె; యీ
సరణినె సద్గుణాగుణ విచారము పాయు దురాశచే; నహం
కరణముచే నశించు నధికంబగు నీశ్వరభక్తి ప్రేల్మిడిన్. 1

గీ॥ సన్నయావగింజంత సూక్ష్మంబు గాదె
భక్తిమార్గంబునకుఁ గల్గు ద్వార మరయ!
గర్వమునఁ జేసి యేనుంగు కరణిఁ దోఁచు
డెంద మక్కటా! నరుఁ డెట్టు లందుఁ జొచ్చు? 2

గీ॥ గురువునకు నెద్దియైనను గొంక కీయ
సిద్ధుఁడై యుండవలయును శిష్యుఁ డెపుడు;
నెద్దియును శిష్యుఁ డీయ గ్రహింపఁజనదు
గురువు; గురుశిష్యధర్మంబు తెరువు లివియ. 3

గీ॥ అందినట్టి మానవదేహ మంద రాదు
మఱల నరునకు నెన్నండు మానుదిఱుఁ;
జెట్టుపండును జెట్టుతోఁ జేర్పరాదు
పుడమిఁ దొరఁగిన నొకమాఱు తొడిమ వీడి. 4

గీ॥ కాలమెల్లను వృథ యౌచుఁ గడచె నకట!
యాజ్ఞుఁ డనురక్తి భజియింపఁ డయ్యె హరిని;
నెంతయును వెన్కఁ గుందంగ నేమిఫలము
పక్షు లెల్లను గడతేర్పఁ బంట లెల్ల? 5

చ॥ వ్యసనము నందఁబోకు, మనయంబును జింతను దక్కియుండు, మిం
పెసఁగ సృజించినట్టి విధియే సకలం బిడు నంచు నెంచుమన్;
బకులకుఁ గీటకంబులకుఁ బక్షులకుం గన నెందు నేని వె
క్కసముగఁ బెన్నిధుల్ గలవె? గాఢతరంబుగఁ గల్మి యున్నదే? 6

చ॥ కమఠము గ్రుడ్డులం బొదివి కాచుఁగదా పదిలంబుగా నురో
జములును లేకయే, పెనుచు సాధనకోటి తెఱం గెఱింగి; యా
క్రమమున జీవరాసుల జగంబుల సృష్టి యొనర్చినట్టి దై
వమె సమకూర్చుఁ బ్రేమమున వస్తువులన్, దగు జీవికాదులన్. 7

గీ॥ సుత్తి దొంగిలించి సూది దానముచేసి, తేరు వచ్చునంచుఁ జూరు నెక్కి
చూచువానిపగిది, కుంత సత్క్రియ చేసి, యజ్ఞుఁడుబ్బు మోక్ష మబ్బు నంచు. 8

గీ॥ నమ్రులై కడు నెందఱు నడచువారొ, వారలందఱు మోక్షంబుఁ బడయువారు.
అగ్రజన్ముల మంచు గర్వోగ్రు లగుచుఁ, ద్రుళ్లువార లధోగతిఁ ద్రెళ్లువారు. 9

గీ॥ అధికులకె తోడుపడ నెంతు రంద ఱిచటఁ; గాని యల్పుల కెవ్వారు గానరారు;
దవమునకు గాడ్పు తోడ్పడి రవులఁ జేయు, నదియె దీపంబు నింతలో నార్పివేయు.

గీ॥ పూలతోఁటలోనికిఁ దోఁటమాలి యరుగ, బల్కెఁ బూమొగ్గ లీరీతి వానిఁ జూచి.
'పుణుకఁబడియెదు వికసించు పూలు నేఁడు; ఎల్లి మావంతు వచ్చెడు నిది నిజంబు.'

గీ॥ జాతి యేది యనుచు సాధు నడుగ నేల? దాని జ్ఞాన మరయ వలయుఁ గాని;
కత్తిపిలువఁగూర్చి కడఁగి యోజించుచో, నొఱను గూర్చి పెద్దయూహ యేల? 12

గీ॥ ఉర్విఁ బెద్దయై, యేమి ప్రయోజనంబు? తాళవృక్షంబు మిగులఁ బెద్దదియ కాదె?
దానినీడను గూర్చుండఁ దలఁచు నెవఁడు? దానిఫలములు మన కందరానివెకద?

గీ॥ బాధపెట్టకు మెవని దుర్బలుఁ డఁటంచు, నతని హాహారవంబుల హననశక్తి
కలదు సుమి; ప్రాణమే లేని కొలిమితిత్తి, చేతఁ గత్తియు రూపఱఁ జేయఁబడదె?

గీ॥ జల్లెడను జూడు! పొల్లును సంగ్రహించి, సారవదాగింజలను గ్రింద జాఱవిడుచు;
నవ్విధంబున నే యజ్ఞుఁడైన నరుఁడు, సారమును ద్రోసి, పూను నసార మిలను. 15

గీ॥ తమకొఱకె పూనవంబువుల్ ధరణినదులు, స్వాదుఫలముల్ భరింపవు పాదపములు
సాధుజనములైహికజన్మమిట్టు, లంచితపరోపకృతిని గావించుకొఱకె॥ 16